# వీరేశలింగంపంతులు
# సమగ్రపరిశీలన



డా॥ అక్కిరాజు రమాపతిరావు

ప్రథమ ముద్రణ 1972 జూన్

సాదా ప్రతి రూ. 18/– :: మేలు ప్రతి రూ. 20/–

ముఖచిత్ర రచన శ్రీ శీలావీర్రాజు

ప్రతులకు
ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్
సికింద్రాబాద్.

విశాలాంధ్ర ప్రచురణాలయం
విజయవాడ.

ముద్రణ
శివాజీ ప్రెస్,
1732-గంజ్ బజారు, సికింద్రాబాదు.

# మనవి

వీరేశలింగంపంతులుగారి సాహిత్యకృషినిగూర్చి పరిశోధించి సిద్ధాంత వ్యాసాన్ని సమర్పిస్తాననగానే, అంగీకరించి, అనుమతించి, ఆశీర్వదించిన మహో ఘులు ఖండవల్లి లక్ష్మీరంజనంగారు. ఆంధ్రశాఖకధ్యక్షులుగా, వారుచేసినసేవ, ౹నీయమైనది. ఎమ్ ఏ చదువుకొంటున్నరోజులలో ప్రస్తావికంగా ఒకరోజున త్రులు, సహాధ్యాయి, కొత్త దేశపతిరావుగారు, ఎమ్ ఏ., పూర్తిఅయిన తరువాత రేశలింగంపంతులుగారి బహుముఖప్రతిభ అన్న విషయంపై సిద్ధాంతవ్యాసాన్ని ను సమర్పిస్తానని అన్నారు కాని ఎమ్.ఏ. పూర్తికాగానే ఔద్యోగిక సంబంధమైన కర ప్రయత్నాలలో ఆయన యీ వ్యాసాంగాన్ని కొనసాగించలేదు. అందువల్ల హెచ్.డి కి విషయం ఎంచుకోవడం నాకు సులభమైంది.

శ్రీకారం చుట్టినప్పటినుంచీ పర్యవేక్షిస్తూ నన్నెంతగానో ప్రోత్సహించి, వరించినవారు ఆచార్య బిరుదురాజు రామరాజుగారు. శ్రీ రామరాజుగారు పర్య క్షణ భారాన్ని వహించకపోయినట్లైతే, నేను నా పూనిన మహత్కార్యాన్ని నిర్వ ంచలేక పోయేవాణ్ణి అడుగడుగునా వెన్నుతట్టి, అలసభావాన్ని మన్నించి, ంతగానో ప్రోత్సహించి నన్నువారు ముందుకునడిపించారు. కనుకనే నేను నా ద్ధాంతవ్యాసాన్ని పూర్తిచేయగలిగాను. ఆత్మన్యప్రత్యయశంకతో, కొట్టుమిట్టాడు న్న రోజులలో మిత్రులు శ్రీ ముదిగొండ వీరభద్రశాస్త్రిగారు, అనుదినము నన్ను ౼చ్చరించి, కొన్ని ప్రకరణాలను బలవంతాన నాచేతవ్రాయించి, నాలో ఆత్మవిశ్వా న్ని ప్రోదిచేశారు.

1960 వ సంవత్సరంలో ఎమ్.ఏ. కాగానే, హైదరాబాదులోని స్థానికకళాశాల యిన న్యూ సైన్స్ కాలేజీలో అధ్యాపకత్వం లభించటంవల్లనే, అనంతర విద్యా వ్యసంగాన్ని నేను కొనసాగించగలిగాను. న్యూ సైన్స్ కాలేజి ప్రిన్సిపాల్‌గారైన ) సి. సుదర్శన్‌గారు, ఎనిమిదేళ్ళు నేను కాలేజీలో అధ్యాపకుడనుగా ఉన్నప్పుడు ంతగానో ఆదరించారు. వారి సహాయసహకారాలు నాకు లభించకపోయినట్లైతే, నా వితంలో నే నేమీ సాధించలేకపోయేవాడినేమో !

1960 నుంచి 64 వ సంవత్సరందాకా, నాలుగు సంవత్సరాలు, వీరేశలింగం ంతులుగారి గ్రంథాలను సంపాదించడం, వారితో పరిచయమున్న వ్యక్తులను, ంస్థలను, దర్శించడం, విషయసేకరణంగావించడం, వ్రాసినది వ్రాసినట్లుగా,

శ్రీ రామరాజుగారికిచ్చి వారు సరిదిద్దగా, టైపుచేయించడంలో నిమగ్నుణ్ణైనాను. ఈ సందర్భంగా వేటపాలెం, రాజమండ్రి, కాకినాడ, నరసాపురం, రాజోలు, మొదలైనప్రదేశాలు సందర్శించి, అమూల్యమైన గ్రంధాలను, విషయాలను, సేకరించాను పంతులుగారిని స్వయంగా ఎరిగిఉన్న అడవి శంకరరావుగారివంటి పెద్దలను దర్శించాను. గౌతమీగ్రంధాలయం, పురమందిరంలో పంతులుగారి తాలుకు గ్రంధసంచయం, నా విషయసేకరణకెంతగానో తోడ్పడినవి. వేటపాలెం సరస్వతీ నికేతనంలో అపూర్వమైన గ్రంధాలు, పత్రికా సంపుటాలు నా కెంతగానో ఉపకరించాయి సరస్వతీ నికేతనం నిర్వాహకులు శ్రీ అడుసుమిల్లి శ్రీనివాసరావు పంతులుగారు అమితవాత్సల్యంతో నన్నాదరించి, సమస్త సదుపాయాలు నాకు కలుగజేశారు. నరసాపురంలో శ్రీ వంగూరి నరసింహారావుగారు నన్నెంతగానో ఆదరించి, తమ తండ్రిగారైన వంగూరి సుబ్బరావుపంతులుగారికి వీరేశలింగం పంతులుగారు. కవులచరిత్ర పరిష్కరణం విషయకంగా వ్రాసినలేఖలను. నకళ్ళుత్తి వ్రాసికొనటానికిచ్చి తోడ్పడినారు విజయవాడలో శ్రీ దిగవల్లి వెంకటశివరావు పంతులుగారు, ఎన్నెన్నో అపూర్వగ్రంధాలను, పత్రికాసంపుటాలను నాకుచూపి సహాయంచేశారు సలహాలిచ్చారు కాకినాడలో ఆంధ్రసారస్వతపరిషత్తులో భద్రపరుపబడిన, పత్రికా సంపుటాలు కూడా నా కెంతగానో తోడ్పడినవి. విశేషించి, పురుషార్ధప్రదాయిని, హిందూజనసంస్కారిణి, వివేకవర్ధని, చింతామణి, వంటి పత్రికా సంపుటాలు, రాజమండ్రి గౌతమీగ్రంధాలయంలోనే నాకు లభించినవి. రాజమండ్రి వెళ్ళినప్పుడల్లా, నన్నెంతగానో ఆదరించి, పెద్దల పరిచయభాగ్యం కలగజేసిన స్వర్గీయ నేదునూరి గంగాధరంగారిని నేను మరువలేను ప్రియమిత్రులు శ్రీ చామర్తి కనకయ్యగారు (కనక్ప్రవాసి) రెండుమూడుసార్లు నేను రాజమండ్రి వెళ్ళినప్పుడు, భోజనభాజనాదులు కలుగజేసి ఎంతగానో నన్నాదరించారు. నరసాపురం దాకా నాతోవచ్చి, సాహిత్యగోష్ఠితో, ప్రేమతో నన్నెంతగానో ఆదరించారు శ్రీ రంధి సోమరాజుగారు.

వీరేశలింగంపంతులుగారి గ్రంధాలనన్నిటినీ అధ్యయనంచేసి, తెలుగుదేశంలో ఇతఃపూర్వము పంతులుగారి సాహిత్యకృషిని, సంఘసంస్కరణకృషిని, సమీక్షించిన వారి అభిప్రాయాలను సమీకరించి, విశ్లేషించి, నేనీ గ్రంథంలో పొందుపరిచాను. తరువాత వీరేశలింగంపంతులుగారి మహత్వాన్ని గూర్చి వివిధ పత్రికలలో నేను చాలావ్యాసాలు వ్రాశాను.

పట్టప్రదానార్హతానిర్ణాయకులై, తమ అమూల్యములైన అభిప్రాయాలతో, నా కృషికిసార్థకతచేకూర్చిన విద్వాంసులు డా. ఎస్. వి. జోగారావుగారికిన్నీ, డా. కోరాడ మహదేవశాస్త్రిగారికిన్నీ నా నమోవాకములు. విశ్వవిద్యాలయ నిబంధనల

ననుసరించి సిద్ధాంతగ్రంథాన్ని గ్రాంథికంలోనే రచించాను అందువల్ల రచించినట్లుగానే మహాంధ్రానికి సమర్పిస్తున్నాను. ఈ కృషిలో నాకు చేయూతవాయూతలనిచ్చిన పెద్దలందరినీ కృతజ్ఞతతో మరీమరీ స్మరిస్తున్నాను. మిత్రులందరికీ వందనాలర్పిస్తున్నాను.

నాలుగుసంవత్సరాలపాటు ఈ వ్యాసంగంలో నేను నిమగ్నుణ్ణై ఉన్నప్పుడు, మిత్రులైన శ్రీ నిడుదవోలు శివసుందరేశ్వరరావుగారు, శ్రీ మొదలి నాగభూషణశర్మ గారు, పోరంకి దక్షిణామూర్తిగారు, శ్రీపాద కృష్ణమూర్తిగారు, నా కెంతో తోడ్పడినారు

మా అన్నయ్య శ్రీ అక్కిరాజు సీతారామారావుగారు, మా వదినగారు ల॥ సౌ॥ అనంతరాజ్యలక్ష్మిగారు, నా అభ్యుదయానికి దోహదంచేసినవారు. వారిపట్ల నేను మిక్కిలి కృతజ్ఞుడను. నా సిద్ధాంతవ్యాసంలోని కొన్ని ప్రకరణాలకు శుద్ధప్రతిని వ్రాసిపెట్టటమేకాక, సర్వవిధాల. నా విద్యావ్యాసంగంలో తోడ్పడిన నా అర్ధాంగి ల॥ సౌ॥ రోహిణిని నేను అభినందిస్తున్నాను.

గ్రంథముద్రణకు ద్రవ్యసహాయంచేసిన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి కృతజ్ఞుడను త్వరితగతిని సర్వాంగసుందరంగా ముద్రించి ఇచ్చిన శివాజీ ప్రెస్ వారిపట్ల కూడా, అందు నా ముఖ్యంగా వ్యవహారదక్షులైన శ్రీ బడేసాహెబ్‌గారిపట్ల మిక్కిలి కృతజ్ఞుణ్ణి. ముఖపత్ర రూపకల్పనంచేసిన ప్రియమిత్రులు శ్రీ శీలా వీర్రాజుగారిని కొనియాడుతున్నాను.

ఈ గ్రంథాన్ని మా నాన్నగారికి అంకితం ఇవ్వడం మహద్భాగ్యంగా భావిస్తున్నాను.

—అక్కిరాజు రమాపతిరావు

## విషయ సూచిక

మత్పురానేక పుణ్యజన్మములు పొంది
నీ కడుపునందు నేను జన్మించినాను
అందుకోవయ్య నే నిచ్చునట్టి ఉపద
కృతి సమాపిన మిద్ది సత్కృతివి చిన్నా.

# 1
# వీరేశలింగం పంతులు గారి పూర్వపు ఆంధ్రదేశము సంఘము-సాహిత్యము

శ్రీరంగ పట్టణమునందుటిప్పు సుల్తానోడుటతో (క్రీ. శ. 1799, ఇంచు మించుగా నాంధ్రదేశముపై సర్వాధికారములు ఇంగ్లీషు వారికి సంక్రమించెనని చెప్ప వచ్చును నిజాము పరిపాలకుని ద్వారా కర్నూలు, కడప, మొదలైన రాయల సీమ ప్రాంతములు ఆంగ్లేయులు స్వాధీనము చేసికొనియుండిరి సముద్రతీరస్థాంధ్ర దేశమంతయు తూర్పిండియా కంపెనికి అప్పటికే వశమై యుండెను.

ఈ విధముగా తూర్పిండియా కంపెనీవారి ఆధిపత్యము ప్రారంభము కాక పూర్వము ఆంధ్రదేశము నిజాము పరిపాలనలో నుండెను. ఢిల్లీ చక్రవర్తికి నామ మాత్రపు సామంతుడుగా నుండి నిజాము గోల్కొండసుబాను సర్వాధికారములతో అప్పుడు పాలించుచుండెను

ఆంధ్రదేశమునందీ కాలమున సంఘజీవనమునందు మహమ్మదీయుల ఆచార వ్యవహారములు తమప్రభావమును చూపుచుండెను ప్రభుత్వము నెరపు వారే మతస్థులైన వారి వేష భాషలు, ఆచారవ్యవహారములు, సంస్కృతి, తత్తద్దేశీయులను ప్రభావితులను చేయుట వింతకాదు.

వీరేశలింగం పంతులుగారి పూర్వీకులు మహమ్మదీయ ప్రభువుల యొద్ద గొప్ప గొప్ప యుద్యోగములుచేసి, బిరుదములుపొంది, జాగీరులను సైతము సంపాదించిరని వారి స్వీయ చరిత్రమువలన తెలిసికొనవచ్చును. ఆ కాలమున ఫారశీ రాజ భాషగా వ్యవహారమున నుండెడిది[1]. ఆంధ్రదేశమునందలి ప్రాధమిక పాఠశాలలలో ఫారశీ భాషను బోధించెడివారు ప్రజలు మహమ్మదీయుల వేష భాషలను అనుకరించుట, ఉదర పోషణార్థము వారిభాషను అభ్యసించుట, సర్వ భారతదేశమునను ఆ కాలమున కన్పట్టెడి విశేషము

ఆంగ్లేయులు భారతదేశము నాక్రమించి, తమ పరిపాలనను కొనసాగించు వరకు, రాజభాషగా ఫారశీ వ్యవహారమునం దుండెడిదనియే చెప్ప వచ్చును.

భారతదేశము మహమ్మదీయుల ఏలుబడిలో నున్నను, సర్వసామాన్యముగా పాలకులకు, పాలితులకు మతసంబంధములైన వైమనస్యములు సంభవించి యుండలేదు. పొసగినను అవి సర్వ భారతీయ సంస్కృతిని ప్రభావితము చేయ జాలక పోయెను,

ఆంధ్రదేశమును పరిపాలించిన మహమ్మదీయ మతస్థులు, ప్రజల మత విశ్వాసముల పొంతబోయినవారుకారు. వారు కవులను, పండితులను, ఆదరించిరి కొందరు దేవ, బ్రాహ్మణభక్తి సిగూడ కలిగియుండి, వారిని బిరుదములతోను, మడి మాన్యములతోను సత్కరించిరి

కరువు కాటకములు సంభవించి నప్పుడు తప్ప ప్రజలాకాలమున శాంతి భద్రతల ననుభవించుచుండిరి దేశము జమీలుగా విభజింపబడి, జమీందారుల పరి పాలన సాగుచుండెను ఆలయ తటాకాది నిర్మాణములు గావించుచు, ఈ జమీం దారులు దేశమును పరిపాలించుచుండిరి.

క్రీ శ. 1802వ సంవత్సరమున తూర్పిండియా కంపెనీ ప్రభుత్వము వారు 'శాశ్వతమైన పైసలా పద్ధతి ని (Permanent Settlement Act) ప్రవేశ పెట్టుటతో, దేశీయుల ఆర్థికస్థితియందు గొప్ప మార్పు సంభవించెను జమీం దారుల హక్కులు నశించి కంపెనీ ప్రభుత్వము మరింతబలపడెను. క్రీ శ. 1793వ సంవత్సరమునందే, దేశమును మండలములుగా విభజించి, కంపెనీ ప్రభుత్వము పరిపాలనాధికారులుగా కలెక్టరులను నియమించెను. ఈ విధమైన ఏర్పాటుతో ప్రజల జీవిత విధానమునందు గొప్ప మార్పు కలిగెను. న్యాయ విధానమునందు పంచాయతీ పద్ధతి అంతరించి, కంపెనీ వారేర్పాటు చేసిన న్యాయసభలు పనిచేయసాగెను. ఇట్టి న్యాయ సభలవలన దేశీయుల సుస్థితికి భంగము కలిగెను కంపెనీ ప్రభుత్వము వారితో పోటీ పడలేక దేశీయ వృత్తులన్నియు క్షీణించిపోయెను ఆంగ్లేయుల పద్ధతులు, న్యాయానుశీలనము సామాన్య ప్రజకు వెక్కసము కలిగించెను ప్రజ లెల్లరును పట్టణవాసము నందధిక వ్యామోహముతో, పల్లె పట్టులను విడిచిపెట్టి పట్టణములను చేరుచుండిరి

యూరోపులో స్థాపింపబడిన పరిశ్రమల మూలమున భారత దేశమునదంలి

కులవృత్తులు, నశించిపోయెను కర్షకులెల్లరును కూలివారుగా మారిరి ప్రజల జీవన స్థాయిపడిపోయెను దేశవ్యాప్తముగా సంభవించిన ఇట్టి గొప్పమార్పువలన, గ్రామములందు నెలకొనియున్న పాఠశాలలు క్షీణించిపోయెను. ఈ పరిస్థితులలో ఇంగ్లండులోని తూర్పిండియా కంపెనీ డైరెక్టర్ల సంఘమువారు, భారతదేశము నందలి తమ పరిపాలిత ప్రాంతములలో విద్యాభివృద్ధి నిమిత్తము కొన్ని పాఠశాలలు నెలకొలుపవలెనని తీర్మానించిరి ప్రజలు ఆంగ్లవిద్య నభ్యసించుటకు ఉత్సాహమును చూపిరి[2] పరిపాలన సౌకర్యము కొరకు ఆంగ్లేయులు దేశభాషల నేర్వవలసి వచ్చెను అందుకుగాను క్రీ శ. 1812వ సంవత్సరమున చెన్నపట్టణమునందు సెంటుజార్జిఫోర్టులో నొక కళాశాల స్థాపింపబడెను. ఈ పాఠశాలలో హెడ్డు ఇంగ్లీషుమేష్టరుగా ఉదయగిరి వెంకటనారాయణయ్యగారును, హెడ్డు తెలుగు మేష్టరుగా వేదం పట్టాభిరామశాస్త్రిగారును నియుక్తులైరి

క్రీ. శ 1814వ సంవత్సరమున ఎ డి. కేంప్ బెల్‌దొర తెలుగు వ్యాకరణ మొక దానిని రచించెను క్రీ శ 1816వ సంవత్సరమున విలియంబ్రౌన్‌దొర ఇంకొక తెలుగు వ్యాకరణమును రచించెను. కళాశాలవారే పాఠ్యగ్రంథములను ప్రచురించెడివారు క్రీ. శ 1820వ సంవత్సరమునందు గ్రంథకరణ సభనొక దానిని కళాశాలవారు స్థాపించిరి. ఆంధ్రదేశపు ప్రాథమిక పాఠశాలల విద్యా ప్రణాళికను గూర్చి వెన్నెలకంటి సుబ్బారావు పంతులుగారొక నివేదిక నీ గ్రంథకరణ సభ వారికి సమర్పించిరి[3]

క్రీ శ. 1813వ సంవత్సరమున, భారతదేశంలో విద్యాభివృద్ధి నిమిత్తమై ఇంగ్లండులోని పార్లమెంటువారు, సాలుకొక లక్షరూపాయలు ఖర్చుపెట్టునట్లు తీర్మానించిరికాని, కంపెనీ వారా తీర్మానమును వెంటనే అమలు పరచిన వారుకారు. 1822వ సంవత్సరమున చెన్నరాజధాని సంఖ్య ఒక కోటి, ఇరవై లక్షలని అంచనా వేయబడినది. అప్పటికి మొత్తము రాష్ట్రంలో 12,500 పాఠశాలలుండెడివి. ఇందులో 750 వేద పాఠశాలలు. గ్రామ పాఠశాలలను గ్రామస్థులే పోషించు కొనుచుండెడివారు.

1820 వ సంవత్సరమున చెన్నపట్టణమునకు గవర్నరుగా వచ్చిన మన్రోదొర, విద్యాభివృద్ధికై గొప్ప కృషి చేసిరి వీరు సిద్ధము చేయించిన లెక్కలవల్ల, ఈ రాజధానిలో పాఠశాలకు బోవు వయస్సుగల బాలుర సంఖ్యలో దరిదాపుగ ఆరవ

వంతు మంది విద్యాభ్యాసము చేయుచుండిరని స్పష్టపడినది. ఈ విధముగానే 1823-28 సంవత్సరముల మధ్య బొంబాయి రాష్ట్రమున జరిపిన విచారణవల్ల ఎనిమిదింట ఒకరు బాలురలో విద్యాభ్యాసము చేయుచుండిరని విశదమైనది. వంగ రాష్ట్రమున పురుషులలో నైదవ వంతు విద్యావంతులుగ నుండిరని స్పష్టపడినది.

కంపెనీవారు ఈ దేశమునందు విద్యాభివృద్ధి నిమిత్తమై పాటుపడుటకు పూర్వమే ఇట్టిపరిస్థితులు నెలకొనియుండెను. ఆంగ్లేయ ప్రభుత్వారంభ దినములలో వారి స్వార్ధబుద్ధి వల్ల, పరంపరాగతముగ వచ్చుచున్న పద్ధతులు నశించి, 1825 సంవత్సర ప్రాంతములకు, దేశము విద్యావిషయకముగ, అజ్ఞానదశయం దుండిపోవుట తటస్థించెను ఈ పరిస్థితులను గుర్తించి ఆంగ్లేయులు కొంత కృషిచేసి ఈ దేశస్థుల కృతజ్ఞతలకు పాత్రులైరి. రాజా రామమోహనరాయలవారి వంటి మేధావులు, ఆంగ్లవిద్య భారతీయ సంస్కృతీ సముద్ధరణమున కేకైక శరణ్యమని నాడు ప్రచారము చేయుట చూడగా నాడు పాశ్చాత్యుల ప్రభావము, భారతీయులపై నెంత గాఢముగా ప్రసరించినదో తెలియగలదు. 1813వ సంవత్సరమునుండి 1833 వరకు కంపెనీ పరిపాలన వర్తక వ్యాపారదృష్టిని విడిచి, రాజకీయముగా నీ దేశమున స్థిరపడుటకై కృషిసాగించుచుండెను 1833వ సంవత్సరమున వారికి రాజ్యాధికారము పూర్తిగా సంక్రమించినది. కంపెనీ ప్రభుత్వము నందాకాలమున ముఖ్యముగా మూడు విభాగములుండెను చెన్నపట్టణమునను, బొంబాయిలోను, గవర్నర్ల యాధిపత్యమున ప్రత్యేక ప్రభుత్వ విభాగము లేర్పడి, కలకత్తాలోని గవర్నర్ జెనరల్ ప్రభుత్వము కేంద్రమై యుండెను

కంపెనీ పరిపాలన కాలమునందు దేశీయుల విద్యావైజ్ఞానికాభివృద్ధి యందు, వారెంతమాత్రమును శ్రద్ధచూపక పోయినను, ఆంగ్లేయుల పరిచయమువల్ల, వారి సంస్కృతీ ప్రభావమువలన, దేశీయుల చిత్తవృత్తులలో గొప్ప మార్పు కలిగెను ఇట్టి మార్పువల్ల సంఘసంస్కరణము నందు, దేశీయులలో కొందరు మేధావులు బద్ధాదరులైరి దీనివల్ల భారతదేశమున నాడు ప్రచురముగా నుండిన దురాచారములు, మూఢవిశ్వాసములు, నశింపవలెనన్న కృషి ప్రారంభమయ్యెను. 1815వ సంవత్సరము మొదలుకొని 1828వ సంవత్సరము వరకు కలకత్తానగరమునందే దాదాపుగ నైదు వేలమంది సతీసహగమనము చేసిరట[4]. నరబలులు, శిశుహత్యలు, సిడులాడుట మొదలగు దురాచారములు కూడ నాడు ప్రబలియుండెను. రాజా రామమోహన రాయల

వారిట్టి దురాచారములు రూపుమాపుటలో గొప్పకృషిచేసిరి. ఆంధ్రదేశమునందు కూడ సతీసహగమనము ప్రచురముగా నుండెడిదని చెప్పవచ్చును 1820వ సంవత్సర ప్రాంతముల తూము వాపయ్యగారనువారు మరణింపగా, గుంటూరులో వారి భార్య సహగమనము చేసిన దృశ్యమును తాము చూచితిమని వెన్నెలకంటి సుబ్బారావు పంతులుగారనువారు తమ స్వీయచరిత్రమున వ్రాసియున్నారుల్. ఈ విధముగా వీరేశలింగము పంతులుగారి జననమునకు సుమారు పాతిక సంవత్సరములకు పూర్వము కూడ ఆంధ్రదేశమునం దీ దురాచారము ప్రబలియున్నదనియే చెప్పవచ్చును.

పంతులుగారికి పూర్వపు ఆంధ్రదేశము, సాంఘికముగ, విద్యావిషయకముగ, రాజకీయముగ నొక సంధికాలమున పరిభ్రమించు చుండెను మతవిషయకముగ కూడ నొక పరిణామ దశనే చేరుచుండెను. యావద్భారత దేశముననే ఆ కాలమున మతవిషయకములగు గొప్ప మార్పులు సంభవించు చుండెను. క్రైస్తవ మిషనరీలు దేశపు నలుమూలలందును పాఠశాలలు, వైద్యశాలలు స్థాపించి, మతప్రచారము సాగించు చుండిరి, రాజా రామమోహనరాయల వారి బ్రహ్మసమాజము కూడ దేశీయుల మత విశ్వాసములందు, సంప్రదాయములందు గొప్ప మార్పును కలుగ జేసెను. హేతువాద ధోరణి ప్రబలి, మత సంస్కరణ మావశ్యకమన్న యభిప్రాయములు నాటి విద్యావంతులలో కలుగజొచ్చినవి ఆంధ్రదేశమునందు సైతము మిషనరీల యుద్యమ వ్యాప్తి, పంతులుగారికి పూర్వమే తీవ్రతరముగా కొనసాగెను తొట్టతొలుత నాంధ్రదేశమున 1805వ సంవత్సర ప్రాంతముననే విశాఖపట్టణమున 'లండన్ మిషన్ సొసైటీ' యను క్రైస్తవ మిషనరీ సంస్థ స్థావరము నేర్పరచుకొని మతవ్యాపనము చేయసాగినది. 1840వ సంవత్సరమున ప్రధాన మతాచార్యపదవి పొంది ప్రసిద్ధి కెక్కిన డాక్టర్ జాన్‌హే దొర, ఇచ్చటనొక యాంగ్లో వర్నాక్యులర్ పాఠశాలను గూడ స్థాపించిరి. ఈ పాఠశాల చెన్నరాజధాని యందంతటను మొట్టమొదటి 'యాంగ్లోవర్నాక్యులర్ పాఠశాల' యగుట ఆంధ్రదేశమున మిషనరీల ప్రచారమెంత తీవ్రతరముగా నుండెనో విశదీకరించు చున్నది.

రాజమహేంద్రవరమున గూడ 1840వ సంవత్సర ప్రాంతమునకే జర్మనీ దేశపు మిషనరీలు వచ్చి, క్రైస్తవ మతవ్యాప్తికి పూనుకొనిరి. 1851వ సంవత్సరము నుండి 'అమెరికన్ లూథరన్ మిషన్' వారుకూడ ప్రచారము సాగించిరి.

1835వ సంవత్సరమునకే యీ దేశమున ఆంగ్లేయ విద్యావిధానము, ఇంగ్లీషు సాహిత్యము, ప్రకృతిశాస్త్ర పరిజ్ఞానము ప్రజలలో ప్రాచుర్యము పొందించవలెనని ప్రయ

త్నములు సాగెను 1830వ సంవత్సరముసకే అలెగ్జాండర్ డఫ్ అను క్రైస్తవ మతాచార్యుడు కలకత్తానగరమున నొక పాఠశాలను స్థాపించి మతప్రచారము సాగించు చుండెను. 1837వ సంవత్సరము నందు చెన్నపట్టణమున 'అండర్సన్' అను క్రైస్తవ మతాచార్యుడు' పాఠశాలను స్థాపించి మతప్రచారమునకు పూనుకొనెను. ఈతని ప్రచారమువలన, చెన్నపట్టణము నందు గొప్ప సంక్షోభములు కూడ పుట్టెను[7]

భారతదేశమునందలి సాంస్కృతిక పునరుజ్జీవమునకు మూలభూతుడు రాజా రామమోహనరాయల వారనియే చెప్పవలెను. పందొమ్మిదవ శతాబ్దపు పూర్వార్ధమునసే, భారతీయుల సాంఘికార్థిక రాజకీయ ప్రవృత్తులందు, జీవిత విధానమునందు గొప్ప పరిణామములు వచ్చెను. 1817వ సంవత్సరముననే విలియం బెంటింక్ సహాయమున రామమోహనరాయలు, డేవిడ్ హేర్, రాజా రాధాకాంత దేవులు కలకత్తాలో 'హిందూకాలేజీ'యను ఇంగ్లీషు విద్యాలయమును స్థాపించిరి రామమోహనరాయలవారు 'ఆంగ్లో వర్నాక్యులర్ స్కూల్' అను పాఠశాలను స్వయముగ నిర్వహించుచు, ప్రకృతిశాస్త్రములు, భూగోళ రేఖాగణితములను బోధించెడివారు భారతీయులలో తొలుతగా పత్రికా నిర్వహణమునకు పూనుకొన్నది కూడ రామమోహనరాయలవారే వీరు వంగభాషలో వచన కావ్యమునకు శ్రీకారమును చుట్టిరి వాచక పుస్తకములను రచించిరి ప్రజలలో రాజకీయ పరిజ్ఞానము కలుగుటకై కృషి చేసిరి. ఏకేశ్వర మత విశ్వాసములను ప్రచారము చేసిరి

రామమోహనరాయలవారు మరణించిన పదునైదు సంవత్సరములకు వీరేశలింగం పంతులుగారు జన్మించిరి. పంతులుగారి కొక ప్రత్యేకవ్యక్తిత్వము సిద్ధించు నాటికి ఆంధ్రదేశమునందుకూడ పాశ్చాత్య సంస్కృతీ ప్రభావము స్థిరముగా కుదురుకొనెను. స్త్రీ విద్య, స్త్రీ పునర్వివాహములు అవశ్యముగా ప్రోత్సహింపదగినవని, విద్యావంతులు, సంఘ సంస్కరణాభిలాషులు తలంచుచుండిరి. పాశ్చాత్యులను జూచి ప్రజా సంఘములు స్థాపించుకొనుట, సంఘ విజ్ఞాపనములను పంపుకొనుట, సాహితీ సంస్థలు స్థాపించుట, అను ప్రజాహిత కార్యతత్పరత్వము, వృద్ధిపొందుచుండెను విశాఖపట్టణమున శ్రీలింగం లక్ష్మాజీ పంతులుగారు బాలికా పాఠశాల స్థాపన సందర్భమున ప్రసంగించుచు, హిందువులు క్రమ క్రమముగా నిట్లు సంఘ సంస్కరణాభిలాషులై ప్రజలకు మేలు కలిగించునిట్టి సంస్థలు స్థాపించుకొనుటకు ముందుకు వచ్చినచో, ఒకనాటికి

స్త్రీ పునర్వివాహము వంటి సంస్కరణములందును ప్రవృత్తులు కాగలరను ఆశాభావమును వెలిబుచ్చిరి దీనిని బట్టి విద్యావంతుల యభిప్రాయము లెట్లుండెనో తెలుసుకొనవచ్చును[8].

1852వ సంవత్సరమునకు పూర్వమే కోమలేశ్వరపు శ్రీనివాస పిళ్ళె, గాజుల లక్ష్మీనరసు చెట్టి, వెంబాకం రాఘవాచార్యులు మొదలైనవారు, చెన్నపట్టణమున స్త్రీ విద్యాభివృద్ధిని గూర్చి కొంత కృషిచేసి యుండుట తెలుసుకోదగినది. శ్రీనివాసపిళ్ళె గారు బాలికా పాఠశాల నొకదానిని కూడ స్థాపించిరి. లక్ష్మీనరసుచెట్టిగారు రాజకీయ సంస్కరణములకై తీవ్రమైన కృషిని సాగించుచుండిరి

1841-42 సంవత్సరములనుండి దేశీయులు తమంత తాము పూనుకొని పలుతావుల పాఠశాలలు స్థాపించుకొనుట, వార్తాపత్రికలను నిర్వహించుట, మత, సాంఘిక సంస్కారముల పట్ల ఆసక్తిచూపుట మొదలైనది. ఈ ఆసక్తివలన ప్రచారముకూడ కొనసాగినది, ఇదే విధమైన కృషి, ప్రచారము, సర్వ భారతదేశమున కొనసాగెను. ఆంగ్లవిద్యా జ్ఞానము ప్రబలిన కొలది, తమ సంఘమునందలి దోషములు తొలగించి, తమ హక్కులను నిలుపుకొని, తమ సంఘమును పునరుద్ధరించుకొనవలెనను అభిలాష దేశీయులలో ప్రబలము కాజొచ్చినది

1844వ సంవత్సరమున హార్డింజి దొర, ఇంగ్లీషు పాఠశాలలలో పరీక్షలిచ్చిన దేశీయులకు ఉద్యోగములిచ్చుటకు తీర్మానించుట వలన, దేశవ్యాప్తముగా, ఆంగ్లవిద్యాభిమానము ప్రజలలో విస్తరించెను

1820 ప్రాంతముల దేశము నల్లకల్లోల పరచిన పిండారీ మూకలవంటి బాధలు లేకుండ, దేశరక్షణము కట్టుదిట్టము చేయబడెను. 1837వ సంవత్సరముననే దేశమున ఉత్తరములు బట్వాడ చేయు పద్ధతి తొలుతగా ప్రవేశపెట్టబడెను దేశమునందు విద్య, వైద్యము, ప్రయాణ సౌకర్యములు విస్తరించెను. కాని దేశీయులలో దురాచారములు, అంధవిశ్వాసములు, ప్రబలముగానే యుండెను విభిన్న సంస్కృతుల సమ్మేళనమైన సంధికాలమునందు వీరేశలింగం పంతులుగారు జన్మించిరి

వీరేశలింగం పంతులుగారు గ్రంధరచనకు పూనుకొను కాలమునకు, ఆంగ్లేయ సాహిత్య, సంస్కృతుల ప్రభావము గాఢముగా పాదుకొనియుండెను పంతులుగారికి పూర్వపు ఆంధ్రదేశపు అర్ధశతాబ్ది సాహిత్య చరిత్రను పరిశీలించి చూచినచో, ఆంగ్ల సాహిత్య ప్రభావమువలన ఆంధ్ర సాహిత్యమున ప్రక్రియా వైవిధ్యమును తెచ్చిపెట్టు ప్రయత్నములను గమనింప వచ్చును.

అంతకు పూర్వము సాహిత్యమునందు పురాణములు, శతకములు, ప్రబంధములు, యక్షగానములు, ద్విపదకావ్యములు మాత్రమే ప్రథితములై యుండెను వచన కావ్యములుకూడ దక్షిణాంధ్ర వాఙ్మయ యుగమున కొన్ని వెలసినను, పందొమ్మిదవ శతాబ్ది పూర్వార్ధము గడుచువరకు, అయా గ్రంథములను గూర్చి సాహితీపరులకు తెలియదు.

పందొమ్మిదవ శతాబ్ది ప్రథమ పాదమునందే, కల్నల్ మెకంజీ దొర స్థానిక చరిత్రలను సేకరించుటకు పూనుకొనెను నాటికే శ్రీ కావలి బొఱ్ఱయ్యవంటి మహామేధావులు, ఆంగ్లభాషయందు పాండిత్యమును సంపాదించి గ్రంథ రచనము గావించి యుండుట, ప్రతిభావంతులపై నీ శతాబ్ది ప్రథమ దశకముననే పొడసూపిన ఆంగ్ల వాఙ్మయ ప్రభావమెట్టిదో గ్రహించుటకు వీలగుచున్నది. బొఱ్ఱయ్యకు ఏడు భాషల యందు సంపూర్ణమగు పాండిత్యము కలదట 'జైనుల వృత్తాంతము'ను గ్రంథమును 'భారతీయుల ప్రభుత్వ మంతరించిన తరువాత మొగలుల ప్రభుత్వమున, గర్ణాటక దేశమున నేర్పడిన ముఖ్య రాజకీయ సంఘటనలు' అను గ్రంథమును, బొఱ్ఱయ్య ఆంగ్లములో రచించెను. ఈ రెండవ గ్రంథము, మెకన్జీదొర వ్యాఖ్యానముతో "Daltrymplis Oriental Reportery"యందు ప్రకటింపబడెను. ఈ గ్రంథమును బొఱ్ఱయ్య మహారాష్ట్రమునుండి ఆంగ్లములోనికి పరివర్తించెనట. ఈ బొఱ్ఱయ్య తమ్ములైన లక్ష్మయ్య, రామస్వామి యను వారలు, భారతీయ చరిత్ర పరిశోధనమునకును ఆంధ్రదేశ చరిత్ర పరిశోధనమునకును చేసిన సేవ గణనీయము కావలి సోదరులలో కనిష్ఠుడైన రామస్వామి 1829వ సంవత్సరమున దక్షిణ దేశ కవుల జీవిత చరిత్రలు (Biographical Skeches of the Daccan Poets) అను పేరిట గ్రంథమును రచించి యప్పటి గవర్నర్ జనరలైన విలియం బెంటింకునకు అంకితము చేసినాడు. తెలుగు కవుల చరిత్రము ప్రప్రథమమున నీ గ్రంథముననే గ్రథితమైనది ఇది 1829వ సంవత్సరమున కలకత్తానగరమున పుస్తకరూపమున ముద్రింపబడి యుండెను[9]. 1812వ సంవత్సరమున "సెయింట్ ఫోర్ట్‌జార్జి"లో కాలేజి స్థాపించబడుదాక, యూరోపియన్ అధికారులు నేర్చుకొనుటకు తెలుగున తగిన పుస్తకములులేవు. క్రొత్తగా తెలుగు నేర్చుకొను దొరలకు పుస్తకము లభిలషణీయములై నందువలన కాలేజి బోర్డువారు మామిడి వెంకటార్యుని ఆంధ్ర దీపికను క్రయము పొందిరి కాలేజీ బోర్డువారు క్రయము పొందిన పుస్తకములలో నిదియే మొదటిది. ప్రతిఫలముగా బోర్డువారు వేయి వరహాలను గ్రంథకర్త కొస

గిరి 1819వ సంవత్సరమున రావిపాటి గురుమూర్తి శాస్త్రిగారు, 'విక్రమార్కుని కథ'లను ప్రకటించిరి వీరికి పూర్వము కాలేజీ తెలుగు హెడ్డుమేస్టరైన వేదము పట్టాభి రామశాస్త్రిగారు 1816వ సంవత్సరమున "పట్టాభిరామియము"ను, 'ధాతు మాల'ను ప్రకటించిరి 1820వ సంవత్సరమున దేశీయ పాఠశాలలలోని ప్రాథమిక తరగతులకు వాచక పుస్తకములు కూర్పవలయునని దేశ భాషా గ్రంథకరణ సభ (Madras Vernacular School Book Society) యను పేరున నొక సంస్థ స్థాపింపబడెను. కల్నల్ మెకంజీ సేకరించిన స్థానిక వృత్తాంతము లన్నియు ని కాలేజిలో భద్రపరుపబడెను ఛార్లస్ పిలిప్ బ్రౌన్ దొర 1817వ సంవత్సరమున సీమనుండి చెన్నపట్టణమును చేరి 1820వ సంవత్సరమున మద్రాసు దొర నిర్వహించిన సివిల్ పరీక్షయందు తీర్ణుడై, తెలుగు జిల్లాలలో అధికారిగా నియుక్తుడయ్యెను నాటినుండి బ్రౌన్‌దొర పండ్రెండు సంవత్సరములు తెలుగు జిల్లాలందు 'మేజస్ట్రేటు'గను 'జిల్లా జడ్జి'గను ఉద్యోగములు నిర్వహించి తెలుగు భాషయందు పాండిత్యము సంపాదించి, అనేక తాళపత్ర గ్రంథములను సేకరించి, వానికి ప్రామాణికములైన ప్రత్యంతరములను వ్రాయించి, పండితుల సాయమున సుపరిష్కృతములు గావింపజేసి, ముద్రించి తెలుగు భాషకు మహోపకారము గావించిరి. 1827వ సంవత్సరమున బ్రౌన్ దొర తెలుగు కావ్యలక్షణమును పరిశీలించి యొక గ్రంథమును కాలేజి బోర్డువారికి సమర్పించగా, బ్రౌన్‌దొరకు వారు వేయి నవరసములు బహుమతి నిచ్చిరి

ఈ శతాబ్దమున తెలుగు సాహిత్య మభివృద్ధి గాంచుటకు అచ్చు కూటములు వెలయుటకూడ ప్రధాన హేతువు. తెలుగున ముద్రణము 1806వ సంవత్సరముననే ప్రారంభమైనను 1830వ సంవత్సరమువరకు అభివృద్ధిని పొందియుండలేదని బ్రౌన్‌దొరవారు 1852వ సంవత్సరమున ప్రకటించిన తెలుగు-ఇంగ్లీషు నిఘంటువు యొక్క ఉపోద్ఘాతమునందు వ్రాసియున్నారు. కాలేజి బోర్డువారు 1835వ సంవత్సరమున జె సి మారిస్ దొరచే నొక తెలుగు వ్యాకరణమును రచింపజేసి ప్రకటించిరి. ఈ వ్యాకరణ రచనమునందు మారిస్ దొరకు రావిపాటి గురుమూర్తిశాస్త్రిగారు సాయపడిరి. ఈ విధముగా వీరేశలింగము పంతులు గారికి పూర్వము తెలుగు సాహిత్యము పాశ్చాత్య విద్వాంసుల కృషిచే వ్యాకరణములు, నిఘంటువులు, కథల పుస్తకములు వెలువడి సుసంపన్నమైనది

తరువాత నీ ఉపయుక్త గ్రంధకరణ దేశభాషా సభ వారి యాజమాన్యమున 1820 నుండి 1856వ సంవత్సరమువరకు బాలబాలికలకును, క్రొత్తగా తెలుగు నేర్చుకొను వారి యుపయోగార్ధమును 'పెద్ద బాలశిక్ష', 'మహాపురుషుల జీవితములు' 'ఇంగ్లండు దేశ చరిత్ర', 'భూగోళము' మొదలగు గ్రంథములు ప్రకటింపబడినవి. ఈ సభకు కొంతకాలము రావిపాటి గురుమూర్తిశాస్త్రిగా రధ్యక్షత వహించిరి. గురు మూర్తిశాస్త్రిగారి తదుపరి చిన్నయసూరిగా రధ్యక్షులుగా నుండిరి వీరధ్యక్షులుగా నున్న కాలమున 'మహమ్మదు చరిత్ర', 'అమెరికాను కనిపెట్టిన చరిత్ర', 'జాను బన్యను చరిత్ర' మొదలగు గ్రంధములు 1856వ సంవత్సరమున ప్రకటింపబడినవి ఈ గ్రంధములన్నియు వ్యవహారిక భాషయందు రచింపబడినవి ఈ అర్ధశతాబ్ది యందు లెక్కకు మిక్కిలి వచన కావ్యములు సరళమగు వ్యవహారిక భాషయందు వెలువడినవి వీనిలో శాస్త్రీయ గ్రంధములు, కధలు, దేశ చరిత్రలు చేరినవి ఇట్టి వానిలో అల్లాడి రామచంద్రశాస్త్రిగారి 'సిద్ధాంత శిరోమణి' (1837) 'భూగోళదీపిక' (1843-కర్త తెలియదు), వర్యం వాసుదేవ పరబ్రహ్మశాస్త్రుల వారి 'జాన్ప్రైయర్థామస్ భూపాలీయ'మను 'వ్యవహారదర్పణము' (1851) ముఖ్యముగా పేర్కొనదగినవి 1838వ సంవత్సరమున ఆంధ్రవాఙ్మయమును గూర్చి బ్రౌన్ దొరగారు పరిశీలనాత్మకమగు వ్యాసము నొకదానిని వ్రాసిరి. భిన్నకాలములలో వేర్వేరు ప్రదేశములలో తెనుగు కావ్యములు వ్రాసినవారి చరిత్రములను సంగ్రహించి, వారి వారి కావ్యములను చారిత్రక దృష్టితో కూడిన సారస్వత విమర్శగా రూపొందించుట యీ వ్యాసముయొక్క ముఖ్యోద్దేశము. ఈ వ్యాసము మార్గదర్శకత్వము ననే తెలుగున తరువాత కాలమున ననేకములగు వాఙ్మయ చరిత్రలు, సారస్వత విమర్శలు వెలువడినవి[10].

ఈవిధముగా పంతులుగారు గ్రంథరచన చేపట్టుటకుపూర్వమే, వచనరచనవికాసము ఆంగ్లసాహిత్యప్రభావము, తెలుగుసాహిత్యమున ప్రధానలక్షణములని గ్రహింప వచ్చును వార్తాపత్రిక నిర్వహణముకూడ నాటికే తెలుగుభాషయందు కాలూనినది.అందు వలన వ్యాసరచనకూడ ప్రారంభమయ్యేనని చెప్పవచ్చును. 1857వ సంవత్సరమున చెన్నపట్టణమున విశ్వ విద్యాలయము స్థాపింపబడుటతో, ఆంగ్ల సాహిత్య సంస్కృతుల ప్రభావము తెలుగు సాహిత్యముపై మరింత బలపడినవి. 1853వ సంవత్సరమునాటికే ఇంగ్లీషువారు స్థాపించిన ముద్రాక్షరశాలలు గాక, హిందువులు స్థాపిం

చిన అచ్చుకూటములు కూడ చెన్నపట్టణమున నెలకొని యున్నవని బ్రౌన్‌దొరగారు తమ యాంధ్రాంగ్ల నిఘంటువునందు వ్రాసియుండుటవలన, గ్రంథ ముద్రణము కూడ అతిశయించెనని యూహింపదగును

పంతులుగారికి పూర్వము తెలుగు సాహిత్యమున గుర్తింపవలసిన యంశ మింకొకటి గలదు. అది రూపకరచనావిర్భావము పంతులుగారు గ్రంథరచన మునకు బూనుకొనుటకు పూర్వమే కోరాడ రామచంద్రశాస్త్రి ప్రభృతులు తెలుగున రూపక రచనమునకు పూనిరి కనుక పంతులుగారు ఆంగ్లవాఙ్మయమునుండి తెలుగు నకు తెచ్చిన సాహిత్య ప్రక్రియలందు వారికి పూర్వమే కొంతకృషి కొనసాగియుండె ననుట స్పష్టము ఈ విధముగా నొకవైపున నిఘంటు నిర్మాణము, వ్యాకరణ రచ నము, భాషాశాస్త్రరచన, శాస్త్రీయ గ్రంథరచన, దేశ చరిత్ర, కథలు వ్రాయుట, పత్రికా నిర్వహణము, ప్రాచీన తాళపత్ర గ్రంథ ముద్రణము, వాఙ్మయ చరిత్ర, చరిత్ర పరిశోధనము, రూపకరచన, పాఠ్యపుస్తకముల నిర్మితి, వచన కావ్య వికా సము, కొనసాగుచుండగా, ప్రాచీనానుసరణము కూడ పంతులుగారికి పూర్వము తెలుగు సాహిత్యమునందు కొంత కన్పించుచునేయున్నది. ప్రబంధములను కొందరు కవులు రచించిరి యక్షగానములను కొందఱు వెలయించిరి పురాణములను కొందరు తెనిగించిరి చిత్రకవిత్వము, గర్భకవిత్వము, బంధకవిత్వమును కొందరాదరించిరి. లక్షణగ్రంథములు, కావ్యములు, ద్వ్యర్థికావ్యములు, శతకములు కొందరు రచించిరి. వీనిలో బ్రహ్మోత్తరఖండము (శ్రీధరమల్లె వెంకటస్వామి–1815), ఓపువతీ పరి ణయము (అక్కినపల్లి నృసింహకవి – 1817), శ్వేతాచల మాహాత్మ్యము (కొటికెల పూడి కృష్ణకవి —1830 పూర్వమే) మొదలైనవి పేర్కొనదగినవి 'రామ కృష్ణార్జున రూపనారాయణీయము'ను పేరున ఓరుగంటి సోమశేఖరకవి ద్వ్యర్థి కావ్యమును వెలయించెను. వసుచరిత్రము, మనుచరిత్రము, రాఘవ పాండవీయము మొదలగు గ్రంథముల నాదర్శముగా చేసికొని నాటి కవులు తమ గ్రంథములను రచించుచుండిరి.

పంతులు గారికి పూర్వము గ్రంథములు రచించిన వారిలో తరిగొండవెంక మాంబ ప్రసిద్ధికెక్కినది. ఈమె 1840వ సంవత్సరమున జీవించియున్నట్లు బ్రౌన్ దొరగారు తమ నిఘంటువునందు వ్రాసియున్నారు ఈ కాలమున పేర్కొన వలసిన మహాపండితుడు మామిడి వెంకటార్యుడు. 1764వ సంవత్సరమునందు జన్మించి

1834 వ సంవత్సరమునందు వీరు పరమపదము నొందిరి. వీరికిని 'ప్రొవిన్షియల్ కోర్టు' ప్రధమ పండితుడైన వర్యం వాసుదేవ పరబ్రహ్మ శాస్త్రుల వారికిని 'ఆర్య' శబ్దార్థ విషయమై పదునైదు దినములు చర్చజరిగెనట ఈ విషయము వలన నాటి పండితుల పాండిత్య స్పర్ధలు విశదమగుచున్నవి[11]. పంతులుగారి పూర్వీకుడైన పిండిప్రోలు లక్ష్మణకవి ద్వ్యర్థి కావ్యములను రచించి ప్రసిద్ధిపొందెను ఈ కాల మున శిష్టు కృష్ణమూర్తి శాస్త్రిగారు ప్రసిద్ధకవులు. ఆంధ్రమున నీ కవి స్త్రీ నీతి శాస్త్రము, వేంకటాచల మహాత్మ్యము, సర్వకామదా పరిణయము, వీక్షారణ్య మహాత్మ్యము, పంచతంత్రము మొదలగు గ్రంథములను రచించెను సంస్కృతమున నీల శైలనాధీయము, యక్షోల్లాసములను కావ్యములను, వల్లవీపల్లవోల్లాసము, మదనాభ్యుదయములను, భాణములను, రచించి కీర్తిగాంచెను వీరు కోరాడ రామ చంద్రశాస్త్రి గారి కవితా గురువులు.

ఈ విధముగా పంతులు గారికిరువది ముప్పది సంవత్సరములవ్యవహిత పూర్వకాలమున సంస్కృత విద్వత్తు, ప్రబంధధోరణి కన్పట్టుచున్నది. పంతులు గారి కాలమున కించుక పూర్వము వెలువడిన మంత్రిప్రగడ సూర్య ప్రకాశకవి కృష్ణార్జున చరిత్రము (ద్వ్యర్థి), సీతారామ చరిత్రము, ఫక్కి వెంకట నరసయ్యగారి శకుంతలా పరిణయము, అమర పదకల్పద్రుమము, నారాయణ, కుమారీ శతక ములు, వేల్పూరి వేంకటేశ్వరకవి విరచిత విచిత్ర రామాయణము, గోవ్యాఘ్ర చరితము, తిరుమల బుక్క పట్టణపు చిన తాతాచార్యుల ఆంధ్రవిశ్వగుణా దర్శము, కరాలపాటి రంగయ్యకవి భూతపురీ మహాత్మ్యము, కవిజనమనోహరము త్యాగరాజ మొదలి విరచిత విద్వత్కర్ణామృతమను నామాంతరముగల సుబ్ర హ్మణ్య విజయము, ఓగిరాల రంగనాధకవి ద్విరేఫదర్పణము మొదలగు ప్రబంధ ముల, నిఘంటువుల, ఛందోగ్రంధముల, ద్వ్యర్థికావ్యముల వలన పంతులుగారికి పూర్వపు తెలుగు సాహిత్యమునందలి ప్రాచీన సంప్రదాయ మార్గానుసరణము స్పష్ట మగుచున్నది పంతులుగారికి సమకాలికులగు మండపాక పార్వతీశ్వర కవి మొద లగు వారు కూడ శతకములను, ప్రబంధములను, లక్షణ గ్రంధములను రచించియు న్నారు కరాలపాటి రంగయ్య కవీశ్వరులే (1814-1863) ప్రప్రధమమున ఆంధ్రభారత, భాగవత, రామాయణములను, లేఖక ప్రమాద జనిత దోషరహిత ము లుగా ముద్రింపించిరని వీరేశలింగము పంతులుగారు తమ కవుల చరిత్రము

నందు వ్రాసియున్నారు[12] ఈ కాలమున మహాకావ్యములను వెలయించిన కవీశ్వరులును కొందరున్నారు. గోపీనాధము వెంకటకవి వాల్మీకి రామాయణము నీ కాలముననే యథామాతృకముగా ననువదించిరి బ్రహ్మకైవర్తపురాణములోని కృష్ణ జన్మఖండము నెనిమిదాశ్వాసముల పద్యకావ్యముగను వెంకటకవి రచించిరి, భగవద్గీతను కూడ పద్యకావ్యముగా వీరు రచించిరి. దక్షిణ దేశమునందు నివసించి మహానుభావుడగు త్యాగరాజస్వామి (1767-1847) యీ కాలముననే మనోహరములగు కృతులనేకము రచించి సంగీత సాహిత్యములందు శశ్వద్యశస్సును సముపార్జించిరి త్యాగరాజస్వామి సంగీతబ్రహ్మ. జీవన్ముక్తుడు ఈ కాలమున దక్షిణాంధ్ర వాఙ్మయమున కొన్ని యక్షగానములు వెలసినవి. తంజావూరును పరిపాలించిన మహారాష్ట్ర ప్రభువు శివాజి (1833-55) అన్నపూర్ణా పరిణయమను యక్షగానమును రచించెను. ఈ కాలముననే నారాయణ తీర్థులవారు సంస్కృతమున కృష్ణలీలా తరంగిణిని, తెనుగున పారిజాతాపహరణ నాటకమును రచించిరి. మేరట్టూరు వెంకటరామశాస్త్రి భాగవత మేళ నాటకములను యక్షగాన సమానములైన వానినేకములు రచించెను. ప్రహ్లాదచరిత్ర, ఉషా పరిణయము వీనియందు ముఖ్యములు. ఈ విధముగా వీరేశలింగం పంతులుగారికి పూర్వము, తెలుగు సాహిత్యమునందు ప్రాచీన మార్గానుసరణము, నవీన మార్గానుసరణము కూడ కన్పట్టుచున్నది సంస్కృతాంధ్రముల యందు పాండితీ ప్రాగల్భ్యము చూపిన వారును, ఆంగ్లసాహితీ ప్రభావితులై నూతన రచనలకు పూనుకొన్న వారును కలరు. ఒక రకముగా పందొమ్మిదవ శతాబ్ది పూర్వార్ధమున తెలుగు సాహిత్యమున రెండు విభిన్నములైన సాహితీమార్గములు ఈ ప్రత్యేకవ్యక్తిత్వముతో పొడకట్టుచుండును ఈ రెండు మార్గములును ఉత్తరార్ధమున సన్నిహితములై ఇరువదవ శతాబ్దమున ఏకముఖమైనవి

ఈ రెండు మార్గములను సమ్మేళన మొనర్చి పంతులుగారు గ్రంథ రచనము కావించిరి ప్రారంభమున వారు పద్య కావ్యనిర్మాణమునకే పూని యున్నను, తదుపరి జీవిత మహాకావ్యమునందు వారు సాధింపబోవు ఉత్కృష్ట కార్యములకు సాధన భూతములగు వచనకావ్యముల వంక వారి దృష్టి మరలెను

సంఘ సంస్కరణమును ప్రధానముగా దృష్టియందుంచుకొని వారు సాహిత్య సృష్టికి గడంగిరి

---

ఆంగ్లేయులు భారతదేశము నాక్రమించి, తమ పరిపాలనను కొనసాగించు వరకు, రాజభాషగా ఫారశీ వ్యవహారమునందుండెడిదనియే చెప్ప వచ్చును.

భారతదేశము మహమ్మదీయుల ఏల్బడిలో నున్నను, సర్వసామాన్యముగా పాలకులకు, పాలితులకు మతసంబంధములైన వైమనస్యములు సంభవించి యుండలేదు. పొసగినను అవి సర్వ భారతీయ సంస్కృతిని ప్రభావితము చేయ జాలక పోయెను.

ఆంధ్రదేశమును పరిపాలించిన మహమ్మదీయ మతస్థులు, ప్రజల మత విశ్వాసముల పొంతబోయినవారుకారు. వారు కవులను, పండితులను, ఆదరించిరి కొందరు దేవ, బ్రాహ్మణభక్తిసిగూడ కలిగియుండి, వారిని బిరుదములతోను, మడి మాన్యములతోను సత్కరించిరి

కరువు కాటకములు సంభవించి నప్పుడు తప్ప ప్రజలాకాలమున శాంతి భద్రతల ననుభవించుచుండిరి దేశము జమీలుగా విభజింపబడి, జమీందారుల పరి పాలన సాగుచుండెను ఆలయ తటాకాది నిర్మాణములు గావించుచు, ఈ జమీం దారులు దేశమును పరిపాలించుచుండిరి.

క్రీ శ. 1802వ సంవత్సరమున తూర్పిండియా కంపెనీ ప్రభుత్వము వారు 'శాశ్వతమైన పైసలా పద్ధతి ని (Permanent Settlement Act) ప్రవేశ పెట్టుటతో, దేశీయుల ఆర్థికస్థితియందు గొప్ప మార్పు సంభవించెను జమీం దారుల హక్కులు నశించి కంపెనీ ప్రభుత్వము మరింతబలపడెను. క్రీ శ. 1793వ సంవత్సరమునందే, దేశమును మండలములుగా విభజించి, కంపెనీ ప్రభుత్వము పరిపాలనాధికారులుగా కలెక్టరులను నియమించెను. ఈ విధమైన ఏర్పాటుతో ప్రజల జీవిత విధానమునందు గొప్ప మార్పు కలిగెను. న్యాయ విధానమునందు పంచాయతీ పద్ధతి అంతరించి, కంపెనీ వారేర్పాటు చేసిన న్యాయసభలు పనిచేయసాగెను. ఇట్టి న్యాయ సభలవలన దేశీయుల సుస్థితికి భంగము కలిగెను కంపెనీ ప్రభుత్వము వారితో పోటీ పడలేక దేశీయ వృత్తులన్నియు క్షీణించిపోయెను ఆంగ్లేయుల పద్ధతులు, న్యాయానుశీలనము సామాన్య ప్రజకు వెక్కసము కలిగించెను ప్రజ లెల్లరును పట్టణవాసము నందధిక వ్యామోహముతో, పల్లెపట్టులను విడిచిపెట్టి పట్టణములను చేరుచుండిరి

యూరోపులో స్థాపింపబడిన పరిశ్రమల మూలమున భారత దేశమునదంలి

ము పోవుట చిన్ననాటి నుండియు వారికి సమ్మతము కాదు బాల్యమునందు
తులుగారు మంత్ర తంత్రములందును, జ్యోతిశ్శాస్త్రము నందును, నమ్మకము
గి యుండిరి. నిష్కారణముగ ఒరులు తనను విమర్శించుట, దూషించుట, అంగీ
ంచ కుండిరి సహజముగా శాంతస్వభావులయ్యును, ఎక్కడ నే యక్రమము
చినను, దానికి ప్రతిక్రియ కలుగుటకై శ్రమించు చుండిరి బాల్యమాదిగా ఈ పట్టు
యే,పంతులుగారి వ్యక్తిత్వమును, దిద్దితీర్చిన మహాగుణమని చెప్పనొప్పును కరిన
న పనికి వెనుదీయకుండెడి స్వభావము కలవారని, చిన్ననాడే, అనేక నియమము
తో రచించిన మార్కండేయ శతకము, వేణుగోపాల శతకముల వలనతెలియును

చిన్నతనమున పురాణపరన, శ్రవణములందు పంతులుగారి కాసక్తి మెండుగ
ండెడిది. వారి పూర్వులు లింగధారణ మొనర్చిన శైవులయ్యును, పంతులుగారి
తగారు లింగధారణమును విసర్జించి, కొంత సంస్కరణమునకు దారిచూపగా,
తులుగారి కాలమునకు వారు శివకేశవులందభేదప్రతిపత్తిని చూపుచుండిరి.
తులుగారు తొలినాళ్ళలో రచించిన గ్రంథములలో శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన
షధము శివునకంకితముకాగా, రసికజనరంజనము విష్ణువునకంకితము చేయబడెను.
రెండు గ్రంథములును ఇంచుమించుగ 1870వ సంవత్సరమున పంతులుగారు
వేశ పరీక్షకు చదువుచుండిన కాలముననే రచించిరి 1879వ సంవత్సరమున
తులుగారు వెలయించిన శుద్ధాంధ్ర భారత సంగ్రహమునందలి ఆశ్వాసాది, ఆశ్వా
ంతముల పద్యములు పరబ్రహ్మాత్మక మైన మూర్తిని వర్ణించు చున్నట్టివిగా
న్నవి. కనుక పది సంవత్సరముల కాలమున పంతులుగారి విశ్వాసము లేవిధమైన
ర్పుపొందెనో తెలిసికొనవచ్చును. ఇట్టి క్రమపరిణామ వికాసము, వారి స్వీయ
త్రమునందలి బాల్యదశను గూర్చి వ్రాసిన ప్రకరణము నుండియే గ్రహింప
చ్చును. ప్రాథమిక తరగతులందు చదువుచుండిన కాలమున, వారు రెండు పూట
ు, ప్రదోష సమయముల రాజమహేంద్ర వరము నందలి, శివాలయమునకును,
ష్ణ్వాలయమునకును కూడ నేగుచుండిరనియు, పర్వదినములందు ఉపవాస నియమ
ను కూడ పాటించు చుండిరనియు, దయ్యములను, భూతములను చూడవలయు
డి పట్టుదలతో, ఉత్కంఠతో, అర్ధరాత్రి సమయములందు స్మశానములందు
గెడు వారనియు, దయ్యములు పట్టిన వారన్నవారి వర్తనములు, నిశితముగ
శీలించు చుండిరనియు స్వీయచరిత్రము వల్లనే విశదము కాగలదు.

ఇట్టి పరిస్థితులందు పంతులుగారు, తమ బాల్య మిత్రులైన చల్లపల్లి

రంగయ్య పంతులుగారి నుండియో, లేక యే మిత్రుని వద్దనుండియో, కేశవ చంద్ర సేనుల యుపన్యాస సంపుటిని తీసికొని చదువుట తటస్థించినది. ఈ పుస్తక పఠన ముతో వారి హృదయము నందు ఏకేశ్వరమత విశ్వాసములు పాదుకొనుట, హేతు వాదము కాలూనుట, భూతప్రేత పిశాచములందలి నమ్మకము సడలుట, సంఘ సంస్కరణ విషయములందు ఆదరము కలుగుట, మొదలగు పరిణామములు కలిగినవి ఆ కాలమునందు బందరునుండి ఆత్మూరు లక్ష్మీనరసింహముగారను వారువచ్చి, రాజ మహేంద్రవరమునందలి ప్రభుత్వ పాఠశాలలో పంతులుగారి తరగతికి పాఠములు చెప్పుచుండిరి. వీరాకాలమున బ్రాహ్మమతాభిమానులై యుండుటవలన, పాఠములు బోధించునప్పుడు సందర్భానుసారముగా బ్రాహ్మమతవిషయములను బోధించుచుండిరట. నాటికే 'తత్వబోధిని' మొదలగు పత్రికలందు స్త్రీ పునర్వివాహము, ఏకేశ్వరోపాసనము, మొదలగు సాంఘిక, మతవిషయకములైన వ్యాసములు ప్రచురింపబడు చుండెను. శ్రీయక్షిణి, తత్వబోధిని మొదలగు నీ పత్రికలందు, ప్రచురింపబడుచుండిన మత, సాంఘిక, రాజకీయవిషయములను పంతులుగారు పరిశీలించు చుండిరి 1872వ సంవత్సరమున 'పురుషార్థ ప్రదాయిని' యను పత్రికయందు స్త్రీ పునర్వివాహమును గూర్చిన వాదవివాదములు ప్రచురింప బడుచుండెను ఆ కాలమున వెలువడు చుండిన 'ఆంధ్రభాషాసంజీవని' 'సకల విద్యాభివర్ధని' 'లోకరంజని' మొదలగు పత్రికలందు సైతము, మత, సాంఘిక, రాజకీయ విషయములు చోటుచేసికొను చుండెను ముఖ్యముగా ఆంధ్రభాషా సంజీవనికిని, పురుషార్థ ప్రదాయినికిని, స్త్రీ విద్య, స్త్రీ పునర్వివాహమును గూర్చిన వాదోపవాదములు జరుగుచుండెను. ఈ వాదవివాదములందు పంతులుగారును పాల్గొను చుండిరి.

పంతులుగారు జన్మించిన ఇరువది సంవత్సరములకు, దేశవ్యాప్తముగ గొప్ప మార్పులు సంభవించు చుండెను. సతీసహగమనమును మాన్పుట, సాంఘికాసమానతలను రూపుమాపుట, ఆంగ్లవిద్యను ప్రోత్సహించుట, సంఘమునందలి యనేక దురాచారములను నిరసించుట, మతసంస్కరణము, భారతీయులకు రాజ్యాంగ పరిజ్ఞానము కలిగించుట, పత్రికానిర్వహణము, మొదలగు మహత్తర కార్యములను సాధించి శ్రీ రాజా రామమోహన రాయలవారు, భారతదేశమున నొక నూతన యుగ ప్రవర్తకులైరి పంతులుగారి వ్యక్తిత్వము రూపురేఖలు దిద్దుకొనుచున్న కాలమునకు రామమోహన రాయలు మరణించి నలుబది సంవత్సరములు గడిచి నప్పటికిని, హిందూదేశముపై రాయలవారుబరపిన ప్రభావము నాడు కూడ ఘనిష్ఠము

గనే యుండెను. కనుకనే పంతులుగారు 1883వ సంవత్సరమునందు రచించిన 'సత్యవతీ చరిత్రము' నందుకూడ, సతీసహగమనమును వర్ణించు సందర్భము నొక దానిని కల్పించుకొని, భయంకరముగ వర్ణించిరి నాటికింకను పెద్దవారు జ్ఞాపకముల రూపమున పిన్న వారి కాయా సందర్భములను వివరించుచుండిరని యూహింప వచ్చును.

మతవిషయకముగ నాటికే, క్రైస్తవమిషనరీలు, దేశము నలుమూలలందును పాఠశాలలను స్థాపించి, కృషి చేయుచుండిరి. చెన్నరాజధాని యందొక ప్రధాన నగరమైన రాజమహేంద్ర వరమున పంతులుగారు జన్మించుటకు పూర్వమే, క్రైస్తవ మిషనరీల పాఠశాలలు నెలకొలుపబడెను. చర్చిలు నిర్మింపబడెను. క్రైస్తవ పాఠశాలలందు, క్రైస్తవమత వ్యాప్తికై కృషి జరుగుటయేకాక, హిందువుల మతగ్రంధములు, పురాణములు, ఆచార వ్యవహారములు, విశ్వాస ములు నిరసింపబడుచుండెను. పంతులుగారికి ఊహాపోహలు వచ్చుసరి కీపరిస్థితులు కుదురుకొనియుండెను

1869వ సంవత్సరమునకే ఆంధ్రదేశమున విశాఖపట్టణమున నొక బాలికా పాఠశాల స్థాపింపబడెను. ఆ సందర్భమున శ్రీ లింగం లక్ష్మాజీ పంతులుగారు ప్రసం గించుచు, భారతదేశమున నిట్టి పాఠశాలలు స్థాపించుట యపూర్వమనియు, నిది వరలో ఒక్క కాశీనగరమందే ఇట్టి పాఠశాల, హిందూదేశము మొత్తమునందు నెల కొలుపబడి యుండెననియు ప్రసంగించిరి [1]

కాని 1852వ సంవత్సరమునకు పూర్వమే చెన్నపట్టణమునందు శ్రీ కోమ లేశ్వరపురం శ్రీనివాస పిళ్ళయను ధర్మాత్ముడు బాలికల నిమిత్తమై యొక పాఠ శాలను నడుపుచుండిరట. ఆ కాలమున విద్యాభివృద్ధి నిమిత్తమై యీ మహాను భావుడు డెబ్బదియైదువేల రూపాయలను దానముచేసెను. ఈ ధర్మనిధినుండి వచ్చు యప్పు పాఠశాల కనుబంధముగా, బాలికా పాఠశాలయొకటి, ఆ కాలమున నిర్వ హింపబడుచుండెను[2]

1873వ సంవత్సరమున కాకినాడలో నొక బాలికా పాఠశాల స్థాపింప బడెను[3]. ఈ విధముగా భారతదేశమునందంతటను, ముఖ్యముగా ఆంధ్రదేశము నను, పంతులుగారు ప్రవేశ పరీక్షయందుత్తీర్ణులై, కోరంగి ఆంగ్లోపాఠశాలయం దుపాధ్యాయులుగా నియమింపబడిన కాలమునకు, దేశపరిస్థితులందు గొప్ప మార్పులు

సంభవించుచుండెను. పూర్వాచారములు పోయి, వాని స్థానమున నవీనాచారములు నెలకొనుచుండెను దేశ వ్యాప్తముగా నొక భావ విప్లవము స్వేచ్ఛావిహార మొనర్చు చుండెను ఈ పరిస్థితులందు పంతులుగారు దేశాభిమాన మాననీయమగు కృషికి పూనుకొనిరి. వారు రాజమహేంద్రవరమున జన్మించుట, యచటనే విద్యనభ్య సించుటవలన అచిర కాలముననే వారిని నవీనాదర్శములు, పాశ్చాత్య సంస్కృతి యాకర్షించినవని చెప్పవచ్చును చెన్నరాజధానియందు తొట్టతొలుత పురపారిశుధ్య సంఘములేర్పరుపబడిన పట్టణములలో రాజమహేంద్రవర మొకటి 1854వ సంవత్సరముననే, యచట పురపారిశుధ్య విచారణ సంఘము స్థాపింపబడినది చెన్నరాజధానియందు తొట్టతొలుత ఆంగ్లేయ పాఠశాలలు స్థాపింపబడిన పట్ట ణములందు కూడ రాజమహేంద్రవర మొకటి. న్యాయసభలు కూడ విచ్చటనే మున్ముందు స్థాపింపబడినవి. ఈ కారణములను పురస్కరించుకొని పంతులు గారిపై ఆధునిక నాగరకతా ప్రభావము, అత్యంత శీఘ్రకాలముననే తన ముద్ర నచ్చొత్తినది. 1874వ సంవత్సరముననే పంతులుగారిపై నీ ప్రభావము స్పష్ట మగుచున్నది పంతులుగారు 1874వ సంవత్సరము అక్టోబరు నెలయందు 'వివేక వర్ధని' ప్రారంభ సంచికను వెలువరించిరి ఆ సంచికయందు వారు దయ్యములను గూర్చి వ్రాసిన యొకానొక వృత్తాంతము, ఆ కాలమున వారి అలోచనలందు కలుగుచున్న మార్పులను వ్యక్తము చేయుచున్నది. నాటినుండి పంతులుగారి సంఘ సంస్కరణైక కృషి ప్రారంభమయ్యెనని చెప్పవచ్చును. 1870వ సంవత్సరమున పంతులుగారు ప్రకటించిన 'బ్రాహ్మవివాహము' 'వ్యవహారధర్మబోధిని' యను ప్రహసనప్రాయములైన రూపకములందు, పంతులుగారి వ్యక్తిత్వము పరిపుష్ట మైనది. 1878వ సంవత్సరముననే పంతులుగారు రాజశేఖర చరిత్రమును రచించి తమ వివేకవర్ధని యందు భాగభాగములుగ వెలువరించిరి రాజశేఖర చరిత్ర రచనా కాలమునాటికే పంతులుగారి సమగ్ర వ్యక్తిత్వము, రూపురేఖలు దిద్దుకొను చుండెను పంతులుగారు రాజశేఖర చరిత్రమునందు నాటి సాంఘిక దురాచారముల నన్నింటిని తీవ్రముగ విమర్శించిరి. జ్యోతిశ్శాస్త్రమునందలి నమ్మకమును, స్వోదర పూరణపరాయణులై ముఖస్తుతులతో కలవారినాశ్రయించు బంధువర్గమును, సాధు సన్యాసుల మోసములను, చాదస్తపుటాచారములను, పంతులుగారు తమ రాజశేఖర చరిత్రమునందు గర్హించిరి. ఈ విధముగా పంతులుగారి జీవితమునందు

1865-75 సంవత్సరముల మధ్యకాలమును పరిణామ దశగా గ్రహింప వచ్చును ఇట్టి పరిణామమునకు నాడు దేశమును ప్రభావిత మొనర్చిన పాశ్చాత్య సంస్కృతియే ప్రధాన కారణమని గ్రహింపవలెను. 1875వ సంవత్సరమునందు పంతులుగారు వెలువరించుచుండిన వివేక వర్ధని యందును నిట్టి యభిప్రాయమే వెల్లడింపబడెను.

'It is admitted by one and all that western lore has worked wonders among the natives of India. We are quite aware that English education has rendered natives more refined in their manners, has dispelled the mist of superstition from the minds of several of them, if not many, and has considerably developed their moral calibre whenever it is properly imparted "4

ఇట్టి భావములను పంతులుగారేకాక నాటి విద్యావంతులందరును కలిగి యుండిరి. కనుకనే పంతులుగారు రాజశేఖర చరిత్రమువంటి గ్రంధములను 1878వ సంవత్సరమునకే రచింప గలిగిరి నాటి సాంఘిక పరిస్థితుల నీ విధముగా శ్రీ అజ్జాడ ఆదిభట్ల నారాయణదాసు గారి వాక్యములలో క్లుప్తీకరింప వచ్చును "కోర్టుల ప్రమాణము, లబద్ధము, లన్యాయములకు, పోలీసులు దొంగతవములకు, మ్యునిసిపాలిటి మురికికి, దేవతాలయములు వెలయాండ్రకు, తీర్ధములపరిశుద్ధికి, కల్మి పాపమునకు, విద్య మోసమునకు హేతుభూతములుగా దోచెడివి.. "5.

ఈ వాక్యములు తమ కాలమునాటి సాంఘిక పరిస్థితులను వర్ణించుచు నారాయణదాసుగారు వ్రాసినవి. దాసుగారి వాక్యములు 1890వ సంవత్సరము ప్రాంతముల దేశకాల పరిస్థితులకు వర్తించునట్టివైనను, పంతులుగారి గ్రంధరచనారంభ కాలమునకు గూడ అన్వయింపవచ్చును.

ఇట్టి పరిస్థితులందు పంతులుగారు, అనూచానముగావచ్చు కావ్య మార్గములను వీడి, వజ్రాభములగు తమ రచనలతో సంఘచైతన్యమునకు, శ్రేయస్సునకు, కారణభూతులు గాకుండనెట్లుండగలరు ? కనుకనే శుద్ధాంధ్రనిరోష్ఠ్యనిర్వచన నైషధము, రసికజనరంజనము, శుద్ధాంధ్రోత్తర రామాయణము, శుద్ధాంధ్ర భారత సంగ్రహమువంటి గ్రంథములు రచించుటకు పంతులుగారి జీవితమున 1879వ సంవత్సరమే కడపటి హద్దుగా పరిణమించినది 1879వ సంవత్సరము నందైనను శుద్ధాంధ్ర భారత సంగ్రహమును పంతులుగారు వెలయించుటకు కారణము, పూర్వము 1876వ సంవత్సరమున తాము చెన్నపురి కేగినప్పుడు, అచ్చట కొల్లా సుబ్బరాయలు శెట్టి, గురుస్వామి శెట్టియను వారలకు శుద్ధాంధ్ర భారతమును కృతి

నిచ్చెదమని వాగ్దానము చేసియుండుటయేయని, వారు తమ స్వీయ చరిత్రమునందు వ్రాసికొనిరి. 1880వ సంవత్సరమునకు తరువాత పంతులుగారెప్పుడును, తమ ఆశయములకు దూరమైన గ్రంథమును రచింపలేదు కవుల చరిత్ర రచనమునందు కూడ యెడ నెడ తమ సంఘ సంస్కరణాభిలాషను వారు ప్రకటించియే యున్నారు.

ఈ విధముగా పంతులుగారి సాహిత్య జీవితమునందు 1865వ సంవత్సరము నుండి 1875వ సంవత్సరము వరకును గల మధ్యకాలమును, వారి గ్రంధ రచనా దశయందును, వ్యక్తిత్వము నందును పరిణామ కాలముగా గ్రహింప వచ్చును.

—: 0 :—

# 3

# పంతులుగారి సాహితీ వేత్తృత్వము

పంతులుగారు తమ స్వీయచరిత్రమునందు తెలుగున తామే తొలి నాటకమును రచించితి మనియు, తొలి ప్రహసనమును వెలయించితి మనియు, మొట్ట మొదటి వచన ప్రబంధమును నిర్మించితి మనియు, తొట్ట తొలుతగా కవుల చరిత్రమునకు కడంగితి మనియు, ప్రథమముగా శాస్త్రీయ గ్రంథముల నిబంధించితి మనియు వ్రాసియున్నారు. పంతులు గారు తెలుగు సాహిత్యమున వివిధ ప్రక్రియలను తెచ్చిపెట్టి, సుసంప న్నము గావించినమాట వాస్తవమేయగును, కాని అన్నిటను ప్రాథమ్యము వారిది కాదు. పంతులుగారికి పూర్వమే ఆధునిక ప్రక్రియలన్నియు వెలసియున్నను, ఆయా మార్గములు ప్రచురములు కాలేదు. వారా మార్గములను ప్రథితములు చేసి కీర్తి గాంచిరి

పంతులుగారు సంప్రదాయబద్ధమైన కావ్యములను రచించిరి ప్రకృతి శాస్త్ర ములను వెలయించిరి. పత్రికలు నిర్వహించిరి చరిత్రములు గ్రథించిరి.

పంతులు గారికి పూర్వమే, నాటక రచనమునందును, వచన ప్రబంధములు కూర్చుట యందును కొంత కృషి జరిగినది. వాడుక భాషయందు వెలసిన గ్రంథ ములుకూడ యున్నవి. వారు రచించిన 'వ్యవహా రధర్మబోధిని', 'బ్రాహ్మ వివా హము' మొదలగు ప్రహసనప్రాయములగు రచనలందు తత్తదుచితముగా గ్రామ్య భాషకూడ ప్రవేశించినది. పంతులుగారికి పూర్వమే అనేకములైన క్రొత్త ప్రయ త్నములు వెలసినవి. వారు గ్రంథ రచనమునకు పూనుకొనుటకు పూర్వమే పురు షార్థ ప్రదాయిని', 'సకల విద్యాభివర్ధిని' వంటి పత్రికలందు, శాస్త్రీయ విజ్ఞానము ప్రజా బాహుళ్యమున కందుబాటులో నుంచవలె నన్న ప్రయత్నము కొనసాగినది. ముద్రణయంత్రముల సౌకర్యము దేశపు నలుమూలల విస్తరించినది.

పంతులుగారు 1818వ సంవత్సరమున గ్రంథ రచనమునకు శ్రీకారము చుట్టిరి. ఈ సంవత్సరప్రాంతములనే వారు 'మార్కండేయ శతకము', 'వేణు గోపాల శతకము'లను రచించిరి 1870వ సంవత్సర ప్రాంతముల 'శుద్ధాంధ్ర

నిరోష్ఠ్య నిర్వచన నైషధము', 'రసిక జనరంజనము' మొదలగు అచ్చ తెలుగు గ్రంథములను నిర్మించిరి. 1878వ సంవత్సరమున 'శుద్ధాంధ్ర భారత సంగ్రహము'ను వెలయించిరి. పంతులుగారి సాహిత్య జీవితమున1878వ సంవత్సర మొక ప్రధానఘట్టము 1868నుండి 1878 వరకు వారి జీవితకాల మొక అపూర్వ ఘట్టము 1878వ సంవత్సరమున వారు 'రాజశేఖర చరిత్రము'ను, 'వివేక వర్ధని' యందు భాగములుగ ప్రచురించిరి 1874వ సంవత్సరముననే 'వివేక వర్ధని' యను మాసపత్రికను ప్రారంభించిరి. 1875వ సంవత్సర ప్రాంతమున రాజమహేంద్రవర మున ముద్రాయంత్రము నొకదాని నేర్పరచుకొనిరి నాటినుండి వివేకవర్ధనిలో పూర్వకవి కృత గ్రంధములు, ప్రహసనములు, నాటకములు, వచన ప్రబంధములు, కవుల చరిత్రములు, వ్యాసములు, వెలయింప జొచ్చిరి. పంతులుగారి సాహిత్య పరి శ్రమమునందు 1897వ సంవత్సర మింకొక ప్రధాన ఘట్టము ఆ సంవత్సరమున పంతులుగారు రెండు సంవత్సరములు శెలవు తీసికొని, చెన్నపట్టణమున కేగి తమ గ్రంథముల నన్నిటిని ఏకరూప సంపుటములుగా (Volumes) ప్రచురించుటకు పూనుకొనిరి పంతులుగారు తలపెట్టిన యీ బృహత్ప్రణాళిక, గ్రంధములన్నియు పది సంపుటములుగా ముద్రింపబడుటతో 1897వ సంవత్సరమున ముగిసినది ఈ పది సంపుటములలో వారు ముఖ్యములని తలచిన గ్రంధములన్నియు చేర్పబడినవి. ఈ గ్రంధములలో చేరని యనేక ప్రహసనములు, నీతి, మత, ధర్మవిలేఖనములు కూడ పెక్కులు గలవు. ఆయా ప్రక్రియలను గూర్చిన ప్రత్యేక ప్రకరణములందు వానిని గూర్చి పరామర్శించుట జరిగినది పంతులుగారి గ్రంధములే కాక, వారు ఆయా గ్రంథములు రచించిన కాలమునకు పూర్వాపరములు సమీక్షింపబడినవి. పంతులు గారి గ్రంధము లీ వరుసన, పరిశీలింపబడినవి

1. పద్యకావ్యములు – సంప్రదాయమార్గము. ఆంగ్లకావ్యముల యాంధ్రీ కరణము
2 నాటకములు – ప్రహసనములు, ఆంగ్లానువాద రూపకములు, సంస్కృతానువాదములు, స్వతంత్ర రూపకములు.
3. నవలలు (వచనప్రబంధములు).
4 కధావాఙ్మయము.
5. పత్రికానిర్వాహణము.

6. వ్యాసము.

7. కవుల చరిత్రము.

8. స్వీయ చరిత్రము.

9 పరిశిష్టము - దేశచరిత్ర, జీవిత చరిత్ర, సాహిత్యవిమర్శ, లక్షణ గ్రంథములు, శాస్త్రీయ గ్రంథములు, వాచక పుస్తకములు మొదలగునవి

ఈ ప్రక్రియలన్నిటి యందును, పంతులుగారి ప్రత్యేకత యీ ప్రకరణము లందు విమర్శింపబడినది యథాప్రసక్తముగ పంతులుగారి సాహితీ వేత్తృత్వము సమీక్షింపబడినది.

— 0 —

# 4

# పద్య కావ్యములు

వీరేశలింగం పంతులుగారు తెలుగునాట కవులుగాకూడ లబ్ధ ప్రతిష్టులు. వారి తొలిరచనలు పద్యకావ్యములే. 1894వ సంవత్సరమున పంతులుగారి జీవితమును రచించిన శ్రీతోలేటి వేంకటసుబ్బారావుగారా గ్రంధమును వీరేశలింగకవిచరిత్ర మనియే పిలిచియున్నారు

కవయతీతికవిః కవియనగా వర్ణించువాడు. లోకవృత్తము నెరిగినవాడు కవి వర్ణనాసామర్ధ్యము గలవాడు కవి పంతులుగారు అచ్చమగుకవి వారి దృష్టి యింకొక వంకకు మరలినందున పద్యకావ్యముల రచించుట నుండి వారు విముఖులైరి. సంఘ సంస్కార యజ్ఞకర్తృత్వమును బూనిన పంతులుగారు రమణీయ కావ్యకల్పనల, నావలకు నెట్టి, సంఘదురాచార లతాలవిత్రములనదగు రచనలను, ప్రజల మేలుకోరి, ప్రజలకు చేరువగు భాషలో, ప్రజల యభిరుచి కనుగుణముగా వెలయించుటయేమి వింత !!

కనుకనే పద్యకావ్యములను విరచించుచు, సమకాలీనులగు పండితులచే ప్రశంసితులగుచున్న కాలమున, పంతులుగారికి 'తెనుగులో పద్యకావ్యముల కంటె వచన కావ్యములు వ్రాయుట యెక్కువ యుపయోగకరమని' తోచినది[1]. ఇట్లు తోచుట ఆంధ్రుల మహాభాగ్యము పంతులుగారు తమ సాహిత్య సృష్టిని శతకములతో ప్రారంభించిరి. విద్యార్ధి దశనుండియు సాహిత్య పరిశ్రమమునందు వారి కభిరుచి మెండుగ నుండెను. చిన్నతనముననే వసుచరిత్రమును కొని దీక్షగ చదువుట, ఓగిరాలజగన్నాధకవి 'సుమనోమనోభిరంజని'మను పద్యకావ్యము నెత్తి వ్రాసికొని, తమ కొక ప్రతిని సిద్ధపరచుకొనుట, అటకలపై కెక్కించిన ప్రాత తాటాకు పుస్తకములను బరిశీలింప వలయునన్న యాసక్తిని కనపరచి, వీలుచేసికొని వానిని పఠించుట, చిన్ననాటినుండి వారికి గల సాహితీపిపాసను చాటి చెప్పుచున్నవి పందొమ్మిది, ఇరువది సంవత్సరముల వయసున ఆయన తొలి రచనలు చేసెను కవిత్వము వ్రాయుట ఆరంభింపగనే రాజమహేంద్రవరమునందలి గోపాలస్వామి మీద నొకటియు, మార్కండేయ స్వామి మీద నొకటియు కందపద్యశతకములను

రచించిరి. అప్పటికి వారికి బ్రాహ్మమతాభినివేశము, ఏకేశ్వరోపాసనమునందలి దీక్ష కలుగలేదు. అందువలననే వారు శివకేశవులపై రెండు శతకములను రచించిరి. కాని యీ రెండు శతకములును ఉత్పన్నములైనవి. ఈ రెండు శతకములును 'శ్రీరాజమహేంద్రవర పుర గోపాలా', 'మార్కండేయా' అను పాదాంత సంబోధనలతో తాము నిర్వహించియుంటిమని పంతులుగారు స్వీయచరిత్రము నందు వ్రాసియున్నారు. ఈ శతకములు బాగుగలేవనియు, ఛందో వ్యాకరణ దోషదూషితములనియు యుపేక్షించుటచే నవి ఖిలములై పోయెను గోపాల శతకములోని పద్యమొకదానిని అభాగ్యోపాఖ్యానమను వికట కావ్యమునందు, ఆశ్వాసాదిని వారు చేర్చియుండుట వలన, పంతులుగారి నాటి కవనరీతి కొంత తెలియుచున్నది ఆ పద్యమిది. "శ్రీరమణీ హృల్లోలా, కరుణ్యాలతాలవాల కాంచన చేలా, ఘోరాహవజయశీలా, శ్రీరాజ మహేంద్ర వరపుర గోపాలా".

పంతులుగారు నాల్గవ తరగతిలో చదువు చుండిన కాలము నుండియు, తెలుగులో మిక్కిలి యభిరుచి కలిగియుండి, సహపాఠకులకు బోధించగలిగి యుండిరి అందువలన తమ పాండిత్యమును చూపవలెనని వారు తలచిరట. ఆ కాలము నందు పద్యములుచేసిన వారికే కాని వచనము వ్రాసిన వారికి గౌరవము లేనందు వలన పద్యరచన చేయవలయునని యభిలషించిరి. మనస్సులో నొక సంకల్పము పుట్టగానే శక్యాశక్య విచారము చేయక, పనికి పూనుకొనెడు స్వభావము, పంతులుగారికి ఆజన్మ సిద్ధము కనుక, కందము చేసినవాడు కవియని యొక వాడుక యుండుట వలన, తాము కవి ననిపించుకొనవలెనని కంద పద్య శతకములుగా రచించుటకు వారు పూనుకొనిరి కఠినమైన పనికి వెనుదీయ కుండెడి స్వభావము పంతులుగారికి వెన్నతో బెట్టిన విద్య కావున, ఒక శతికమున మార్కండేయా యను సంబోధనను కూర్చుకొని, ప్రతి పద్య చతుర్ధ పాదమును 'మ'కారము తోడి మైత్రిగల యక్షరముతో ప్రారంభించెడి నియమమును తెచ్చిపెట్టికొనిరి. ఈ శతకమును ముగించి, సోత్సాహులై, ఆత్మ విశ్వాసముతో, రెండవ శతకమైన గోపాల శతకము యొక్క చతుర్ధ చరణమును 'శ్రీరాజమహేంద్రవర పుర గోపాలా', యని కూర్చి, ప్రతి పద్యమును 'ర'కార ప్రాసముతో రచింపవలసిన కఠిన నియమమును పెట్టుకొనిరి. పంతులుగారీ శతకమును గూడ పూర్తి చేసిరి. శతక రచనా సందర్భమున యీ నియమపాలనము వలన వారు పూనిన పనికి వెనుదీయని స్వభావము కలవారనియు, గట్టి పట్టుదల కలవారనియు గ్రహింప వీలగుచున్నది.

ఈ శతకముల నాకాలమున వారి మిత్రులు పలువురుశ్లాఘించి యుండుటవలన పంతులుగారు ద్విగుణీకృతోత్సాహులై మరింత కఠినమైన కావ్యమును రచించుట కున్ముఖులైరి. పాఠశాల తరగతులందు పలుమారు పఠించుచువచ్చిన, మహాభారతము మిశ్రకావ్యము కావున పంతులు గారు తమ నల చరిత్రమును అచ్చ తెనుగు కావ్యముగా జేయతలపోసిరి. ఈ కావ్యమున కొంత భాగమును రచించిన తదుపరి, ఇందు విశేషమేమియును లేదనియు, ఈ వరకెవ్వరును త్రొక్కని క్రొత్త త్రోవ త్రొక్కి విలక్షణమగు కావ్యములను వెలయింప వలెననియు పంతులుగారికి తోచినది అప్పటికి అచ్చతెలుగు కావ్యములను రచించినకీర్తి పొన్నికంటి తెలగన, కూచిమంచి తిమ్మనలకు మాత్రమే కలదు. నిర్వచన కావ్యము నొక్క తిక్కన సోమయాజి మాత్రమే రచించియుండెను నిరోష్ఠ్య కావ్యములను రచించినవారును పలువురులేరు. అందువలన పంతులు గారీ మూడు విధములైన కఠిన నియమముల నొక్క గ్రంథముననే నిర్వహించుచు వ్రాసినచో యధిక ప్రశంసనీయమని తలచి, అప్పటికి రచించిన నలచరిత్రములోని పద్యములను తీసివేసి 'శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధమ'ను పేరున నలచరిత్రమును రచించుటకు పూనుకొనిరి. మూడాశ్వాసములుగా ఈ గ్రంథమును వారు పూర్తిచేసిరి ఇట్టి నియమత్రయముతో కావ్యమును రచించుటకుపూనుకొని కడముట్ట నిర్వహించిన వారిలో పంతులుగారే ప్రథములని చెప్పవలెను. పంతులుగారికి పూర్వము ద్వ్యర్థి కావ్యములును, నిర్వచన కావ్యములును, అచ్చతెనుగు కబ్బములును కలవుకాని, ఇట్టి నియమములు మూడును పాటించి వ్రాసిన గ్రంథములులేవు. పంతులుగారు తమ ప్రవృత్తికి దగినట్లుగ, ఇట్టి దుస్తర ప్రయత్నమునకు బూనుకొని, పండితుల మెప్పుబడసినారు. పంతులుగారు రచించిన ప్రప్రథమకావ్యమిదియే ఈ గ్రంథమును వారు 1870వ సంవత్సర ప్రాంతమున రచించియుందురు. 1871వ సంవత్సరమున రాజమహేంద్రవర ప్రభుత్వపాఠశాలా ప్రధానోపాధ్యాయులైన రెవరెండ్ బారోదొర నడుపుచుండిన గోదావరీ విద్యాప్రబోధిక (The Godavary Edu-ationist)యను పత్రికకు పంతులుగారు సహాయ విలేఖకులై, తమ శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధములోని కొంతభాగము నీ పత్రికయందు ప్రచురించిరి. అనతికాలమున యీ పత్రికలో తెలుగు విభాగము నిలిపి వేయబడుటతో దీనిలోనే పూర్తిగా ప్రచురింపలేదు. సంపుటములుగా తమగ్రంథముల కూర్చునప్పుడు పద్యకావ్యములను నాల్గవ సంపుటముగా పంతులుగారు ప్రచు

రించినారు. అందీ నైషధకావ్యము చేర్చినారు. ఈ గ్రంథమునందు పంతులుగారు నన్నయ్యగారి నలోపాఖ్యానమును విశేషించి యనుకరించిరి. నన్నయ్యగారి పద్యములనే, తమ నియమముల కనుగుణముగా మార్చి వ్రాసిన సందర్భము లెన్నియో యున్నవి కొన్ని పట్టుల శ్రీనాధుని నైషధమును కూడ అనుసరించి యున్నారు పంతులుగారు కూర్చిన అచ్చతెనుగు భాషమీదవారికిగల అధికారమును, ప్రస్ఫుటము చేయుచున్నది పంతులుగా రాంధ్రమున గొప్ప పండితులను విషయము, వారి పద్యకావ్యములు నిరూపింపగలవు. ఈ గ్రంథమున నిరోష్ఠ్య నియమమున్నందున, భీమ, దమయంతి, దమన, దమదాంత, ఋతుపర్ణ, బాహుకాది పాత్రలనామములను, ఏ విధముగా నిర్వహించిరో, చూచిన, వారి ప్రౌఢి తేట తెల్లము కాగలదు భీమునకు గ్రథకైశికు డన్న నామాంతర ముండుటజేసి, యానామము బాధకము కాజాలక పోయెను. కాని దమయంతి, ఋతుపర్ణాది నామములను గ్రంథమున నిర్వహించుట యందు పంతులుగారు చూపిన మెలకువ ప్రశంసార్హము. పూర్వులైన కవులు, కొందరిట్టి సందర్భముల, నామవాచకములు గనుక, వానినట్లే యుంచినను, పంతులుగారు తమ ప్రతిజ్ఞా పాలనము నసిధారావ్రతముగ నిర్వహించి స్తుతిపాత్రులైరి. దమయంతి యను పేరు నీ విధముగా కూర్చినారు

ఒనరగా నేడు నాల్గుల యొక్కటగుచు
దనరు తెనుగచ్చరానను దయలనందు
గూడిన దయంతి యనజెల్లు కూతునోర్తు
దనరు కొడుకుల నిద్దఱ గనియె నతడు.

ఋతుపర్ణునకు

తగు నైదైదుల రెండయి
సొగసగు తెనుగచ్చరాన నూటి యెసంగన్
దగియెడుతుర్ణుల సందు గ
లిగిన ఋతుర్ణుడను ఱేడు లెస్సగ నచటన్

బాహుకునకు

నాలుగాఱుల నాలుగై క్రాలి నిడుద
యానుగల యచ్చతెలు గచ్చరాన దొలుత

నలరి యుండిన హకుఁడన నతని యొద్ద
నుండునది యని యానతి యొసగి చనిన

అని చమత్కారముగ పంతులుగారు పద్యములు రచించిరి. పంతులుగారి మౌలికమైన ప్రతిభ చూపుటకుకాని, కావ్యతత్త్వమును కనబరచుటకుగాని, సంస్కృతాంధ్ర భాషావైదుష్యమును ప్రతిబింబించుటకుగాని యీ కావ్యము చాలియుండక పోయినను, ప్రాథమిక దశయందలి పంతులుగారి కావ్యరచనా వైదగ్ధ్యమును గూర్చి తెలిసికొనుటకు తగినంత యాధారమగుచున్నది పంతులుగారీ కావ్యమున నాశ్వాసాదిని పరమశివుని స్తుతించినారు. శివునకే యంకితమిచ్చినారు. ఆ కాలమున కింకను ఏకేశ్వరమత విశ్వాసములు వారియందు ప్రాబల్యము వహింపకుండుట కిది తార్కాణము. ప్రాచీన కవి సంప్రదాయానుసారముగా ఆశ్వాసాదిని, ఆశ్వాసాంతమున, కృతిపతి ప్రశంస గావించియున్నారు

ఆశ్వాసాదిని

"సిరి యెదగల దొర జేజే
దొరయఁ నెలత నోరనుండు దొర జేజే లె
ల్లరు గొలుచుతేడ ! త్రాచుల
సరులు గలుగు జక్కులదొర సంగడి కాడా."

ఆశ్వాసాంతమున

"తిగ కొటికల దాయా తెల్ల యేరున్నరాయా
సెగకను గలదంటా చేదుగొన్నట్టి జంటా
సొగసుల తలకట్టా సూడులంగొట్టు దిట్టా
జిగియల చెలి జేడా చిల్కురారౌతు సూడా,"

"కలంగితోడి రక్కసీంద్రు కాలి కొద్ది డూటగా
జెలంగుచుం దిగంచు కత్తి చేతదక్కలీనగా
గొలందిలేని కిన్కతోడ గ్రుద్దుబెట్టి జేసియా
తొలంగు హత్తి సోకుతేని ద్రుంచునట్టి రాయడా" అని రచించిరి.

ఈ పద్యముల వలన పంతులుగారి పాండిత్యము వెల్లడియగు చున్నది. త్రిశూలమును తిగంచు కత్తియనియు, గజాసురుని హత్తి సోకుతేడనియు-,

పరమశివుని చిల్క రారౌతుసూడా! యనియు వర్ణించుట పంతులుగారికి అచ్చతెను గున గల అధికారమును సూచించుచున్నవి వారు తమకు పూర్వపు కవులు రచించిన అచ్చతెనుగు కావ్యములను బాగుగ పరిశీలించి యుందురు అందువలన వీరి కావ్య మున శైలీ సౌలభ్యము కుదురుకొన్నది. ఇన్ని నియమములతో రచించినను, ఈ కావ్యమునందలి శైలి సరళముగా నున్నది. అచ్చతెనుగు కావ్యముల సామాన్య లక్షణమైన అన్వయ కాఠిన్యము, సమాసజటిలత,ఈ నైషధమునందులేవు నన్నయ్య భట్టు ననుసరించిన పద్యము లీ విధముగా నున్నవి

కలిదమయంతి బాపసమకట్టు నతింబతి వాయనోపడా
లలనను దీర్ఘ సౌహృద బలంబున నిట్టుల రెంటజేసి య
న్నలుడు విమోరహజ్జుల బెనంగి గతాగత కారియైన యు
య్యేలయును బోలెనూఆడక యెంతయు బ్రొద్దు వినిశ్చితాత్ముడై.

(నన్నయ)

అయ్యేలనాగడించిచన నక్కలి రేచగ లేచు లేచియా
తొయ్యెలి నొంటిజేసి చనదోచక క్రన్నన గూరుమండు దా
నుయ్యెల తీరుగా నెడద యూగగ నాగక యెట్టకేలకుం
జయ్యన గానడించి చనె జానను లో నేనరేది యొక్క తెన్

(వీరేశలింగం)

ఈ పద్యమునందు నన్నయ్యగారు చెప్పిన భావముకన్న పంతులుగారు, నలుడామెను విడిచిపెట్టి చనెనని కొంత యధికముగ చెప్పినను, పద్యమెత్తుగడను, భావమును నన్నయ్యగారి ననుకరించుచునే రచించిరి

'భామవిదర్భ కేగి తనబంధు జనంబుల యొద్దనుండియుం
గోమలదేహ సౌఖ్యములకున్ వెలియై మలినార్ధవస్త్రమున్
భూమిరజంబు నంగమున బొల్పగు చుండగనుండె జీవిత
స్వామి నిజేశు జూచు దివసంబులు గోరుచు సువ్రతంబుతోన్

అను నన్నయ్యగారి పద్యము నీ విధముగా పంతులుగారనుకరించిరి.

"చిలుకల కొల్కి యక్కరణి జెన్నుగ(జుట్టలయొద్దనుండియున్
నలునెదలో దలంచుచు ననల్ దలదాల్చక నేలసెజ్జగా

నల యర చీరతో నొడలనంటి తొంఅంగని ధూళితోఁగనుం
గొలకుల నీటితో నెసగె గూరుకు చెందని కన్నుదోయితోన్..."

ఈ విధముగా భారతములోని నలోపాఖ్యానమునకును, శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధమునందలి పద్యములకును పోలికలుచూపవచ్చును శ్రీనాథుని శృంగార నైషధానుకరణము కూడ యెడ నెడ కాన్పించుచున్నది. ఈ కావ్యము ప్రాథమిక దశయందు రచింపబడినదగుట ఇట్టి యనుకరణములు కన్పించుచున్నవి. శ్రీనాథుని

తల్లి మదేక పుత్రక పెద్ద కన్నులఁ
గాన దిప్పుడు మూడు కాళ్ళముసలి
యిల్లాలు గడుసాధ్వి యేమియు నెఱుఁగదు
పరమ పాతివ్రత్య భవ్య చరిత
వెనుక ముందరలేరు నెనరైన చుట్టంబు
లేవడి యెంతేని జీవనంబు
గానక కన్న సంతానంబు శిశువులు
జీవనస్థితికేన తావలంబు
కృప దలంప గదయ్యయోనృపవరేణ్య
యభయమీవయ్య యోతుహినాంశు వంశ
కావ గదవయ్య యర్థార్థి కల్పశాఖి
నిగ్రహింపకు మయ్యయో నిషధరాజ.

యనుపద్యమునకు

ఎల్లచో నారొక కెదురు చూచుచునుండు
నెలతుక యెద నెంత తలకెనొక్కొ......

మొదలైన పద్యములను పంతులుగారు రచించిరి. ఈ పద్యమునకు మను చరిత్రములోని "నను నిముసమ్ము కానక యున్న నూరెల్ల నరయు మజ్జనకుడెంత డలు నొక్కొ," యను పద్యముతోడి పోలికలు కూడ కన్పించుచున్నవి. ఈ విధముగా పంతులుగారు తమ శుద్ధాంధ్రనిరోష్ఠ్య నిర్వచన నైషధమునందు, పూర్వ కవుల

ననుసరించి యున్నారు ఈ కావ్యమున మొత్తము మూడు వందల డెబ్బది పద్యములున్నవి ఆశ్వాసాంతగద్య లున్నవి. ఫలశ్రుతి కూడ చెప్పబడినది.

అశ్వాసాంతగద్య యిట్లున్నది.

"ఇది శ్రీ మదాపస్తంబసూత్ర లోహితసగోత్ర కందుకూరివంశపయః పారావార రాకాకైరవమిత్ర సుబ్రహ్మణ్యామాత్యపుత్ర సుజనవిధేయ వీరేశలింగ నామధేయ ప్రణీతంబైన..."

ఆశ్వాసాంతముల మాలిని, పంచచామరము, మణిగణనికరము మొదలైన వృత్తములున్నవి.

ఈ శుద్ధాంధ్ర కావ్యమును రచించుచుండిన కాలముననే, పంతులుగారొక మిశ్రప్రబంధమును రచింప వలెనని పూని, అర్జునుడు చిత్రాంగదను పరిణయమాడిన కథను గ్రహించి రసికజనరంజన మను పేర మిశ్రకావ్యముగా రెండాశ్వాసములు రచించిరట. అంతట నిట్టి మిశ్ర ప్రబంధములు తెలుగుభాషయందు నూఱుల కొలది యుండగా తమకావ్యమున కాధిక్యమేమి కలుగునని యోచించి, ఈ గ్రంథమును కూడ అచ్చతెలుగుగా జేయసంకల్పించిరట తదనుగుణముగా ఆ రెండాశ్వాసములను మార్చి మరి మూడాశ్వాసములను చేర్చి, గ్రంథమును పూర్తిచేసిరి. ఈ కావ్యముకూడ పండిత ప్రశంసలందెను. తామాకాలమున వసుచరిత్రాది గ్రంథముల మిక్కిలి యభిమానించినందున, రసికజనరంజనమున శృంగారమతివేలముగా చోటుచేసికొన్నదని పంతులుగారు వ్రాసిరి తదుపరి ఈ గ్రంథములను తిరిగి ముద్రించునప్పుడందలి మృదువుతప్పిన వాక్యములను తీసివేసినామనియు పంతులుగారు తమ స్వీయచరిత్రమునందు తెలిపియున్నారు ఇట్టి గ్రంథములు రచించుట కూడ తమకు సమ్మతము కాదనియు, తమ అభిప్రాయములన్నియు కాలక్రమమున మారిపోయిన వనియు పంతులుగారు స్వీయచరిత్రమునందు వ్రాసియున్నారు ఈ గ్రంథము 1870వ సంవత్సర ప్రాంతమున పంతులుగారు రచించిరి. కొంతవరకు నాటియభిరుచులును వారిట్టి కావ్యములు రచించుటకు దోహదము చేసియుండును. ఆ కాలమున పాండిత్యమును ప్రదర్శించుట, చిత్ర, గర్భ, బంధ కవిత్వముల 'ప్రజ్ఞచూపుట గొప్పగా నెంచబడుచుండెను. పంతులుగారుకూడ అట్టి చిత్రకవిత్వమును రచించిరి. ఆ కాలమునందు పద్యకావ్యములు వెలయించిన యనేకులట్టి ప్రజ్ఞనే ప్రదర్శించిరి కొక్కొండ వెంకటరత్నం పంతులుగారి బిల్వేశ్వరీయము, చతుర్విధ కవిత్వములకు రత్నాకరమువలె

వెలయుచున్నది. నాటి సాహిత్యాభి రుచులట్టివి ఆ కాలమునందే వెలసిన పెక్కు కావ్యములలో యీ చిత్ర, గర్భ, బంధకవిత్వము లతిమాత్రముగా నెలకొనియుండుట చూడవచ్చును. కాని పంతులుగారు కవులచరిత్రము రచించునాటికి, వారికీవిధములైన కావ్యములందు నిరసన దృష్టి కూడ కలిగినది తమ కవుల చరిత్రమున గణపవరపు వెంకటకవి రచిత ప్రబంధరాజ వేంకటేశ్వర విజయవిలాసము, గుడారు వెంకటదాస రచిత బలరామచరిత్రములను, తీవ్రముగ ఆక్షేపించినారు ఇట్టి గ్రంథములను గూర్చి, గ్రంథకర్తలను గూర్చి "ఇట్టివారిలో నెన్నిక గొన్న కొందఱు బంధాదుల నతిమాత్రముగా జేర్చి, యర్థసారస్యమును బూర్ణముగా జెఱిచి, యవయవముల విఱిచి, తమ భాషావధూటిని, విరూపినిజేసి శవప్రాయను జేసిరి". అని విమర్శించిరి. ఇంకను చింతామణి పత్రికయందు ప్రబంధ రాజవేంకటేశ్వర విజయ విలాసమును సమీక్షించుచు, "ఇది బంధగర్భ కవిత్వములకును చిత్ర కవిత్వములకును లక్ష్యగ్రంథముగా నుద్దేశింపబడిన దగుటచేత దీనిని చేయుటయందు గవి యెంత కష్టపడినను, పడిన శ్రమమును విచారించి రసికులెంత యాశ్చర్యపడినను, దీనిని చదువువారికి మాత్రము కథా చమత్కృతిని బట్టి కాని, రసపుష్టిని బట్టికాని కలుగవలసిన యానందము కలుగకున్నది" అని తమ యభిప్రాయములను వ్రాసినారు. కావున పంతులుగారు గర్భ, బంధచిత్రకవిత్వములను మెచ్చరని స్పష్టమగు చున్నది. కాని పంతులు గారు కూడ తమ శుద్ధాంధ్రనిరోష్ఠ్యనిర్వచన నైషధమును, ఆసాంతము చిత్రకవిత్వమున జెప్పినారు. తమరసిక జనరంజనమున గర్భబంధ కవిత్వములను కూడ ప్రవేశపెట్టినారు. దీనికి కారణము వారి సాహిత్య జీవితమున, ఆ కావ్యములు రచించుకాలము ప్రాథమిక దశయగుటయే. అంతియేకాక చిన్ననాట ప్రత్యేక వైలక్షణ్యమును తాము ప్రదర్శింప వలయునను మెండైన యభిలాష వారికి గలదు అందువలన అట్టి గ్రంథమును రచించిరి. రసికరంజనమున, ప్రథమాశ్వాసమున 118వ పద్యము గోమూత్రికా బంధకందముగా పంతులుగారు రచించిరి. కనుక చిత్ర కవిత్వమునందును బంధ కవిత్వము నందును వారికి నేర్పు కలదని తెలియుచున్నది

ఆ పద్యమిది.

కం. దరివిసమిడజను కొమ్మంబొరిగొని తెలివొందు
పైడిపుట్టము రాయా,

పొరిఁగస వొడలను గ్రమ్మందెరిపిని జెలినందుఁ
గూడి దిట్టగురాగా.

గోమూత్రికాబంధ లక్షణమును బట్టి యీ పద్యము నీ విధముగా కూర్చవచ్చును.

ద వి మి జ కొ బొ గొ తె వొ పై పు ము యా
రి స డ ను మ్మం రి ని శి దు డి ట్ట రా
పొ గ వా ల గ్ర దె పి జె నం గూ ది గు గా

ఈ రసిక జనరంజనముననే ద్వితీయాశ్వాసమున 114వ పద్యమును కంద గర్భిత మణిగణనికరముగా కూర్చియున్నారు. ఆ పద్య మిది.

కం॥ చిలువదొరపఱపు చెలువున
జెలగన్ సిలుగుల నడచెడు సిరిచెలిమగడా
నలువయుఁ గొడుకయి నలువుగ
వెలయన్ బెలుకుఱ బగతురబిగి చెఱచుదొరా.

ఇందలి మణిగణ నికరము
చిలువదొర పఱవు చెలువున జెలగన్
సిలుగుల నడచెడు సిరిచెలిమగడా
నలువయుఁగొడుకయి నలువుగ వెలయన్
బెలుకుఱ బగతుఱ బిగిచెఱుచుదొరా.

తృతీయాశ్వాసమున 139వ పద్యమును నిరోష్ఠ్యకందముగా రచించియున్నారు.
రక్కసి తేండ్లంగనలన్
జక్కడచి యలతెఱగంట్ల సాకెడిదిట్టా
చక్కగ నెల్లర సేగిం
జిక్కగనియ్యక యరసెడి జేజేరాయా

కనుక పంతులుగారి తొలికావ్యములవలన, వారిపాండిత్యము, ప్రతిభావ్యుత్పత్తులు వెల్లడి కాగలవు. ఇన్ని నియమములతో రచించినను పండితులు, పంతులుగారి శైలీ సారళ్యమును ప్రశంసించి యున్నారు.

"అచ్చతెనుగు రామాయణము పాకముకంటె దమయచ్చ తెనుగు గ్రంథము యొక్క పాకము మేలైనదని నానిజమైన యభిప్రాయ"మని రసికజనరంజనమును బహుజనపల్లి సీతారామాచార్యులు గారు మెచ్చిరట. "ఇది యచ్చతెలుగు పుస్తకమయి నను, చెప్పకపోయిన పక్షమున జదివెడివారికిది యచ్చతెనుగుగా గనబడక మిశ్ర కావ్యమువలె ధారాళముగా నడచునని" పంతులుగారే వ్రాసిరి[4]. పొన్నికంటి తెలగన యయాతి చరిత్రము కాని, కూచిమంచి తిమ్మకవి నీలాసుందరీ పరిణయము కాని, పంతులుగారి రసికజనరంజనమునకు 'శైలీసారళ్యముదృష్ట్యా, యీడుగావని పంతులు గారి జీవిత చరిత్రమును రచించిన శ్రీ తోలేటి వెంకట సుబ్బారావుగారు తెలిపి యున్నారు[5]

శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధము రచించిన కాలముననే, రసిక జన రంజనమును సైతము రచించినను, ఇది మొట్టమొదట వివేకవర్ధని యందు కాని వెలువడలేదు. వివేకవర్ధని ప్రథమ సంచిక యందే యీ కావ్యము ప్రారంభ మైనది[6] నైషధము శివునకంకితము కాగా నీ చిత్రాంగదా పరిణయ గాథ విష్ణువున కంకిత మీయబడినది పంతులుగారప్పటికి శివకేశవ భేదమునెంచక, ఇరువురి యెడ లను సమానమైన భక్తి ప్రపత్తులను కలిగియుండిరి. పంతులుగారీ గ్రంథమును తమదెందమున 'వెన్నుడు తనకప్పనంబుసేయు తలంపు పాదుకొలిపి' రనికృత్యాదిని వర్ణించిరి. అవతారికయందు ప్రాచీన సంప్రదాయము ననుసరించి షష్ఠ్యంతములను కూడ పంతులుగారు కూర్చియున్నారు. నైషధమునందువలెనే దీనియందుకూడ, ఆశ్వాసాది, అంతములయందు వివిధ ఛందములను కూర్చియున్నారు. ఆశ్వాసాంత గద్యకూడ కూర్చినారు " శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధకావ్య రచనాచాతురీ దురంధర , సద్యశోబంధుర" యని యధికముగా, ఈ గ్రంథములోని గద్యయందు చెప్పికొనుట విశేషము. కృత్యాదిని దీనిని 'అబ్బురంపుఁదెలుగు కబ్బ' మనియు, ప్రబంధరత్నమనియు నుగ్గడించినారు ఈ గ్రంథమును భగవంతుడే తనకీయమని యడిగెనని కల్పించుట, షష్ఠ్యంతములను కూర్చుట, ఆశ్వాసాంత గద్యములందు, పూర్వీకులవలె విశేషణములను చేర్చికొనుట, మొదలగువానిని బట్టిచూడగా వారీ కావ్యములను చిఱుతకూకటినాడు రచియించుటే యిట్టి వానికెల్ల కారణమని స్పష్ట పడగలదు.

అర్జునుడు చిత్రాంగదను పరిణయమాడుట యిందలి ఇతివృత్తము ఈ

కథను చేమకూర వేంకటకవికూడ, విజయవిలాసమున గ్రహించియుండెను. భూప్రదక్షిణ మొనర్చుచు అర్జునుడు, పాండ్యరాజ్యము నందలి మణిపురమును ప్రవేశించి, లీలోద్యానము నందు విహరించుచున్న, పాండ్యరాజ తనయయగు, చిత్రాంగదను జూచి మోహితుడై, ప్రియవయస్యుడైన విశారదుని పాండ్యరాజు కడకు రాయబారమంపుట విజయవిలాసమునందు వర్ణితము. పంతులుగారి కథయందు కొన్ని క్రొత్త కల్పనలు చేసినారు. అయినను విజయవిలాసమును కూడ పంతులుగారెడనెడ ననుసరించిరి. పింగళి సూరనార్యుని ప్రభావతీప్రద్యుమ్నమును గూడ, వర్ణనలందు, కల్పనలందు, కొంతవఱ కనుసరించిరి. శబ్దాలంకారభూయిష్టముగ, పూర్వకవి ప్రణీతప్రబంధను, అను పదము ననుసరించుచునే, విలక్షణమగు మార్గమును త్రొక్కవలయునన్న యభిలాష, పంతులుగారి యీ కావ్యములవలన మనము గ్రహింపవచ్చును.

పారజూచిన పరసైన పారజూచు
వింటికొరగినరిపురాజి వింటికొరగు–విజయవిలాసము
అడుగు వెట్టిన మారుతుండడుగు వెట్టు
మైమఱువిడిన బగతుఁడు మైమఱువిడు–రసికజనరంజనము.
నువ్వుఁబువ్వు నవ్వు జవ్వనినాసిక
చివురు సవురు జవురు నువిదమోవి
మబ్బు నుబ్బు గెబ్బు బిబ్బోకవతివేణి
మెఱపు నొఱపుఁ బఱపుఁ దెఱవమేను – వి. వి.
మీలనేల జాలు వాలు గన్నులడాలు
మిన్ను చెన్నుఁ గన్నుఁ గన్నె కౌను
మించు మించు మించునంచయాన యొడలు
పొగరు తొగరు ఓగురు ముగుదకేలు – ర. రం.

మొదలగు పద్యములవలన రసికజనరంజన రచనయందు పంతులుగారిని విజయవిలాసమెంత యాకర్షించినది తెలియుచున్నది. ఇట్టి రచనా మార్గమును, శ్లేషయమకాను ప్రాసాద్యలంకారములును, విజయవిలాసమునుండి గ్రహించినను

పాత్ర చిత్రణమునందును, కథాసన్నివేశకల్పనమునందును, విజయవిలాసముకన్న ప్రభావతీప్రద్యుమ్నము, పంతులుగారి నధికముగా నాకర్షించినదని, పరిశీలించినచో విశదము కాగలదు. ప్రభావతీప్రద్యుమ్నమునందు పింగళిసూరన హంసజంటను, చిలుకను కల్పించినట్లుగా, పంతులుగారు రసికజనరంజనమందు చిలుక జంటను కల్పించినారు కాని ప్రభావతీప్రద్యుమ్నమునందు శుచిముఖికిగల కార్యకరణ దక్షత, మాటనేర్పు, బుద్ధికౌశలము, కథాప్రాధాన్యము, రసికజనరంజనమునందలి చిలుకజంటకులేదనియే చెప్పవలెను. చిత్రాగందవృత్తాంతము అర్జునునకును, అర్జునుని వృత్తాంతము, చిత్రాంగదకును, వీరిరువురి పరస్పరానురాగమును చిత్రాంగద తండ్రికిని, ఎరిగించుటతప్ప, యీ చిలుకజంటకు, రసిక జనరంజనమునందు ప్రత్యేక ప్రాధాన్యములేదు ఈ కావ్యమునందుగూడ విజయవిలాసము నందువలె అర్జునునకు ప్రియ వయస్యుడున్నాడు ఈ వయస్యుడు, వసు చరిత్రలోని వసురాజు చెలికాని వలె, ఉద్యానవనమునందు జలక్రీడలాడి, యలసి, కవ్వడికథలతో ప్రొద్దు పుచ్చుచున్న చిత్రాంగద వివరములను తెలిసికొనివచ్చుటకై పోవును. పంతులుగారు కల్పించిన విశేషమేమనగా మత్స్యయంత్రమును కొట్టి ద్రౌపదిని పరిణయమాడినాడన్న విష యమును వినినప్పటి నుండియు చిత్రాంగద అర్జునుని వలచియుండెననుట. రసిక జనరంజనము నందీ యిష్ట సఖుడు చిత్రాంగదను పలుకరించివచ్చి, యామె సౌందర్య మును విజయునకు వర్ణించుట, వసుచరిత్రమునందలి ఘట్టమును పోలియున్నది. విజయవిలాసమునందు విశారదుడు చిత్రాంగదార్జునుల వివాహమునకు సంధాన కర్తకాగా, రసికజనరంజనమునందీ కార్యమును చిలుకల జంటయే నిర్వ హించినట్లు వర్ణింపబడినది. 'ప్రభావతీప్రద్యుమ్నము'నందు ప్రద్యుమ్నుడు గుఱ్ఱపు స్వారియందలసి, గుఱ్ఱమునుండి దిగుచుండగా శుచిముఖి ఆతనికి వినపడు నట్లుగా 'అల్లయత డితండు కావలయునని' ప్రద్యుమ్నుని దృష్టి నాకర్షించి తన కార్యక్రమము నారంభించును. రసికజనరంజనమునను లీలోద్యానమున కేళాకూళి చెంగట జాబిల్లి రాతిన్నెపై పరివారముతో నిష్ట కథా ప్రసంగమున బ్రొద్దువుచ్చు చున్న యర్జునునకు వినబడునట్లుగా, మంజువాణి, మృదువాణి, యను చిలుకలు "ఇంతకుముందు త్రోవలో నెదనముకొన్న దాని కితడే తగు గన్గొని ముచ్చటాడివే వెడలుట మంచి మేలుగదవే" యని అర్జునుని దృష్టి నాకర్షించినవి. శుచిముఖివలెనే యీ చిలుకలు గూడ సరస్వతీదేవి పెంపుడు చిల్కలని పంతులుగారు వర్ణించిరి.

ఈ విధముగా కథాసన్నివేశ కల్పనలను, వర్ణనములను, పంతులుగారు తమ కావ్యమునందు ప్రభావతీప్రద్యుమ్నము ననుసరించి చేసియున్నారు. పైనుదహరించిన పద్యములను పరిశీలించిన ప్రభావతీప్రద్యుమ్నము, యొక్క ప్రభావ మేవిధముగా ఈ కావ్యమును దిద్ది తీర్చినదో తెలియగలదు.

'ఇది పదిలమ్ముగా నడుగకే నపుడక్కట కోర్కిదాచి వ
ట్టి దొరతనంపు నీటుప్రకటించితి బావపు లజ్జనన్ను నో
రదిమె, న నాదరంబు తెఱఁగై యది హంసికి దోచెనేమొ ని
ల్పదమఱియించుకైన గరువ ల్చవిగాని కథల్వచింతురే - సూరన

అను నీ పద్యభావమును పంతులుగారు

'ఏనపు డంతయున్ వినియునిట్టటు పల్కక యూరకుంట యే
మోనగుబాటుగా దలచి ముందఱ నెద్దియుఁబల్కగొంకి నా
యానతిబొంది చిల్కచని యవ్వల నెల్లి ద మైతినంచయో
తానెదజిన్నవొయెనా కదా యిక దానికి నేమి సేయుదున్'

మొదలగు పద్యములం దనుసరించి యున్నారు. పంతులుగారు ప్రభావతీ ప్రద్యుమ్నము ననుసరించియున్నను, అందలి మౌలికమైన ప్రతిభయిందు గానరాదు. అనేక ఘట్టములందు పంతులుగారు సూరన ననుసరించినారు. ప్రభావతి యొక్క సౌందర్యము నాకర్షించి ప్రద్యుమ్నుడిట్టి విరహావస్థకు లోనగును.

'కనడొద్దనున్న వారిని, వీరు వారని, కనిన దదర్థ వర్తనలు మఱచు
వినడుచెప్పిన పల్కువేమరు చెప్పక వినిన నేమేమంటిరనుచునడుగు
జన డెత్తులిడక మజ్జన ముఖ్యవిధులకు, జనిన దబ్బిబ్బుగా జలుపు గ్రియలు,
కొనడు నానాసేవకుల సేవలెవ్వియు, గొనిన వీడ్పాటుగా బనులు పనుచు

శుచిముఖీ వాక్య దర్పణ స్ఫురితనిరుప
మాన దనుజేంద్ర కన్యకామణి మనోజ్ఞ

రూపరేఖా విలాస సంరూఢమైన
యాత్మ మలలింప నేరక, హరిసుతుండు

ఇట్లే అర్జునుడు కూడ చిత్రాంగద సౌందర్యము నాలించి, విరహాతురుడై,

"కనఁడెట్టె యెదురనిల్చిన వారలనునైనఁగనియె నేనియుఁనల
గంటజూచు
జెవిఁజొనుప డొరులు చెప్పెడి మాటల, జొనిపెనేనియు, నేమి
టనుచు నడుగు
బలుకరించడు, తన చెలికాండ్రనైనను, బలుకరించిన వెడపలుకు
పలుకు
బిలిపించుకొనును, దాబలుమారు తిండికి నెంతసేపటినికి, నేగకుండ
మిన్ను మన్నునుగానక మెలతమీది
కూర్మి బలువింతవలవంత గుందుచుండె
నడుమ సిరి యెత్తుకొన్నచో మిడిసిపడెడు
ములుచు మానిసిఁబోలి యప్పుడమితేడు."

ఈ విధముగానే "కృపనెరింగింపరే కీరోత్తమములార వజ్రపురికి బోవువారె మీరు .. " అని ప్రద్యుమ్నుడు చిలుకలను, తుమ్మెదలను తన విరహావస్థను, ప్రభావతికి తెలిపి పుణ్యము కట్టుకొండని వేడుకొనగా, అర్జునుడుకూడ" అలలార యంచ తొయ్యలు లారమీరైన జిత్రాంగదకు నన్ను జెప్పగలరె..." యని హంస లను, తుమ్మెదలను రసికజనరంజనము నందు వేడుకొనును. ఈ విధముగా నీ రెండుప్రబంధములలోను సమానఘట్టము లెన్నిటినో జూపవచ్చును. ఈరసికజనరంజ నము అచ్చ తెలుగు కావ్యమైనను 'వికృతులూ, మారుమూల పదాలూ, గొట్టుపదాలూ కాకుండా, వాడుకకు చేరికగా, అంటితే కంది పోయేటంత సుకుమారముగా ఉన్నది" అను వేదుల సత్యనారాయణ శాస్త్రిగారి యభిప్రాయము గమనింప దగినది[7]. పంతులుగారిపై విజయవిలాస, ప్రభావతీప్రద్యుమ్నముల ప్రభావమే కాక, అల్లసాని పెద్దన, భట్టుమూర్తి, శ్రీనాధాదుల ప్రభావము కూడ నీ కావ్యము నందు కన్పించుచున్నది.

'మూడు కన్నుల వానితో మొనసిమున్ను
చచ్చి బ్రతికియు వలదేడ చలముతోడ
వేయి కన్నుల దేవర బిడ్డమీఁది
కేమొగంబున వచ్చితి విపుడుమరల'

యను రసికజనరంజనమునందలి యర్జునుని మన్మధోపాలంభనము, శ్రీనాధుని నైషధమునందలి,

'మూఁడు కన్నుల వానితో మోహరించి
నేఁడు దేహంబు లేక యున్నాఁడు మరుఁడు,
వేయికన్నుల వానితో విగ్రహించి
యువిద ఇంకేమికానున్న వాఁడొ వాఁడు,'
అను పద్యమును స్ఫురింప జేయుచున్నది.

పంతులుగారే తమ స్వీయ చరిత్రము నందీ కావ్యములను గూర్చి యీ విధముగా వ్రాసియున్నారు.

"ఆ కాలమునందు నేను వసుచరిత్రము మొదలైన శృంగార ప్రబంధముల నమితముగా జదివి యుండినందున పూర్వగ్రంధకర్తలు చూపిన మార్గమునే నేనను సరించి వారి గ్రంధములలోని యుత్తమ కల్పనలవంటి కల్పనలనే యనుకరించి దీనిని వ్రాసితినిరి."

ఈ వాక్యముల వలన శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధము, రసికజనరంజనములను గూర్చి పంతులుగారి యభిప్రాయము తెలియుచున్నది. ఈ రసికజన రంజనము పండిత కవులచే మెప్పుపొందినది. శ్రీ కొక్కొండ వేంకటరత్నము పంతులుగారు తమ బిల్వేశ్వరీయమునందు పంతులుగారినిట్లు ప్రశంసించి యున్నారు

'అచ్చ తెనుగు గబ్బ మలవరించుటఁగూచి
మంచి తిమ్మనయును మంచి తెలగ
నయును లింగనయును నయమున స్వీయ భా
షాభి మాన్యులని నుతింతు.'

ఈ కావ్యముల తదుపరి పంతులుగారి కావ్యములలో పేర్కొనదగినది 'అభాగ్యోపాఖ్యానము'. శృంగారశిరోమణి నిర్వచన నైషధము, రసికజనమంజ నములు రచించు కాలమునకును, అభాగ్యోపాఖ్యానమును రచించు కాలమునకును పంతులుగారి యభిరుచులలో గొప్ప మార్పు సంభవించినది. మొదటి కావ్యములను రచించు కాలమునకు పంతులుగారిపై పూర్వ కవుల ప్రభావమనన్యము 'అభాగ్యోపాఖ్యానము' రచించు కాలమునకు వారి దృష్టి మరలి నది. హేళనా పూర్వకమైన సంఘ సంస్కార దృష్టి యభాగ్యోపాఖ్యాన రచనముతోనే పంతులుగారి యందు మొదలైనదని చెప్పవచ్చును సునిశిత పూర్వకమైన వ్యంగ్య వైభవము, పంతులు గారి పూర్వ విరచిత గ్రంధములందు లేదు అధిక్షేప మార్గమున పంతులుగారు రచించిన వానిలో అభాగ్యోపాఖ్యానమే మొదటిది దీనిని పంతులుగారు హాస్యప్రబంధ మనిరి ఈ రచనమును తెలుగు సాహిత్యమందు వెలసిన తొలి వికటకావ్యమన వచ్చును సాహిత్యమునందు ప్రసిద్ధమైన మృదు హాస్యధోరణి యందు విమర్శించు మార్గమును తెలుగున పంతులుగారే ప్రవేశపెట్టిరి అంతకు పూర్వము చంద్రరేఖా విలాసా(పా)దులు వికటకావ్యములుగా రచింపబడినను, శిష్టజన దూష్యము లగుట వలన, పంతులుగారీ ప్రబంధ నిర్మాతలలో ఆద్యులయినారను కీర్తి వారికి లభించినది.

ఇంచుమించుగా తెలుగు భాషలో నున్న ప్రబంధములన్నియు, కామినీకచ, కుచ, సంభోగాది వర్ణనలతో నిండియుండి, యేకరీతిగా నుండుటచే, అట్టి ప్రబంధ ములనే తామీ వరలో రచించియున్నను, తమ వెనుకటి యభిరుచులు మాఱి, శృంగార ప్రబంధములు చేయు మేలు కంటె, కీడెక్కువగా నుండునన్న సిద్ధాంతము నకు వచ్చిన వారగుటచేత, ప్రబంధ ప్రణేతృపంధమ బరిహసింపవలెనన్న యుద్దే శముతో, తా మీ 'యభాగ్యోపాఖ్యానము'ను రచించితిమని పంతులుగారు స్వీయ చరిత్రమునందు విశదీకరించియున్నారు[8].

పంతులుగా రీ కాలమునకే ప్రచురింపబడియున్న ప్రబంధములను, తాము సంపాదించుచు వచ్చిన తాళపత్ర లిఖిత గ్రంధములను చదువుచుండి, యెక్కడ జూచినను, స్త్రీలకచముల యొక్కయు, కుచముల యొక్కయు, రతుల యొక్కయు, పతుల యొక్కయు వర్ణనంబులె కాని మానవులను సన్మార్గంబునకు ద్రిప్పజాలిన నీతులను బోధించు వాక్యంబులు మృగ్యంబైన తారాశశాంకవిజయము, బిల్హణీ యను మొదలైన శృంగార ప్రబంధములను జదివినప్పుడు ఆయా కావ్యములను

వ్యంగ్యధోరణియందు పరిహసింప దొరకొని యీ యథాగ్యోపాఖ్యానము రచించి రని శ్రీ తోలేటి వెంకటసుబ్బారావుగారు వ్రాసిరి పరవస్తువారలే పానుపూరలందని పంతులుగా రీ కావ్యమునందు ప్రబోధించిరి. ఈ యథాగ్యోపాఖ్యానము రచయించిన పంతులుగారికి రామలింగమువలెనే వికట కవిత్వమబ్బుచున్నదని స్నేహితులు చెప్పు కొనుచు వచ్చిరట[10]

సాధారణముగా నుపాఖ్యానము లన్నియు నరణ్యవాసము జేయుచున్న ధర్మరాజాదులకు మార్కండేయ మహాముని యెఱిగించెననియో, లేక నైమి శారణ్యంబున శౌనకాది మహర్షులు, సత్రయాగంబొనర్చుతరి వారలకు రౌమహర్షణి వినిచెననియో చెప్పబడిరచింపబడుచుండుటచే, నిది హాస్యాస్పదంబైన కధయగుటం జేసి, ధర్మరాజును సందర్శింప జనుదెంచిన యొక పరిహాసకుడు, దీనిని వాని కెఱింగించె నని, కృత్యాదియందు చెప్పబడియున్నది పూర్వకావ్యములం దన్నిటను "ఒక రాజు వేటకుంజని యచ్చోనొక కాంతామణింగాంచి, తన చెలికాని సాహాయ్యమున, దానిని గాంధర్వవిధి పాణిగ్రహణము చేసికొని సుఖించుటయే,"ఇతివృత్తము. సర్వ సామాన్యముగా నాయికా నాయకుల విరహము, చంద్రమలయానిల మన్మధోపాలం భనములు, ప్రతి కావ్యమునందును గాంచనగును. స్వోపజ్ఞతగాని, మౌలికమైన ప్రతిభగాని, యీ కావ్యములందు ప్రాయికముగా కానరాదు. అభాగ్యుడను నొక రాక్షసరాజు వేటకు వెడలి యచ్చట నొక వనితను గాంచి, విరహాతురుడగుట, యిందలి కధ. పురవర్ణన, చాతుర్వర్ణ్యవర్ణనము, రాజు వేటకు వెడలుట, అచ్చట నొక వనిత యార్తనాదమును విని, దానిని తెలిసిరమ్మని తన యిష్ట సఖుని బంపుట వాడు పోయి చూచి వచ్చి యా కాంతను వర్ణించి దానియం దీ భూకాంతునకు వలపు బుట్టించుట, మొదలగు సన్నివేశములన్నియు నీ యథాగ్యోపాఖ్యానమునందు వర్ణింప బడినవి. రాజుచే నియోగింపబడిన దూతికపోయి, కధానాయికను గాంచి, రాజువద్దకు వచ్చి యాపె యంగ ప్రత్యంగ వర్ణన చేయుట, రాజు మోహావేశపరవశుడై, ఉపా లంభనములకు బూనుట మొదలగు వర్ణనములన్నియు, హాస్యధోరణిలో పంతులుగారు కల్పించియున్నారు.

పంతులుగారికి పూర్వము గ్రంధములం దచ్చటచ్చట వ్యంగ్యము, హేళన, హాస్యము పుట్టించు సన్నివేశము లున్నను ఆసాంతము హాస్యసంయుతముగా నొనర్పబడిన గ్రంధ మొకటియునులేదు పిండిప్రోలు లక్ష్మణకవి రావణ దమ్మీ

యాదులు, వికట కావ్యములని చెప్పుటకు వలను పడదు. వ్యక్తి దూషణ నాశ్రయించి, వ్యంగ్యధోరణియందు సాగిన శ్లేషకావ్యములవి చంద్రరేఖా విలాపాదులును వ్యక్తిదూషణ ప్రధానములే
అభాగ్య దేలుపురము వ్యాఘ్రాఖ్య పట్టణము

ఆ పురము లచ్చియప్పకు
గాపురము జగంబులందు గల పురములలో
గాపురము పాప సమితికి
దాపురము మహాపురముల దానవతతికిన్.

ఇది పురవర్ణనము. అట్టి మహా పట్టణమున కొడయుడైన అభాగ్యుని రూప లావణ్య విశేషములును, పాండిత్యమును, శౌర్యమును వర్ణించి తుదకొక్క పద్యమున

అతనికి బొట్ట కోసినను నక్షరమొక్కటిలేదు కాగడన్
వెతకిన తెల్విలేదు, దయ వీసమునుం గలనైనలేదు ప్రో
న్నతనయ విద్యలేదు, పదునాల్గు పుటంబులు పెట్టికాల్చినన్
జతురత వాత పెట్టినను సత్యము జిహ్వకు రాదొకప్పుడున్.

అని వాని గుణశీలములను వర్ణించిరి. అతడు కొలువున్న చంద మిట్లభి వర్ణితమైనది.

'ఒక దిక్కునను గుక్కలొక గ్రుక్కగా గూయ
నొకచెంత బలుదొంత లొలసి యార్వ
నొకమూల ఖరజాలమురులీల నోండ్రింప
నొకచోట గుడిసేటి యువతు లడల
నొకదండ ముదిముండ లొకదండుగా గూడ
నొకవంక బలుకుంక లొదిగి యుండ
నొకపొంత గడముంతలొక దొంతరగనుండ
నొకక్రేవ మధుసేవ లొనర జేయ
బెంట పోగులు జీపుళ్ళు బేడ కుప్ప
లలుకు గుడ్డలు గోడి యాకలును దనర

డంబు మీరిన శునకాసనంబునందు
గొలువుచో జచ్చినట్టుల గూరుచుండె'.

ఈ వర్ణనము, ప్రబంధములలో మహారాజు పేరోలగంబుననుండు వర్ణనమును వికటము చేయుచున్నది తమపరి రాజుగారు మృగయావినోదమునకై వెడలుట ఇట్లు వర్ణింపబడినది.

ముడ్డి యె డియున్న మొద్దు గుఱ్ఱముమీద
గదలకుండ నెక్కి కాళ్ళునేల
దగుల గూరుచుండి తక్కిన వారలు
వెనుకజేరి తోల వెడలె నతడు.

ప్రతి పద సహితముగా ప్రబంధ ప్రణేతృపంథను బరిహసించుచు నీ యభాగ్యోపాఖ్యానము సాగినది

రాజు మృగముల వేటాడుట, వనవిహారము, కానలో పాడుదేవళము పొంత నొకయింతిని కనుగొనుట, తనకు దానిని కూర్చుమని యొక్కదూతికను బ్రతిమాలి పంపుట, ఆ దూతికపోయి దాని నొడబరుప ప్రయత్నించుట, ఈ కధానాయిక యయిన యిగురుబోడిని వెదకికొంచు దాని బంధువులు వచ్చి, అభాగ్యునితో కూడి యున్నదానిని జూచి, ఇరువురకు దేహశుద్ధిసేయుట, మిక్కిలి నవ్వు పుట్టించునట్లిందభివర్ణితము.

ఇది నూటపదిహేడు పద్యములుగల ఏకాశ్వాసహాస్య ప్రబంధము 1876వ సంవత్సరమునందు వివేకవర్ధిని కనుబంధముగా శ్రీ కొక్కొండ వేంకటరత్నము పంతులుగారి హాస్యవర్ధనికి ప్రతిగా ప్రారంభింపబడి, 'హాస్యసంజీవని యందు (జూలై 1876) ఈ యభాగ్యోపాఖ్యానము ప్రారంభింపబడి, తరువాతి సంచికల యందు ముగింపబడినది 'పంతులుగారి అభాగ్యోపాఖ్యానము బూతులులేని చంద్రరేఖా విలాసమునకు అచ్చుబొమ్మ యనియు, ఇందు వీరు వికృతాకారములను, వికారచేష్టలను వర్ణించుటచే హాస్యము జీవింప బ్రయత్నించిరని శ్రీ ఆంధ్ర శేషగిరిరావు గారును[11], అభాగ్యోపాఖ్యానము, హాస్యరచన కపూర్వావిష్కరణమని శ్రీ నిడుదవోలు వేంకటరావుగారును, వ్రాసియున్నారు[12]

పంతులుగారు 1872వ సంవత్సర ప్రాంతమున కూచిమంచి తిమ్మకవి పూర్వము రెనిగించిన రామాయణములోని యుత్తరకాండము మిగిలియుండుట జూచి 'శుద్ధాంధ్రోత్తరరామాయణము'ను రచించుటకు పూనుకొనిరి. ఆసంవత్సరమున నీ గ్రంథమునం దొక యాశ్వాసమును రచించిరిగాని, పూర్తిచేయలేదు పంతులుగారి యసంపూర్ణగ్రంథములలో నిదియొకటి. తిక్కనసోమయాజి 'నిర్వచనోత్తరరామాయణ'మున్నను నదియచ్చ తెనుగునందు లేని కారణమున పంతులుగారు, ఉత్తర రామాయణమును శుద్ధాంధ్రమున వెలయించుటకు పూనుకొనిరి ఆకాలమున శుద్ధాంధ్రోత్తరరామాయణమును పండితులు, కవులు, మెచ్చుచువచ్చిరని పంతులుగారు తమ స్వీయచరిత్రమునందు వ్రాసియున్నారు ఈ శుద్ధాంధ్రోత్తరరామాయణ మాకాలమున మచిలీబందరునుండి వెలువడుచుండిన పురుషార్థప్రదాయినియను పత్రికలో ప్రచురితమాయెను. ఈ కావ్యమును గూర్చియా పత్రిక యీ అభిప్రాయము వెలిబుచ్చెను

"ఈపద్యములు అచ్చతెనుగు భాషయందు మధురమైన కదళీపాకమున నాతి కఠినముగా పదగుంభనయును, ఉక్తిచమత్కారములును, గలిగి రసయుక్తముగునటుల బహుసరసముగా రచింపబడినవి.... ....నిశ్చయముగా నిది సరసమయిన పండిత కవిత్వము .."[18], దీని శైలితెలియుటకొరకీ పద్యముదాహరింపబడుచున్నది.

"అలరుల కొమ్మలో మరునియమ్ములొ బంగరుకీలుబొమ్మలో
వలపుల దీవులో తొవల బావులొ చక్కని గుజ్జుమావులో
తొలకరిమించు లోయనగ దూకొని యచ్చరలేమలచ్చటన్
బెళుకుఁగనుంగవల్ తళుకు బెన్దొడలుందగ నందడింపుచున్

ఇది యసంపూర్ణము, ఏకాశ్వాసము. అచ్చతెలుగునందు పంతులుగారికి గల యధికారము దీనివల్ల వ్యక్తము కాగలదు 1872వ సంవత్సరప్రాంతముననే పంతులుగారు అచ్చతెనుగు భారతమును రచించుటకు పూనుకొనిరి అందు సభా పర్వములోని కొంతభాగమును వారు శ్రీకొక్కొండ వెంకటరత్నముపంతులవారి యాంధ్రభాషా సంజీవనియం దాకాలమున ప్రచురించియున్నారు ఈకాలముననే విశేషముగా స్త్రీవిద్యాప్రోత్సాహకరములగు వాదములను చేయుచు, పత్రికలలో వానినెల్ల ప్రచురించుచుండిరి ఆకాలమున పురుషార్థప్రదాయిని స్త్రీవిద్యామండనవాదమును, ఆంధ్రభాషా సంజీవని స్త్రీవిద్యాఖండన వాదమును ప్రోత్సహించుచుండెను. అందు

వలన పంతులుగారు ఆంధ్రభాషా సంజీవినియందు వెలువడిన వాదముల నన్నిటిని పరాస్తములు గావించుచు పురుషార్థ ప్రదాయిని యందు తమ వాదములు ప్రచురించు చుండిరి. పంతులు గారాసమాధానముల నొక్కొకసారి పద్యమురూపమున గూడ వెల యించుచుండిరి. వానిలో చిత్ర, గర్భ, బంధకవిత్వములను గూడ జొప్పించుచుండిరి. పంతులుగారు వచనము వలెనే, పద్యములనుగూడ మిక్కిలి వేగముగా వ్రాయగలిగి యుండిరి. అందువలననే ప్రతిపక్షులు, ప్రతివిమర్శచేయుటయందు దినముల కొలది నాలోచించిన పద్యములకు పంతులుగా రొక్కదినములో ప్రత్యుత్తరమువ్రాసి పంప గలిగెడు వారుట. అట్లు అశ్రమసాధ్యముగా రచించిన పద్యములందును, బంధ కవిత్వమును, గర్భకవిత్వమునుగూడ జొప్పించుట పంతులుగారి శక్తిసామర్థ్యము లకు దృష్టాంతమని చెప్పవచ్చును.
ఈ పద్యమిట్టిది.

వినయ మొప్పారగ విన్నవించెద నిదే
న్యాయంబుగా జూచి మీయెడఁగడు
సదయ లీలందగ సారసాననలవి
ద్యా సంవివాదంబులో సరళిగ
విజయమెవ్వారికి వీకమైఁ గలిగెనో
సామాన్య ధీమైనుధీమదే భ
ని చయముల్మెచ్చగా నీతితోనుడువు డీ
జాల్పాకులై సజ్జ నుల్పొంగ
వెలదులకు విద్యకూడదు కలుగునఘము
దాన నిజముగానని యనదారెలమిని
దలపడినను నార్యులు చెప్పుపలుకులనె వలయును గనబఋపన్...

ఈపద్యమునందలి గర్భమత్తేభము

నయ మొప్పారగ విన్నవించెదనిదే న్యాయంబుగా జూచి మీ
దయ లీలందగ సారసాననల విద్యా సంవివాదంబులో

జయ మెవ్వారికి వీకమైగలిగెనో సామాన్యధీమై సుధీ
చయముల్మెచ్చగ నీతితో నుడువు డీజాల్పాకులై సజ్జనుల్.

ఇందలి గర్భకందము

వెలదులకు విద్య కూడదు
కలుగునపము దాననిజముగా ననియన దా
రెలమి ని దలపడినను నా
ర్యులు చెప్పు పలుకులనె వలయును గనబఱుపన్.

ఈ స్త్రీవిద్యా ప్రోత్సాహకరములైన వాదములను పంతులుగారు కం.వీ యనియు, స్వదేశాభిమాని'యనియు మారుపేర్లతో పురుషార్థ ప్రదాయిని యందు ప్రచురించుచుండిరట

ఈ విధముగా స్త్రీవిద్యాప్రోత్సాహకరములగు వాదములలో మునిగి, పంతులుగారు తాము పూనుకొన్న శుద్ధాంధ్రభారతము నాకాలమున ముగింపక, సభాపర్వమును మాత్రము రచించివిడిచిపెట్టిరి. ఈ వాదవివాదములవలనను, రసికజనరంజన, శుద్ధాంధ్రనిరోష్ఠ్యనిర్వచననైషధ, శుద్ధాంధ్రోత్తరరామాయణ రచనల వలనను పంతులుగారు నాటికే కవియని ప్రసిద్ధివహించియుండిరి. ఈ విషయము వడ్డాది సుబ్బరాయకవిగారి యీ పద్యమువలన తెలిసికొనవచ్చును.

'భావను రాణ్మహేంద్రమునఁ బాదమువెట్టితి నాడిటంగవుల్
వావిలవాసుదేవ గురువర్యు డొకండు, వివేకవర్ధనీ
ధీవర పత్రికాధిపతి దేశిక వీరపలింగ మొక్కడున్
కావుననే కవిత్రయముగా గణియించిరి మమ్మొటీవలన్'[14]

ఈ పద్యము వలన భావనామ సంవత్సరమునకే (1874) పంతులుగారు కవులుగా ప్రసిద్ధికెక్కిరని విదితమగుచున్నది.

పంతులుగారి కాకాలమున పద్యకావ్యములు రచింపవలయునన్న యాసక్తి క్రమక్రమముగా తగ్గుచుండెను ఈ కాలము పంతులుగారి సారస్వత జీవితమున సంధికాలమని చెప్పవలెను. 1874వ సంవత్సరముననే పంతులుగారు వివేకవర్ధనిని ప్రారంభించిరి 1875వ సంవత్సరమున ఆంగ్ల, సంస్కృతరూపకానువాదమునకును, ఆంగ్ల పద్యకావ్యముల ననువదించుటకును పూనుకొనిరి. అనగా వారిదృష్టి

ప్రక్రియావైవిధ్యముపై పరువిడెనని గుర్తింపనగును అప్పట్ల వారికి తెలుగున వచనకావ్యములు లేనిలోటు, మదినాటునట్లుగా విశదమైనది. అంతటవారు పద్యరచన నుండి విరమించి వచన కావ్యములను రచించుటకు పూనుకొనిరి

1875వ సంవత్సరమున పంతులుగారు వివేకవర్ధని ముద్రాణయంత్రమును రాజమహేంద్రవరమున ప్రతిష్ఠాపించుకొను నుద్దేశముతో తత్ప్రయత్నములు చేయుటకై, చెన్నపట్టణమునకేగినప్పుడు, వారి మిత్రులైన కార్మంచి సుబ్బరాయలు నాయనివారు, పంతులుగారికి కొల్లా గురుసామిసెట్టిగారితోను వారి సోదరునితోను పరిచయముగావించిరి. గురుసామిసెట్టి, సుబ్బారాయలుసెట్టియను నాయన్నదమ్ములు పంతులుగారిని మిక్కిలి గౌరవించి, శుద్ధాంధ్రభారతమును తమ పేరున వెలయచేయ వేడుకొనిరి. పంతులుగారందులకు సమ్మతించి వారి కాగ్రంధము సంకితమిచ్చుటకు వాగ్దానమొనగిరి అటుతరువాత పంతులుగారు వచనకావ్యములు రచించుటయందు, ఆసక్తిని వహించి ప్రప్రధమమున 'రాజశేఖరచరిత్రము'ను రచించిరి. కాని చెన్నపట్టణమునుండి మిత్రులు పలుమారు హెచ్చరించుటచే, వారినిర్బంధమును నెట్టివేయజాలక, రాజశేఖరచరిత్ర రచనానంతరము, 1878వ సంవత్సరమునందు శుద్ధాంధ్రభారతసంగ్రహము పేరిట, యచ్చతెలుగు భారతమును, మూడాశ్వాసములలో ముగించి, యీసంవత్సరముననే ప్రకటించిరి. ఈ శుద్ధాంధ్రభారతసంగ్రహమును సర్వకళాశాలలవారు (యూనివర్శిటీ) ప్రధమ శాస్త్ర పరీక్షాపరనీయ గ్రంధముగా నిర్ణయించియున్నారు

ఈ శుద్ధాంధ్రభారతము విశేషించి, కవిత్రయము వారి భారతమునకు అచ్చ తెలుగు పద్యముల రూపాంతరమేయని చెప్పవచ్చును.

'మదమాతంగతురంగ కాంచనలసన్మాణిక్యగాణిక్యసం
పదలోలిం గొనివచ్చియిచ్చి ముదమొప్పంగాంచి సేవించిర
య్యుదయాస్తాచలసేతు శీతనగమధ్యోర్వీపతుల్సంత తా
భ్యుదయుం ధర్మజుఁ దత్సభాస్థితు జగత్పూర్ణ ప్రతాపోదయున్'

అను సభాపర్వమునందలి నన్నయగారి పద్యమునకు,

'హత్తులగత్తలానులను నందపు రోవిరిబోండ్ల జాళు వా
మొత్తముఁ దెచ్చియిచ్చి సతమున్మది మెచ్చుచుఁ గొల్చుచుండుదుర్

క్రొత్తగ నాల్గుసంద్రములకున్ నడుమంగల రాచసింగముల్
మొత్తముగ్రైయటం గొలువులోపల నొప్పెడు నేలదాలుపున్'.

అను పద్యమును పంతులుగారు వ్రాసిరి ప్రాయికముగా నీ శుద్ధాంధ్రభారత మంతయు నీ విధముగానే రచింపబడినది

'నీరజ మిత్రుడేల ధరణీగతుడయ్యెడు నొక్కొయంచు వి
స్మేరమనస్కులై జనులు మెచ్చి నిజద్యుతి సూచుచుండగా
నారదు డేగుదెంచె గగనంబుననుండి సురేంద్ర మందిర
స్ఫారవిలాసహాసియగు పార్థ గృహంబునకుం బ్రియంబునన్'

అను పద్యమునకు,

'ఏలావేడి వెలుంగు నేలకును నిక్లైతెంచుచున్నాడు నే
డో లేబాయపు బిడ్డలార, కనుడం చొక్కొక్కచో మానుసుల్
గేలుందోయి తెమల్చి గుంపులయి యోలింజూడరా నింగియుం
గ్రాల న్నారదుఁడేగుదెంచె గడువేడ్కం గవ్వడిం జూడగన్'.

అను రీతిని పంతులుగారు అచ్చతెనుగునందు రచించిరి. శ్రీపర్వమునందలి, సౌప్తికపర్వమునందలి, తిక్కనగారి పద్యములను యథాతథముగ గ్రహించి, వానిని యచ్చతెలుగులోనికి పరివర్తితములు చేసియున్నారు. కాని యీ కావ్యమునందు భారతకథ సంగ్రహముగా చెప్పబడియుండుటవలన, యెడనెడ మాత్రమే వారు కవిత్రయము ననుసరించిరి. ఈ శుద్ధాంధ్రభారతసంగ్రహము ప్రప్రథమమున 1879వ సంవత్సరమున పుస్తకరూపమున వెలువడినది.

పంతులుగారి కావ్యములన్నియు వారు సంపుటీకరించిన తమ గ్రంథములలో నాలుగవ సంపుటమునందు చేర్చియున్నారు. పంతులుగారు1874వ సంవత్సరమున తమ వివేకవర్ధనిని స్థాపించి, వాని ప్రథమ సంచికలందు ప్రార్థనలు రచించియున్నారు. ఈప్రార్థనాపద్యములందు పంతులుగారి భగవద్భక్తి, సంస్కరణాభిలాష సౌమనస్యము, ఆదర్శములు, వ్యక్తముకాగలవు.

ఈకాలముననే పంతులుగారు పురుషార్థప్రదాయినియందు 'ముద్దియవిద్దియ పెద్దకార్యమనుట ప్రసిద్ది' యని శ్రీవిద్యామండన వాదమును పద్యరూపమున వెల

యించియున్నారు కావ్యవిమర్శపై తమ యభిప్రాయములు ప్రకటించుచు వివేక వర్ధనియందు నీతియను పేరిట కొన్ని పద్యములను ప్రకటించియున్నారు 1875వ సంవత్సరమున శ్రీవిద్యనుగూర్చిన పద్యాత్మకమగు నొక వ్యాసమును పురుషార్థ ప్రదాయినియందు వెలయించినారు

1885వ సంవత్సరమున చెన్నపురి బ్రహ్మోపాసనామందిర ప్రతిష్ఠాపన మును గూర్చి పదునారు పద్యములను పంతులుగారు శ్రీమన్నవ బుచ్చయ్యపంతులు గారి కోరికపై రచించి ప్రకటించినారు ఈ పద్యములు స్వీయచరిత్రమునం దుదాహ రింపబడినవి.

1883వ సంవత్సరమున నాటి గవర్నర్ జనరలయిన రిపన్‌దొర చెన్న పట్టణమునకు రాగా, ఆయన రాకను పురస్కరించుకొని, శ్రీరిపన్‌ప్రభుస్వాగతము పేరిట పంతులుగారు కొన్ని పద్యములను, ఒకపాటను రచించి తాము నడుపు చుండిన సతీహితబోధినియందు ప్రచురించిరి ఈ పద్యములు, పాటయుగూడ పంతులుగారు తమ స్వీయచరిత్రమునం దుదాహరించియున్నారు.

శ్రీవిక్టోరియా మహారాజ్ఞి రాజ్యపాలనమునకు వచ్చిన జ్యూబిలీయుత్సవము లను పురస్కరించుకొని, 'శ్రీవిక్టోరియా జ్యూబిలీ నవరత్నము'ల పేరిట తొమ్మిది పద్యములను రచించి ప్రకటించిరి. ఈ పద్యములనుగూడ పంతులుగారు స్వీయ చరిత్రమునందు చేర్చియున్నారు.

ఈ విక్టోరియా జ్యూబిలీ నవరత్నములవలన, నాటి మేధావులకు ఆంగ్లేయ ప్రభుత్వము నెడల గల భక్తి ప్రపత్తులెట్టివో తెలిసికొనవచ్చును. 1892వ సంవ త్సరమున సంఘసంస్కారవాదమును నిరసించుచు, నవనాగరిక పంచరత్నములని యొక పత్రిక యందెవ్వరో యైదుపద్యములను ప్రచురింపగా, వానినిచూచి పంతులుగా రాగ్రహపరవశులై 'కులాచార సంస్కార పూర్వ నాగరిక పంచరత్నముల'ని యైదు పద్యములను సత్యసంవర్ధనియను పత్రికయందు ప్రచురించిరి. 1895వ సంవత్సరమునందు, బంధ, గర్భ, చిత్రకవిత్వములచే నొప్పుచు, నర్థసారస్యమును లాఘవపరచు, ద్వ్యర్థికావ్యములను, ఏకాక్షరనిఘంటువుల సాయము కోరు గ్రంథ ములను రచించినవారి నధిక్షేపించుచు పంతులుగారు, సరస్వతీ నారద విలాపమను పేరిట పద్యాత్మకమగు ప్రహసనమును రచించి, తమ చింతామణి పత్రికయందే

వెలువరించిరి. పంతులుగారి యీ పద్యములు స్వీయచరిత్రమునం దుదాహృతములు. ఉత్తర సరస్వతీ నారద విలాపము పేరిట పంతులుగారీ పద్యములందు వెలువరచిన భావములను శ్రీకాశీభట్టబ్రహ్మయ్యశాస్త్రిగా రధిక్షేపించియున్నారు. 1879వ సంవత్సరముననే పంతులుగారు 'స్త్రీపునర్వివాహనబానాటక'మను పేరున నొక నాటకమును పద్యాత్మకముగా రచించుటకు పూనుకొని,ఒక యంకమును మాత్రము వివేకవర్ధని యందు ప్రచురించి, యంతటితో నిలిపివేసిరి. ఇది యసంపూర్ణము ఇవిగాక చిన్న తరగతుల పిల్లలకై నీతిదీపిక, స్త్రీనీతిదీపిక, మొదలగు గ్రంథములను రచించి యున్నారు. స్త్రీల నుత్తమ సంస్కారవంతురాండ్రనుగా చేయుటకై సతీహితబోధిని యను పత్రికను స్థాపించి అందు మాతృపూజ, పితృపూజ, సత్యాద్రౌపదీ సంవాదము మొదలగు పాటలను పద్దెములను రచించియున్నారు. బాలబాలికలకై వారు కూర్చిన చిన్నపుస్తకములు బహుకాలము, పఠనీయగ్రంధములుగా నుండెనని పంతులుగారే తమ స్వీయచరిత్రమునందు వ్రాసియున్నారు.

'తాతముత్తాత లెంతెంత ధనము కూడ
బెట్టి, పెట్టెలు నిండంగ బెట్టియున్న
గష్టపడి, తాను న్యాయమార్గమున బడయు
స్వార్జితం బొకగవ్వతో సమముగాదు'.

ఇట్టి పద్యములు నీతిదీపికయందు నూఱువరకు పంతులుగారు కూర్చిరి పంతులుగారిట్టి నీతిపద్యములను 'నీతికథామంజరి'యను ఈసపు నీతికథల యనువాదమునందును కూర్చియే యున్నారు ప్రతి కథ అడుగున, నాకథలోని నీతిని తెలియ జేయుపద్యము నొకదానిని పంతులుగారు కూర్చిరి. పంతులుగారికి పూర్వమే శ్రీ గజ్జెల రామానుజులు నాయని వారి సతీహిత సంగ్రహము, వివేక సంగ్రహము మొదలగు గ్రంథములు, చిన్న పిల్లలకొరకు వెలువడినవి. సత్యాద్రౌపదీ సంవాదమును పంతులుగారు పాటగా రచించిరి. మాతృపూజ, పితృపూజలను, ద్విపదలో రచించిరి తలిదండ్రులు తమ బిడ్డల విషయమై యనుభవించు తాపత్రయమును వివరించుచు, తలిదండ్రుల పట్ల బిడ్డలెట్లు నడచుకొనవలెనో పంతులుగారీ రచనలలో బోధించిరి. 1889వ సంవత్సరమునకు పూర్వమే చిన్న తరగతి బాలికలకు నేర్పుటకు స్త్రీ నీతి దీపికయను పేరున నొక శతకమును రచించిరి.

'చక్కదనమునకును దోడు చదువుకూడ
గలిగియుండిన నందమౌనలరునకును
దావి కలిగిన వడువునఁ దనరుచుండ్రు
పూవుబోండ్లు విద్యాగంధమునను గరము.
'పువ్వులును మంచి బట్టలు భూషణములు
సుగుణముల యట్ల యెన్నడు సుందరులకు
శోభ తేనేరవదిగాన, సుదతులార
సుగుణ సంపద గడియింపఁ జూడుఁడెపుడు.'

మొదలైన చక్కని పద్యములు సులభ శైలియందీ శతకమున పంతులుగారు రచించిరి బాలురకు నీతిదీపిక, బాలికలకు స్త్రీనీతి దీపికయని పంతులుగారు రచించిన రెండు శతకములును, పాఠ్యగ్రంధములుగా విద్యాశాఖవారు నిర్ణయించినారు. పండితు లెందరో నీ శతకములను ప్రశంసించిరి.

"బాలురకు నుపయోగకరముగానేతత్కవి విరచితమగు నీ పొత్తంబు, సత్తమ చిత్తంబులకు, మోదంబు హత్తించెడు. సరిగఁబరికించిన నీ నూఱు పద్యంబులు నూఱు వరాలనవచ్చును....

నీతి యెఱుంగని బాలురకు దీపము వెలుంగుఁజూపి "పదార్థ జ్ఞానంబు గలిగించునట్లు, నయానయవివేకంబు, బాల్యంబుననే తెలిపి, పెద్ద పెరిగినమీఁదట, దుర్ణయవర్తనులు గాకుండునట్లు చేయుట, కిది ముఖ్యాధారభూతమనుటకు సందేహ మొక్కింతయును లేదు " అని శ్రీవావిలాల వాసుదేవశాస్త్రిగారు పొగడిరి[15] పంతులు గారు నాడు ప్రసిద్ధికెక్కిన రెండాంగ్లేయ కావ్యములను అనువదించి యున్నారు. విలియంకొపర్ (1731—1800) అను నాంగ్లకవి రచించిన గిల్పిన్ (The Diverting History of John Gilpin) అను కావ్యముననుసరించి పంతులుగారు జాన్‌గిల్పిన్ అను పేరనే తెలుగులో నొక పద్యకావ్యమును రచించిరి ఆంగ్ల కావ్యముల ననుసరించి తెలుగు కావ్యములుగా వెలసిన వానిలో పంతులుగారు రచించిన నీ జాన్ గిల్పిన్ మొట్ట మొదటిది అనగా నాంగ్ల కావ్యములను తెలుగున

ననుసరించి, పద్య కావ్యములుగా ననువదించిన వారిలో పంతులుగారే ప్రథములని యేర్పడుచున్నది.

పంతులుగారు తమ స్వీయచరిత్రమునందు 'రాజశేఖర చరిత్రమునకు ముందు కౌపరనెడి యింగ్లీషు కవీశ్వరుడు రచించిన 'జాన్‌గిల్పిన'ను పుస్తకమును ... .. పద్యములతో చేసితిని' అని వ్రాసియున్నారు[16]. ఈ వాక్యముల వలన రాజశేఖర చరిత్రమునకు పూర్వమే పంతులుగారీ కావ్యము ననువదించిరని తెలియుచున్నది. కనుక పంతులుగారు ఆంగ్లసాహిత్యమునందలి నవలల ననుసరించి, తెలుగు నవలలను రచించుటకు పూర్వమే, ఆంగ్లభాషలోని పద్యకావ్యములను, తెనుగున ననువదించుటకు పూనుకొనిరని విదితమగుచున్నది ఈ జాన్‌గిల్పిన్ అను పద్య కావ్యము వివేకవర్ధనియందు యువనామసంవత్సర ఆషాఢమాససంచికయందు ప్రారంభింపబడి, ఆ సంచికయందు పదిహేడు పద్యములు ప్రచురింపబడినవి. ఆ మరుసటి సంచికయందు నలుబదియారు పద్యములు ప్రచురింపబడి, ముగింపబడినది[17] అనగా నీ కావ్యమునందు 63 పద్యములు కలవు జాన్‌గిల్పిన్ కథ హాస్యసంయుతము. కౌపర్ కవీశ్వరుడు దీనిని గేయ రూపమున రచించెను గేయపు నడకకు అనురూపమైన తేటగీతియందు పంతులుగారీ కావ్యమును రచించిరి. ఆంగ్లమునందును నీ కృతి మిక్కిలి సులభశైలియందు రచింపబడినది. తదనుగుణముగనే పంతులుగారును ఈ కావ్యమును మిక్కిలి సులభశైలియందు రచించిరి. అనుకొనని సన్నివేశములతో, ఈ కథయందు హాస్యము ప్రధానస్థానము నాక్రమించియున్నది. పంతులుగారికి సహజముగ హాస్యరచనలందు ప్రీతి కావున, దీని ననువదించుటకు వారు పూనుకొనియుందురు[18]. పంతులుగారీ కావ్యమును, కథా సంవిధానమునుగాని, దేశకాల పాత్రములనుగాని మార్చక యథాతథముగ ననువదించిరి.

John Gilpin kissed his loving wife
O'erjoyed was he to find
That though on pleasure she was bent
She had a frugal mind

దీనిని పంతులుగారు

'దాని కపరిమితానందమూని, యాత
డట్టి సంతోష సమయంబునందు గూడఁ

బ్రియ వధూమణి తా మిత వ్యయమునందె
పెద్ద తవిలియుంటకు ముద్దు పెటుకొనియె'

అని అనువదించిరి కనుక నీ విధముగా పంతులుగారు, యధాతథముగా ననువదించినందున, మన దేశీయాచారములకు విరుద్ధములైన సంఘటనలు కొన్ని యీ కావ్యమునందు చోటుచేసికొనినవి. అవి మనవారికి వింతగా నుండును పంతులు గారీ కావ్యమునందు 'విగ్గు, (Wig)కు కృతకశిఖ, కల్లజుట్టు, మాయజుట్టు, అను పదములను సమానార్థకములుగా ప్రయోగించిరి మూలమును జూడనిచో నీ ప్రయోగ ముల యర్థ సారస్యము తెలుగు వారికి బోధపడదు ఆ దేశమునందు పురుషులును స్త్రీలును, విగ్గులను ధరించుట వారి దేశాచారము కాని యీ కావ్యమున కధానాయకుని కల్లజుట్టు ప్రసక్తి తెలుగువారి కర్థావబోధకముకాదు. ఈ విధముగా శైలీ సౌలభ్య మును పంతులుగారనుకరింప గలిగిరికాని. అందలి భావములను, వాతావరణమును పంతులుగారు తేలేకపోయిరి[19] పంతులుగారు వెలయించిన రెండవ యాంగ్ల పద్య కావ్యానువాదము 'పధికవిలాసము'నునది ఈ పధిక విలాసము ఆలివర్ గోల్డ్‌స్మిత్ (1728-1774) రచించిన The Traveller అను కావ్యమున కనువాదము ఈ కావ్యమును పంతులుగారు 1892వ సంవత్సరమున ననువదించి ప్రకటించిరి పధిక విలాసముగూడ అనువాద విధానమున జాన్ గిల్పిన్‌నే పోలియున్నను, ఈ కావ్యరచనమున ప్రధానభేద మొకటి కలదు. జాన్ గిల్పిన్‌ను ఆసాంతము తేటగీతి యందే వారు వ్రాసిరి పధిక విలాసమున వివిధ వృత్తములనురచించిరి. కౌపర్ కవి ననువదించుటయందు పంతులు గారా గ్రంథ నామమును సైతము యథాతథ ముగ గ్రహించిరి. కాని గోల్డ్‌స్మిత్ కవీశ్వరుని 'ది ట్రావెలర్' యను పద్య కావ్య మును 'పధికవిలాస' మను పేరున తెనిగించిరి గోల్డ్‌స్మిత్ కవీశ్వరుడు తన 'ట్రావె లర్' కావ్యమును హీరోయిక్ క్లెప్లెట్ (Heroic couplet) అను మన 'ద్విపద'ను బోలిన ఛందమున రచించెను. పంతులుగారు వివిధ వృత్తములు వ్రాసిరి ఆంగ్ల గ్రంథము 1765వ సంవత్సరమున వెలువడినది. గోల్డ్‌స్మిత్, తన దేశ సంచారాను భవమును పురస్కరించుకొని యీ కావ్యమును రచించెను. ప్రాపంచికములైన సర్వ విషయముల కతీతముగ నొకానొక తాత్త్విక సత్యమీ కావ్యమునందు ప్రతిపాదింప బడినది పంతులుగారీ కావ్యమును 1892వ సంవత్సరమున రచించునాటికి వారి

దృష్టి, ఇట్టి తాత్త్విక దర్శనమున కున్ముఖమై యుండెనని యూహింపవచ్చును తాను సత్యమని నమ్మినదాని దృఢముగా పూని నిర్వహించుటయందును, ఉత్కర్షాప కర్షములను లెక్కగొనక, సమచిత్తముతో, సత్యము ననుష్ఠింప వలయునని గోల్డ్ స్మిత్ తన కావ్యమున ప్రతిపాదించెను ఇట్టి పరమార్థము పంతులుగారి నాకర్షించు టలో వింతలేదు ఇది కాక ఇంకొక ప్రయోజనమును కూడ వారాశించిరి. తత్త్వ దర్శను లైన యాంగ్లేయ కవీశ్వరుల పోకడలు తెలుగు వారికి పరిచయము గావిం చుట యా ప్రయోజనము జాన్ గిల్పిన్ యనువాదము వలన అది సాధ్యముకాదు. అదియును గాక అది హాస్య రచనము. దాని ప్రయోజనమువేరు పథిక విలాసమును రచించుటలో తమ యాశయమును పంతులుగారిట్లు విశదీకరించిరి

హూణ కవుల పోక లొకయింత తెలుపంగ
దెలుగు వారి కొరకు దేటగాను
గోల్డుస్మిత్తను కవి గూర్చిన యట్టి యీ
పథిక చరిత మేను వ్రాసినాడ'[20]

పంతులుగారు మూలమున నొక వాక్యమున చెప్పిన భావమునైనను చక్కగా తెలుగున చెప్పుటకై విపులీకరించి యొక వృత్తముగా ననువదించిన ఘట్టము లనేక ములు గలవు పంతులుగారీ కావ్యమున భావార్థమునుగూడ సంపూర్ణముగ తెలుగు నందు తెచ్చుటకై కృషి చేసి కృతకృత్యులైరి మూలభావము. ఒక గీతమునందు చెప్పబడినప్పుడు, దానిలోని యంతరార్థము చెడకుండ తెలుగులోనికి తెచ్చుటకు పంతులుగారా గీతమును, రెండు మూడు వృత్తములలో ననువదించుటయుకద్దు. పాశ్చాత్య పౌరాణిక గాథలకు సంబంధించిన తాత్త్విక చింతనలను, మూల గ్రంథాను సారముగా ననువదింప వలసి వచ్చినప్పుడు పంతులుగారు యథాతథముగా ఆ భావ ములనే యనువదించుట వలన, కొంత వైలక్షణ్యమా యనువాదమునందు తెలుగు వారికి బొడకట్టుట యనివార్యము. అట్లు గాక సార్వత్రికమైన పరమార్థ ప్రతిపాదన మును మూల గ్రంథానుసారముగా ననువదించినప్పుడు, ఆ భావము తెలుగు వారికి గూడ చేరువగనే యుండుట యీ కావ్యమునందు బొడకట్టును, 'పంతులుగారీ కావ్యమునందు కొంత స్వేచ్ఛను వహించి భావానువాదముగా నిర్వహించిరి.

'As some lone miser visiting his store
Bends at his treasure, counts, re-counts its o'er
Hoards after hoards his rising raptures fill
Yet still he sighs, for hoards are wanting still'

ఈ భావమును పంతులు గారిట్లనువదించిరి.

'ఘనలోభాత్మకు డొంటిగాఁ దన ధనాగారంబు దర్శించి, యో
లిని గూర్చుండి ధనంబుఁ బల్మఱును దా లెక్కించి లెక్కించి, యా
ధనముల్ కుప్పలు కుప్పలై కడుఁ బ్రమోదంబియ్య నుప్పొంగునా
వెనుకన్ గన్గొని వెచ్చ నూర్చు మఱియున్ విత్తంబు లేకున్కికిన్'

ఈ కావ్యమును గూర్చి పంతులుగారు స్వీయచరిత్రము నందిట్లు వ్రాసి యున్నారు. "ఆచార వ్యవహారములును బేరులును దేశములును మన వారికి వింతగా గనఁబడును గాన కేవల మూలార్థానుసారముగా భాషాంతరీకరింపబడిన పాశ్చాత్య గ్రంథములు మన వారికంతగా రుచింపక పోవచ్చును. భాషాంతరము సుగమముగాను మనోహరముగాను, నున్నదని ప్రకటింపబడిన కాలమునందు మహామహోపాధ్యాయ కొక్కొండ వెంకట రత్నము పంతులు వారు మొదలయినవారు శ్లాఘించిరిగాని దానిని గొని చదువు మహా జనులసంఖ్యను బట్టి మన వారంతగా నాదరించిరని నేను భావింపను"[21]

పంతులుగారు, ఈ పధిక విలాసము నందనుసరించిన యనువాద విధానము, వారి తరువాత తెలుగు కవిత్వమునందు వచ్చిన నవ్యరీతులకు గూడ మార్గదర్శకత్వ మును వహించుచున్నదని శ్రీకొత్తపల్లి వీరభద్రరావు గారు తమ పరిశోధనా గ్రంథ మునందు విశదీకరించియున్నారు[22].

పంతులుగారి పద్యకావ్యములను బరిశీలించి చూచినప్పుడు, ఈ క్రింది విష యములను మనము గ్రహింపవచ్చును.

పంతులుగారు కావ్యతత్త్వమును బాగుగా గుర్తెరిగినవారు. మహా కావ్య రచనా సామర్థ్యమును వారికి గలదు. వారు తమ సారస్వత జీవితమును పద్య కావ్య రచనముతోనే నారంభించిరి. అచ్చ తెలుగు కావ్యములందు పంతులుగారి

కావ్యములకు విశిష్టమైన స్థానము కలదు. పద్యకావ్య రచనమునందుగూడ పంతులు గారు కొన్ని క్రొత్త మార్గములను ప్రవేశ పెట్టిరి. శుద్ధాంధ్ర కావ్యములను నిరోష్ఠ్య నిర్వచనములుగా వెలయించుట యందు పంతులుగారే ప్రథములు.

శుద్ధాంధ్ర కావ్యములందు నిత్యవ్యవహారమున నుండు వ్యక్తుల నామములు, ఊళ్ళపేళ్ళు మున్నగునవి మార్పక, యథాస్థితముగ నుంచుట పంతులుగారేర్పరచిన విలక్షణమగు మార్గము. కూచిమంచి తిమ్మకవి మొదలగువారు తత్సమ శబ్దములైన నామములను, అచ్చ తెనుగున మార్చినందున, వ్యక్తుల నామములుకూడ వికృతములై, సుగ్రాహ్యములు కాకపోయెను. పంతులుగారి మార్గమువలన, అచ్చ తెలుగు కావ్యముల కా వికారము తప్పినది. పంతులుగారి శైలియందు, మారుమూల పదములు కాని, కల్పిత పదములుకాని, కఠిన పదములుగాని కనపడవు. అచ్చ తెలుగు కావ్యములందు సైతము, ఇట్టి సులభ శైలిని గూర్చిన పంతులుగారి ప్రజ్ఞ యనన్య సామాన్యము

పంతులుగారి యాంగ్లానువాద కావ్యములందును వారి విశిష్టత గోచరించుచునే యున్నది బాలబాలికలకు నీతిశతకములు రచించుటయేకాక, కవిశేఖరుల మెప్పు లందుకొను, శుద్ధాంధ్ర రామాయణ, శుద్ధాంధ్ర భారతములను రచించుట యందును అమేయ ప్రజ్ఞాశాలురు పంతులుగారు వారు క్రాంతదర్శికావుననే, పద్య కావ్యములను విరచించుట మానుకొని, తెలుగు సాహిత్యమున ప్రక్రియా వైవిధ్యమును తెచ్చి పెట్టి, భాషకు మహోపకారము గావించిరి. హేళన కావ్యమును తొలుత వారే రచించిరి వచనరచనా విశారదత్వమునకు గద్యతిక్కనయను బిరుదు పంతులుగారికెట్లు తగి యున్నదో, పద్య కావ్య నిర్మాణ చాతుర్యమునకుగాను శ్రీవావిలాల వాసుదేవశాస్త్రి గారిచే నొసగబడిన యభినవ తిక్కన బిరుదముకూడ అట్లే తగియున్నది

---

# 5
# నాటకములు

(ప్రహసనములు, ఆంగ్లానువాదములు, సంస్కృతానువాదములు, స్వతంత్ర రూపకములు).

వీరేశలింగంపంతులుగారి కాలమునకు తెలుగున నాటక రచన విశేష ప్రాచుర్యమును బొంది యుంటలేదు అన్ని సాహిత్య శాఖలవలెనే పంతులుగారు నాటక ప్రక్రియను గూడ చేపట్టి సుసంపన్నము గావించిరి.

పంతులుగారికి పూర్వమే విరళముగా నాటకములు రచించు ప్రయత్నము కొనసాగినను, దృశ్య కావ్యముల ప్రధాన ప్రయోజనమగు ప్రదర్శనము పంతులు గారి నిర్వాహకత్వమువలననే తెలుగునాట ప్రబలెను తమ స్వీయచరిత్రము నందు వారు తామే తొలి నాటకమును తెనిగించితిమనియు, తొలి ప్రహసనమును రచించితి మనియు, చెప్పికొనియున్నను, నాటక రచనము వారికన్న పూర్వులే ప్రారంభించిరి. సంస్కృత రూపకానువాదము, ఆంగ్ల రూపకానువాదము, స్వతంత్ర నాటక రచనము కూడ, పంతులుగారికి పూర్వమే వెలసినవి. ప్రహసనమును మాత్రము పంతులుగారే తొలుతగా తెలుగులోనికి తెచ్చిరని చెప్పవచ్చును ఉత్తర రామచరిత్రాంధ్రీకరణమునకు వావిలాల వాసుదేవ శాస్త్రిగారు వ్రాసిన ఆంగ్లేయ పీఠిక వలన ప్రథమాంధ్ర నాటకకర్తలు కోరాడ రామచంద్రశాస్త్రిగారని తెలియు చున్నది. ఉత్తరరామచరిత్రాంధ్రీకరణము 1883వ సంవత్సరమున పుస్తక రూపమును దాల్చినది. చింతామణి పత్రికయందు తత్పూర్వము భాగభాగములుగ వెలువడినది. వీరేశలింగముగారి శాకుంతలానువాదముకూడ చింతామణియందే పూర్తి యయినది. వాసుదేవ శాస్త్రిగారు తమ పీఠికలో ప్రప్రథమమున వేణీ సంహారమును తెనిగించి, సంస్కృత రూపకానువాద ప్రక్రియకు శ్రీకారమును చుట్టిన కీర్తి తమ గురువర్యులగు రామచంద్రశాస్త్రిగారిదే యనివ్రాసిరి. కాని వేణీసంహారము నాడు ముద్రణ భాగ్యమునంది యుండలేదు. ముద్రణమును పొందిన తొలి సంస్కృతానువాదము కొక్కొండ వారి నరకాసుర విజయ వ్యాయోగము. ఇది 1872వ సంవత్స

రమున వెలువడినది కనుక శ్రీరామచంద్రశాస్త్రిగారి వేణీసంహారానువాదము అంతకు పూర్వమే రచితమైయుండును. సంస్కృత రూపకము ననువదించుటయేకాక, తొలి స్వతంత్ర రూపకమును గూడ వారే రచించిరని పరిశోధకులు తలంచుచున్నారు ఆధునిక కాలమున వెలసినవానిలో రామచంద్రశాస్త్రిగారి మంజరీమధుకరీయము, తొలి స్వతంత్ర నాటకమనియు, ఇది 1860వ సంవత్సర ప్రాంతముల రచింపబడి యుండెననియు పరిశోధకుల నిర్ణయము మంజరీమధుకరీయము ప్రప్రథమమున 1908లో ప్రకటింపబడినది. ప్రస్తావనలో రామచంద్రశాస్త్రిగారు తెలుగున నాటికి దృశ్య కావ్య రచనము లేదని తెలిపియున్నారు కనుకనిదియే తెలుగున తొలి స్వతంత్ర రూపకమగుచున్నది కాని కొందరీ విషయమున సందేహములను వెలిబుచ్చిరి. వాసుదేవ శాస్త్రిగారు, రామచంద్రశాస్త్రిగారి శిష్యులగుటయు, వారిని గూర్చి బాగుగ తెలిసియుండుటయు, వారి వ్రాతల ప్రామాణికత్వమును స్థిరీకరించుచున్నవి. 1875వ సంవత్సరమున కొక్కొండ వెంకటరత్నము పంతులవారి విగ్రహతంత్రము వెలువడినది దీని పీఠికయందు శ్రీ శివశంకరపాండ్యాగారనువారలు వేంకటరత్నము పంతులవారే తొట్టతొలుతటి సంస్కృతరూపకానువాద కర్తయని వ్రాసియున్నారు. 1883వ సంవత్సరమున తమ ఉత్తర రామచరిత్రమును ప్రకటించునాటికి వాసుదేవ శాస్త్రిగారు పాండ్యాగారి వ్రాతలనుచూసియే, తమ పీఠికయందు వేంకటరత్నము పంతులుగారికి పూర్వమే రామచంద్రశాస్త్రిగారు సంస్కృతరూపకానువాదమునకు బూనిరని వ్రాసియున్నారని చెప్పవచ్చును. రామచంద్రశాస్త్రిగారి తరువాత సంస్కృత నాటకములను వేంకటరత్నము పంతులవా రనువదించియున్నారన్న విషయమును గూడ వాసుదేవశాస్త్రిగారువ్రాసిరి కాగా ప్రథములు శ్రీరామచంద్రశాస్త్రిగారే. వేంకటరత్నము పంతులుగారి తరువాత సంస్కృతరూపకానువాదమునకు బూనినవారు పరవస్తు వేంకటరంగాచార్యులు వారు. వీరు కూడ 1872వ సంవత్సర ప్రాంతముననే శాకుంతలము నాంధ్రీకరింపబూనిరట కాని, 1875వ సంవత్సరమున కాని యది వెలుగుచూడలేదు. 1875వ సంవత్సరమున విశాఖపట్టణము నుండి వెలువడిన సకల విద్యాభివర్ధనియను మాసపత్రికయందీ శాకుంతలానువాదము వెలువడినది. ఇంచుమించుగానిదే కాలమున వీరేశలింగం పంతులుగారును శాకుంతలము నాంధ్రీకరించుటకు పూనుకొని తమ వివేకవర్ధని యందు ప్రచురించుట ప్రారంభించిరి. సకల విద్యాభివర్ధని యందు రంగాచార్యుల వారి యనువాదమునుచూచి, అది పూర్తిగా ప్రకటింపబడిన

తదుపరి, యావశ్యకమైనచో తమది ప్రకటింపవచ్చునని, తమ యనువాదమును కొన సాగింపక విడిచిపెట్టిరి. ఏ కారణముననో రంగాచార్ల వారి యనువాదము కూడ పత్రిక యందు తరువాత కాలమున పూర్తిగా వెలువడలేదు. మూడంకములతో ఆగిపోయి నది. అప్పుడు వీరేశలింగము పంతులుగారు తమ యనువాదమును పూర్తిచేసి, 1881వ సంవత్సరమున వివేకవర్ధని కనుబంధముగా వెలువడుచుండిన చింతామణి యను పత్రికయందు వెలువరించియున్నారు. ఈ పత్రిక కప్పుడు శ్రీవావిలాల వాసు దేవశాస్త్రిగారు సంపాదకులుగ నుండిరి. కనుక సంస్కృత రూపకానువాదమునకు బూనినవారిలో వీరేశలింగము పంతులుగారు నాలవవారగుచున్నారు తరువాత సంస్కృత రూపకానువాదము విరివిగాసాగినది. ఆంగ్లరూపకములను కూడ పంతులు గారనువదించిరి కాని వీరికి పూర్వమే యట్టి యనువాదములు కొన్ని వెల్వడినవి ఆంగ్లేయ రూపకములను తెనుగుజేయుటలో వావిలాల వాసుదేవశాస్త్రిగారు ప్రథములు వీరు 1874వ సంవత్సరముననే 'జూలియస్‌సీజరు' నాంధ్రీకరించి సీజరు చరిత్ర ముగా బ్రకటించిరి ఇది 1876వ సంవత్సరమున పుస్తక రూపమున వెల్వడినది. వివేకవర్ధని సీజరు చరిత్రమును సమీక్షించుచు ఆంగ్ల రూపకముల నాంధ్రీకరించు టలో నీనాటకమే ప్రథమ స్థానమును బొందునని వ్రాసియున్నది [1]

వాసుదేవశాస్త్రిగారు తొట్టతొలుతగా ఆంగ్లరూపకానువాదమును వెలయించుటే కాక, తొలి సాంఘిక రూపకమును, తొలి పద్యనాటకమును గూడ రచించిరని చెప్ప వచ్చును నందకరాజ్యమను వాసుదేవశాస్త్రిగారి సాంఘికరూపక మాద్యంతము తేట గీతులలో నిర్వహింపబడినది. కావ్యరచనయందు ఒకేఛందము నాద్యంతము నిర్వ హించినవారిలో కూడ వీరే ప్రథము లగుచున్నారు. వీరితరువాత గురజాడ శ్రీరామమూర్తిగారును, వీరేశలింగముగారును ఆంగ్లరూపకముల ననువదించి యున్నారు. శ్రీరామమూర్తిగారు 1880వ సంవత్సరము జనవరి నెలలో 'మర్చంట్ ఆఫ్ వెనీస్ నాటకమును' 'వెనీసువణిజ నాటకము లేక సుహృత్సుభాషితమ'ను పేరున అనువదించి ప్రకటించినారు. 1880వ సంవత్సరాంతమున వీరేశలింగం పంతులు గారు ది కామెడి ఆఫ్ ఎర్రర్స్, అను నాటకమును చమత్కార రత్నావళియను పేరుతో ననువదించి, తమ విద్యార్థులచే ప్రదర్శింపించియున్నారు. కాని శ్రీరామమూర్తి పంతులు గారికి పూర్వమే వీరేశలింగంగారు 1876వ సంవత్సరమున నీ కామెడీ ఆఫ్ ఎర్రర్స్ నాటకమును పద్యనాటకముగా ననువదింపబూని, యందలి కొంత భాగమును తమ

వివేకవర్ధనియందు బ్రకటించిరిగాని, యదిపూర్తిగా ప్రకటింపక పోవుటను జూడగా, వారికామార్గము, రుచించలేదని యూహింపవచ్చును. వాసుదేవశాస్త్రిగారివలెనే ఒకే ఛందమున నీ నాటకమును నిర్వహించవలెనని పంతులుగారు తలంచియుందురు. కాని తమ యభిప్రాయమును వారు మార్చికొనిరని వివేకవర్ధనియందు సీజరు చరిత్రను సమీక్షించు వారివాక్యములవలననే తెలియగలదు[2]. ది కామెడీ అఫ్ ఎర్రర్స్‌కు పంతులుగారి యనువాదమైన చమత్కారరత్నావళి' వివేకవర్ధనియందు కొంత భాగమే వెలువడినది తరువాత నిదే నాటకము 1880వ సంవత్సరాంతమున గద్యాత్మకముగజేసి ప్రకటించిరి. కనుక వీరేశలింగంపంతులుగారు ఆంగ్లరూపకముల నాంధ్రీకరించిన వారిలో రెండవవారగుచున్నారు. కాని వీరితొలి ప్రయత్నమసమగ్రము ద్విపదయందు, కామెడీ ఆఫ్ ఎర్రర్స్ పేరుతోనే అనువదించుటకు పూనుకొనిగూడ, తత్ప్రయత్నమునుండి విరమించి, గురజాడ శ్రీరామమూర్తి పంతులుగారు గద్యపద్యాత్మకముగా తమవెనీసువణిజనాటకమును ప్రచురించిన తరువాత, చమత్కారరత్నావళిని గద్యాత్మకముగ వెలయించిరి. పంతులుగారుకూడ 'ది మర్చెంట్ఆఫ్ వెనీస్' నాటకమును వినీసు వర్తక చరిత్రమను పేరున, ద్విపద కావ్యముగాచేసి ప్రవటించుటకు పూనుకొనిరిగాని, యదియు అసంపూర్ణముగానే విడిచిపెట్టిరి

తెలుగున ప్రహసనములు రచించుటయందు పంతులుగారే ఆద్యులు. సంఘములోని లోటుపాట్లను హాస్యరస స్ఫోరకముగా, వ్యంగ్యధోరణియందు విమర్శించుట పంతులుగారి కనివార్యముకాగా, వారు ప్రహసనరచనమునకు బూనిరని చెప్పవచ్చును. పంతులుగారు హేళనాత్మకములైన నిశితవిమర్శనములు వెలయించుట యందు మిక్కిలి నేర్పుగలవారు. వీరి యీ ధోరణి తొట్టతొలుతగా వీరు విమర్శించిన కొక్కొండ వెంకటరత్న కవికృత విగ్రహ తంత్రవిమర్శనము నందే గాంచవచ్చును. వీరేశలింగముగారి సంస్కరణ ప్రయత్నముల నన్నిటిని ఆక్షేపించుటకుగాను కొక్కొండవారు, తమ ఆంధ్రభాషా సంజీవని కనుబంధముగా, హాస్యవర్ధనియను పత్రికను ప్రారంభించి, వీరేశలింగంగారి వ్రాతలను పరిహసించుచుండిరి. అందువలన వీరేశలింగంగారు తమ వివేకవర్ధని కనుబంధముగా, హాస్యసంజీవని యను పేరున నొక యనుబంధమును ప్రచురించుచు, వెంకటరత్నముగారి యభిప్రాయములను హేళనకు గురిచేయుచుండిరి. కొలదికాలము తరువాత హాస్యవర్థని యంత

రించిపోగా. హాస్యసంజీవనియు ప్రత్యేకానుబంధముగా ప్రచురింపబడుటనిలిచి, వివేక వర్ధని యందంతర్భాగమైపోయెను తరువాత పంతులుగారు హాస్యధోరణియందు రచించిన రచనలన్నియు, హాస్యసంజీవనులన్న పేరుతో లోకమునందు ప్రకాశించినవి. పంతులుగారు ప్రహసనములు రచించుటలోని క్రమపరిణామ మీ విధముగా రూపొందెనని చెప్పవచ్చును. పంతులుగారి ప్రహసనరచనచ్ఛాయలు వారు రూపక రచనమునకు మొదటిసారి పూనినప్పుడు రచించిన బ్రాహ్మవివాహము, వ్యవహార ధర్మబోధిని, అను నాటికలందే కాంచవచ్చును ఆ రూపకరచన కాలమునాటికే పంతులుగారి వ్యంగ్య, చమత్కార, హాస్యరసోల్లసితమైన ధోరణి పదునెక్కినది బ్రాహ్మవివాహమును పెద్దయ్యగారి పెండ్లి పుస్తకమనియు, వ్యవహార ధర్మబోధినిని ప్లీడరు నాటకమనియు నాడు రాజమహేంద్రవరమున ప్రజలు వీధి యరుగులమీద చేరి చదువుకొనుచు, గుంపులు గుంపులుగా కూడి పకపక నవ్వి యానందించుచుండి రట అటుపిమ్మట పంతులుగారు ఆంగ్లవాఙ్మయము నందలి ప్రసిద్ధములగు ప్రహసనములకొన్నిటి ననువదించి తమ వివేకవర్ధనియందు 1886వ సంవత్సర ప్రాంతమున ప్రచురించిరి. నాటి రాజమహేంద్రవరమున లంచగొండులగు అధికారులు, అవినీతిపరులైన పెద్దమనుషులు, కుక్షింభరులగు విద్వాంసులు, మాయోపాయ ధురీణులగు కులస్వాములు, ధనవంతులగు దాంభికులు పంతులుగారి నిశితవిమర్శనమునకు గురిఅయి, వారి ప్రహసనముల కెక్కినారు. వారురచించిన మ్యునిసిపల్ నాటకము, జమీందారీధర్మఖర్చు, దంభాచార్య విలసనము, వేశ్యాప్రియ ప్రహసనము, కౌతుక వర్ధని మొదలగు ప్రహసనము లిట్టివే.

పంతులుగారి రూపక రచనమునందు

1. ప్రహసనములు. 2. సంస్కృతానువాదములు. 3 ఆంగ్లానువాదములు. 4. స్వతంత్ర రచనలు కలవు.

పంతులుగారికి పూర్వము తెలుగు దేశమునందు నాటక ప్రక్రియ యొక్క వివిధ దశావిర్భావముల నీ క్రింది విధముగా క్రోడీకరింపవచ్చును.

1. ఆధునిక కాలమున తొలి తెలుగు స్వతంత్ర రూపక రచనము 1860వ సంవత్సర ప్రాంతము మంజరీ మధుకరీయమను పేరున శ్రీకోరాడ రామచంద్ర కవి విరచితము.

2. తొలి తెలుగు సంస్కృతానువాదరూపకము వేణీసంహారము శ్రీరామ చంద్రశాస్త్రిగారిచే 1870వ సంవత్సర ప్రాంతమున విరచితము.

3 1872వ సంవత్సరమున శ్రీ కొక్కొండ వేంకటరత్నము పంతుల వారు సంస్కృతమున ధర్మ సూరి విరచిత నరకాసుర విజయవ్యాయోగమును, 1875వ సంవత్సరమున పరవస్తు వేంకటరంగాచార్యుల వారు, అభిజ్ఞాన శాకుంత లము నాంధ్రీకరించి ప్రకటించిరి

కొక్కొండ వేంకటరత్నము పంతులుగారు తమ నరకాసుర విజయ వ్యాయో గమున ఆంధ్రమున రూపకాద్యమిదియయగుట యని రూపకాంధ్రీకరణమున ప్రథమ కర్తృత్వము తమదియని ప్రస్తావించియున్నారు కాని శ్రీవావిలాల వాసుదేవశాస్త్రిగారి ఉత్తరరామ చరిత్రము పీఠిక వలన సంస్కృత రూపకాంధ్రీకరణమునకు పూనుకొనిన వారిలో కోరాడ రామచంద్రశాస్త్రులవారు ప్రథములని తెలియుచున్నది

4. తొలి యాంగ్ల రూపకానువాదము శ్రీవావిలాల వాసుదేవశాస్త్రిగారి సీజరు చరిత్రము. 1874వ సంవత్సరమున రచింపబడి 1876వ సంవత్సరమున ముద్రింపబడి ప్రకటింపబడినది

5 తొలి సాంఘిక నాటకమును రచించిన కీర్తి కూడ శ్రీవావిలాల వాసుదేవ శాస్త్రిగారిదే. 1880వ సంవత్సరమున నందక రాజ్యమను పేరున వాసుదేవశాస్త్రి గారు సాంఘిక రూపకమును రచించిరి.

6 ప్రహసనములను రచించిన వారిలో వీరేశలింగము పంతులుగారు ప్రథ ములు. పంతులుగారు 1879, 80 సంవత్సరములలో స్వతంత్రరూపక రచనమున కును, అనువాద రచనములకును పూనుకొనిరి.

తెలుగు దేశమున తొలుత నాటక ప్రదర్శనములు నిర్వహించిన కీర్తి తెలుగు వారిలో పంతులుగారికేదక్కును. 1880వ సంవత్సరమున వ్యవహారబోధినియను ప్లీడరు నాటకమును, వినోదార్థముగా విజయనగరము మహారాజగారి బాలికా పాఠశాల యందు విద్యార్థులచే ప్రదర్శింపజేసినప్పుడు నూరుల కొలది జనులు చూచి యానం దించిరని స్వీయ చరిత్రమునందు పంతులుగారు వ్రాసియున్నారు. తొట్టతొలుత ప్రద ర్శన భాగ్యమును పొందిన రూపకములలో ఆధునిక కాలమునకు సంబంధించినంత వరకు నీ వ్యవహార ధర్మబోధినికే ప్రాథమ్యము సిద్ధించుచున్నది. ఈ ప్రదర్శనము

వలన కలిగిన యుత్సాహముతో ఒక నాటక సమాజమును స్థాపింపవలెనన్న యభిలాష కూడ పంతులుగారికి కలిగినది. 1880వ సంవత్సరమున కళాశాల విద్యార్థులతో నొక నాటక సమాజమును స్థాపించి, ధార్వాడ నాటక సమాజము వారాడిపోయినపాకలో తమచే రచింపబడిన శ్రీహర్ష దేవకృతమగు రత్నావళి యనువాదమును, షేక్స్పి యర్ విరచిత 'ది కామెడి ఆఫ్ ఎర్రర్స్' అను నాటకమున కనువాదమైన చమత్కార రత్నావళిని, విద్యార్థులచే ప్రదర్శింపజేసిరి నాటక ప్రదర్శనమునందు కూడ పంతులు గారు సంఘ సంస్కార ప్రయోజనమునే యపేక్షించుట గమనార్హము. "ఇట్టి నాటక ప్రదర్శన మూలమున జనులకు వినోదము కలుగుటయే కాక యక్రమములుచేయు వారు సిగ్గుపడి తమ ప్రవర్తనమును దిద్దుకొనుటయు, అందువలన నీతి వర్ధిల్లుటయు గలుగుమగాన క్రొత్త నాటకములనుజేసి నాటక సమాజము నొక దానిని స్థాపింప వలసినదని నా మిత్రులనేకులు నన్నుగోరిరి "[3] అని పంతులుగారు స్వీయ చరిత్ర ములో వ్రాసిరి. ధార్వాడ నాటక సమాజము వారు 1880-81 సంవత్సరములలో తెలుగు జిల్లాలలో సంచారముచేసి నాటకములను ప్రదర్శించిరి. నాటిదనుక తెలుగు దేశమున నాటక ప్రదర్శనములులేవు తొలినాళ్ళలో నాటక సమాజములన్నను, ప్రద ర్శనములన్నను పెద్దలకు సదభి ప్రాయములేకుండెను[4]. అందువలన పంతులుగారు స్థాపించిన నాటక సమాజ మెంతో కాలము పనిచేసినట్లు కనబడదు. ఏది ఎట్లున్నను ఆంధ్ర దేశమునందు నాటక ప్రదర్శనములకు, ధార్వాడ నాటక సమాజము వారి ప్రదర్శనములే ప్రోత్సాహకములయ్యెను తద్వారా నాటకరచనము వ్యాప్తినొందెను నాటక సమాజముల వారి కోరిక ననుసరించి చిలకమర్తి లక్ష్మి నరసింహముగారు, కొండుభొట్ల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు మొదలగు కవీశ్వరులు నాటక రచనమున కుపక్ర మించిరి.

1880వ సంవత్సరమున వ్యవహారధర్మబోధిని మొదట ప్రదర్శింపబడినది. 1881వ సంవత్సరమున ధార్వాడ నాటక సమాజమువారు తెలుగు జిల్లాలలో ప్రదర్శ నములిచ్చిరి. తరువాత పంతులుగారును నాటక సమాజమును స్థాపించి నాటకములను ప్రదర్శించిరి. "అట్టి నాటకములాడుటకదియే ప్రథమ ప్రయత్నమైనను మొత్తము మీదనవి జయప్రదముగానే జరిగినవని యెల్లవారు నభిప్రాయపడిరి" అని పంతులుగారు స్వీయ చరిత్రములో వ్రాసియున్నారు. కాబట్టి తెలుగుదేశమున తెలుగు నాటకములను ప్రదర్శించుట్ట పంతులుగారితో ప్రారంభమైనదని చెప్పవలెను. తరు

వాత తెలుగునాట యెన్నియో నాటకసమాజములువెలసి, నాటక ప్రదర్శనములకును, నాటకరచనమునకును దోహదముచేసినవి. ఇట్టివానిలో గుంటూరులో వెలసిన ఫస్టు కంపెనీ, రాజమహేంద్రవరమున నెలకొన్న హిందూనాటకసమాజము చాలా ప్రసిద్ధి నొందినవి

ప్రహసనములు

వీరేశలింగంపంతులుగారనేక ప్రహసనములను రచించిరి. ఇట్టివిరచించు టలో వారి పరమార్థము సంఘసంస్కరణమేయని వారి వ్రాతలనుబట్టియే తెలియు చున్నది. "కులాచార విషయములలోను రాజకీయ వ్యవహారములలోను గల యనేక దురాచారములను వినోదకరముగా సంభాషణరూపమున వెల్లడిచేసి తన్మూలమున దురాచారములను మాన్పుటకయి వివేకవర్ధని కంతర్భాగముగా హాస్యసంజీవని ప్రక టింపబడుచుండెనని" పంతులుగారు వ్రాసియున్నారు. ఇట్టి ప్రహసనములను రచిం చుటకు ఆంగ్లసాహిత్య ప్రభావముకూడ వారిని ప్రేరేచియుండవచ్చును. ఆంగ్ల సాహి త్యమునందలి రెస్టొరేషన్ డ్రామాయని పిలువబడు నాటకరచనా పద్ధతి పంతులుగారి నాకర్షించి వారిని ప్రభావితులనుగ జేసినదని విమర్శకులు తలంచుచున్నారు[5]. సంఘా చారములయందుగల వైకృతముల విపరీతముగా గనుపర్చి నవ్వుపుట్టించుచు సంఘ మును బాగుచేయుట వీని ఆశయమని' పంతులుగారి ప్రహసనములను గూర్చి సమ కాలికులు వ్రాసియున్నారు[6]. "ప్రహసనమాయనకరముల కుచితపరికరమయ్యెను. శైలి సొంపులతోను హాస్యంపుదళులతోను శోభిల్లెడి యీ ప్రహసనావళియందు 'దుష్టాంగమును ఖండించి శేషాంగస్ఫూర్తికి రక్షచేయు చికిత్సకునివలె' నీ రచయిత సాంఘికానర్థముల నురు మాడెను "అని రాయసము వేంకటశివుడుగారు తమ ఆత్మ చరిత్రమునందు పంతులుగారి ప్రహసనములను గూర్చి ప్రస్తావించియున్నారు[7]. పంతులుగారి సర్వ రచనల యందును నీ ప్రహసములే విశిష్ట స్థానమునలంకరించునని గురజాడ అప్పారావుగారు అభిప్రాయపడినారు[8]. ప్రహసన మొక ప్రక్రియగా పంతులు గారివలన తెలుగు సాహిత్యమున విలసిల్లెను చిలకమర్తివారు పంతులుగారి తర్వాత ప్రహసనరచనమును వృద్ధి పొందించినారు. పంతులుగారువ్రాసిన ప్రహసనములలో పదింటికి మాత్రము ఆంగ్లమునందు మాతృకలున్నవి. తక్కినవన్నియు స్వతంత్ర రచనములే. మొదట హాస్య సంజీవనియందును, తరువాత చింతామణి, వివేకవర్ధని, జనానా, సత్యవాదిని మొదలగు పత్రికలందు పంతులుగారు ప్రహసనములను వెల

యించిరి. వీనినన్నింటిని మూడు భాగములుగా హాస్యసంజీవనిపేరులో పుస్తక రూపమున పంతులుగారు ప్రకటించిరి. 1897వ సంవత్సరమునందు, తమ గ్రంథ ములను సంపుటములుగా ప్రచురించునప్పుడు, నీ మూడు భాగములను, ఆంగ్లేయ ప్రహసనముల ననుసరించి రచించిన పది ప్రహసనములను, మొదటి సంపుటముగాచేసిరి. హాస్యసంజీవని మూడు భాగము లందును కలసి మొత్తము నలుబదినాలుగు హాస్య సంభాషణములున్నవి. ఇవి కాక గ్రంథరూపమున ప్రకటింపబడని వెన్నియోకలవు. వివిధ పత్రికలలో వ్రాసిన వాని నన్నింటిని పంతులుగారు పుస్తకరూపమున ప్రక టించలేదు

## హాస్యసంజీవని-మొదటి భాగము

హాస్య సంజీవని మొదటిభాగము 1888వ సంవత్సరమున ప్రప్రథమమున పుస్తకరూపమునొందినది. ఈ భాగమున పందొమ్మిది ప్రహసనములున్నవి. వీని యందు కులాచారములు, మూఢవిశ్వాసములు, రాజకీయములు, మతాచారములు మొద లగు విషయములపై హాస్య సంభాషణలున్నవి. వీనిని పంతులుగారు 1876వ సంవత్సరమునుండి 1887 వరకు వివిధ పత్రికలలో ప్రచురించియుందురు ఇవి అన్నియు చిన్నచిన్న సంభాషణములే 'పెళ్ళివెళ్ళిన తరువాత పెద్దపెళ్ళి' 'లోకోత్తర వివాహము' అను ప్రహసనములందు మాత్రమే రెండు రంగములున్నవి తక్కిన వన్నియు ఒకే రంగమునందు నిర్వహింపబడినవి. వేశ్యాభిమానము, చాదస్తపు టాచారములు, శాఖాభేదములు, అశాస్త్రీయములైన యంధ విశ్వాసములు పరిహసింపబడి నవి మానవ ప్రవృత్తియందలి అజ్ఞానము, అమాయకత్వము, దుర్మార్గము, స్వార్థము మొదలగునవన్నియు సహజముగ వర్ణింపబడినవి హిందూమహాజనులమతసభ యను ప్రహసనమునందు ఆచార్యపురుషుల దాంభికవర్తనము పరిహసింపబడినది. కొన్ని ప్రహసనములందు ఇంగ్లీషుపదములు విరివిగా ప్రయోగింపబడినవి. 'నవనాగరకుల'ను ప్రహసనమునందు నాగరకులమనుకొను వారి అజ్ఞానము, దంభము నవ్వుపుట్టించు నట్లుగ వర్ణింపబడినవి. సామెతలతో నుడికారములతో నీ ప్రహసనములన్నియు పంతులు గారాశించిన యుద్దిష్టార్థమును సాధించుచున్నవనుటలో సందేహములేదు.

## హాస్యసంజీవని-ద్వితీయ భాగము

ఈ భాగము 1891వ సంవత్సరమున ప్రప్రథమమున ముద్రింపబడినది. దీని యందు పదహారు ప్రహసనములున్నవి. ఈ ప్రహసనములన్నియు 1886వ సంవ

త్సరమునుండి 1891వ సంవత్సరమధ్య కాలమున రచించి పంతులుగారు పత్రిక లలో ప్రకటించియుందురు ఈ భాగమునందును ప్రథమ భాగమునందువలెనే కులా చారములు, అంధ విశ్వాసములు, సంఘదురాచారములు, సంభాషణారూపమున నధిక్షే పింపబడినవి. ఇవియన్నియు చిన్నచిన్న హాస్య సంభాషణములనియే చెప్పవలెను. జమాబందీ, యోగాభ్యాసము-ను ప్రహసనములు తప్ప, మిగిలిన ప్రహసనములన్నియు ఒకే రంగమునందు నిర్వహింపబడినవి ఈ రెండు ప్రహసనములందు మాత్రము రెండు రంగములుకలవు వేశ్యావిషయ సంవాదము, చంద్రగ్రహణము-తేలుమందు, స్వర్గలోక సుఖము, హిందూమత సభ, బహుభార్యాత్వము, యజ్ఞప్రయత్నము, బాల భార్యా వృద్ధభర్తృ సంవాదము, మొదలగు ప్రహసనములందు పంతులుగారు నాటి సంఘమును నిశితముగ విమర్శించియున్నారు. ఈ ప్రహసనములయందలి విషయము నాటి సాంఘిక దుస్థితిని వేనోళ్ళ చాటి చెప్పుచున్నది పంతులుగారి విషయ విన్యా సము అమిత తీక్షణముగానున్నది కటువుగానున్నది ఈ ప్రహసనములు చదివి ఆనందించుట జరుగదు ఎచ్చటనైన సంభాషణములలోని చమత్కారము నవ్వు పుట్టించినను, దిగజారిపోయిన నాటి సాంఘికుల దుస్థితి హృదయ విదారకమై, మనసు విలవిలలాడిపోవును హిందూ వివాహములు, హిందూమత సభ, బహిష్కారపత్రికలు, అను ప్రహసనములందు పంతులుగారి హాస్యము కటువుగానున్నదని చెప్పవలెను పంతులుగారు సాంఘికదురాచారములను నిర్దయగా ఖండించిన మతాచార్యుడు కావున, లోపములను బాహిరపరచి, తీవ్రముగా నిరసించిరని సమాధానము చెప్పుకొనవలయును దుస్సహమైన నాటి దుస్థితిని పంతులుగారు తమ కలము నసిగాజేసి, కూకటివ్రేళ్ళతో కూలజేయు ప్రయత్నములనుజేసినారు. తత్ఫలితముగా వారి యీ ప్రహసనములందు మృదువైన హాస్యధోరణిమృగ్యమై కటు వ్యంగ్య మెల్లెడను కదను త్రొక్కినది.

## హాస్యసంజీవని-తృతీయ భాగము

ఈ భాగము 1897 వ సంవత్సరమున ప్రప్రథమమున పుస్తకరూపము నొందినది దీనియం దెనిమిది ప్రహసనము లున్నవి ఈ ప్రహసనము లన్నియు 1891 వ సంవత్సరము నుండి 1897 వ సంవత్సరము మధ్యకాలమున వెలువడి నవి వీనిలో కామరూప మంత్రమను ప్రహసనము 'చింతామణి' పత్రికయందు 1896 వ సంవత్సరము జులై నెలయందు వెలువడినది. పూర్వాచారమను ప్రహ

సనము 1897 జనవరినెల సత్యసంవర్ధనియందు వెలువడినది. ఈ భాగమునందలి ప్రహసనములు తక్కిన రెండుభాగములలోని ప్రహసనములకన్న పెద్దవి. కొన్ని ప్రహసనములందు అంకవిభజనము కూడ కలదు. కన్యాశుల్కము, వినాయకచతుర్థి, అతిబాల్యవివాహము, పూర్వాచారములను ప్రహసనము లొకేరంగము కలవి తక్కిన వానిలో మ్యునిసిపల్ నాటకమను ప్రహసనమందు మూడంకములును, ప్రథమాంకమున మూడు రంగములును, ద్వితీయాంకమున మూడురంగములును, తృతీయాంకమున రెండు రంగములును కలవు. దీనిని నాటకముల సంపుటియందు చేర్చియుండ వలసినది. కామరూప ప్రహసనమునందు నాలుగు రంగములు కలవు. లులాయశాస్త్రియను ప్రహసనమునందు రెండురంగములును, లక్కగేదెయను ప్రహసనమునందు మూడు రంగములును కలవు వస్తువునుబట్టియు విన్యాసమును బట్టియు పంతులుగారి సంపుటమునందు రెండవ సంపుటమున చేర్చిన తిర్యగ్విద్వన్మహాసభ, మహారణ్యపురాధిపత్యము, అనునవి ప్రహసనములే. కాని వీనిని నాటకముల సంపుటమందు చేర్చినారు. ఇట్లే ప్రహసనములందు చేర్చిన కౌతుకవర్ధనియందు కూడ మూడంకము లున్నవి. చింతామణియను పత్రికయందు భ్రాంతితరంగిణియను ప్రహసనమును, సత్యవాదినియందు స్త్రీ విద్యను గూర్చిన హాస్యసంభాషణమును ప్రచురించిరి. కాని వీనిని సంపుటమునందు చేర్చలేదు. మూడు భాగముల ప్రహసనము లందును కులాచారములు, రాజకీయములు, సంఘసంస్కరణ వ్యతిరేకత, లంచగొండితనము, వేశ్యాలంపటత్వము, మూఢవిశ్వాసములు మొదలగునవి విమర్శింపబడినవి. మూడుభాగము లందలి నలుబదినాలుగు ప్రహసనములలో మూఢవిశ్వాసముల నవహేళనము చేయునవి 15, సంఘసంస్కారమునుద్బోధించునవి 21, మిగిలినవి 8 కలవు ఇతరములన్న వానిలో నవనాగరకుల వర్తనము, కొందరి అజ్ఞానము, స్వార్థపరత్వము, అమాయకత్వము హాస్యయుతముగా విమర్శింపబడినవి ఇవికాక కలిపురుష శనైశ్చర విలాసము, వేశ్యాప్రియ ప్రహసనము, వినోదతరంగిణి, యనునవి కూడ కలవు. ఇవికాక వివేకవరనిలో వెలువడిన దంభాచార్య విలసనమను ప్రహసనము సంపుటమునందు చేరలేదు. ఇవి హాస్యసంజీవనిలోని ప్రహసన ప్రాయములైన సంభాషణలకన్న విషయపరిమితినిబట్టి సుదీర్ఘములుగా నున్నవి. కాని విషయము సంఘసంస్కరణమునకు సంబంధించినట్టిదే.

వేశ్యాప్రియ ప్రహసనము : దంభాచార్యులు తన కుమార్తెయైన చిన్నమ్మ వివాహసందర్భమున మాయాచార్యులవారి ప్రోత్సాహము వలన, గణికాప్రాణనాథ రావుగారి భోగముమేళమును పెట్ట నిశ్చయించును మాయాచార్యులు భోగము మేళములు పెట్టకపోయినచో పరువు తక్కువని నూరిపోయుచు దంభాచార్యులను విడువక ప్రోత్సహించుచుండును దంభాచార్యులవారి పత్ని చారుమతి తల్లి కూతుళ్ళు మాత్రము వివేకముగా ప్రవర్తింపవలెనను నభిప్రాయము గలవారు. దంభాచార్యులు వీరి యభిప్రాయములను మన్నింపక గణికాప్రాణనాథరావు, విటేంద్ర రావు మొదలగు వారల ప్రోత్సాహ వాక్యముల నభిలషించును. ఇంతలో భోగము మేళముల ప్రయోజనమును, పరమార్థమునుగూర్చి గ్రామములో సభజరుగును ఆ సభలో గణికాప్రాణనాథరావు, విటేంద్రరావు మొదలగువారు భోగముమేళముల ప్రాశస్త్యమును గూర్చి యుపన్యసింతురు. వివేకరావు, సత్యప్రియాచార్యులు, వయభూషణరావు మొదలగు సంస్కారపరులు సభయందు నిలిచి భోగముమేళముల వలన కలుగు అనర్థములను వివరింతురు వీరితో వాదించుటకు శక్తిచాలక గణికా ప్రాణనాథరావు మొదలగువారు సభలో బిగ్గరగా కేకలువేసి, ప్రతిపక్షుల వాదములను సభలోనివారు వినకుండుటకు, గిరిరావు, రాజరత్నము. అను విద్యార్థులను ప్రోత్సాహపరచి సభకు తీసికొని వత్తురు కీరవాణియను వేశ్య తల్లిని కూడ సభలో ప్రవేశించి కేకలు వెయ్యవలసినదని ప్రోత్సహింతురు. కాని సభలో పోలీసు ఇన్స్పెక్టరు సాయము వలన అల్లరి జరుగక, భోగము మేళములుపెట్టుట నింద్య మను తీర్మానము అత్యధిక సభ్యులచే నామోదింపబడును.

భార్య చారుమతి యొత్తిడి వలనను, వరుడు భోగముమేళముల నిరసించు వాడగుట వలనను, దంభాచార్యులు చివరకు తన కొమార్తె వివాహము భోగము మేళములు లేకుండగనే జరుపుటకు నిశ్చయించును

ఈ ప్రహసనమునందు వేశ్యాప్రియులైనవారు తమవాదమును నిలబెట్టుకొను టకు చేయువాదములు, చూపు హేత్వాభాసములు, పాఠకులను కడుపుబ్బ నవ్వించును. ఈ ప్రహసనమును పంతులుగారు మిక్కిలి వినోదాత్మకముగా రచించిరి ఈ ప్రహసనమునందు పంతులుగారు పెట్టిన పేర్లు ఔచితీ శోభితములే కాక చమత్కారములుగ కూడ నున్నవి. వేశ్యాప్రియులను గణికాప్రాణనాథరావు, విటేంద్ర రావు అని పిల్చుట, సంస్కార పరులను వివేకరావు, సత్యప్రియాచార్యులు, నయ

భూషణరావు అని పిల్చుట పంతులుగారి సంస్కార ప్రియతను చాటిచెప్పుచున్నది. దంభాచార్యులకు, భార్య వివేకము గఱప ప్రయత్నించుచుండగా ఆతడామెను 'నీవు సత్యవతి సహవాసమున చెడిపోవుచున్నావని' మందలించును ఈ సత్యవతి పంతులుగారి యభిమానపాత్రురాలగు, సత్యవతీ చరిత్రము నందలి నాయికయైన సత్యవతికావచ్చును ఈ ప్రహసనమును గూర్చి యింకొక విశేషముకలదు. పంతులు గారే ప్రహసనమునకును ఉపోద్ఘాతమును కూర్చియుండలేదు కాని యీ ప్రహసన మునకు కూర్చిరి ఈ యుపోద్ఘాతముకూడ మిక్కిలి హాస్యరసోల్లసితముగానున్నది. ఈ ఉపోద్ఘాతముయొక్క యుద్దిష్టార్థ మీ ప్రహసనమునందు చిత్రింపబడిన పాత్రలు, ఎవరినికూడ యుద్దేశించి వ్రాయబడినవికావని చెప్పుట. పంతులుగారి మౌలికత యీ ప్రహసనమునందు వెల్లివిరియుచున్నది ఉపోద్ఘాతమేకాక, యీ ప్రహసనమునకు పంతులుగారు ఉపసంహార వాక్యములుకూడ చేర్చియున్నారు. ఉపోద్ఘాతమున తామీ ప్రహసన మెవరినిగాని యుద్దేశించి వ్రాయలేదని మనవిచేసినను, అ, ఇ, ఉ, ఋ, లను దుష్టచతుష్టయ మొకచోచేరి, యీ ప్రహసనము తమను గూర్చియే వ్రాయ బడినదని చర్చించుకొనుచుండిరని, ఉపసంహారమునందు, వారు సంభాషించిన విధ మును చమత్కారముగా తెలిపియున్నారు దీనియందు రంగము లైదుకలవు

కలిపురుషశనైశ్చర విలాసము : ఈ ప్రహసనము 1892వ సంవత్సరము సత్య సంవర్ధనియను పత్రికయందు వెలువడినది ఇది నాలుగురంగములుగా విభ జింపబడినది కలి ప్రభావమున సాంఘిక పరిస్థితులెట్లు మారిపోయినవో చూపు ప్రహ సనమిది విగ్రహారాధనము, మద్యపానము, వేశ్యాగమనము మొదలగున వింద అధిక్షేపింపబడినవి. కలియు, శనైశ్చరుడునుకలిసి, దేశ ప్రజలను, అజ్ఞానులుగను, అహంకారులుగను, మద్యపానప్రియులుగను, అసత్యవాదులుగను, దురాచారులుగను, ప్రవర్తించునట్లు చేయుటకు పూనుదురు. శనైశ్చరుని అనుచరులు మద్యప్రియుడు, దాంభికుడు కలిపురుషుని యనుచరులు పరదోషారోపకుడు, అసత్యుడు, స్తుతి పాఠకుడు మొదలగువారు వీరి ప్రయత్నములన్నియు హాస్యమును పుట్టించునవిగా యున్నవి.

కౌతుకవర్ధని : వేశ్యాలంపటత్వమును వర్ణించు ప్రహసనమిది. నరసింహారావు పంతులుగారు, సుబ్బారావు పంతులుగారు, వేశ్యాగమన దురాచారమును రూపుమాప

వలెనని సభలుచేయుచుండిరి నాగభూషణరావు, గంగాధరశాస్త్రులు, రామసోమ యాజులుగారలు వేశ్యాప్రియులు

వేశ్యల నాదరించుట దుష్కృత్యమనివారును, సదాచారమేయని వీరును, సభలలో వాగ్వివాదములు సలుపుచుందురు. కోర్టు మున్సఫుగా ఉద్యోగముచేసి పదవీ విరమణముచేసిన భీమారావుగారిరుపక్షములవారిని సమావేశపరచి, తమ స్వానుభవమును వివరించి వేశ్యలపొందు అనర్ధదాయకమని హితవుచెప్పుదురు. ఈ ప్రహసనమున మూడంకములుకలవు ప్రతి అంకమురంగములుగ విభజింపబడినది. వేశ్యల కపటోపాయములు, వేశ్యాప్రియుల దుఃఖానుభవములు, వివరముగా వర్ణింపబడినవి.

వినోదతరంగిణి : ఈ ప్రహసనమున వృద్ధ వివాహమువలని బాధలు వర్ణింపబడినవి. సోమయాజులను వృద్ధుడు, తన పడుచు పెండ్లామైన సోమిదేవితో పడుబాధలిందు వర్ణితములు. భీమరావుగారి మరదలు భ్రూణహత్యకుపూనుట, తహసీలుదారుగారు కేసు విచారింపవచ్చుట, ఆ కుటుంబము పొందిన యపఖ్యాతి, కష్టనష్టములు వివరముగా వర్ణింపబడినవి ఈ ప్రహసనమునందు కొన్ని సన్నివేశములు మిక్కిలి జుగుప్సావహముగానున్నవి. సంఘములోని చెడుగును నిర్మూలింపవలయునని బద్ధకంకణులగుట, పంతులుగారిట్టి సన్నివేశములు వర్ణింపక తప్పలేదు ఈ ప్రహసనమున కూడ రంగవిభజనమున్నది

ఈ ప్రహసనములుకాక ఆంగ్ల ప్రహసనము లాధారముగా పంతులుగారు పది ప్రహసనములు రచించిరి. వీనిలో కొన్ని వివేకవర్ధనియందు వెలువడినవి. ఈ ప్రహసనములనన్నిటిని ప్రథమ సంపుటమునచేర్చినారు పంతులుగారు. ఇవి అనువాదములుకావు. దేశకాలపాత్రములను మన సంప్రదాయానుగుణముగా మార్చుటకు కొంత ప్రయత్నము జరిగినది కాని యీ ప్రయత్నము నెరవెరలేదు వాక్య నిర్మాణమునందును, సన్నివేశ కల్పనమునందును, ఇంగ్లీషు నుడికారము, ఇంగ్లీషువారి ఆచారములు త్రోసికొని వచ్చుచున్నట్లుగా నుండును 1886వ సంవత్సరమున అపూర్వ బ్రహ్మచర్య ప్రహసనము వివేకవర్ధనియందు వెలువడినది. కనుక తక్కిన ప్రహసనములుకూడ ఆ కాలముననే వెలువడియుండెనని నిశ్చయింపవచ్చును. వీని మూలములను పంతులుగారెచ్చటను పేర్కొనియుండలేదు కాని ఆంగ్లమూలము ననుసరించినామని స్వీయచరిత్రమునందు తెలిపినారు. 1898వ సంవత్సరమున

నీ ప్రహసనములు ద్వితీయ ముద్రణము పొందినవి. ముఖపత్రమందు "Adapted from an English Farce, ఇది కొంత ఒకానొక యింగ్లీషు ప్రహసనము ననుసరించి రాజమహేంద్ర దొరతనము వారి కళాశాలలో తెలుగు పండితుడుగానున్న కందుకూరి వీరేశలింగముచే రచింపబడినది" అని మాత్రమేయున్నది

ఆంగ్లేయ ప్రహసనము ననుసరించి అపూర్వ బ్రహ్మచర్య ప్రహసనము, విచిత్రవివాహ ప్రహసనము, మహాబధిర ప్రహసనము, పునర్మరణ ప్రహసనము, బలత్కార గానవినోద ప్రహసనము, కలహప్రియ ప్రహసనము, మహా మహోపాధ్యాయ ప్రహసనము, యోగనిద్రా ప్రహసనము, మహావంచక ప్రహసనము, అసహాయశూర ప్రహసనము, అనువానిని పంతులుగారు రచించిరి.

The Married Bachelor or Master and Man – అపూర్వ బ్రహ్మచర్య ప్రహసనము, Twice killed పునర్మరణ ప్రహసనము, Caught by the ears–బలాత్కార గానవినోద ప్రహసనము, Caught in his own trap–విచిత్రవివాహ ప్రహసనము, Artful Dodge–మహావంచక ప్రహసనము, Irish Tutor–మహామహోపాధ్యాయ ప్రహసనము అనునవి పంతులుగా రనుసరించిన ప్రహసనములు [9]

ఈ ప్రహసనములు స్వేచ్ఛానువాదములని చెప్పుటకు వీలులేకపోయినను దేశీయాచారముల కనుగుణముగా పంతులుగారు కొన్నిమార్పులు చేసియున్నారు. ముఖ్యముగా దేశకాల పాత్రములను భారతీయ సంప్రదాయానుగుణముగా మార్చినారు

Mr Cranky Crotchet-a musical Amateur- గానప్రియుడు, Fredrick Vuverly- సంగీతరావు, CAVENOUSCRUNTINGTON- విశ్వపతిశాస్త్రి, Mr Euclid Facile- దృఢవ్రతుడు, Mr Ralph Reckless- సాహసవర్మ, Mrs Facile-మృదుభాషిణి, Miss Julia Flighty-మనోరంజని, ఇత్యాదిగా పాత్రలనుమార్చి పేర్లుపెట్టినారు కధా సందర్భములను, రంగములను కూడ మార్పుచేసినారు ఇంగ్లీషు ప్రహసనములం దీయబడిన రంగస్థల సూచనలు తెలుగున పరిహరించిరి. పంతులుగారు వీనిని ప్రదర్శనాపేక్షతో రచించి యుండరు. వినోదముకొరకును, సంఘ విమర్శకొరకును రచించియుందురు. కనుకనే రంగాలంకరణమును గూర్చిన సూచనలను తెనిగించక విడిచిపెట్టిరి ఈ ప్రహసనములందు

వాక్యనిర్మాణమున ఇంగ్లీషు నుడికారము కొట్టవచ్చినట్లుగా కనబడుచున్నది. రంగ స్థలమున ముద్దుపెట్టుకొనుట, కౌగలించుకొనుట, ప్రాణప్రియాయని మాటి మాటికి సంబోధించుకొనుట, వీధులలో సంగీతములు పాడుచు తిరుగుట, మొదలగునవి విదేశీయవాసితములనియే చెప్పవలెను. పంతులుగారినాటికి తెలుగుదేశమున అట్టి సాంఘిక వాతావరణము లేదు

అపూర్వ బ్రహ్మచర్య ప్రహసనము: రామాకాంతముపంతులనే వ్యభిచారి తన సేవకుడైన కరటకరెడ్డి భార్యను కవయగోరి ప్రయత్నములు చేయుచుండును. ఆతని కామె తనసేవకుని భార్యయని తెలియదు కొన్నివిచిత్రమైన పరిస్థితులలో కరటకరెడ్డి భార్య మోహిని రామాకాంతము పంతులింట పంతులయెదుట కనిపించును. ఈ సన్ని వేశమున పంతులు తబ్బిబ్బుపడుచుండగా ఆయన భార్య శ్యామలాంబ, అదే సమయ మున పుట్టింటినుండి వచ్చి ఇంట ప్రవేశించుట జరుగును. అంతట కరటకరెడ్డియు, మోహినియు భార్యాభర్తలని పంతులు తెలిసికొనుట తటస్థించును. వారియన్యోన్య మును చూచి బుద్ధితెచ్చుకొని పంతులుకూడ తానప్పటినుండి మంచి గృహస్థుడగుటకు నిశ్చయించుకొనును. సంభాషణములు, సన్నివేశములు విదేశీయములుగా నున్నవి.

విచిత్రవివాహ ప్రహసనము : ధనకోటిరాజనునతడు హైకోర్టువకీలు. విధు రుడై మరల వివాహమాడ నొల్లక ఇతడు కాలము గడుపుచుండెను ఆయన అన్న కొడుకు వెంకటపతిరాజు ఆయన పోషణమున నుండి, తనకు వివాహము చేయవలసి నదని పినతండ్రిని నిర్బంధించుచుండెను అతని కోరికను కాదనలేక, ఇరవైవేల రూపాయలు కట్నమువచ్చిన వివాహము చేతునని ధనకోటిరాజు వాగ్దానము చేయును ఇదివరలో ఆతడు, తన దృఢచిత్తమును గూర్చి పందెము పలుకుచు తనను ఏ స్త్రీ యైన ఆకర్షితుని జేసినచో ఇరువదివేల పందెముపెట్టి, తానోడిన, ఆ మొత్తమును వదులుకొందునని ప్రతిజ్ఞచేసినాడు. వెంకటపతిరాజు రతీసుందరియను నామెను ప్రేమించినాడు ఆమె మేనత్త మోహినీదేవి చాలాతెలివికలది. ధనకోటిరాజింటచేరి, ఆమె అతనిని మోహింపజేయును ఆమెను పెండ్లాడుట కాతడు సంసిద్ధుడగును. వెంకటపతిరాజు కోరిక సిద్ధించును. ఈ ప్రహసనమున మోహినీదేవి ముప్పదేండ్లు పైబడిన స్త్రీయని పంతులుగారు వర్ణించిరి ఆనాటి సాంఘిక స్థితి కది విరుద్ధము.

మహాబధిర ప్రహసనము : సుమంత్రుడను నొకధనికుడు, తన కొమార్తెను ధనపాలుడను పరమలోభికిచ్చి వివాహము చేయవలెనని తలంచి అమలాపురమున

నొక సత్రమున బసచేసి కొమార్తెకు వర్తమానమంపును కొమార్తె ఇందుమతియు, ఆమెచెలికత్తె విశాలాక్షియు సత్రమునకు వత్తురు. ఆ సమయమున ఇందుముఖిని ప్రేమించిన విజయవర్మ ఆ సత్రమునకు వచ్చి, చెవిటివానివలె నటించుచు, ధన పాలుని లుబ్ధత్వమును, మూర్ఖతను సుమంత్రునకును, అచ్చట నున్నవారికిని రుజువు పరచి, ఇందుముఖిని తాను వివాహమాడును ఇతివృత్తమంతయు విదేశ వాతావరణ సంబంధిగా నున్నది.

పునర్మరణ ప్రహసనము : చండశాసనుడను నొకగృహస్థు తన కొమార్తె మనోరంజని త్రివిక్రమవర్మ యను వానిని ప్రేమించుచున్నదని తెలిసికొని దాని కంగీకరింపక, ఆమెను మేనత్తయైన మృదుభాషిణి యింట నిర్బంధావాసమున నుంచి ప్రియుని కలుసుకొనకుండ వేయికనులతో కనిపెట్టుచుండును త్రివిక్రమవర్మ అసలు పేరు సాహసవర్మ అతడు తనమిత్రుడైన మాధవుని సాయమున వెదురు పేళ్ళ బుట్టలో దాగి మృదుభాషిణి ఇంటికి చేరుకొనును మృదుభాషిణి పరిచారకురాలైన జానకి మాధవునికి ప్రియురాలు కనుక జానకికి పంపినట్లుగా యీ బుట్టను మాధవుడు మృదుభాషిణి ఇంటికి చేర్చును చివరకు చండశాసనుడు సాహసవర్మ సాహసమును మెచ్చి తనకొమార్తె నాతనికిచ్చి వివాహముచేయుట కంగీకరించును. ఈ ప్రహసనము నందలి రంగభూమి రాజమహేంద్రవరముగా వర్ణింపబడినది పెండ్లికాకపూర్వమే ప్రేమలేఖలను యువతీయువకులు వ్రాసికొనుట, మత్తుపానీయములు త్రాగుట, బోటు షికార్లు చేయుట, దేశీయములుకావు వాక్యనిర్మాణము కృతకముగానున్నది.

బలాత్కారగానవినోదప్రహసనము . గానప్రియుడు సంగీత రసపిపాసి. ఈతడు విశ్వనాధశాస్త్రియను మహాగాయకునిచే సారంగపాణి పదము పాడించి విన వలెనని మిక్కిలి కుతూహలపడి, విశ్వనాధశాస్త్రిగారి కెన్నిమారులో వర్తమాన మంపును కాని ఆయన ఆశ నెరవేరలేదు. విశ్వనాధశాస్త్రిగారు పిఠాపురము వెళ్ళు చున్నాడని వృత్తాంత పత్రికవలన తెలిసికొని ఆయనను బ్రతిమాలికాని, వినకపోయిన యెడల బంధించికాని తీసికొనిరమ్మని, ధవలేశ్వరము రేవుకు తన సేవకులను గాన ప్రియుడు పంపును. వారు విశ్వనాధశాస్త్రిగారుగా పొరపడి విస్సప్పపాత్రుడను ఓఢ్రదేశపు వడ్రంగిని తీసికొనివత్తురు అతడే సంగీత విద్వాంసుడని గానప్రియు డాతని పాటపాడవలసినదని నిర్బంధించును. ఇంతలో గానప్రియుని మేనల్లుడైన

సంగీతరావు అచ్చటకు వచ్చును  గానప్రియుని కూతురగు లీలావతిని సంగీతరావు ప్రేమించెను మేనమామను మెప్పించి ఆమెను వివాహమాడవలెనని సంగీతరావు తంజావూరునకేగి సంగీతము నేర్చి తనమిత్రుడైన సుమతితోవచ్చును. గానప్రియుడు విస్వప్పపాత్రుని పాట పాడవలసినదని నిర్బంధించుచుండగా ప్రక్కగదిలో నుండి సంగీతరావు పాటపాడి గానప్రియుని మెప్పించును. గానప్రియుడు నిజము తెలిసికొని సంగీతరావుకు తనయ నిచ్చి వివాహము గావించును. ఈ ప్రహసనమందలి కథ హాస్యప్రధానమైనది  పంతులుగారి స్వోపజ్ఞత, మృదుహాస్యము, ఈ ప్రహసనము నందు కొంత చూడవచ్చును.

కలహప్రియ ప్రహసనము, మహామహోపాధ్యాయ ప్రహసనము, యోగనిద్రా ప్రహసనము మొదలైన ప్రహసనములందుకూడ, పంతులుగారు దేశీయమైన వాతావరణము ప్రవేశపెట్టవలెనని కొన్నిమార్పులు చేసినను దేశీయతా ముద్రను అవి పొందలేకపోయినవి. అనువాద పద్ధతి తెలిసికొనుటకీ ఉదాహరణము చూడవచ్చును పునర్మరణ ప్రహసనము నందలిదీ ఘట్టము

Mrs Facile- Really My dear, the best advice I can give you is to employ yourself about something, it will divert your mind

Julia - Divert I dont want to be diverted, I want to be miserable, its very unkind of you to try to console me.

Mrs Facile- I can only say I mean well and I belive your guardian means well.

Julia - Yes so is very horrid thing meant well Our governess used to make us wash our hands in icy water in winter and tell us it was all for our good. I hate what is for our good.

ఈ ఘట్టమును పంతులుగారీ క్రింది విధముగా ననువదించిరి.

మృదుభాషిణి - అమ్మాయీ! మనోరంజనీ! నీవదేధ్యానంగా వూరికే విచారిస్తూ కూర్చోక యేదయినా పనిచేస్తూవుంటే పనిసందడిలో విచారం మరచి పోతావు.

మనోరంజని - మరచిపోవడంకూడానా? నేను ఎప్పుడూ మరచిపోను. నేను విచారంగానే వుంటాను అత్తా! నేను వకటి చెపుతాను విను. నన్ను ఈ ప్రకారంగా నీవు వోదార్చడానికి ప్రయత్నం చెయ్యడం యెంత మాత్రమూ బాగా వున్నదికాదు.

మృదు - నేను మంచివుద్దేశముతో నీమేలుకోసరమే చేస్తూవున్నాను నీతండ్రి కూడా మంచి వుద్దేశముతోనే చేస్తూవున్నాడు

మనో - అవునవును. మీరన్నీ నామేలుకోసమే చేస్తూవుంటారు మా సవతితల్లి నాకు తిన్నగా అన్నంపెట్టకుండా మాడుస్తూ అదీ నామేలుకోసరమేనని చెప్పేది. ఇటువంటి మేళ్ళంటే నాకు తలనొప్పి వస్తుంది.[10]

ఈ అనువాదమును యథా మాతృకానువాదమనకూడదు. యథేచ్ఛానుసరణమని చెప్పవలెను. ఆంగ్ల ప్రహసనమునందలి సంరక్షకురాలు (Governess) ఇచ్చట సవతితల్లియైనది. చలికాలంలో శీతోదకమున చేతులుకడిగించుట యను భావము ఇచ్చట అన్నము పెట్టకమాడ్చుటయని యనూదితమైనది. ఇట్టి మార్పులు పంతులుగారి ప్రహసనములందనేకములు జేసియున్నారు ఇట్టిదే యింకొకయుదాహరణము. ఇది బలాత్కార గానవినోద ప్రహసనము నుండి గ్రహింపబడినది.

"Enter Thomas hastily

Cranky – well Thomas you have got him

Thomas – Ees sur ! thof he made a Woundy struggle he was obleged to fettle his arms and legs with a cord

Cranky – Thaks' right–thats right Where did you catch him – in the road by the park

Thomas – No at the public house at tendo' the village – he got off coach thre and was asking' bout a' bus for Brummagem (laughing) He be a rum looking Jockey surely not a bit like a gen' lem'n – all his luggage be a pocket hard Keecher hundle and hold rumberella..."

ఈ సన్నివేశమును పంతులుగారిట్లనువదించిరి.

"అప్పుడు తొందరగా గోవిందుడు ప్రవేశించుచున్నాడు)

గాన ప్రియుడు - గోవిందా! గోవింవా! యేమి? మీరాయనను తీసుకుని వచ్చినారా ?.

గోవిం - తీసుకొని వచ్చినాము అతడైతే తప్పించుకుని పారిపోవడానికి చాలా ప్రయత్నంచేసినాడు కాని మేము పోనియ్యకుండా ముగ్గురమూమీదపడి కాళ్ళూ చేతులూకట్టి బండిలో పడవేసినాము.

గాన - మంచిపనిచేసినారు మీకాయన యెక్కడ దొరికినాడు ? పడవలుదిగే చోటనా ? సత్తురువువద్దనా ?

గోవిం - ఆ రెండుచోట్లనూకాదు కాలవవద్దున కల్లు దుకాణంకాడ పట్టుకున్నాము. అతడక్కడ నిలుచుండి పిఠాపురం వెళ్ళడానికి చామర్లకోట పడవమీద కేవు యెంత పుచ్చుకుంటారని అడుగుతూవున్నాడు (నవ్వుచు) అతడు నిజంగాయేదో తక్కువ కులంవాడుగా కనపడుతూవున్నాడు గాని వేషం వల్ల గొప్పవాడుగా యెంత మాత్రమూ కనబడడంలేదు. ఆయనవద్ద బట్టలమూటాగొడుగూతప్పమరియే మీ వస్తువులులేవు..."11

దీనినిబట్టి పాత్రోచిత భాషనుకూడ పంతులుగారు ప్రవేశపెట్టినారని తెలుస్తున్నది. ఇంగ్లీషు ప్రహసనంలో సేవకుని భాష శిధిలబంధము. తెలుగున అట్టిదికాన రాదు. ఈ విధముగా పంతులుగారు ఆంగ్లేయ ప్రహసనముల ననువదించినారు. పంతులుగారి ప్రహసనములలో అసభ్యశృంగారమున్నదని గురజాడ అప్పరావుగారు విమర్శించినారు. కొన్ని సన్నివేశములలో హాస్యము అసభ్యముగ నున్నమాట సత్యమే. అయినను పంతులుగారు సాహిత్యమును సంఘ సంస్కరణాయుధముగా గ్రహించి యుండుటవలన వారి ప్రహసనములందలి పాత్రలు ఆ కాలమునందలి సజీవవ్యక్తులే యగుట, ఇట్టిది యనివార్యమైనది

'ప్రభుత్వోద్యోగి యొకడు లంచము పుచ్చుకొనినను, పెద్ద మనుష్యుడొకడు వేశ్యనాదరించినను, ఆ సంగతి యీ వారపు వివేకవర్ధని వెక్కిరింపవలసినదే'. యని రాయసం వేంకట శివుడుగారు తమ ఆత్మ చరిత్రమునవ్రాసిరి

కనుకనే పంతులుగారి ప్రహసనములను నేటి దృష్టితోచూచినచో వాని యందు కటు వ్యంగ్యము, అశ్లీలములు, అసభ్యములు ననిపించు సన్నివేశములు, జుగుప్సావహ మనిపించు హాస్యధోరణియు నెడనెడ సాక్షాత్కరించుచుండును. పంతులుగారు ప్రహసన ప్రక్రియను తెలుగు సాహిత్యమునందు సృష్టించినవారు. వారి ప్రహసనము లన్నియు ప్రాథమికదశకు చెందినవి. పంతులుగారి ప్రయోజనమువేరు వారి సాహిత్యపు విలువలువేరు. వారి దృష్టివేరు అందువలన కావ్య సౌందర్యమాయన రచన లందు ప్రధానముగాదు. ఇట్లనుటవారి ప్రహసనరచనా వైదగ్ధ్యమునకు న్యూనతా పాదకముకాదు. పంతులుగారి ప్రహసనములను, నాటకములను గూర్చివ్రాయుచు, "కొన్ని భాగములు మాత్రము కేవలము ప్రాకృతజనుల కాహ్లాదము బుట్టించెడు రీతిని వ్రాయబడినట్లుగాన్పించునని శ్రీ టేకుమళ్ళ అచ్యుతరావుగారు వ్రాసియున్నారు.[12] వీరేశలింగం పంతులుగారి తర్వాత నీ ప్రక్రియను చిలకమర్తివారు సుసంపన్నము గావించినారు.

పంతులుగారి ప్రహసనములు నాడు రాజమహేంద్రవరమునందు సంఘజీవన మున నమితమగు సంచలనమును కలిగించినవి. పంతులుగారి కెందరో విరోధులైరి. న్యాయ సభలయందు అభియోగములు నడిచినవి. కొందరి ఉద్యోగములుపోయినవి. కొందరి పరువు ప్రతిష్ఠలు పదటగలసినవి. పంతులుగారి పేరన్న దురాచారులకు సింహ స్వప్నమైనది. పంతులుగారి ప్రహసనములకు సమాధానముగా వారి ప్రతి పక్షులు పంతులుగారినే పాత్రమునుగాజేసికూడ కొన్ని ప్రహసనములు రచించిరి. ఇట్టి వారిలో కొక్కొండ వెంకటరత్నం పంతులవారు, కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు ముఖ్యులు. పంతులుగారికి సాహిత్యమున ప్రహసన కర్తగానసముచితమైన స్థానమున్నది.

నాటకములు : వీరేశలింగం పంతులుగారు నాటకరచనమునకు బూనుకొను నప్పటికి తెలుగున నాటకరచనము బహుళ ప్రచారము నందియుండలేదు. ఆధునిక కాలమున విలసిల్లిన ప్రక్రియ లన్నియు, ఆంగ్ల సాహిత్య ప్రభావమున వెలసినవే యైనను నాటకరచనమాత్ర మట్టిది కాదనిపించును. ధార్వాడ నాటకసమాజమువారి ప్రదర్శనములను చూచిన తరువాత తెలుగుదేశమునందు తెలుగునాటకములు ప్రదర్శింపవలయునన్న యభినివేశమే తెలుగున నాటకరచనా ప్రాచుర్యమునకు దోహద కారియైనది. ధార్వాడనాటక సమాజమువారు ఆంధ్రదేశమున తమ ప్రదర్శన లీయక

పూర్వమే నాటకములను రచించు ప్రయత్నము తెలుగునాట కొంతకొనసాగినను, నాటకముల ముఖ్యప్రయోజనమగు ప్రదర్శనము నానాటకములు పొందకపోవుటచే వానికి చారిత్రక ప్రశస్తిమాత్రమే నిలిచినది అట్లని, తెలుగు సాహిత్యమునందు నాటక రచనా విషయమై ఆంగ్లసాహిత్య ప్రభావమేమియు లేదనరాదు. నవ్య రీతుల పెక్కింటిని సంతరించుకొనిన నాటకరచనము బహుళప్రచారమునందుటకును, వస్తువైవిధ్యము, ప్రదర్శన సౌలభ్యము, నూతన ప్రయోగ సంధాన కౌశలము మొదలగున వన్నియు, ఆంగ్లేయసాహిత్య ప్రభావమువలననే తెలుగునాటకరచనము నందు విలసిల్లెనని చెప్పుట సత్యదూరముకాదు.

తెలుగుసాహితీపరులు పూర్ణనాటకముల గాంచినదాక నాటకరచనమునకు బూనరైరనియు, పూర్ణనవలలను జూచినదాక నవలారచనములకు బూనుకొనరైరనియు వేదంవేంకటరాయశాస్త్రిగా రభిప్రాయపడుట చూడగా ఆధునికకాలమునందలి నాటకవికాసమునకు ఆంగ్లేయ సాహిత్యప్రభావమే మూలకందమని వారు విశ్వసించి నట్లు తోచుచున్నది. ఏది యేమైనను తెలుగు సాహిత్యమునందలి ప్రక్రియా వైవిధ్య మాధునిక కాలముతో ముడివడి యున్నది. ఇట్టి ఆధునికకాలమునందు యుగప్రవర్త కుడు వీరేశలింగం పంతులు.

వీరేశలింగం పంతులుగారు 1875 వ సంవత్సరముననే నాటకరచనమునకు బూనుకొనిరి. 1894 వ సంవత్సరమున చివరి నాటకమును రచించిరి. అనగా నించుమించుగా పంతులుగారు పాతికసంవత్సరముల కాలవ్యవధిలో తమనాటకము లన్నిటిని ప్రకటించిరని చెప్పవచ్చును

పంతులుగారు తమ నాటకరచనమును ఆంగ్లరూపకానువాదముతో ప్రారంభించుట గమనార్హము ఈ విషయము పంతులుగారిపై గల ఆంగ్లసాహిత్యప్రభావ మును స్పష్టము చేయుచున్నది. 1875 వ సంవత్సరమున అభిజ్ఞాన శాకుంతలాను వాదముతో తమ ఆంధ్రరూపక రచన కారంభము చేసినారు పంతులుగారని కొందరు పరిశోధక విమర్శకులు తలంచుచున్నారు కాని అది సరికాదు[18]. అభిజ్ఞానశాకుంత లము నాంధ్రీకరించుటకు పూర్వమే షేక్స్పియర్ మహాకవి విరచితమగు 'ది కామెడి ఆఫ్ ఎర్రర్స్' అను నాటకము నదే పేరున, అవే దేశకాలపాత్రములతో యథాతథ ముగా ద్విపదకావ్యముగా సంతరింప పూనుకొని యున్నారు కని ఏకారణముననో

దాని నాసాంతము నిర్వహింపలేదు. రెండంకములపై కొంతభాగము ననువదించి విడిచిపెట్టిరి తదుపరి మహాకవి కాళిదాసుని యభిజ్ఞానశాకుంతలము నాంధ్రీకరించుటకు పూనుకొని రెండంకములు మాత్రమే యనువదించి యప్పటికి నిలిపి వేసిరి. తదుపరి 'వినీసు వర్తక చరిత్రమును' రచించుట కారంభించి దానిని గూడ రెండంకములు మాత్రమే యనువదించి విడిచిపెట్టిరి. ఇది 'మర్చెంట్ ఆఫ్ వెనీస్' నాటకమున కనువాదము దీనినిగూడ ద్విపదగానే ప్రారంభించిరి గాని, పూర్తిగా అనువదింపలేదు.

పంతులుగారి నాటకరచనా కృషియందు ప్రథమదశలో అన్ని నాటకములును అసంపూర్ణములుగా నిలిపివేయుట గమనార్హము అందును రెండంకములు మాత్రమే రచించుట విచిత్రము ఒక్క శాకుంతలానువాదమును ప్రప్రథమమున రెండంకములతో నిలిపివేయుటకు కారణము లున్నను, ఆంగ్ల రూపకానువాదములను మధ్యలో నిలిపివేయుటకు కారణమవగతము కాదు. కాని అ యీ కారణముల నిట్లూహింపవచ్చును. పంతులుగారు నాటకరచనమునకు బూనుకొనిన రోజులలో వారనుసరింపవలసిన మార్గమునుగూర్చి వారికి నిశ్చితమైన యభిప్రాయములేదు శాకుంతలానువాదము దీని కపవాదము. దీనిని మధ్యలోనే నిలిపివేయుటకు వేరుకారణములున్నవి. ఆంగ్లరూపకానువాదముల విషయమున అట్టి కారణములులేవు పంతులుగారు ఆంగ్లరూపకానువాదము ప్రారంభించునాటికి ఒక్క వావిలాల వాసుదేవశాస్త్రిగారు మాత్రమే ఆంగ్లరూపకము ననువదించి యుండిరి కాని ఆ మార్గము పంతులుగారి కనుసరణీయముగా తోచలేదు. అయినను చూతమని 'ది కామెడి ఆఫ్ ఎర్రర్స్' అను నాటకము ననువదించుటకు పూని, వాసుదేవశాస్త్రిగారి మార్గము ననుసరించిరి కాని పంతులుగారికా మార్గము రుచించినట్లు కన్పట్టదు[15] అందువల్ల ఆంగ్లరూపకానువాదమును వదిలిపెట్టి సంస్కృత రూపకానువాదమును చేపట్టిరి. ఇంతలో మహామహోపాధ్యాయ శ్రీమాన్ పరవస్తు వేంకటరంగాచార్యులవారు శాకుంతలమును తెనిగించుచున్నారని తెలిసికొనిరి. అంతట ఆ అనువాదమును చూచి తమ యనువాదము కొనసాగింపవచ్చునని, అప్పటికి నిలిపివేసిరి ఈ విధముగా నాటకరచనా ప్రథమదశయందు పంతులుగారి నాటకము లన్నియు అసంపూర్ణములుగానే నిలిచిపోయినవి. మరల 1880 వ సంవత్సరమున 'ది మర్చెంట్ ఆఫ్ వెనీస్' నాటకమును 'వినీసు వర్తక చరిత్రము' పేరిట ద్విపదయందు రచించుట కింకొకసారి ప్రయత్నముచేసిరి.

అప్పటికి గురజాడ శ్రీరామమూర్తి పంతులుగారి యదే నాటకానువాదమైన 'వెనీసు వణిజనాటకము' లేక 'సుహృత్సుభాషితము' వెలువడెను. ఈ నాటకమును శ్రీరామ మూర్తిపంతులుగారు గద్యపద్యాత్మకముగా రచించిరి వీరేశలింగం పంతులుగారికీ మార్గముకూడ ఉపాదేయము కాలేదు అందువలన ఇంకొకసారి ప్రయత్నించి చూత మని ప్రథమాంగ్లరూపకాంధ్రీకర్తలైన వాసుదేవశాస్త్రిగారి మార్గమునే యనుసరించి 'వినీసు వర్తక చరిత్రము'ను ద్విపదయందు రచించుటకు పూనుకొనిరి. వారి మార్గముననే మూలమునందలి దేశకాలపాత్రముల విషయమై గూడ పంతులుగా రెట్టి మార్పులను జేయలేదు ఈ ప్రయత్నముతో పంతులుగారికాయనువాద విధానము నెడ నొక నిశ్చయమైన యభిప్రాయము కలిగియుండును. అంతటితో వారామార్గమును విడిచి పెట్టుటయేకాక, మరెప్పుడును, అట్టి ప్రయత్నమునకు పూనుకొనలేదు. కనుక 1875 నుండి 1880 వ సంవత్సరము వరకు నాటకరచనా పద్ధతుల నన్వేషించుచు, ప్రయోగములు జరుపుచుండిరని మాత్రమే తెలియనగును 1880 వ సంవత్సరమునుండి వారి మార్గమును వారేర్పరచుకొని నాటకరచనను కొనసాగించిరి ఆ సంవత్సరమున శ్రీ హర్షదేవకృతమగు రత్నావళిని పద్యగద్యాత్మకముగను, షేక్స్పియర్ మహాకవి 'ది కామెడి ఆఫ్ ఎర్రర్స్' నాటకమును గద్యాత్మకముగను తెనిగించి ప్రకటించిరి 1879 వ సంవత్సరమున పంతులుగారు 'స్త్రీ పునర్వివాహ సభానాటక'మను పేరున నొక నాటకమును, పద్యాత్మకమైన దానిని తమ వివేకవర్ధని యందొక యంకమును మాత్రమే ప్రచురించియున్నారు ఇది కూడ పంతులుగారి అసంపూర్ణ నాటకములలో నొకటి దీనిని పద్యాత్మకముగా రచించుటనుబట్టి చూడగా పంతులుగారు నాటికింకను ప్రయోగదశను దాటిపోనట్లు స్పష్టపడుచున్నది. తదుపరి వారి వివేకదీపికయను నాటకము కూడ ఇట్టిదే ఈ నాటకమునందు కూడ వారు మూడంకములు మాత్రమే రచించిరి ఇది గద్యాత్మకమగు నాటకము దీనిని 1880 లో ప్రారంభించినను పంతులుగారి నాటక రచనా ప్రయోగదశకు చెందినదే యీ నాటకము కూడ 1880 వ సంవత్సరమున చమత్కార రత్నావళి, రత్నావళి యను నాటకములను పూర్తిచేసి, ధార్వాడ నాటక సమాజమువారు నాటకములాడి విడిచిపోయిన పాకలో ప్రదర్శింపించుటతో, పంతులుగారికి నాటకరచనమున స్థిరమైన యభిప్రాయములు కుదిరినవని చెప్పవచ్చును. ఈ కాలమునకు తరువాత 1894 వ సంవత్సరమువరకును పంతులుగారు పూనిన నాటకములను సంపూర్ణముగా రచించి

నారు. 1880వ సంవత్సరమునకు పూర్వమారంభించిన నాటకములన్నియు, ఒక్క శాకుంతలానువాదముతప్ప, యసమగ్రములుగానే యుండిపోయినవి తరువాత రచించిన నాటకములన్నియు సంపూర్ణములుగా నున్నవి.

పంతులుగారు మొట్టమొదట సంపూర్ణముగా నిర్వహించిన సంస్కృత రూపకానువాదము రత్నావళి ఆంగ్లరూపకానువాదము చమత్కారరత్నావళి. ఇవి రెండును 1880 లోనే వెలువడినవి తదుపరి 1881వ సంవత్సరమున శాకుంతలానువాదమును పూర్తిచేసిరి. ఇది 1883వ సంవత్సరమున పుస్తకరూపము నొందినది పంతులుగారు పౌరాణికేతివృత్తములు గ్రహించి వ్రాసిన మొదటి రూపకము దక్షిణ గోగ్రహణము. ఇది 1885 లో వెలువడినది చివరిది సత్యహరిశ్చంద్ర. ఇది 1886లో వెలువడినది సంస్కృతాను వాదములలో చివరిది ప్రబోధ చంద్రోదయము. ఇది 1885న వెలువడినది

పంతులుగారు మొత్తము పండ్రెండు నాటకములను సంపూర్ణముగా వ్రాసియున్నారు ఇవికాక మహారణ్యపురాధిపత్యము, తిర్యగ్విద్వన్మహాసభ, మూషికాసుర విజయములను ప్రహసనములనుకూడ నాటక సంపుటముననే చేర్చినారు. ఇవి ప్రదర్శనానుకూలములుగావు బ్రాహ్మవివాహము, వ్యవహారధర్మబోధిని, కూడ ప్రహసన ప్రాయములేయైనను వీనియందు అంకవిభజనము, రంగవిభజనము, మొదలగు నాటకలక్షణములున్నవి కావున వీనిని నాటకములుగా గ్రహింపవచ్చును. వీనిలో వ్యవహార ధర్మబోధిని ప్రదర్శనమునుగూడ గాంచినది. ఇవికాక 'ది కామెడి ఆఫ్ ఎర్రర్స్', శ్రీ పునర్వివాహ సభానాటకము, వినీసు వర్తక చరిత్రము, వివేకదీపికలను నవి నాలుగును పంతులుగారి యసంపూర్ణ నాటకములు కనుక పంతులుగారి మొత్తము నాటకములు (సంపూర్ణములు, అసంపూర్ణములు) పందొమ్మిది యని చెప్పవచ్చును.

పంతులుగారు నాటకములను రచించిన కాలక్రమ మీ విధముగా నున్నది. 1. ది కామెడిఆఫ్ ఎర్రర్స్-1875 మే, జూన్, 2. అభిజ్ఞాన శాకుంతలము-1875 డిసెంబరు, 3 బ్రాహ్మవివాహము-1876 జూలై, 4 వ్యవహారధర్మబోధిని-1878, 5. శ్రీ పునర్వివాహసభా నాటకము-1879, 6. చమత్కారరత్నావళి-1880-81, 7. రత్నావళి-1880-81, 8. వినీసు వర్తక చరిత్రము-1880, 9. వివేక దీపిక 1880, 10 శాకుంతలము-1881, 83, 11. మాళవికాగ్ని

మిత్రము-1885, 12. ప్రబోధ చంద్రోదయము- 1885, 1891, 13. రాగ మంజరి-1885, 14. దక్షిణ గోగ్రహణము-1885, 15. ప్రహ్లాద-1885, 16. సత్యహరిశ్చంద్ర-1886, 17. తిర్యగ్విద్వన్మహాసభ-1889, 18 మూష కాసుర విజయము-1889, 19. మహారణ్య పురాధిపత్యము-1889, 20. కళ్యాణ కల్పవల్లి-1894

వస్తువునుబట్టి పంతులుగారి నాటకము లీ క్రిందివిధముగా వింగడింప వచ్చును

ఆంగ్లరూపకానువాదములు : 1. ది కామెడి ఆఫ్ ఎర్రర్స్ 2. వినీసు వర్తక చరిత్రము 4. చమత్కార రత్నావళి 4. రాగమంజరి 5. కళ్యాణ కల్పవల్లి

సంస్కృత రూపకానువాదములు : 1 అభిజ్ఞాన శాకుంతలము, 2. రత్నావళి 3. ప్రబోధ చంద్రోదయము, 4. మాళవికాగ్ని మిత్రము

స్వతంత్ర పౌరాణిక నాటకములు : 1 దక్షిణగోగ్రహణము 2 ప్రహ్లాద 3. సత్యహరిశ్చంద్ర

స్వతంత్ర సాంఘిక రూపకములు 1. బ్రాహ్మవివాహము, 2 వ్యవహార ధర్మబోధిని, 3 మహారణ్యపురాధి పత్యము, 4. తిర్యగ్విద్వన్మహాసభ 5 మూషి కాసురవిజయము, 5 స్త్రీ పునర్వివాహ సభానాటకము, 6 వివేకదీపిక.

పంతులుగారి రూపకము లన్నియు కాలక్రమానుసారిగా సమీక్షింపబడు చున్నవి అటుతరువాత పంతులుగారి నాటకములందలి యనువాదపద్ధతులు, వస్తు సంవిధాన దృష్టి, మొదలగునవి పరిశీలింపబడును

## 1. ది కామిడి ఆఫ్ ఎర్రర్స్

పంతులుగారీనాటకమును 1875 వ సంవత్సరమున ప్రారంభించి, కొంత భాగమును వివేకవర్ధనియందు ప్రచురించిరి ఈ యనువాదము రెండు సంచికలందు మాత్రమే ప్రచురింపబడినది. ఈ యనువాదమును పంతులుగారు ద్విపదయందు రచించిరి. ఇందలి విశేషము పంతులుగారు గ్రంథనామమైన మార్చకుండుట, దేశ కాల పాత్రములను మార్చక యధాతధముగ ననువదించుటకు పూనుకొన్నారు పంతులుగారు. ఆంగ్లనాటకము నందువలెనే యీ నాటక ప్రారంభమునను "ఈ నాట

కమునందు వచ్చు మనుష్యులు" అను శీర్షికక్రింద పంతులుగారు పాత్ర పరిచయము గావించినారు.

"సోలినస్-ఎపినసుపట్టణపు ప్రభువు, ఏజియన్-సరకాజియా వర్తకుడు, సరకాజియా ఆంటిపోలస్, ఎపినసుఆంటిఫోలస్-వీరిరువురును కవలలు. అన్నదమ్ములు ఏ జి యన్ కొమాళ్ళు, సరకాజియా డ్రోమియో, ఎపినసుడ్రోమియో-వీరిరువురును కవలవాండ్రే, అన్నదమ్ములు, పయికవలవారి సేవకులు" ఇత్యాదిగా పాత్రధారుల పరిచయము గావింపబడినది[15] ఈ యనువాదము సంపూర్ణముగా పంతులుగారు నిర్వహింపలేదు. అనువదించినంతవరకు మూలానుసారిగా యున్నది వావిలాల వాసుదేవశాస్త్రిగారొక్కరు మాత్రమే అప్పటికి అంగ్లరూపకము ననువదించిరి. దానిని వారు మంజరీ ద్విపదయందు నిర్వహించిరి వారిననుసరించి పంతులుగారుకూడ ద్విపదలోనే ప్రారంభించిరేమో! జూలియస్సీజరు నాటకమును సీజరుచరిత్రమను పేరున 1874వ సంవత్సరముననే రచించి 1876వ సంవత్సరమున వాసుదేవశాస్త్రిగారు పుస్తకరూపమున ప్రకటించిరి. ఆంగ్ల రూపకాంధ్రీకరణము నందు 'సీజరుచరిత్ర' ది ప్రథమస్థానము. పంతులుగారికి శాస్త్రిగారి మార్గము రుచింపకనేమో తమ యనువాదమును పూర్తిచేయలేదు శాస్త్రిగారుకూడ తమ సీజరుచరిత్రము సాహితీపరుల నాకర్షించి యుండలేదని, తమ యుత్తరరామ చరిత్ర పీఠికయందు తెలిపియున్నారు

అనువాద మీవిధముగా నున్నది

Act 1, Scene 1, A Hall in the Dukes Palace - Enter Duke, Aegeon, Gaoler, officers aud other attendants

Aege-Proceed, Solinus, to procure my fall
And by the doom of death end woes and all

Duke - Merchant of syracuse, plead no more
Iam not Partial to infringe our laws.

దీనిని పంతులుగారిట్లనువదించిరి.

ప్రథమాంకము ౧. ప్రదేశము - ప్రభుమందిరము నందలి చావడి.

ప్రభువు, వర్తకుడు, కారాగృహాధిపతి, ఉద్యోగస్థులు, ఇతర సేవకులు ప్రవేశించిన మీాదట.

ఏజియన్ — నరపాల! యరుదెమ్మనను శిక్షసేయ
మరణ దండనమున మాను నా వెతలు
ప్రభు — వర్తక మరి యేమి పలుకకు మింక
నార్తులకొలకుంగా నకట! మాలంక
ధర్మశాస్త్రంబుల తగ వేదగాను ...[16]

ఈ విధముగా ద్విపదయందనువదించుటవలన మూలముకన్న గ్రంథము పెరిగినది. యతిప్రాసలకొరకుగా గ్రంథము పెరుగుట తప్పని సరియైనది. దీనినే పంతులుగారు గద్యాత్మకముగా తెనిగించినప్పుడీ వైపుల్యములేదు. గద్యాత్మకముగా ననువదించునప్పుడు పంతులుగారు మూలకథలోని దేశకాల పాత్రములను మార్చివేసి నారు. వివేకవర్ధనిలో యథామాతృకముగా నీ నాటకమును ద్విపదలో ప్రచురించు కాలముననే 'జాన్‌గిల్పిన్' అను పేరుగల కౌపర్ కావ్యమును తెనిగించుట గమనార్హము.

## 2. అభిజ్ఞానశాకుంతలము :

పంతులుగారు శాకుంతలానువాదమును 1875వ సంవత్సరమున ప్రారంభించి తమ వివేకవర్ధని యందా సంవత్సరము డిసెంబరు నెలలో కొంత భాగమును ప్రచురించిరి. ఆ సందర్భముగా కలకత్తా బొంబాయి మొదలైన ప్రదేశములనుండి యనేక ప్రతులను సంపాదించినట్లు తమ స్వీయ చరిత్రమునందు వ్రాసిరి. ఈ విధముగా బహుప్రతుల నాధారముచేసికొని రెండంకములు తెనుగుచేసి ప్రకటించునప్పటికి విశాఖ పట్టణమున శ్రీమాన్ ... వేంకటరంగాచార్లయ్యవారు శాకుంతలము నాంధ్రీకరించి రనియు, అది ఆ పట్టణమునుండి వెలువడుచున్న సకలవిద్యాభివర్ధని యను పత్రికలో ప్రకటింపబడుచున్నదనియు పంతులుగారికి తెలిసి, యా పత్రికను తెప్పించుకొనివదివి, యా యనువాదమును పూర్తిగా పరిశీలించిన తరువాత తమ యనువాదమును పూర్తిచేయవచ్చునని నిలిపియుంచిరట[17].

అప్పటికి నిలిపియుంచిన యనువాదమును పంతులుగారు మరల 1881వ సంవత్సరమున కొనసాగించి, వివేకవర్ధని కనుబంధముగా నా కాలమున వెలువడు

చుండిన చింతామణియను పత్రికయందు ప్రకటించిరి అప్పుడీ పత్రికయందు శాకుంతలానువాదమును పూర్తిచేసిరి 1883వ సంవత్సరమున పుస్తకరూపమున ప్రచురించిరి. మొట్టమొదట యందలి రెండంకములు రచించి ప్రకటించుచున్న కాలమున, నందలి శైలి కొంత కఠిన పాకమునబడినదనితలచి, తరువాత రచించిన ఐదంకములును సులభ శైలియందు వ్రాసియున్నామని పంతులుగారు మొదటి కూర్పు పీఠికలో వ్రాసియున్నారు పంతులుగారి సంస్కృతానువాదములలో నీ శాకుంతలానువాదము మొదటిది. పంతులుగారికి పూర్వము సంస్కృతరూపకానువాదము లెక్కుడుగా వెలువడలేదు. ఒండు రెండున్నను నవి ప్రకటింపబడలేదు కనుకనే పంతులుగారు ఆచార్లవారి యనువాదమును పరిశీలించి తమ యనువాదమును బూర్తిచేయవలెనని, ఆ యనువాదమును తెప్పించుకొని పరిశీలించిరి అభిజ్ఞాన శాకుంతలము ననువదించుటయందు పంతులుగారు మిక్కిలి శ్రమించిరి అంతటిరమణీయమైన నాటకమును రసవంతముగా తెనిగించుట తనవంటి యప్రౌఢునకు గానిపనియని యెరిగియు, కాళిదాసుని శాకుంతలమునందలి యభిమానమువల్ల, తాము అనువాదమునకు బూనితిమని పంతులుగారు వినయముగా బలికియున్నారు. పంతులుగారి యనువాదము 1886వ సంవత్సరమున ద్వితీయ ముద్రణమందినది. 1896లో మూడవ ముద్రణము పొందినది. 1958వ సంవత్సరమునాటికి ఎనిమిది ముద్రణములు పొందినది. సంస్కృత రూపకానువాదమునకు శాకుంతలముతోనే ప్రారంభించినను, పూర్ణముగా ననువదించి ప్రకటించిన సంస్కృతరూపకానువాదము శ్రీహర్షుని రత్నావళి దీనిని 1880వ సంవత్సరముననే పంతులుగారు పూర్తిచేసిరి 1881లో శాకుంతలము పూర్తియైనది

పంతులుగారు తమ శాకుంతలానువాదమును గూర్చి ఇట్లువ్రాసిరి.

"నాభాషాంతరము గూఢపదములను, ప్రౌఢాన్వయములును లేనిదయి పామరులును గ్రహించునట్లుగా తేటతెల్లమయియుండును". ఈ వాక్యములనుబట్టి సంస్కృతరూపకానువాదములందు పంతులుగారి యాశయములెట్టివో గ్రహింపవచ్చును.

పంతులుగారి యనువాదము భావప్రధానమైనది. ఆయాభావములను తెచ్చుటకే పంతులుగారు తమ యనువాదమునందు శ్రద్ధవహించిరి కాని, యర్థగతమైన,

శబ్దగతమైన సారస్యములను, చమత్కారములను తెచ్చుటకు పూనుకొనలేదు. అందు వలన పంతులుగారి యనువాదమునందు కాళిదాస మహాకవి చూపిన యందచందములు రాలేదని కొందరు విమర్శింతురు పంతులుగారి లక్ష్యమట్టిదికాదు. తమ యనువాదము నితరుల యనువాదముతో బోల్చి పరిశీలించుచు 'తక్కినవారి భాషాంతరములు కఠిన పదభూయిష్ఠములై ప్రౌఢతరాన్వయ విశిష్టములై పండితజన గ్రాహ్యములు'గా నుండు నన్న యభిప్రాయమును వెలిబుచ్చిరి. కనుక పంతులుగారి ప్రయోజనము నుపేక్షించి, వారిని విమర్శించుట ప్రయోజనకారికాదు సంస్కృత రూపకముల ననువదించుట యందు నిర్దిష్టమార్గ మొకదానిని పండితులు నిర్దేశించినట్లు కనపడదు. 'ఆధుని కాంధ్రవాఙ్మయ వికాసవైఖరి' యను గ్రంథమున శ్రీజయంతి రామయ్య పంతులు గారు సంస్కృత రూపకానువాదములనుగూర్చి ప్రస్తావించిరి. మూలకృతిని శబ్దముల నుండియు యథాతథముగ ననువదించుట యొక మార్గమనియు, తెలుగు భాషా సంప్రదాయానుసారముగా ననువదించుట వేరొక మార్గమనియు వారు తెలిపి యున్నారు. మొదటి మార్గమునకు శ్రీ వేదం వేంకట్రాయశాస్త్రిగారును, రెండవ మార్గమునకు శ్రీవీరేశలింగం పంతులుగారును, ఉపదేష్టలని విమర్శకులు తలంచు చున్నారు[18] ఇంచుమించుగా అభిజ్ఞాన శాకుంతలానువాదములు ముప్పదికి మించియే తెలుగున వెలసినవి. ఈ యనువాదము లన్నింటను పంతులుగారి యనువాదమే మిక్కిలి ప్రశస్తిగాంచినది. పంతులుగారి తరువాత రాయదుర్గం నరసయ్య శాస్త్రి గారును, వేదం వేంకట్రాయశాస్త్రిగారును, దాసు శ్రీరాములు కవిగారును, వడ్డాది సుబ్బారాయుడుగారును, శాకుంతలము నాంధ్రీకరించిరి. పంతులుగారికి పూర్వమే పరవస్తువారు తెనిగించిరి. ఈ యనువాదములు పంతులుగారి సమకాలికులవి. ఈ యనువాదముల నన్నిటినిపోల్చి తక్కినవి పండిత గ్రాహ్యములనియు, తమ యను వాదము పండితపామర సులభ గ్రాహ్యమనియు పంతులుగారు స్వీయచరిత్రమునందు వ్రాసిరి.

"నా కంటె నెక్కుడు సామర్థ్యముగల వారనేకు లీవఱలో నీ యభిజ్ఞాన శాకుంతలమును వేలువేలుగా, దెనిగించి ప్రకటించియున్నారు. కాని వానియందు సందిగ్ధ స్థలముల భావవివరణాదులు లేనందుచేత, మూలమందలి చమత్కారము లనేకములు గ్రహించి యానందించు భాగ్యము పెక్కండ్రకు దుర్లభమగుచున్నందు వలన గొందఱు మిత్రులు ప్రోత్సాహపరుపగా బూర్వోక్తరీతిని లఘుటీకాసమేతముగా

దీనిని ముద్రింపించి ప్రకటించితిని" అని శ్రీవడ్డాది సుబ్బారాయ కవిగారు 1906వ సంవత్సరమున ప్రకటించిన తమ యనువాదమును గూర్చి వ్రాసియున్నారు.

పంతులుగారి యనువాదము సరళసుందరము.

ఈ యనువాదమున శాకుంతలాంగ్లానువాదముల సాయమునుగూడ తాము బడసి యుంటిమని పంతులుగారు వ్రాసినారు[19]

"గ్రీవాభంగాభిరామంముహురనుపతతి స్యందనేబద్ధ దృష్టిః
పశ్చార్ధేన ప్రవిష్టశ్శరపతన భియాభూయ సా పూర్వకాయం
దర్భైరర్ధావ లీఢై శ్శ్రమవివృత ముఖ భ్రంశిభిః కీర్ణవర్త్మాన్
పశ్యోదగ్రప్లుతత్వాద్వియతి బహుతరం స్తోకముర్వ్యాం ప్రయాతి"

ఈ శ్లోకమును రంగాచార్యులవారిట్లనువదించిరి

"పలుమారున్ వడివచ్చు తేరుపయిఁ గ్రీవంద్రిప్పి యీక్షింపుచున్
బొలుపారన్ శరపాతభీశ్రితతనూ పూర్వార్ధమై సుశ్రమ
స్ఖలదాస్యాపత దర్ధజగ్ధకుశ సంక్రాంతాధ్వమై యుత్ప్లుతా
కలనంగొంచెము భూమినెక్కుడు దివిఁగాఁబర్వెడుం గంటివే"

ఈ యనువాదమునందు మూలమునందలి శబ్దచమత్కృతి గూడ తీసికొని రాబడినది. పంతులుగారి యనువాదమిట్టిదికాదు పంతులుగారీ శ్లోకము నిట్లనువదించిరి.

"వడిఁబరతెంచు తేరిదెస బల్మరు మాత్మెడ వెట్టి చూచుచుం
గడు శరపాత భీతిదన కాయము ముందుకు గుంచి యెంతయుం,
బడలికనోటినిందెఱచి మార్గమునిండ సగంబు తిన్నద
ర్భలు పడమింట బాఱెడు ధరంబదమూనక పెద్ద దాటులన్"

ఇట్లే శాకుంతలమునందలి యొక శ్లోకమునకు పంతులుగారి యనువాదమును, ప్రఖ్యాత పండితుల యనువాదములను క్రింది విధముగా చూడవచ్చును.

"పాతుంన ప్రథమం వ్యవస్యతి జలం యుష్మాస్వపీతేషుయా
నాదత్తేప్రియమండనాపి భవతాంస్నేహేనయా పల్లవమ్
అద్యేవఃకుసుమ ప్రసూతి సమయే యస్యాభవత్యుత్సవ
స్సేయంయాతి శకుంతలా పతి గృహంసర్వైరను జ్ఞాయతాం"

"ఎవతెజలంబు మీకిడక యెన్నడు త్రాగదు తానుముందుగా
నెవరితె ప్రేమచేఁజిదుమ దీప్సిత భూషణయయ్యు మీచిగు
ళ్ళెవతెకు మీరు తొల్తనన లెత్తుట పండువుగాగ నుండునా
ప్రవిమలగాత్రియేగఁబతి పజ్జకు నంద రనుజ్ఞ యీయరే"

(వీరేశలింగకవి)

"తొలుతంద్రావగ నెవ్వత పూనదుతోయము మీరలు గొనకున్నం
జెలిమింబ్రియ మండనయయ్యును మీచివురుల నెవత గ్రహింపదు మీ
తొలునన కాలునిజోత్సవముగ సంతోసిలు నెవ్వతయట్టి శకుం
తల ప్రాణేశ్వరుపాలికి జనుగాన న్వీడ్కొలుపరె మీరెల్లన్"

(రాయదుర్గం నరసయ్యశాస్త్రి)

"త్రాగదెవర్తె డస్సినదె త్రావకయుండ జలంబు మీకుమున్
దాగయిసేతకే నెవతె దాకద కూరిమి మీ ప్రవాళమున్
సాగును బండు వెవ్వతెకు జయ్యన మీ తొలుపూవు సూతిచే
నేగెడు నా శకుంతల యిదే మగనింటికి వీడుకొల్పరే"

(వేదం వేంకటరాయశాస్త్రి)

"మొనయదు మీరు ద్రాగుటకు ముందర నీళులుద్రావ గ్గైకొనం
దునుమదు మీననన్ నెనరుతో నగలాస నటారి యైన దా
నొనరుచు నబ్బపబ్బముగ నోపిక మీ తొలుపూతకాఁడిదే
చను మగనింటికిన్ సెలవొసంగుడు మీరు శకుంతలమ్మకున్"

(దాసు శ్రీరాములుకవి)

"పోయక మీకు నీరెవతె పూనదొముందుగ ద్రావ, దేనికౌ
నో యెద యుష్మదాద్య కుసుమోదయవేళను బందువేదితా
గోయదొ మీ యిగుర్నగను గోరియు గూరిమి, భర్తయింటికిన్
బోయెడు నాశకుంతల, యనుంగున కందఅనుజ్ఞ యీయరే"

(వడ్డాది సుబ్బారాయుడు)

ఏది యెట్లున్నను వీరేశలింగం పంతులుగారి శాకుంతలాంధ్రానువాదము
ంధ్రదేశమున పలుచోట్ల ప్రదర్శింపబడి మన్ననలందినది ఆంధ్రదేశమున నేనాటక
మాజము వారైనను శాకుంతలమును ప్రదర్శింపవలెనని తలచిన, వీరేశలింగం
ంతులుగారియనువాదమునే ప్రదర్శించుట, దాని ప్రాశస్త్యమును వెల్లడించుచున్నది.

శ్రీ కాశీభట్ట బ్రహ్మయ్య శాస్త్రిగారు పంతులుగారి ప్రతిపక్షకోటి నాయకులు.
.స 1881 వ సంవత్సర ప్రాంతముల కాకినాడయందు 'ఆర్య బృందానంద
ాయిని' యను నాటక సమాజమును స్థాపించి, తత్పక్షమున శ్రీ వీరేశలింగం
ంతులుగారి శాకుంతలానువాదమును ప్రజారంజకముగ ప్రదర్శించు చుండిరని
హ్మయ్యశాస్త్రిగారి జీవిత చరిత్రకారులు వ్రాసియున్నారు[20]

పంతులుగారు శాకుంతలము ననువదించిన తదుపరి భవభూతి యుత్తరరామ
రిత్రమును గూడ అనువదించవలెనని తలంచినట్లును, ఆ నాటకమును తమ మిత్రు
న శ్రీ వావిలాల వాసుదేవశాస్త్రిగారు తామనువదింతుమని చెప్పుట వలన తాము
ానినట్లును పంతులుగారు వ్రాసియున్నారు పంతులుగారు తమ శాకుంతలానువాద
ున సంస్కృతమున నీచపాత్రలకు ప్రాకృతము నుపయోగించి నసందర్భములందు
ూడ సరళ గ్రాంథికమునే యుపయోగించిరి కొక్కొండ వేంకటరత్నం పంతులు
ారివలెను, పరవస్తు వేంకటరంగాచార్యులవారి వలెను, మూలమున ప్రాకృత
ున్నచోట అనువాదమున నచ్చతెనుగు నుపయోగింపలేదు. తరువాత రూపకరచన
ున ప్రసిద్ధి వహించిన వేంకటరాయశాస్త్రిగారివలె, మూలమున ప్రాకృతమున్న
ట్టల, పాత్రోచిత భాషయని వ్యావహారికభాష నుపయోగింపలేదు. నాటకానువాద
ంతయును సరళగ్రాంథికముననే నిర్వహించిరి పంతులుగారు శాకుంతలానువాదము
ందు ప్రథమ ముద్రణమునకును, మూడవ ముద్రణమునకును మధ్యకాలమున
ందఱు సాహితీపరుల సూచనల ననుసరించి, కొన్ని మార్పులు చేసియున్నారు.

ఈ విషయమును మూడవకూర్పు పీఠికయందు వ్రాసినారు. తమ శాకుంతలానువాదమును గూర్చిన విమర్శలకు పంతులుగారు 1901 వ సంవత్సరమున జనవరి, ఫిబ్రవరి, మార్చి సంచికల అముద్రిత గ్రంథచింతామణి పత్రికయందు, సమాధానము వ్రాసియున్నారు.

## 3. బ్రాహ్మవివాహము ;

ఇది ఏడంకముల నాటకము దీనిని హాస్య సంజీవని ప్రథమసంచికయందు ప్రారంభించినామని పంతులుగారు స్వీయచరిత్రమునందు వ్రాసిరి. హాస్యసంజీవని ప్రథమ సంచిక 1876 వ సంవత్సరము జూలై నెల 16 వ తేదిన వెలువడెనని వారే స్వీయచరిత్రమునందు వ్రాసిరి వీరేశలింగకవి చరిత్రమును రచించిన తోలేటి వెంకటసుబ్బారావుగారు కూడ పంతులుగారు రాజశేఖర చరిత్రమును రచించుచుండిన కాలమున, నీ బ్రాహ్మవివాహమును రచించిరని వ్రాసియున్నారు రాజశేఖరచరిత్రము 1878 వ సంవత్సరమున వివెకవర్ధనిలో భాగభాగములుగా వెలువడినది హాస్యసంజీవని వివేకవర్ధని కనుబంధముగా ప్రప్రథమమున మాసపత్రికగా ప్రారంభింపబడినను, తదుపరి త్రైమాస పత్రికగా వెలువడి, అటు తరువాత వివేకవర్ధని లోనే యంతర్భాగమై పోవుట వలనను, ఇది ఏడంకముల రూపకముగుట వలనను 1876 వ సంవత్సరమున హాస్యసంజీవనియందు ప్రారంభింపబడి, 1878 వ సంసత్సరము వరకు వెలువడి యుండును. దీని తరువాత వ్యవహారధర్మబోధిని, హాస్యసంజీవనియందు ప్రారంభింపబడినది. కనుక వ్యవహారధర్మబోధిని 1879వ సంవత్సర ప్రాంతమున ప్రారంభింపబడి 1880 వ సంవత్సరమున ముగింపబడి యుండునని యూహింపవచ్చును ధార్వాడ నాటకసమాజమువారు ఆంధ్రదేశమునందు ప్రదర్శనము లిచ్చుటకు పూర్వమే వ్యవహార ధర్మబోధిని విజయనగరము మహారాజా గారి బాలికాపాఠశాలయందు ప్రదర్శింపబడినది. కనుక 1880వ సంవత్సరము నాటికది హాస్యసంజీవనియందు ముగిసి యుండును దీనినిబట్టి పంతులుగారు ఇంచుమించుగా ఆంగ్లరూపకానువాదమును, సంస్కృతానువాదమును, స్వతంత్రరూపక రచనమును, ఒకేసారి ప్రారంభించినను, స్వతంత్ర రూపకమునే మొట్టమొదట పూర్తిగావించిరని తెలియుచున్నది. స్వతంత్ర రూపకరచనమునకు పంతులుగారు 1876 వ సంవత్సరమున పూనుకొనగా అంతకు పూర్వమే అనగా 1875 వ

సంవత్సరముననే ఆంగ్లరూపకానువాదమునకును సంస్కృత రూపకానువాదమునకును బూనుకొనిరి.

బ్రాహ్మవివాహము నాడు జనులను మిక్కిలి ప్రభావితులనుచేసెను నాటికి తెలుగున సంభాషణరూపముననున్న గ్రంథములు జనులకు తెలియకపోవుటవలన బ్రాహ్మ వివాహము వారిని మిక్కిలి యాకర్షించెను. ఇది వెలువడిన కొన్ని దినముల వరకును ప్రజలు గుంపులు గుంపులుగాచేరి, వీధి యరుగులమీద సమావేశమై, ఈ నాటకమునొకరు చదువుచుండగా వినుచు, పకపక నవ్వుచుండెడివారట ప్రజలానాడు దీనిని పెద్దయ్యగారి పెండ్లి పుస్తకమని వ్యవహరించుచుండిరి.

సంభాషణరూపమున నుండుటతప్ప దీనియందు నాటక లక్షణములులేవని విమర్శకులు తలంచుచున్నారు. లేకున్న తెలుగు సాహిత్యమునందు వెలసిన సాంఘిక రూపకములలో ప్రాథమ్యము మీ బ్రాహ్మ వివాహమునకే దక్కియుండెడిది. సాంఘిక రూపక నిర్మితియందు బ్రాహ్మ వివాహమున కుచితమైన స్థానమేయున్నది శ్రీవావి లాల వాసుదేవశాస్త్రిగారి నందక రాజ్య పతనమునందు గూడ సంపూర్ణముగా నాటక లక్షణములులేవు. అంక విభజనము, రంగ విభజనము మాత్రమున్నది ఈ మాత్రము బ్రాహ్మ వివాహమునందుగూడనున్నది. కనుక తెలుగు సాహిత్యమునందలి తొలి సాంఘికరూపకము బ్రాహ్మ వివాహమనియే చెప్పవచ్చును. బ్రాహ్మ వివాహమున సంఘమునందు ప్రచురముగానుండిన దురాచారములు నిశితముగా విమర్శింపబడినవి. దీని యందు హాస్యము ప్రాధాన్యము వహించుటవలన దీనికి ప్రహసన లక్షణములు పట్టినవి. కొన్నియెడల హాస్యము కటువుగను, అసభ్యముగను, పంతులుగారి హాస్యరచనా విదగ్ధతకు తార్కాణముగానునున్నది.

ఈ నాటకమునందు అతి బాల్య వివాహము, వృద్ధ వివాహము, కన్యాశుల్కము, మొదలగు సాంఘిక దురాచారములు, అధిక్షేపింపబడినవి. పెద్దయ్యగారను మూడు కాళ్ళముదుసలి, చిన్నమ్మయను పసిపిల్లను వివాహమాడుట, ఆ వివాహమువలన సంభ వించిన యనర్థములు,చిన్నమ్మ జీవితము దుఃఖభాజనమగుట, విధవావివాహ నిషేధము వలనకలుగు దారుణములు, వర్ణింపబడినవి. ఈరూపకమునందు ప్రధానవిషయము కన్యా శుల్క నిరసనము. సందర్భానుసారముగా వృద్ధ వివాహములు, భోగముమేళములు, సంఘములో తగు మనుష్యులమనిపించుకొను వారి హేయవర్తనము, వంట బ్రాహ్మ

ణులు, శవవాహకులు, శుభాశుభకర్మములందు ప్రవర్తించు నీచమైన పద్ధతులు, పెండ్లి వేడుకలయందలి మోటుసరసములు, ఊరేగింపులవేళ, అప్పగింతలవేళ, సంభావనలు పట్టువేళ ఒసగులు సమర్పించు సమయమున నాటి జనుల మౌఢ్యము, దురాచారములు, డంబములు, హేయవర్తనములు, అన్నియు అవహేళనముచేయబడి తీవ్ర విమర్శనమునకు గురిఅయినవి. పాపపంకమును ప్రక్షాళనముచేయుటకు పూను కొనిన మహా యోద్ధ కావున పంతులుగారీ రూపకమున నాటి జనులలోని దురాచార ములను దారుణముగా విమర్శించిచూపినారు నేటి దృష్టికి అసభ్యములనిపించు సన్ని వేశములు కూడ ఈ నాటకమునందెడనెడకలవు. పంతులుగారిట్టి రూపకమును రచించుట వలన ప్రయోజనమును గుర్తించి తరువాత ప్రహసనరచనమునకు గడంగిరని చెప్ప వచ్చును సాహిత్యమును సాంఘిక ప్రయోజనమునకై యుపయోగించుట వారికి తెలిసినది

"ఇట్టి నాటకప్రదర్శన మూలమున జనులకు వినోదముకలుగుటయేకాక యక్ర మములుచేయువారు సిగ్గుపడి తమ ప్రవర్తనమును దిద్దుకొనుటయు గలుగునన్న" విశ్వాసము పంతులుగారికి కలుగుటకీ బ్రాహ్మ వివాహము, వ్యవహారధర్మ బోధి నులు తోడ్పడినవి. బ్రాహ్మ వివాహమునందు నాటక లక్షణములు కదరకపోయినను, కావ్య శిల్పము కొఱవడినను, నాటి కాలమున ఇది యొక నూతన ప్రయోగమనియే చెప్పవలెను.

"బ్రాహ్మవివాహము ఆ కాలములో జరుగుచుండిన పెళ్ళిళ్ళను గూర్చిన కావ్యదూషణ. ముసలివాని పెళ్ళికి ఆడంగిసబబులు, పూర్వ శ్లోకములకు పెడర్థములు, ముసలి సబబులు, జోతిష్యముచూచుట, నిశాలగ్నము, సానిమేళము, సభాతాంబూలపు గొడవలు, అపాత్రదానము, భోజనవేళ అలుగుటలు, టెక్కులు, రాత్రివేళ ఊరేగింపు చిక్కులు, అప్పగింతలవేళ ఏడ్పులు, ముసలి పెళ్ళివల్ల కొందరికి కలిగెడు దురూ హాలు, కొందరకు పట్టెడిదుర్గతి, మొదలైన విషయములు ఇందు చూపింపబడినవి" అని శ్రీభమిడిపాటి కామేశ్వరరావుగారు వ్రాసినారు.

బ్రాహ్మవివాహమునందొక విశేషాంశమున్నది. ఇందలిపాత్రలన్నియు సమ కాలిక వ్యక్తుల నుద్దేశించినవే. సప్తమాంకమునందు పంతులుగారు స్వీయ చరిత్రము నందు వర్ణించిన పోలూరి శ్రీరాములుగారి యుదంతము ప్రసక్తమైనది. ఈ పోలూరి

శ్రీరాములుగారు, రాజమహేంద్రవరమునకు డిస్ట్రిక్టు మున్సిపుగావచ్చి, ప్రాడ్వివాక న్యాయస్థానమునందు ప్రభుత్వ న్యాయవాదిగాపనిచేయుచుండిన చిత్రపుకామరాజుగారను తమ బంధువు సాహాయ్యమున, వాది ప్రతివాదుల పక్షములనుండి లంచములను గ్రహించుచుండెడి వారు. వీరిదువురనుగూర్చి పంతులుగారు వివేకవర్ధని యందు వ్రాసిరి. తరువాత విచారణ జరిగి, శ్రీరాములుగారు ఆత్మహత్యచేసుకొనిరి. ఈ బ్రాహ్మవివాహమున సప్తమాంకమున శ్రీరాములుగారి ప్రసక్తి కలదు. శ్రీరాములు గారు 1878వ సంవత్సరమున రాజమహేంద్రవరమునకు ప్రాడ్వివాకులుగావచ్చిరి. కనుక బ్రాహ్మవివాహమునందలి సప్తమాంకము 1878 ప్రాంతముల రచింపబడి యుండవలెను. శ్రీరాములుగారు బలవన్మరణము పొందుటను పంతులుగారును విచారించిరి ఆయన బలవన్మరణముపాలైన తదుపరి యీ ప్రసహనము రచింపబడి యున్నచో పంతులుగారాన్యాయాధిపతిని గూర్చి పరిహసించియుండరు చిత్రపు కామ రాజు, శ్రీరాములగార్లపై వచ్చిన యభియోగములు ఒకటి రెండు సంవత్సరములు విచారింపబడెననుకొన్నను, బ్రాహ్మవివాహము 1878వ సంవత్సరమున ముగింప బడి యుండెనని చెప్పవచ్చును

## 4. వ్యవహార ధర్మబోధిని .

హాస్య సంజీవనియందు బ్రాహ్మవివాహము ముగియుటతోడనే వ్యవహార ధర్మబోధిని ప్రారంభింపబడెను ఇందు ఐదంకములును, ప్రదేశము అనుపేర రంగ ములునుకలవు బ్రాహ్మవివాహమువలెనే, ఇదికూడ నాంమికదురాచార నిరసనార్ధమే రచింపబడినది ఇందలి పాత్రములన్నియు నాటి సంఘమున, హేయవర్తనము కలిగి తగుమనుష్యులమనిపించుకొనుచున్న పెద్దలనుగూర్చినట్టివేయని చెప్పనొప్పును దీనిని ప్రజలు నాడు మిక్కిలి యభిమానించిరి ప్లీడరునాటకమని వ్యవహరించుచు దీనిని చదివి యానందించుచుండిరి దీనియందు సంభాషణలు వ్యావహారికము నందుండుట గమనార్హము. వ్యావహారిక భాషా ప్రయోజనమును పంతులుగారా కాల మునకే గ్రహించిరి సరళ సుందరమగు వచనశైలియందు, ప్రజలకు చేరువైన భాషలో రచించుటవలన, పామరులను సైతము వ్యవహారధర్మబోధిని యాకర్షించినది. ప్రదర్శన భాగ్యమునొందిన తెలుగురూపకములలో ఇది మొదటిది. తరువాతనే ధార్వాడ నాటక సమాజమువారువచ్చి యాంధ్రదేశమున హిందూస్థానీరూపకములను

ప్రదర్శించిరి నాటి రాజమహేంద్రవర ప్రజలు ప్లీడరు నాటకమును వీధియరుగులపైచేరి చదువుకొనుచు పగులబడి నవ్వుకొనెడివారుట. ఈ నాటకమునందు న్యాయవాదుల అక్రమ వర్తనలు, పోలీసు డిపార్టుమెంటువారు కూట సాక్ష్యముల సృష్టించి చేయు దురన్యాయములు, ప్రభుత్వోద్యోగుల లంచగొండితనము, వేశ్యాలోలత్వము, కపటవేషములు, మొదలగునవి వివరముగా వర్ణింపబడినవి నాటి సంఘమునందు ఏ దురన్యాయముగాని, యే దురాచారముగాని, పంతులుగారి దృష్టిపథమునుండి తప్పించుకొని పోలేదనుటకీ వ్యవహారధర్మబోధిని గొప్ప నిదర్శనము

ప్రథమాంకమున రాజమహేంద్రవరమున నాడు ఆక్టింగ్ మున్సిపుగా పని చేయుచున్న ఆత్మూరి లక్ష్మీ నరసింహంగారి ప్రసక్తికలదు. వీరు వైష్ణవమత ప్రవిష్టులగుట ప్రసక్తమైనది. చిత్రపు కామరాజుగారి యుదంతముకూడ ద్వితీయాంకమునందొకచో ప్రసక్తమైనది. కనుక వ్యవహారధర్మబోధిని నాడు ప్రభుత్వోద్యోగులలోని యవినీతి వర్తనమును విమర్శించు పరిహాసరచనయని చెప్పవచ్చును.

అమాయకులైన గ్రామస్థులను, ప్రభుత్వోద్యోగులును, పోలీసువారును, ఏ విధముగా పీడింతురో హృదయవిదారకముగా నిందభివర్ణితము. ఇందు హాస్యమున్నను, భయానక బీభత్సములతో కూడిన కరుణమును గలదు పంతులుగారికిగల నానావిషయ పరిజ్ఞానము, ప్రజాజీవితముతో వారికి గల సన్నిహితమైన సంబంధము, అమాయకుల, పీడితుల, వంచితులయెడ, వారి సమస్యలయెడ, పంతులుగారికి గల సానుభూతి, యీ వ్యవహార ధర్మబోధిని వలన గ్రహింపవచ్చును. తెలుగు నాటకములందు తొట్టతొలుతగా ప్రదర్శనమును బొందిన ప్రశస్తి యట్లుండగా, సాంఘికేతివృత్తములుగల తెలుగు రూపకములందీ వ్యవహారధర్మ బోధినికి విశిష్టమైన స్థానమున్నది. నేటికిని వ్యవహార ధర్మబోధినియందు గల నిశితమైన సంఘ దురాచార నిరసనము, సాంఘిక విమర్శ, మరియే ఇతర రూపకమునందును లేదు దీనిని సాంఘిక దురాచార పరశువు అని చెప్ప నొప్పును.

## 5. స్త్రీ పునర్వివాహ సభానాటకము .

ఇది అసంపూర్ణము. దీని నాసాంతము పద్యనాటకముగా జేయవలెనని పంతులుగారు సంకల్పించినట్లున్నది. 1879 వ సంవత్సరము ఆగస్టునెల వివేకవర్ధని

యందీనాటకము ప్రారంభింప బడినది ప్రధమాంకమును మాత్రమే ముగించి దీని నసంపూర్ణముగా పంతులుగారు విడిచిపెట్టిరి స్వీయచరిత్రము నందీరచనను గూర్చిన ప్రసక్తిలేదు. శ్రీ తోలేటి వెంకటసుబ్బారావుగారు రచించిన వీరేశలింగకవి చరిత్రమునందు, ఈ నాటకమును గూర్చిన కొన్నివివరములును, ఇందలి కొన్ని పద్యములును ఉదాహరింప బడినవి.[21]

ఈ ప్రధమాంకమునందు చిన్నతనముననే భర్తృ విహీనలైన కాంతల దయ నీయమైన స్థితి మిక్కిలి జాలిపుట్టునట్లు వర్ణింపబడినది స్త్రీ పునర్వివాహావశ్యకత నీనాటకము నొక్కిచెప్పుచున్నది. ఆసియాఖండమునందలి పదునారు దేశములందునను, నీ హిందూదేశముననే స్త్రీ పునర్వివాహము లేదనియు, అట్లులేకపోవుటవలన ననే కానర్ధములు వాటిల్లుచున్నవనియు, స్త్రీ పునర్వివాహము శాస్త్రసమ్మతమనియు, విజ్ఞులు పూనుకొని మగువల దుస్థితి బాపవలెననియు పంతులుగారీ నాటకమున ప్రబోధించినారు.

రాజశేఖర చరిత్రమును రచించునాటికే పంతులుగారు స్త్రీల దురవస్థనుగూర్చి పరితపించుచుండిరి, 1879 వ సంవత్సరమున స్త్రీ పునర్వివాహ సభానాటకము వెలువడునాటికి పంతులుగారికి స్త్రీల దురవస్థ నివారింపవలెననుకోరిక మరియు బల పడినది ఈ పద్య నాటకమున వివిధ ఛందములున్నవి

## 6. చమత్కార రత్నావళి :

ఈ నాటకమును పంతులుగారు 1880వ సంవత్సరమున రచించిరి ఇది షేక్స్పియర్ విరచిత 'ది కామెడి ఆఫ్ ఎర్రర్స్' నాటకమునకు గద్యాత్మకమైన యనువాదము ధార్వాడ నాటక సమాజమువారు నాటకము లాడిపోయిన పాకలో ప్రదర్శింపబడినది ఆంగ్లరూప కాంద్రీకరణములలో తొట్టతొలుతగా ప్రదర్శనమును బొందినదీ నాటకమనియే చెప్పవలెను. వ్యవహారధర్మబోధిని, నాటకముకాదుకనుక ఆంధ్రదేశమున ప్రపథమమున ప్రదర్శనభాగ్యమును పొందిన తెలుగు నాటకము కూడనిదియేయని చెప్పనొప్పును. ఆంధ్రదేశమునందు నెలకొలుపబడిన తొలినాటక సమాజము ప్రదర్శించిన నాటకమిది యగుట గమనార్హమైన విశేషము ఈ నాటకము చాల రంగస్థలములందు చాలమార్లు ప్రదర్శింపబడినది[22].

ఈ నాటకమును రచించుటలో పంతులుగారు తత్పూర్వాంగ్లరూప కాంధ్రీకర్త లెవ్వరును త్రొక్కని క్రొత్తదోవ త్రొక్కిరి. అందువలన తెలుగు నాటకరచనా దశయందు చమత్కార రత్నావళికి విశిష్ట స్థానమున్నది. నాటికీనాటక రచనమొక నూతన ప్రయోగము. పంతులుగారీనాటకము ననువదించుటకు పూర్వము ఆంగ్లరూపకముల నాంధ్రీకరించిన వావిలాల వాసుదేవ శాస్త్రిగారుకాని, గురజాడ శ్రీరామమూర్తి పంతులుగారుకాని, ఆంగ్లరూపకములలోని దేశకాల పాత్రములను మార్చలేదు. వాసుదేవ శాస్త్రిగారు యథాతథముగ ననువదించినారు. శ్రీరామమూర్తి పంతులుగారు దేశకాల పాత్రములను మార్చకపోయినను, దేశీయ సంప్రదాయములకు విరుద్ధములుగానున్న కొన్ని యుపమానములను, కొన్ని సన్నివేశములను, దేశీయ సంప్రదాయానుకూలముగా మార్చినారు. వాసుదేవశాస్త్రిగారు నాటకము నంతను ఒకే ఛందమున రచించిరి. శ్రీరామమూర్తి పంతులుగారు గద్యపద్యాత్మకముగా ననువదించిరి. వాసుదేవశాస్త్రిగారికన్న, శ్రీరామమూర్తిగారు కొంత స్వేచ్ఛను వహింపగా, వీరికన్నను వీరేశలింగంపంతులుగారు మరికొంత స్వేచ్ఛనువహించి, గద్యాత్మకముగా జేయుటయేకాక, దేశకాల పాత్రములను కూడ భారతీయాచారముల కనుగుణముగా మార్చినారు. ఇందువలన పంతులుగారి నాటకరచన చరిత్రమునందు చమత్కార రత్నావళి రచనాకాలము ప్రధానఘట్టమని చెప్పవలెను. ఈ అనువాదమునందు పంతులుగారు చేసిన మార్పులు తరువాత కాలమున ఆదరణమును పొందినవి. ఆంగ్ల నాటకము నందలి పాత్రావరణమును పంతులుగారిట్లు మార్చిరి

"Solinus-Duke of Ephesus

ధర్మపాలుడు-చోళమండలపురాజు

Aegeon-A merchant of syracuse

వర్ధమానుడు-పాండ్యదేశమునందలి మధురాపురిపు వర్తకుడు

Antipholus of Ephesus } Twin Brothers, Sons of
Antipholus of Syracuse } Aegeon

పెద్దవసంతకుడు - వర్ధమానునకును చారుమతికిని గలిగిన కవలబిడ్డలలో నొకడు

చిన్నవసంతకుడు-పైవారి కవలబిడ్డలలో నింకొకడు

Dromio of Ephesus } Twin Brothers, attendants on
Dromio of Syracuse } the two Antipholuses

పెద్దలక్ష్మణుడు- పెద్దవసంతకుని సేవకుడు, చిన్నలక్ష్మణుని సోదరుడు
చిన్నలక్ష్మణుడు- చిన్నవసంతకుని సేవకుడు, పెద్దలక్ష్మణుని సోదరుడు
Aemilia- Wife of Aegeon, an Abbes at Ephesus
చారుమతి- వర్ధమానుని భార్య, వసంతకుల తల్లి"

"ఆచార వ్యవహారములును బేరులును దేశములును మనవారికి వింతగా గన బడును గాన కేవలము మూలార్థానుసారముగా భాషాంతరీకరింపబడిన పాశ్చాత్య గ్రంథములు మనవారికంతగా రుచింపకపోవచ్చు" ననియు "నాటక కథలను నేను తెలిగించునప్పుడు మునుపున్న పేరులకు మాఱుగా మనదేశపు పేరులు పెట్టి అందున్న దేశములను మన భరతఖండములోని దేశములనుగా మార్చి, కథలో మన యాచార వ్యవహారములకు బ్రతికూలముగానున్న భాగముల ననుకూలముగా నుండునట్లుచేసి, సాధ్యమైనంతవరకు మనవారికింపుగా నుండునట్లుచేసితిమి" అనియు పంతులుగారు స్వీయ చరిత్రమునందు వివరించియున్నారు

షేక్స్పియర్ యీ నాటకమును గద్యపద్యాత్మకముగా రచించెను పంతులుగారు గద్యాత్మకముగా రచించిరి ఇంకను తెలుగువారికి కథాప్రారంభము, సులభముగా తెలియుటకొరకు మూలమునలేని ఒక సన్నివేశమును సైతము కూర్చియున్నారు. మూలమున నాటకము హఠాత్తుగ నారంభమగును. అట్టి ప్రారంభము తెలుగువారికి రుచించదని పంతులుగారు ప్రారంభసన్నివేశమును విపులార్థకముగా పెంచినారు మూలమున ప్రభువు, విదేశీయ వర్తకుని విచారణచేయుటకు పూనుకొను సన్నివేశ ముతో నాటకము ప్రారంభమగును భద్రుడను సేవకుని, శ్వేతవాహనుడను కారా గృహాధికారిని పంతులుగారు తమ యనువాదమునందు క్రొత్తగా సృష్టించిరి. ఆ దేశపు కట్టడిననుసరించి, విదేశీయుడైన యావర్తకుని బంధించి, కారాగృహాధికారి మ్రోల ప్రత్యక్షపరతురు అంతట కారాగృహాధికారి, యా బంధితుని రాజు మ్రోలకుకొని వచ్చును రాజు విచారణను ప్రారంభించును మూలమున హఠాత్తుగారాజు, పర దేశస్థుడగు వర్తకుని విచారణచేయుచుండగా కథ ప్రారంభమగును పంతులుగారు దేశీయ సంప్రదాయములననుసరించి మూలమునందలి కొన్ని సన్నివేశములను మార్చి

యున్నారు ఈ నాటకమునే తొలుదొలుత ద్విపదయందు రచించుటకు పూనుకొని నప్పుడు పంతులుగారు మూల విధేయముగానే రచించిరి పంతులుగారు రచించిన ఇతర యనువాద నాటకములందును భారతీయ సంప్రదాయానుసారముగా కొన్ని మార్పులను చేసియున్నారు. మూలమును యథాతథముగ గద్యాత్మకముగా ననువ దించినను కొన్ని పట్టుల విపులపరచినారు మూలసన్నివేశములందలి భావమును మక్కికిమక్కిగా ననువదించిన, తెలుగువారి కర్థావబోధములుగా నుండవని పంతులు గారిట్లుచేసియుందురు. ఇంకను గద్యము వైశద్య ప్రధానముగా నుండును కనుక, మూలము గద్య పద్యాత్మకముగానుండి యనువాదము గద్యాత్మకముగా వెలయింప బడినందునను, ఈ విస్తృతి సంభవించియుండును.

ఈ నాటకమునందు, కవలపిల్లలను ఒకరిగా యొకరిని తలచి ప్రజలు సంభా షించుట, వారితో వ్యవహారములు పరిష్కరించుకొనుటకు ప్రయత్నించుట, మొదలగు సన్నివేశములవలన హాస్యరసోత్పాదనము జరుగును ఈ సోదరులిరువురకు కవలలే అయిన సేవకులు కుదురుటకూడ మరింత చమత్కార జనకమగును. ఈ నాటకము ఒక రకముగా భ్రాంతి తరంగిణియని చెప్పవచ్చును. ఒకరినిగాంచి, ఒకరనుకొను భ్రాంతితో, ఆయా వ్యక్తులకు సంబంధించినవారలు తబ్బిబ్బుపడుట చమత్కారముగా నుండును. చిట్టచివరకు వారుపడిన భ్రాంతులన్నియు తొలగిపోవును ఈ కథను పంతులుగారు భారతీయ సంప్రదాయముల కనుగుణముగా మలచుకొనుట యందు గొప్ప నేర్పు చూపిరి. సేవకుల సంభాషణములను, వారి యజమానుల సంభాషణము లను మిక్కిలి నేర్పుతో రచించిరి నగలుచేయు నాతనికి విశ్వకర్మయని పేరిడుట, పెద్ద లక్ష్మణుడు, తన భార్య సీతకు, విశ్వకర్మచే చంద్రహారమును చేయించుట, మఠమునందలి యోగిని యైన ప్రభావతి వర్తనము, సీత చెల్లెలైన సుభద్ర, చిన్న లక్ష్మణునియెడ తన వలపును వ్యక్తపరచుట మొదలగు సన్నివేశములందు సంభాష ణములు, తెలుగువారి యాచారవ్యవహారములకు, సంప్రదాయములకు దగ్గరగా నున్నవి. చమత్కార రత్నావళి ఆంగ్లరూపకానువాదములలో గద్యాత్మకముగా ననువ దింపబడిన తొలినాటకము.

## 7. వినీసు వర్తక చరిత్రము :

పంతులుగారీనాటకమును 1880 వ సంవత్సరమున ద్విపదలో రెండంకముల వరకు తెనిగించిరి. అసంపూర్ణ నాటకములలో నిదియొకటి. దీనిని పంతులుగారు

మూలవిధేయిగా రచించిరి. దేశకాల పాత్రములను మార్చలేదు. కాని ద్విపదలో రచించుటవలన మూలముకన్న యనువాదము కొంత వైపుల్యమును పొందినది ఈ సంవత్సరముననే గురజాడ శ్రీరామమూర్తిగారీ నాటకమును వెనీసు వణిజనాటకము లేక సుహృత్సుభాషితము అను పేర గద్య పద్యాత్మకముగా ననువదించుట గమనార్హము శ్రీరామమూర్తిగారు తమ యనువాదమునందు, దేశకాల పాత్రములను మార్చకపోయినను, భారతీయాలంకారిక సంప్రదాయముననుసరించి రచించిరి పంతులు గారీమార్గము ననుసరింపలేదు వావిలాల వాసుదేవశాస్త్రిగారి సీజరు చరిత్రము ననుసరించిరి. ఒకే ఛందమునందు వ్రాయుట, దేశకాల పాత్రాదులను మార్చకుండుట యీ మార్గము. అయినను అతి స్వల్పములగు మార్పులు పంతులుగారి యనువాదమునందు కాన్పించుచున్నవి ఇట్టివి అనివార్యములు. పంతులుగారి యనువాదము సరళముగా లేదు ద్విపదయందు వ్రాయుటవలన, యతిప్రాసలకొరకుగా వ్యర్థపదములనేకములు వచ్చిచేరినవి మూలమునందు రెండు మూడు పాదములలో ఇమిడిన భావమును పంతులుగా రేడెనిమిది వాక్యములను గూర్చియు, మూలమునందలిసారళ్యమును తేలేకపోయిరి. ఆంగ్లేయుల పురాణగాథల ప్రసక్తి వచ్చినచోట్ల, పంతులుగారు యథాతథముగా ననువదించుటవలన, ద్విపదయందు వ్రాయుటవలన, మూల విధేయమైన యనువాదమనిపించుకొన్నను, ఆ సన్నివేశములర్థావ బోధకములుగా నుండలేదు. గద్యమునందు రచించియున్నచో ఆ భావములను విశదముగా చెప్పుటకైన నవకాశముండెడిది. పంతులుగారి నాటకానువాదములలో నీ వినీసు వర్తక చరిత్రము ప్రసిద్ధిని బొందియుండలేదు. ఆసంపూర్ణమగుట కొంత కారణమై యుండవచ్చును. ప్రదర్శన సౌలభ్యము కొరవడుట మరికొంత కారణమై యుండవచ్చును. అనువాద విధానము తెలియుటకై కొంతభాగ ముదాహరింపబడుచున్నది.

Antonio- Mark you this Bassanio

The devil can cite the scripture, producing holy witness

Is like a villian with a smiling cheek

A goodly apple rotten at the heart

O, what a goodly out side falsehood hath.

ఆంటో - వినుమి యీ యసురుండు వేదంబునుండి
తన పనికిఁ బ్రమాణమును జూపగలడు
తన దురాచారంబు స్థాపించుకొఱకు
బనిగొనుచు బ్రమాణ వచనముల్ నుడువు
కష్టాత్ముఁడు నగు మొగంబును బూను
దుష్టుని కరణి, దొ్ౖర జూపులకు
బాగుగా నుండి లోపల గుళ్ళినట్టి
రేగుపలము యొక్క రీతిని నుండు
ఔరౌర ! పయికెంత యందంబుగాను
ధారుణి గాన్పించు దబ్బర యెపుడు

ఈ యనువాదమునందు a villain with a smiling cheek అను భావమును నగుమొగంబును బూను దుష్టుడని యనువదించుట, Producing holy witness యను భావమునకు వేదంబునుండి ప్రమాణమును జూపుటయని యనువదించుట, మూలమునందలి యర్ధమును తెచ్చుటలేదు. "Enter Gratiano and Salarino masqued" అను వాక్యములను పంతులుగారు "కృత్రిమ ముఖముల ధరించుకొని గ్రేషియానో, శాలారియో ప్రవేశించుచున్నారు" అని యనువదించినారు. జెస్సికా ప్రవేశించినప్పుడు మూలమున "what art thou come" అని యుండగా పంతులుగారు "అరుదెంచితివె నీవు హస్తింద్రయాన" యని యనువదించిరి. ఇట్లు సంబోధించుట యెబ్బెట్టుగా నుండక మానదు. ఈ సంబోధన మూలమునందు లేక పోయినను పంతులుగారు చేర్చినారు. పద్యమునందు వ్రాయుటవలన ఇట్టి విస్తృతి యనువాదమునకు కలిగియుండవచ్చును

8 రత్నావళి .

ఈ నాటకమును పంతులుగారు 1880వ సంవత్సరమున రచించి ధార్వాడ నాటకసమాజమువారు నాటకములాడి విడిచిపోయిన పాకలో ప్రదర్శించినట్లు తమ స్వీయచరిత్రమునందు వ్రాసిరి ఇందలి కథ ఉదయనమహారాజు సాగరికను పెండ్లి యాడుట ఉదయనుడు చారిత్రక ప్రసిద్ధినొందిన మహారాజు. ఈతని చరిత్రమును

సుబంధుడు వాసవదత్తయను కావ్యముగా రచించియున్నాడు భాసుడు స్వప్న వాసవదత్తమను నాటకమును గూర్చియున్నాడు. ఈ మహారాజు చరిత్రము పూర్వ కాలమున మిక్కిలి ప్రసిద్ధిపొందినట్లు కాళిదాసుని మేఘసందేశమువలన తెలియు చున్నది. కాశ్మీరదేశ ప్రభువైన శ్రీహర్షుడు రత్నావళియను పేరున నీ ఉదయన మహారాజు చరిత్రమును వర్ణించినాడు పంతులుగారు సంస్కృత రూపకానువాదమును అభిజ్ఞాన శాకుంతలముతో నారంభించినను, రత్నావళి ననువదించిన తరువాతనే శాకుంతలానువాదము పూర్తిచేసినారు. కనుక పంతులుగారు ప్రకటించిన సంస్కృతానువాద రూపకములలో రత్నావళి మొదటిది. పంతులుగారీ నాటకమునకు పీఠిక నొకదానిని కూర్చి యున్నారు. ఆ పీఠికయందు "ఇందు చెప్పబడిన సంగతులలో స్వభావవిరుద్ధమయిన దేదియులేదు. దీనివలన బూర్వకాలమునందు హిందూ సుంద రుల కెంత స్వాతంత్ర్యముండెడిదియో, వారెంత నాగరికురాండ్రుగాను, విద్యావతులు గానుండి భర్తలతోగూడ సభలకు సహితము వచ్చెడి యాచారము కలిగియుండెనో స్పష్టపడుచున్నది"యని వ్రాసిరి. పంతులుగారి సంస్కరణ ప్రియత్వము, స్త్రీవిద్యాభి మానము, ఈ వాక్యములవలన తెలియుచున్నవి. పంతులుగారికీ నాటకమునుగూర్చి యిట్టి యభిప్రాయము లుండుటనుబట్టియే వారీనాటకము ననువదించియుందురు. పంతులుగారి సమకాలికులలో వేదం వేంకటరాయశాస్త్రిగారును, దాసు శ్రీరాములు కవియు నీ రత్నావళి నాంధ్రీకరించిరి. తరువాత కాలమునందు గూడ రత్నావళికి మరి నాలుగనువాదములు పుట్టినవి. ఈ నాటకమును ప్రప్రథమమున వీరేశలింగంపంతులు గారే యనువదించిరి తొట్టతొలుత ప్రదర్శన భాగ్యమును పొందిన సంస్కృతాను వాదరూపకముకూడ నీ రత్నావళియే. పంతులుగారియనువాదము సరళముగానున్నది. మూలమునందువలెనే అనువాదముకూడ గద్యపద్యాత్మకము.

## 9. వివేకదీపిక

ఈ నాటకము స్వతంత్ర నాటకము. అసంపూర్ణము. 1880వ సంవత్స రమున మూడంకములు మాత్రము రచింపబడి ప్రకటింపబడినది. తదుపరి ముగింప బడలేదు ఇది సాంఘికరూపకము సంఘదురాచారముల నిరసించుట పంతులుగారి సాంఘిక రూపకముల సామాన్యలక్షణము. వివేకదీపిక విగతభర్తృకల దైన్యమును వర్ణించు నాటకము. చిన్నతనమునందే పతివిహీనలైన ముద్దరాండ్ర కష్టముల

నితివృత్తముగా స్వీకరించి, అట్టివారనుభవించెడి వేదనలు, నైచ్యము కన్నులకు కట్టినట్లు వర్ణింపబడినవి. సంఘమున వారివలన కలుగు అనర్థములు, స్త్రీ పునర్వివాహావశ్యకత యీ నాటకమునందు నిరూపితములు. ఈ నాటకము రెండవ యంకము నందును, మూడవ యంకమునందును, స్త్రీపునర్వివాహము శాస్త్రసమ్మతమా ? కాదా ? యనుచర్చ లున్నవికాని, కథ యేమియునులేదు.

ప్రథమాంకమున పసితనమునందే విగతభర్తృకలైనవారి దయనీయ జీవితము వర్ణింపబడుచు, నాటకప్రారంభము జరిగినది. సీతారామయ్య, సుభద్రమ్మలు భార్యాభర్తలు పోయినవారుపోగా వారికైదుగురు కొమార్తెలు ఇరువురు కుమారులునున్నారు. కొమార్తెలలో ముగ్గురు చిన్నతనమునందే భర్తృవిహీనలై పుట్టింట చేరిరి. తల్లిదండ్రుల, తండ్రీకొడుకుల, తల్లీకూతుండ్ర సంభాషణములందు, విగత భర్తృకల దుస్థితి వర్ణింపబడినది ఈ నాటకము ప్రదర్శనయోగ్యముకాదు. దీర్ఘములైన స్వగతములు విస్తారముగానున్నవి స్వగతములుకూడ స్త్రీపునర్వివాహావశ్యకోపన్యాసములేకాని, కథాగమన ప్రయోజనకారులుగావు. పంతులుగారి యభిప్రాయములన్నియు, ఇందు సంభాషణరూపమున, పాత్రలనోటివెంట చెప్పించిరేకాని, ఇందు నాటకీయత యెంతమాత్రమునులేదు. పాత్రలు తమస్థాయికి మించిన విషయముల నుపన్యసింతురు. పదమూడేళ్ళ శ్యామలాంబ స్త్రీ పునర్వివాహమునుగూర్చి, స్వగతములలో శాస్త్రవిషయములు ప్రసంగించుట యుచితముకాదు శ్యామలాంబ స్వగతములలోకూడ పంతులుగారు తమ యభిప్రాయములను చెప్పుట, వారి కీనాటకమునందు నాటకీయదృష్టి కొరవడినదని చెప్పుటకు నిదర్శనము ప్రథమాంకమునందు మూడు రంగము లున్నవి. ద్వితీయాంకమునందును మూడు రంగములుకలవు. తృతీయ రంగమున స్త్రీ పునర్వివాహమునుగూర్చి, పరనమందిరమున చర్చ ప్రారంభమైనది. ఉక్తిప్రత్యుక్తులతో తృతీయరంగము ముగిసినది తృతీయాంకమున ప్రథమ రంగమున స్త్రీ పునర్వివాహవిషయమై ప్రతిపక్షీయులు, విధాయక వాదులను జయించుటకై యాలోచన సేయుట వర్ణింపబడినది. ఇందు వీరరాఘవరావుగారను వారు స్త్రీ పునర్వివాహ విధాయకవాది. శ్రీరామ పండితుడు ప్రతిపక్షవాది. వీరరాఘవ రావుగారి ప్రసంగము ద్వితీయాంకములోని తృతీయరంగమున ఆరు పుటలలో చోటు చేసికొన్నది, కనుక ఇది ప్రదర్శన యోగ్యముకాదు తృతీయాంకమున ద్వితీయ రంగమున, స్త్రీ పునర్వివాహ విధాయకవాదులకును, ప్రతిపక్షవాదులకును, శాస్త్రచర్చలు

జరుగును. ఇంతటితో నాటకమసంపూర్ణముగా నిలిచిపోయినది. మూడంకములందును కలిసి మొత్తము 8 రంగము లున్నవి. వివేకదీపికయందు పంతులుగారు భయానకమైన వాతావరణమును వర్ణించిరి. వ్యభిచారము, భ్రూణహత్యలు, లేచిపోవుటలు. అశ్లీలములైన ప్రసంగములు, జుగుప్సావహములైన సన్నివేశములు, నిండి యీ నాటకమంతయు పాపపంకిలముగా నుండును. పంతులుగారు ప్రతిచిన్న సన్నివేశమును వాచ్యముచేసి, భరించలేని వాతావరణమును కనులముందు నిలిపినారు ఇతి వృత్తము నాటకీయ దృష్టితో చూచినప్పుడు మిక్కిలి బలహీనమైనదిగా తోచును. కనుకనే పంతులుగారు దీనినసమగ్రముగా విడిచిపెట్టియుందురు వారు చెప్పదలచిన భావము లీ మూడంకములలో చెప్పివేసినారు కథయందుకాని, పాత్రల శీలచిత్రణము నందుగాని వారికి దృష్టిలేదు, కేవలముపన్యాసముగా వ్రాయుటకన్న నాటకీయ వాతావరణమును కల్పించి సంఘసంస్కరణ ప్రయత్నమునకు సహాయముగా ప్రచార సాహిత్యమును సృష్టించుటయందు వివేకదీపికా రచన మొక ప్రయోగమని చెప్పవచ్చును విధవావివాహ ప్రతిపక్షులు, సంస్కరణపరులనుపెట్టిన కష్టనష్టములువర్ణించు సన్నివేశముల పంతులుగారి స్వీయానుభవములు కొన్ని వర్ణింపబడినవని తోచును.

## 10. మాళవికాగ్నిమిత్రము :

ఈ నాటకమును పంతులుగారు 1885వ సంవత్సరమున ప్రకటించి యున్నారు పీఠికయందు కథానాయకుడైన అగ్నిమిత్రునిగూర్చియు, ఆతని వంశము వారిని గూర్చియు, చారిత్రక విషయములు తెలుపబడినవి ఈ నాటకమును, మూడు వివిధదేశ ప్రతులాధారముగా పంతులుగా రనువదించిరి ఆంధ్రదేశపు ప్రతికిని వంగదేశపు ప్రతికిని విశేషభేదముండినట్లును, పంతులుగారు వంగదేశపు ప్రతినే యనుసరించుచు, కొన్ని స్థలములయందాంధ్రదేశప్రతిలోని పాఠములనుగూడ గ్రహించినట్లును వ్రాసియున్నారు. వంగదేశపు పండితులైన తారానాథ తర్కవాచస్పతుల ప్రతినాధారముగాచేసికొని యీ నాటకమును పంతులుగారనువదించినారు

మాళవికాగ్నిమిత్ర మైదంకముల నాటకము. కథ మిక్కిలి హృదయాహ్లాదకారి పదకారిన్యముగాని, యన్వయ కారిన్యముగాని కానరాని శైలియందీనాటకము ననువదించినారని శ్రీతోలేటి వెంకట సుబ్బారావుగారు, పంతులుగారి జీవితచరిత్రమునందు వ్రాసియున్నారు. పంతులుగారి యనువాద మీ విధముగానున్నది.

"పురాణమిత్యేవన సాధు సర్వం
న చాపికావ్యంనవమిత్య వద్యమ్
సంతః పరీక్షాన్యతరద్భజంతే
మూఢః పరప్రత్యయనేయ బుద్ధిః"

దీనిని పంతులుగారిట్లనువదించిరి.

"సర్వమును బ్రాతదని యెందు సాదుగాదు
క్రొత్తదనియె కావ్యమునకు గొఱతరాదు
యోగ్యులు గ్రహింతురారసి యుత్తమంబు
మూఢుడన్యులనేనమ్మ బుద్ధిలేక"
"బాష్పాసారా హేమ కాఞ్చీగుణేన
శ్రోణీ బింబాదప్యుపేక్షాచ్యుతేన
చండీ చండంహంతు మభ్యుద్యతామాం
విద్యుద్దామ్నా మేఘరాజీవవింధ్యమ్"
"కాను నుండి యుపేక్షతో గరముజాఱు
పసిడి మొలనూలితోడ బాష్పములు కాఱ
నుగ్రురాలయినను గొట్టనుద్యమించె
మొయిలు మెఱుముతో వింధ్యాద్రి మోదునట్లు".

ఈ విధముగా సులభశైలియందనువాదము సాగినది రత్నావళియందును నీ నాటకమునందును మూలమునందలి ప్రాకృత సంభాషణలను పంతులుగారు సరళ గ్రాంధికముననేయనువదించినారు.

ఈ నాటకమునందు పంతులుగారు, ద్వితీయాంకమున నొక కీర్తనను రచించి పాఠాంతరముగా చేర్చియున్నారు నాటకములందు కీర్తనలు రచించుట తరువాత తరువాత సుప్రసిద్ధము. ద్వితీయాంకమున సంగీతశాలయందు రాజుగారి సమక్షమున జరిగిన పోటీ పరీక్షయందు మాళవిక యొకగీతమును పాడి యభినయించి, ప్రభుని రంజింపజేయును. ఆ సందర్భమున పంతులుగారు మూలమునందలి శ్లోకమును పద్య

రూపమున ననువదించి, దానిని ఘంటారాగము-ఆదితాళము నందు కీర్తనగారచించి, పాఠాంతరముగా నిచ్చియున్నారు. నాటకప్రదర్శనములందు కీర్తనలు ప్రవేశించుచున్న కాలమిదియని పంతులుగారీ కీర్తనను రచించుటవలన తెలియనగును

## 11. ప్రబోధ చంద్రోదయము :

పంతులుగారీ నాటకమును 1885వ సంవత్సరమున వివేకవర్ధనియందు ప్రారంభించిరి కాని యా సంవత్సరమున ప్రథమాంకమును మాత్రమే యనువదించి యప్పటికి నిలిపివేసిరి. మరల 1891వ సంవత్సరమున చింతామణియందీ నాటకమును పూర్తిచేసి, యా సంవత్సరముననే పుస్తకరూపమున ముద్రించిరి ఇది యద్వైతమత సిద్ధాంతమును బ్రతిపాదించుటకయి రచింపబడిన వేదాంతనాటకము. ఇందు వివేకునకును మహామోహునకును పోరాటముజరిగి, కడకు వివేకునకు జయము కలిగినట్లు ఎర్ణింపబడినది. ఈ నాటకమునందలి కథ వేదాంత విషయమేయయినను కృష్ణ మిశ్రులు దీనిని హృదయరంజకముగను, సుబోధకముగనుజేసియున్నారు. ఇందు సుగుణదుర్గుణములు పురుషులుగాను స్త్రీలుగాను జెప్పబడి యా యాపక్షములయందు, వారివారి వర్తనములు చక్కగా వర్ణింపబడినవి. ఉపోద్ఘాతమున ఈ నాటకకర్తయైన కృష్ణమిశ్రుల కాలాదికములను, నాటకవస్తువునుగూర్చి పంతులుగారు వర్ణించియున్నారు దీనిని తొలుత నాటకముగా ననువదించినది పంతులుగారే. నందిమల్లయ్య, ఘంట సింగయ్యలనువారలీ ప్రబోధ చంద్రోదయమును పద్యకావ్యముగా ననువదించిరి. నాటకముగా పంతులుగారి తదుపరి వడ్డాది సుబ్బరాయుడుగారు (1893), ఆకొండి వ్యాసమూర్తి శాస్త్రులవారు (1911)ననువదించియున్నారు.

సంస్కృతమునందలి సంకల్ప సూర్యోదయము మొదలగు నాటకములిట్టివే. ప్రబోధ చంద్రోదయమారంకముల నాటకము. వివేకునకు మహామోహునకు యుద్ధము జరిగి యందు వివేకుడు జయించినట్లితివృత్తము కల్పింపబడినది. వస్తువిచారుడు, సంతోషుడు వివేకుని సేనానాయకులు. వివేకుడును, మహామోహుడును సోదరులే. వీరికి మనస్సు తండ్రి. క్షమ, వివేకుని సేనానాయకురాలు. మతి వివేకుని భార్య. శ్రద్ధ, శాంతి, కరుణ, మైత్రి, సంకల్పుడు, వైరాగ్యుడు, విద్య, విష్ణుభక్తి, మొదలైన పాత్రము లీనాటకమునందు కలవు. ఉపనిషద్దేవి వలన వివేకునకు ప్రబోధ చంద్రుడు పుట్టుటతో, నాటకము ముగియుచున్నది.

మహామోహుడు ప్రతినాయకుడు. కాముడు, క్రోధుడు, లోభుడు, మహామోహుని సేనానాయకులు. రతి కాముని భార్య. హింస క్రోధునిభార్య తృష్ణ లోభుని భార్య. లోభుని తండ్రి అహంకారుడు. లోభునికొడుకు దంభుడు. వీరందరును మహామోహుని పక్షమున పోరుదురు. నాస్తికత మహామోహుని పట్టపుదేవి. చార్వాకుడు, దిగంబరసిద్ధాంతుడు, బుద్ధాగముడు, సోమసిద్ధాంతుడు మొదలగువారలు మహామోహుని పరివారములోనివారు.

1898 వ సంవత్సరమున నీ ప్రబోధ చంద్రోదయము ద్వితీయ ముద్రణము నొందినది. పంతులుగారీ నాటకము నితివృత్తమున కనుగుణముగ నోజోభూయిష్ఠముగ ననువదించిరి పంతులుగారినాటకమును యథాతథముగానే యనువదించిరి గాని, సందర్భము వచ్చినచోట నించుకంత పరిసిద్ధాస్తిక మతధర్మములను ప్రవేశపెట్టుటలో వెనుకాడలేదు మూలగ్రంథమందలి సందర్భానుసారమగు శైలికి తగినట్లుగా అనువాదమును నిర్వహించినారు పంతులుగారు కాపాలిక మతస్థుడైన సోమసిద్ధాంతునకు, బౌద్ధుడైన బుద్ధాగమునకు, జైనుడైన దిగంబర సిద్ధాంతునకు, సిద్ధాంతచర్చ జరుగుచుండగా సోమసిద్ధాంతుని సంరంభమిట్లు వర్ణితమైనది ఆతడు కోపించి ప్రతిపక్షులను తెగనరికి దుర్గకు బలి ఇత్తుననును.

"ఈ నిశితోగ్ర ఖడ్గ వినికృత్త భవద్గళనాళికోచ్ఛలత్
పేనిలబుద్బుదౌఘయుత భీకరశోణిత భూరిధారలన్
నేనిదె తృప్తిచేసెద వినిశ్చలభక్తిని దుర్గకిప్డు క్రీ
డానినదోల్లసడ్డ మరుఢాంకరణాగత భూతవర్గకున్"

ఈ సందర్భమును వడ్డాది సుబ్బరాయ కవిగారిట్లనువదించిరి

"వేడిగ నుచ్ఛలద్బహుల పేనిల బుద్బుద రక్తమొల్కనా
వాడి కృపాణధారను, భవద్గళనాళము లీలదున్మితూ
టాడి, వడిం డమడ్డమరుడాంకృతి హూతపిశాచభూతముల్
నేడిటగూడ భర్గగృహిణీమణికిందగు విందుజేసెదన్"

చతుర్థాంకమున వివేకుని దిగ్విజయ సందర్భమున రథసారథి వేగమును నిరూపించుచు ఇట్లు పల్కెను. సందర్భమునకు దగినట్లు పంతులుగారీ పద్యము నోజోగుణప్రధానముగా రచించిరి.

"ప్రచురోద్ధూత రజచ్ఛటానుమిత శుంభద్యానధావత్ఖురా
గ్రచయేషత్పరి చుంబితోర్వ్యుపరిభాగంబుల్ మహోవాహముల్
ప్రచలన్మందర మధ్యమాన జలధిధ్వానోగ్ర ఘోషంబుగా
నుచిత ప్రౌఢిని వ్యోమమార్గముననోహోతేరు గొంపోయెడిన్"

ఈ సందర్భమును వడ్డాది సుబ్బారాయ కవిగారిట్లు వర్ణించిరి

"ధరా రజోభరానుమేయ ధావనావధాన వ
త్ఖురాగ్రచుంబితోర్వులౌచు ఘోటముల్ వహింప మం
దరావనీధరాదితేయ దైత్య మధ్యమాన సా
గరారవంబుతో శతాంగకంబు నింగినేగెడున్"

ఈ విధముగా పంతులుగారు సందర్భానుసారముగా కఠిన శైలిని రచించుటయేకాక మూలానుసారముగా కొన్నిపట్టుల ప్రసన్నమధురమగు శైలినికూడ తమ యనువాదమునందు చూపియున్నారు. ప్రబోధ చంద్రోదయమును పంతులుగారు ప్రకటించిన తరువాత, వడ్డాది సుబ్బరాయకవిగారును ప్రకటింపగా, వీరిరువుర యనువాద ప్రతిభా తారతమ్యములను గూర్చి సమకాలీన పత్రికలయందు వివాదములు నడిచినవని వీరేశలింగకవి చరిత్రమునందు తోలేటి వెంకట సుబ్బారావుగారు వ్రాసిరి.

ప్రబోధ చంద్రోదయమున పంతులుగారి శైలీ మాధుర్య మీ విధముగా నున్నది

"సుందర మందిరంబులును సోయగపుంజవరాండ్రు షట్పదా
మందర వోల్లసల్లతలు మల్లెల తావుల నొప్పుగాడ్పులున్
జందురుడున్న రేలు నెటనాకునమోఘబలంబు లౌట గె
ల్పొందగ నవ్వివేకుడెటులుండు ప్రబోధుడు నెట్లుపుట్టెడున్"

"కలదట యాత్మయొక్కటి జగంబున దేహముకంటె వేఱుగా
ఫలమది మీదగాంచు నట భద్రముగా బరలోకమందహో

వలవని యీ దురాశయు నభస్తరు రాజము పూచిస్వాదు స
త్ఫలముల నిచ్చునన్ భ్రమమువంటిదె కాదె తలంచిచూడగన్"

ప్రబోధ చంద్రోదయ నాటకానువాదమునుండి పంతులుగారి యనువాద సామర్థ్యమును గ్రహింపవచ్చును

పంతులుగారు సంస్కృత రూపకానువాదమును శాకుంతలానువాదముతో ప్రారంభించిరి. ప్రబోధ చంద్రోదయము ననువదించిన పిదప మరి దేనిని యనువదింపలేదు. ప్రబోధ చంద్రోదయమునందు బ్రాహ్మ మతస్థుల నాకర్షించు పరిశుద్ధాస్తిక సిద్ధాంతములున్నవి పంతులుగారి నవి యాకర్షించి యుండును. పంతులుగారు సంస్కృత రూపకములను నాల్గింటిని తెనుగుజేసిరి. వీనిలో రత్నావళి, మాళవికాగ్నిమిత్రములు 1880 వ సంవత్సరమునను, 1885 వ సంవత్సరమునను ప్రకటింపబడినవి. శాకుంతలానువాదము 1875 వ సంవత్సరముననే ప్రారంభింపబడి, 1881 వ సంవత్సరమున ముగింపబడి, 1883 ఎ సంవత్సరమున పుస్తక రూపమున ప్రకటింప బడినది. ప్రబోధ చంద్రోదయము 1885 వ సంవత్సరమున వివేకవర్ధనియందు ప్రారంభింపబడి 1891 వ సంవత్సరమునందు చింతామణి పత్రికయందు ముగింపబడినది

## 12. రాగమంజరి .

ఈ నాటకమును పంతులుగారు 1885-86 సంవత్సర ప్రాంతముల రచించి ప్రకటించిరి ఇది షెరిడన్ కవీశ్వరుని ది డ్యుయన్నా యను నాంగ్లనాటకమున కనువాదము షేక్స్పియర్ నాటకములలో నొక్క 'దికామెడీ ఆఫ్ ఎర్రర్' ను మాత్రమే సంపూర్ణముగా ననువదించి యున్నారు. తరువాత షెరిడన్ రూపకముల రెండింటిని యనువదించిరి. మొదటిది డ్యూయన్నా, దేశకాల పాత్రములను మార్చి రాగమంజరియను పేరున పంతులుగా రనువదించిరి.

సమకాలీన సాంఘికదురాచారములను అవహేళనముచేయుట యందు ఆంగ్ల కవులలో షెరిడన్ కవీశ్వరుడు లబ్ధప్రతిష్టుడు. వీరి నాటకములందు సాంఘిక దురాచారములు వ్యంగ్య ప్రధానముగా విమర్శింపబడును పంతులుగారిదికూడ అట్టి లక్ష్యమే కావున వారికి షెరిడన్ రచనలు ప్రీతి పాత్రములయ్యెను. ఆ కవీశ్వరుని

గ్రంథము లాధారముగా పంతులుగారికి తమ కాలమునాటి సాంఘికదురాచారములను అవహేళనచేయుటకు వీలుచిక్కినది షెరిడన్ రచనలలో సమకాలికులైన పెద్ద మనుషుల కపటవర్తనము, మఠాధిపతుల కుక్షింభరత్వము, వీరపురుష లనిపించుకొన దలచినవారి దాంభికవర్తనము, అపహసింపబడినవి.

పంతులుగారి కాలమునాటి సాంఘిక పరిస్థితులు పూర్తిగా షెరిడన్ గ్రంథములలోని పరిస్థితులవంటివి కాకపోయినను, ఆయన ధోరణిననుకరించుచు తమ కాలమునాటి సాంఘిక పరిస్థితుల నిరసించు అవకాశమువారికి కలిగినది. ఈ నాటకము ఆంగ్లములో 1775వ సంవత్సరమున వెలువడినది పంతులుగారు దీనిని 1885వ సంవత్సరముననువదించిరి.

మూలము గేయప్రధానముగా నుండుటనుబట్టి పంతులుగారు దీని యందు పద్యములను ద్విపదలను నెక్కువగా రచించి, మూలమునేయనుసరించిరి. చమత్కార రత్నావళియందువలెనే దీని యందు కూడ పంతులుగారు దేశకాల పాత్రములను మార్చిరి. ఈ నాటకమునందు కథానాయిక పేరు భానుమతి. కథానాయిక భానుమతి యైనను, పరిచారికయైన రాగమంజరి ప్రాధాన్యమునుబట్టి నాటకమున కామెపేరేపెట్టబడినది. మూలమునందుకూడ డ్యూయెన్నా (Duenna) కథానాయికపేరే

పంతులుగారీ నాటకమునందు మూలకథలోని మత విషయములను, సాంఘికాచారములను, మార్పుచేసినను, ఆంగ్లేయ సంప్రదాయము లనువాదమునందుకూడ భాసించుచునేయున్నవి

అనువాద విషయకముగా నీ నాటకమునందు కొన్ని లోపములున్నవి. చమత్కార రత్నావళిని గద్యాత్మకముగా రచించినట్లు దీనినికూడ గద్యాత్మకముగా రచించినచో నీ లోపములు దొరలకుండెడివి.

రాగమంజరి నాటకమునందలి యిటి వృత్తము దేశీయాచారములకు వింత గొల్పునట్టిదిగానుండును. వాక్య నిర్మాణము సైత మాంగ్ల వాసనావాసితముగానున్నది. పంతులుగారీ నాటకమునందు, కథా సన్నివేశములను, ఆచారములను మార్చియున్నను, ఆయా సన్నివేశములు తెలుగువారి జీవితమునకు సుపరిచితములైనవి కాకపోవుటచే వింతగానుండును. దేశకాలముల నీ విధముగా మార్చినారు.

Donlerome - సుదర్శనవర్మ — Don Louisa - భానుమతి
Don Ferdinand - విజయవర్మ — Donna Clara - సుదంత
Don Antonio - కామపాలుడు — Duenna - రాగమంజరి
Issac Meudoza - వసుకాముడు — Servilla - ఉజ్జయిని

మొదలుగా పంతులుగారు ఇంగ్లీషు పేర్లను తెలుగున మార్చినారు

పంతులుగారు చేసిన మార్పులు ఈనాటకమునందలి యితివృత్తమును స్వతంత్రేతివృత్తమనుకొనునట్లు చేయలేకపోయినవి యువతులు తాముప్రేమించిన వారితో లేచిపోవుట, ప్రియురాండ్ర నిమిత్తమై ద్వంద్వయుద్ధములు చేయుట, కత్తులు, తుపాకులు ధరించి ఇండ్లలోను వీధులలోను ఒకరితోనొకరు తారసిల్లుట, పాటలు పాడుచు, శృంగార వేషములు పూని వీధుల యందు సంచరించుచు, గవాక్షముల నుండి చూచు ప్రియురాండ్ర నాకర్షించుట, ప్రియురాండ్రు ప్రియులను మారువేసములందభిస రించుట మొదలగు సన్నివేశములు. విదేశీయములుగా నుండునేకాని, మనదేశీయా చారముల కనుగుణముగా నుండవు

అయినను పంతులుగారు మూలమునందలి మత సంబంధములైన విషయము లను, సాంఘికాచారములను కొంతవరకు మార్చియున్నారు. మూలమునందలి చర్చిని కేశవస్వామియాలయముగా మార్చుట, ఫాదరీలను, గండభేరుండాచార్యులు, కంఠీరవాచార్యులు, మొదలగు పేర్లతో ఆలయ పూజారులుగా మార్చుట, అచ్చట చర్చిలలో జరుగు ఘోరములను, ఈ దేశమునందలి పూజారుల కపట వర్తనములుగా పరివర్తింపజేయుట పంతులుగారు చేసిన ముఖ్యమైన మార్పులు. అయినను మూలము నందు వారి దేశీయాచారముల ననుసరించి పెద్దలు చిన్నవారిని ముద్దుపెట్టుకొనుట, మన నాటకములందు చోటుచేసుకొనుట కొంత యెబ్బెట్టుగా నుండకపోదు. అనువాదము నందు మామగారు కోడలిని 'నీ నవ్వుమొగము నొక్కసారి ముద్దిమ్మ' అని యడుగు టయు, ఆమెమామగారికి తనచేతిని ముద్దిడుకొననిచ్చుటయు ననందర్భములుగానుండక మానవు మూలమునందు "Give your father in law a kiss" అని యుండగా "నీ ముసలిమామగారి కొక్కసారి నీనవ్వుమొగము ముద్దిమ్మ" అని పంతులుగా రనువదించినారు.

సంప్రదాయములందును సన్నివేశములందునేకాక వాక్యనిర్మాణమునందు కూడ, ఆంగ్లేయనుడికార మీనాటకానువాదమున కనపడుట గమనార్హము.

రెండుమూడు ఉదాహరణములు క్రింద చూపబడుచున్నవి

Isac [with out] "come my charmer ! my trembling angel"

పంతులుగారి యనువాదము.

వసుకాముడు (తెరలో) నా ముద్దుగుమ్మా ! రమ్మ ! నావడకు దేవతారమ్మ. ఇచ్చట trembling angel అనుటను వడకుదేవతయని యనువదించినారు పంతులుగారు ఔచిత్యము కన్పట్టదు

Don Ferd- "Ay, that's a different case ! we never mean that others should act to our sisters and wives as we do to others-But..."

విజ- "అది వేరేసంగతి. పరులవిషయములో మనము జరిగించునట్టుగా మనభార్యల విషయములోను మన తోబుట్టువుల విషయములోను పరులు జరిగించుటకు మన మొప్పుకోము" ఈ విధముగా పంతులుగారి యనువాదము సాగినది కొంత దేశీయవాతావరణమును కూర్చ ప్రయత్నించినను కధానన్నివేశములు విదేశీయములగుటవలన పంతులుగారి ప్రయత్నము ఫలింపలేదు ఇది మూడంకముల నాటకము ఇందు జెరూసలేము నగరము ప్రస్తావన వచ్చినప్పుడు కాశికానగరమనుట, సౌందర్య ప్రసక్తి వచ్చినప్పుడు రంభతో పోల్చుట, మాయలమారితనమునుగూర్చి ప్రసంగించునప్పుడు శంబరాసురునితో పోల్చుట పంతులుగారు చేసిన కొన్నిమార్పులు.

## 13. ప్రహ్లాద నాటకము :

పంతులుగారీనాటకము నొక నాటక సమాజమువారు తామాడుటకయి వ్రాసిపెట్టుడని కోరగా 1885 వ సంవత్సరము నందతిత్వరితముగా వ్రాసి ముద్రించిరి.

ఇది యైదంకముల స్వతంత్ర పౌరాణిక నాటకము తెలుగున వెలసిన స్వతంత్ర పౌరాణిక నాటకములలో నిదియే మొదటిది తరువాత పంతులుగారు దక్షిణగోగ్రహణము, సత్యహరిశ్చంద్ర నాటకములను రచించియున్నారు.

పంతులుగారీ నాటకమును గూర్చి తమ స్వీయచరిత్రమునందిట్లు వ్రాసియున్నారు. "సంఘదురాచార సంస్కరణమును పరిశుద్ధ మతధర్మ ప్రకటీకరణమును

నా మనస్సునెప్పుడును బాయకుండునుగాన, నేనే పుస్తకమును జేసినను, దానిలో నవకాశమున్నయెడల నేసందర్భముననైనను, వానినించుక చొప్పించుచుందును. కాబట్టి యీ పుస్తకమునందును వాని చిహ్నములు కానవచ్చును".

ఈ వాక్యములనుబట్టి పంతులుగారి వ్యక్తిత్వమును బరిశీలింపవచ్చును. ఈ నాటకమునందు, పంచమాంకమున, నృసింహమూర్తి హిరణ్యకశిపు వధానంతరము, వేషధారులైన భక్తుల నిరసించుచు, దయ, సత్యము, సర్వమానవ సమానత్వము, చిత్తశుద్ధి, అరిషడ్వర్గములను జయించుట, కర్తవ్యములని ప్రబోధము సలుపును. నృసింహస్వామి నోటివెంట ఇట్టి యుపన్యాసమును జేయించుట పంతులుగారి వ్యక్తిత్వమునుపట్టి యిచ్చుచున్నది. ఇందు మొత్తము 8 పద్యములు మాత్రమేకలవు కనుక దీనిని గద్యనాటకముగానే చెప్పవచ్చును. పురాణ కథయందు పంతులుగారు మార్పులు చేయలేదు కాని నాటకీయములగు నూతన సన్నివేశములను కొన్ని కల్పించిరి

హిరణ్యకశిపుడే నాటకమునందలి కథానాయకుడు. దీనిని విషాదాంతనాటకముగా రూపించిరని చెప్పుటకు వీలులేకపోయినను, నాయకుని మరణముతో నాటకసమాప్తి జరుగుట, హిరణ్యకశిపుడు ధీరగంభీరుడగుట, విషాదాంత నాటక వాతావరణము కొంత యీ నాటకమునందు చోటుచేసుకొన్నదని చెప్పవలెను

ఆంగ్లవిషాదాంత రూపకములందలి నాయకులు సహజముగ ధీరులును, ఉదాత్తులునునయ్యు, ఏదోయొక బలహీనత వలన పతనము నొందుదురు. ఈ నాటకమునందు హిరణ్యకశిపుడట్టివాడుగ పంతులుగారు కల్పించిరి విష్ణువునందలి విరోధమొక్కటే యాతని పతనహేతువైనదికాని, వానియందితర యవలక్షణములు లేవు. విష్ణువు నందలి వైమనస్యమునకును వాని భ్రాతృ ప్రేమయే కారణము కాని, ఆతడు సహజముగ భగవద్విరోధికాడు తన సోదరుని పరిమార్చినవాని పైన పగ తీర్చుకొనుట హిరణ్యకశిపుని ప్రధానోద్దేశము ఈవిధముగా పంతులుగారు హిరణ్యకశిపుని యందు రాక్షసత్వమును లాఘవ పరచి యాతని దైవోపహతునిగ తీర్చిదిద్దిరి ప్రసక్తాను ప్రసక్తముగ పరిశుద్ధాస్తిక మత స్వరూపము, నాటి సాంఘిక దురాచారములను నిరసించుట, యీనాటకమునందు ప్రవేశించినవి. పంతులుగారు రచించిన తక్కిన పౌరాణిక నాటకములందు ప్రహ్లాదనాటకములో కన్న

నెక్కుడు పద్యములుకలవు. పంతులుగారు ప్రహ్లాదను కూడ గద్యనాటకముగనే రచించ సంకల్పించినను సన్నివేశప్రాబల్యమును బట్టి కొన్ని పద్యములు ప్రవేశ పెట్టి రని తోచుచున్నది. పంతులుగారు ఆంగ్లరూపకాను వాదమైన చమత్కార రత్నావళిని గద్యనాటకముగానే రచించుట గమనార్హము. తెలుగునాటకముల తొలిదశ యందు గద్యనాటకములకే వ్యాప్తియెక్కుడుగ నుండెను.

## 14. దక్షిణగోగ్రహణము

దీనిని పంతులుగారు 1885 వ సంవత్సరమున రచించిరి. కాని 1897వ సంవత్సరము వరకది పుస్తకరూపమును పొందినట్లు లేదు. ఏ నాటకసమాజము వారో కోరగా 1885 వ సంవత్సరమున రచించి వారికిచ్చినను 1897 వ సంవత్స రమున చింతామణిలో భాగభాగములుగ ప్రకటించి, తరువాత పుస్తకరూపమున తెచ్చినారు పంతులుగారు

భారతకథను నాటకీకరించిన వారిలో పంతులుగారే ప్రథములని తెలుగు నాట కోద్భవ వికాసములన్న గ్రంథమున శ్రీ పోణంగి శ్రీరామ అప్పారావుగారు వ్రాసి యున్నారు.

మహాభారతమునందత్యంత ప్రసిద్ధిని వహించిన ఉత్తర గోగ్రహణమును వదిలిపెట్టి పంతులుగారు దక్షిణగోగ్రహణమును నాటకముగా రచించినారు పంతులు గారు తమ స్వీయచరిత్రమునందు "భారతములో నాకత్యంత ప్రియములగు భాగ ములు విరాటపర్వములోని యుత్తర గోగ్రహణమును, భీష్మ ద్రోణ కర్ణ శల్యపర్వ ములును " అని వ్రాసియున్నారు. కాని దక్షిణ గోగ్రహణమును కథావస్తువుగా స్వీక రించి నాటకమును రచించినారు.

పంతులుగారు పౌరాణికేతి వృత్తమును గ్రహించి స్వతంత్రరూపక రచనము చేసన వారిలో ప్రథము లగుటయు, భారతకథను వస్తువునుగా తీసికొని నాటకమును రచించిన వారిలో ప్రథములగుటయు గమనార్హము కీచకవధా సందర్భమును, దక్షిణ గోగ్రహణమున పంతులుగారు ప్రస్తావించి యున్నారు విరటుడు సుదేష్ణ నూరడించుచు కీచక వధను గూర్చి ద్వితీయాంకమున సుదీర్ఘముగా ప్రసంగించును ద్వితీయాంకముననే విరటుడు, భార్య నోదార్చు సందర్భమున పంతులుగారు వ్యభి చార దోషమును గూర్చి తమ యభిప్రాయము లన్నియు ప్రకటించినారు.

ఈ నాటకమున నాంది ప్రస్తావనలులేవు పాత్రధారుల సంఖ్య పదిహేడుకు మించియున్నది. ప్రథమాంకమున ప్రథమరంగము విరాటనగర సమీపమున సుశర్మ తన సేనలతో విడిసి, సేనాధిపతియగు విక్రమభుజునితో, పాండవుల యజ్ఞాతవాసమును గూర్చి ప్రసంగించుచున్న ఘట్టముతో కథాప్రారంభ మగును. ఇందైదంకములు గలవు రంగవిభజన మున్నది. తృతీయాంకమున విరాటమహారాజు సుశర్మతో పోరునకు తలపడుట రమణీయముగ వర్ణింపబడినది. విష్కంభాదులు, నాటకీయ సంప్రదాయానుగుణముగ పాటింపబడలేదు కాని, ప్రదర్శనయోగ్యములగు కొన్ని సన్నివేశముల కల్పన మీ నాటకమునందు పంతులుగారు ప్రవేశ పెట్టియున్నారు. విరాటమహారాజురణకౌశలమును చూడగోరి సుదేష్ణ వేడుకపడగా కంకుభట్టారకాదు లామె కంగరక్షకులై, ఆమెను దోడ్కొనిపోయి, యుద్ధభూమి కనతిదూరమున నిలిపి యుద్ధవార్తల నామెకు తెలియ జెప్పుచు, మహారాజు పరాక్రమమును వ్యాఖ్యానించుచుందురు అట్లే విరటుని పూర్వసేనాధిపతులలో నొకడై అంగవైకల్యమును పొంది యంధత్వము కూడ సంప్రాపింప, యుద్ధవార్తల నాలింపవలెనన్న కుతూహలముతో కొమారుని బ్రతిమాలి, పురుషోత్తమ వర్మయను నాతడు యుద్ధభూమికి సమీపమున చేరియుండును వజ్రబాహువనునీతని తనయుడు యుద్ధవిశేషముల నీతనికి వర్ణించి చెప్పుచుండును ఈవిధముగా పంతులుగారు విరాట, సుశర్మల యుద్ధమునంతయు వర్ణించినారు విరాటుని సుశర్మ బంధించి తీసికొనిపోగా వలలుడు పోయి యాతని బంధవిముక్తుని గావించినట్లు పంతులుగారు కల్పించినారు. సుశర్మను బంధించి తెచ్చి విరాటుడు పేరోలగమున విచారణసల్పును గాని, కంకుభట్టాదుల సలహాపై నాతనిని విడిచి పుచ్చును ఈనాటకమునందు సుశర్మ మాయావిగను, క్రూరుడుగను. పౌరుష హీనుడుగను చిత్రింపబడినాడు. సుదేష్ణ పాత్ర చక్కగా తీర్చిదిద్దబడినది. మహాభారత కథయందు సుదేష్ణాదేవి, భ్రాతృస్నేహ వివశయై ద్రౌపదీదేవి యెడల కొంత కౌటిల్యము వహించినట్లు అర్థ మేర్పడుచున్నది కాని, యీ నాటకమునం దామెకాకళంకము తొలగిపోయినది. ఈ నాటకమున ఆమె ధూర్తకాదు తమ్మునకు ఎన్నివిధముల బుద్ధిగరపినను, చేటు కాలము సమీపించుటచే వాడు వినడు సుదేష్ణ యుద్ధమును ప్రత్యక్షముగ చూడ గోరుట యామె వీరపత్నీ లక్షణమును వ్యంజించుచున్నది. కంకుభట్టు, వలలుడు,

తంత్రీపాలుల, పాత్రచిత్రణములందు విశేషమేమియు లేకపోయినను, కథాగమనము నందు వారి పాత్రలనుగుణముగా చిత్రింపబడినవి.

ఈ నాటకమునందు సుశర్మను భీరువుగను చిత్రించి, హాస్యమును కూడ పంతులుగారు సృష్టించిరి ఇందలి సంభాషణము లన్నియు ధ్వని ప్రధానములుగ బిగువుగ నడిచినవి ప్రదర్శన యోగ్యమగునట్లు పౌరాణికేతి వృత్తములను నాటకీ కరించుటలో పంతులుగారికిగల ప్రతిభ యీనాటకము వలన తెలియనగును. రంగస్థల మున ప్రదర్శించుటకు పౌరాణికేతి వృత్తములను నాటకవస్తువుగా స్వీకరించినప్పుడు దానిని రక్తికట్టించుటకు నాటక రచనయందు సిద్ధహస్తు డగుటయేకాక, కవి ప్రయోగ విజ్ఞాన కౌశలమునుకూడ కలిగియుండ వలెను. పంతులుగా రట్టివారని యీనాటకము వలన గ్రహింపనగును. ఈనాటకమును ప్రేక్షకులును, సాహితీపరులును బాగుగా ఆదరించిరని పంతులుగారు వ్రాసియున్నారు కాని, ధర్మవరము రామకృష్ణమాచా ర్యులవారివంటి ప్రముఖ నాటకకర్తలు మెచ్చలేదు. ఈ నాటకము మిక్కిలి చప్పిడిగా నున్నదని రామకృష్ణమాచార్యులుగారు పూండ్లరామకృష్ణయ్యగారికి వ్రాసియున్నారు.[28]

పంతులుగారు స్వతంత్ర పౌరాణిక నాటకములందు పాత్రోచిత భాషనుపయో గింపలేదు పాత్రానుగుణముగ రసానుగుణముగ సంభాషణలను గ్రాంథికముననే రచించినారు. సందర్భానుసారముగ శైలియొక్కచో ప్రౌఢముగను, మరియొకచో తేటగను పంతులుగారు కూర్చియున్నారు. సంభాషణలందు దీర్ఘ సమాసములులేవు. కాని, పద్యరచనయందు తత్తద్రసానుగుణ్యముగా శైలీ వైవిధ్య మీనాటకమున కన్పించుచుండును. ఓజోగుణ భూయిష్టములు, ప్రసన్నమధురములు నైన పద్య ములు పంతులుగారి నాటకములందు ప్రచురములే.

## 15. సత్యహరిశ్చంద్ర నాటకము ;

రాజమహేంద్రవరము నందలి నాటకోజ్జీవక సమాజమువారుతాము ప్రదర్శించు కొను నిమిత్తము హరిశ్చంద్రోపాఖ్యానమును నాటకముగా వ్రాసి ఇవ్వవలసినదని కోరగా తామీనాటకమును 1886వ సంవత్సరమున నాలుగంకములవరకు రచించితి మనియు, ఆ నాటక సమాజమువారు నాటకమునప్పుడు ప్రదర్శించుట విరమించుకొనగా దాని నప్పటికి నిలిపివేసితిమనియు పంతులుగారు స్వీయచరిత్రమునందు తెలిపి యున్నారు. తరువాత కొలదికాలమునకు కాకినాడలోని యొక నాటకసమాజమువారు

దానిని తాము ప్రదర్శించుకొనుటకు పూర్తిచేయుడని కోరగా, పంచమాంకమునుగూడ రచించి పూర్తిచేసి యానాటకసమాజము వారికిచ్చితిమనియు దానిని వారు విజయవంతముగా ప్రదర్శించిరనియు పంతులుగారు స్వీయచరిత్రమునందే వ్రాసిరి హరిశ్చంద్రోపాఖ్యానమును నాటకీకరించిన వారిలో పంతులుగారే ప్రథములని తమ యాంధ్రనాటక - ఉద్భవవికాసములందు శ్రీరామ అప్పారావుగారు తెలిపియున్నారు. హరిశ్చంద్ర నాటకమును రచించుటలో పంతులుగారి సంఘ సంస్కరణాభిలాషకూడ కొంత ప్రాధాన్యము వహించి, వారి నాకథ యాకర్షించినదని చెప్పవచ్చును. సత్యతత్పరత, శీలసౌష్ఠవము, ఆపదలందు ధైర్యము మొదలగు హరిశ్చంద్రుని సుగుణముల నాధారముచేసికొని పంతులు గారీనాటకమునందు, పాత్రలద్వారా నీతి బోధచేసియున్నారు. హరిశ్చంద్రుని కథ మార్కండేయపురాణ మొకరీతిగను, స్కాందపురాణ మొకరీతిగను చెప్పుచున్నవి[34] క్షేమేశ్వరుని చండకౌశికము మార్కండేయపురాణము ననుసరింపగా శంకరకవి హరిశ్చంద్రోపాఖ్యానము స్కాందపురాణాంతర్గత గాథ ననుసరించియున్నది. లోకమున స్కాందపురాణ గాథకే మిక్కిలి ప్రచారమున్నది శంకరకవి మార్గమునే పంతులుగా రనుసరించిరి.

పంతులుగారీ కథనే 1884వ సంవత్సరమున స్త్రీల కుపయుక్తమగునటుల వచన ప్రబంధ రూపమున రచించి ప్రకటించిరి కాని యీ వచన ప్రబంధమున పంతులుగారు హరిశ్చంద్రుని కథ నాధారముగా గైకొనిరేగాని యథాతథముగ స్వీకరింపలేదు చంద్రమతి కథ నాధారముగా స్త్రీ విద్యను ప్రోత్సహింపవలెనను సిద్ధాంతప్రతిపాదనమునకై వారా ప్రబంధమును రచించిరి కావుననే వారు దానికి చంద్రమతి చరిత్రమని పేరుపెట్టిరి చంద్రమతీ చరిత్రమును రచించుచున్నప్పుడే హరిశ్చంద్రోపాఖ్యానమును గూర్చిన యాధారముల నన్నిటిని వారు పరిశీలించి యుందురు. కనుకనే వారు 1886వ సంవత్సరమున హరిశ్చంద్ర నాటకమును, రెండు మూడు వారములలోనే నాలుగంకములను రచించిరి తమను కోరిన నాటక సమాజమువారు ప్రదర్శించుటకు పూనుకొనకపోవుటచే అది యప్పటికి నిలిచిపోయెను. తరువాత కొలదికాలమునకే పంచమాంకమునుగూడ ముగించిరికాని పుస్తకరూపమున 1889వ సంవత్సరము వరకు ప్రకటించియుండలేదు. పంతులుగారి పౌరాణికేతివృత్త స్వతంత్రరూపకములలో ఇది చివరిది. పంతులుగారు ప్రప్రథమమున రచించిన పౌరాణిక నాటకమగు ప్రహ్లాదనాటకము నందుగాని తరువాతి దక్షిణ గోగ్రహణము

నందుగాని, నాంది ప్రస్తావనములను కూర్చలేదు పంతులుగారికి పూర్వము పౌరాణిక గాథల నాటకములుగా వ్రాసినవారులేరు. కనుక పంతులుగారే ఆవిషయమున మార్గ దర్శకులని చెప్పవలెను. సత్యహరిశ్చంద్రనాటకమున నాంది ప్రస్తావనలు కూర్చ బడినను, సంస్కృత సంప్రదాయానుసారిగా నవిలేవు ఈ నాంది ప్రస్తావనలయందు, కవినిగూర్చికాని, కావ్యమును గూర్చిగాని చెప్పబడక, నీతి, ధర్మప్రబోధములు చేయుటకు పంతులుగారు అవకాశము కల్పించుకొనిరి పంతులుగారే ఆ విషయమును గుర్తించి సూత్రధారునిచే "ఓహో! నేనిప్పుడు ధర్మప్రసంగాదరపరవశుడనయి ప్రస్తుతకరణీయమును మరచిపోయితినిగదా" యనిపించినారు భరత వాక్యము కథానాయకుడైన హరిశ్చంద్రుని నోటనే పలికించినారు పంతులుగారు

ప్రథమాంకమునందు హరిశ్చంద్రుని సత్యసంధతను గూర్చి ఇంద్రసభయందు, వసిష్ఠవిశ్వామిత్రుల సంవాదము వర్ణింపబడినది ఈ కల్పన మూలావిధేయము. పంతులుగారీ ఘట్టమును స్వకపోల కల్పితము గావించిరి. ఈ కల్పన జనరంజకముగా నుండుటచేత హరిశ్చంద్రుని కథను నాటకరూపమున రచించిన పలువురు పంతులుగారి ననుసరించిరని తెలుగునాటకములనుగూర్చి తమ పరిశోధన గ్రంథమునందు శ్రీరామ అప్పారావుగారు వ్రాసియున్నారు.

ద్వితీయాంకమున మార్కండేయమహర్షి శిష్యుడైన జాబాలి, హరిశ్చంద్రుని వేడుక చెలికాడైన గాలవుల సంభాషణము విష్కంభముగా కూర్చబడినది ఈ విష్కంభము విశ్వామిత్రుడు హరిశ్చంద్రుని రాజసూయాధ్వరమునకు వచ్చి ధనము గ్రహించి, రాజునొద్దనే దాచిపోవుటను తెలుపుచున్నది. ద్వితీయాంకమున మృగయా వినోదమునకు వచ్చిన హరిశ్చంద్రుని కడకు విశ్వామిత్రుని పనుపున మాలెతలువచ్చుట, హరిశ్చంద్రుడు వారిని దండింపజేయుట, విశ్వామిత్రుడు కోపించి వారిని దండించి నందుకు పరిహారార్థముగా హరిశ్చంద్రుని సామ్రాజ్యము నుదకపూర్వకముగా తాను గైకొనుట మొదలగు కథాంశములు వర్ణింపబడినవి.

తృతీయాంకమున చంద్రమతీ హరిశ్చంద్రులును, వారి పుత్రుడు లోహితా స్యుడును పురమువిడిచి కానలకు బోవుట, వారనుభవించిన కష్టములు, నక్షత్రకుడు వారిని పెట్టినబాధలు, వారు కార్చిచ్చుచే చుట్టుకొనబడుట, చంద్రమతి పాతివ్రత్య ప్రభావముచే దానినుండి వారు తప్పించుకొనుట మొదలగు సన్నివేశములు వర్ణితములు.

చతుర్థాంకమున హరిశ్చంద్రుడు కాశికాపురముజేరి, నక్షత్రకుని పోరుపడలేక తన భార్యాబిడ్డలను కాలకౌశికుడను విప్రునకు విక్రయించుట, ఇంకను ఋణవిముక్తుడు కకుండుటచే వీరబాహువను కాటికాపరికి తనకై తానమ్ముడుబోవుట మొదలగు కథాంశములు వర్ణితములు

పంచమాంకమున లోహితాస్యుని మరణము, చంద్రమతి శ్మశానమునకువచ్చుట కాటిసుంకము చెల్లింపలేకపోవుట, తన భర్తనే గుర్తింపలేకపోవుట, ఆమెపై శిశు హత్యానేరము మోపబడి, యామెకు కాశికాపురాధీశుడు శిరచ్ఛేదనము విధించుట, విశ్వామిత్రుడు పంతమును విడువుమని హరిశ్చంద్రున కుపదేశము చేయుట, హరిశ్చంద్రుడు సమ్మతింపకపోవుట, పార్వతీపరమేశ్వరులు ప్రత్యక్షమై చంద్రమతీ, హరిశ్చంద్రులను కృతార్థులజేయుట వర్ణింపబడినవి.

ఈ నాటకమును పంతులుగారు గద్య పద్యాత్మకముగా రచించిరి. కమనీయములగు కల్పనలుచేసిరి వారి వ్యక్తిత్వము వారి రచనలందు ప్రతిఫలించుచుండు ననుటకీ నాటకమొక దృష్టాంతము. ఇంచుక సందర్భము వచ్చినచో పంతులుగారు తమ యభిప్రాయములను పాత్రల నోటివెంట ప్రసంగింప జేయుచుందురు. వారికెల్లప్పుడును సంఘసంస్కరణపైననే దృష్టి. హాస్య సన్నివేశములందు సైతము పంతులుగారి దృష్టి సాంఘిక దురాచారముల విమర్శించుటయందే యంటిపెట్టుకొని యుండును ఈ నాటకమునందు గాలవుడు హరిశ్చంద్రుని వేడుక చెలికాడు. విదూషకుడు. ద్వితీయాంకమున మాలెతలువచ్చి హరిశ్చంద్రుని ప్రేమభిక్షనర్థింపగా నట్టి యనుచితములైన కోర్కె వారికి కలిగినందున వారు శిక్షార్హులని పలుకుచు హాస్యముగా "నేను వీరిని దాకగూడని బ్రాహ్మణుడనయి పోతినిగాని, కాకపోయినయెడల వీరీ పాటికి యిల్లాంద్ర కేశఖండన మహోత్సవము నాటి రాగములు తీయుచు బరుగెత్తి యిల్లు త్రొక్కిచూడరా" యని పలుకును. పంతులుగారు కృతయుగమున ఇల్లాంద్ర కేశఖండన ప్రసక్తి యనౌచిత్యమని భావింపలేదు తృతీయాంకమున పురజనులు హరిశ్చంద్రునికి, వీడ్కోలు చెప్పి పంపునప్పుడు హరిశ్చంద్రుడు వారితో ధనవంతుల, ధనహీనుల గుణగణములనుగూర్చి ప్రసంగించును. ఈ ప్రసంగము కథాగమనమునకు ప్రతిబంధకము కాకపోయినను, సహాయకారి కాదు. తృతీయాంకమునందే చంద్రమతీ హరిశ్చంద్రులు అరణ్యమున దవశిఖిచే చుట్టుకొనబడగా, చంద్రమతి నాకు తల్లి

దంద్రులు చెప్పించిన విద్యసార్థకమగునట్లాను కవిత్వముగా దండక మొకటి చెప్పి యిప్పుడిప్పావకుని మెప్పించెదను" అని పలికి దండకముచెప్పి అగ్నిదేవుని మెప్పించి వారి నాయాపదనుండి రక్షించినట్లు కల్పింపబడినది చంద్రమతికి చిన్నతనమున తల్లి దంద్రులు విద్యచెప్పించినారని చెప్పుట పంతులుగారి స్త్రీ విద్యాభిమానమును చాటి చెప్పుచున్నది. పంతులుగారు స్త్రీ విద్యాప్రోత్సాహకరములగు వాదముల నెన్నిటినో నా కాలపు పత్రికలందు వెలయింపజేసిన విషయము అందరకు తెలియును ఇదే విధముగా పంచమాంకమున హరిశ్చంద్రుడు ఇంచుక సందర్భమును కల్పించుకొని జ్యోతిషశాస్త్రమును విమర్శించును తనపుత్రుడు చక్రవర్తియగునని జ్యోతిష్కులు చెప్పిరనియు, అతడల్పవయస్సుననే దుర్మరణము పాలయ్యెననియు చంద్రమతి విలపించుచుండగా ఆ ఘట్టమున హరిశ్చంద్రుడు శాస్త్రవాదములుచేసి, జ్యోతిషమును విమర్శించును

పంతులుగారీ నాటకమునందు జేసిన ప్రధానమైన మార్పులలో, లోహితాస్యుడు నిజముగా మరణింపలేదనియు, చిలువ కాటునకు మూర్ఛితుడయ్యెననియు కల్పించుట యొకటి. కాశీరాజపుత్రుని ముష్కరు లెవ్వరో నగలనిమిత్తము మడియింపగా నేరము చంద్రమతిపై మోపబడి యామెవధ్యస్థానమునకు గొనిపోబడినటులున్న కథను పంతులుగారు, నక్షత్రకుడే యా బాలుని రహస్యముగా దాచియుంచి, చివరకు బయల్పరచినట్లు మార్చిరి. నాటకమునందు కూడ చంద్రమతి వధ్యస్థానమును చేరినది ఆ నేరమునకే అయినను పంతులుగారు మానుషాతీతములైన సంఘటనలను నాటకమునందు కూర్చుట కిష్టములేక, లోహితాస్యుడు మూర్ఛితుడుకాగా, వారు మరణించిరని భావించిరనియు, విశ్వామిత్రుడు విషనివర్తనోపాయముల నాబాలుని పునర్జీవితుని చేసెననియు, కాశీరాజపుత్రుని నక్షత్రకుడే దాచియుంచి, చివరకు కాశీ రాజునకప్పగించెననియు మార్పులు చేసియున్నారు. కల్పనమునందు దివ్యసామగ్రిని (Supernatural element) ప్రవేశపెట్టుట పంతులుగారికి రుచింపదు. అట్టివానిపై పంతులుగారికి విశ్వాసములేదు. అయిన నీ నాటకమునందు కథాంతమున పార్వతీ పరమేశ్వరులేల ప్రత్యక్షమైనారన్న ప్రశ్నవచ్చును. నాటి ప్రేక్షకుల యభిరుచి ననుసరించి నాటకము జయప్రదముగా ప్రదర్శింపబడుటకును, ప్రదర్శకుల తృప్తి కొరకును, ఇట్టి కల్పనమును పంతులుగారు ప్రవేశ పెట్టియుందురు

తరువాత హరిశ్చంద్రుని కథను నాటకముగా వ్రాసినవారెందరో కలరు కాని అందు సెట్టి లక్ష్మీనరసింహముగారును, బలిజేపల్లి లక్ష్మీకాంతకవిగారును ప్రసిద్ధులు బలిజేపల్లి వారిది మిక్కిలి ప్రసిద్ధి నొందినది. సెట్టి లక్ష్మీనరసింహముగారి చిత్ర హరిశ్చంద్రీయము 1913వ సంవత్సరమున ప్రకటింపబడినది. ఈ నాటకమునందలి గ్రంధకర్త చిత్రవిచిత్రములగు మార్పులనేకము చేసెను. ఈ నాటకమునందలి ప్రస్తావనలో సెట్టివారు తమ నాటకము పంతులుగారి నాటకమును పోలజాలదని చెప్పికొనిరి. లక్ష్మీనరసింహముగారు పంతులుగారికి చెన్నపట్టణమునందు రాజధానీ కళాశాలలో శిష్యరికము నెరపిరట అందువలన మిక్కిలి వినయముతో పంతులు గారి నాటకమునకును తమనాటకమునకును తారతమ్యము లెన్నుచు, తాము వీరేశ లింగము గారిని మించలేమనియు, వారి పాదసేవకు మాత్రమే తమ కర్హత కల దనియు, సూత్రధారునిచే చెప్పించినారు.

పంతులుగారి హరిశ్చంద్ర ప్రకటింపబడిన తరువాత, ఆ కాలమున పంతులు గారి నాటకమును శంకరకవి కావ్యముతో బోల్చుచు, తారతమ్య పరిశీలనము చేయుచు సాహితీపరుల పత్రికలలో వాదములు ప్రచురించిరి.[26] ఇవి శుష్కవాదములని పంతులు గారభిప్రాయపడిరి.

## 16. మహారణ్య పురాధిపత్యము :

దీనిని పంతులుగారు నాటకముల సంపుటియందు చేర్చినను ఇది ప్రహసన ప్రాయమైన రచన మాత్రమేయని చెప్పవలెను.

ఇది 1889 వ సంవత్సరమున వివేకవర్ధనిలో వెలువడి, ఆ సంవత్సరమే పుస్తకరూపమున ముద్రింపబడినది. దీనిని పంతులుగారు ఆక్షేప గర్భనాటకమని పేర్కొనిరి. కావున ఇది కొందరువ్యక్తుల దుర్వర్తనము నధిక్షేపించు నాటకమని చెప్పవచ్చును దీనిని ప్రదర్శించుట కష్టము. ఇందలి పాత్రములన్నియు తిర్యగ్జంతు వులే. కథను పంతులుగారు పంచతంత్రమునుండి గ్రహించిరి. నక్కనీలి కుండలోబడి తనశరీరమున కంటుకొన్న నీలిరంగును చూపి తనబంధువులను మోసపుచ్చి తనను రాత్రిదేవతలు స్వర్గమునకు గొనిపోయి మృగరాజ్యమున కభిషిక్తునిజేసి నీలవర్ణము ప్రసాదించి పంపిరని బొంకి, వాని సాహాయ్యమున మృగరాజయి, చివరకు తన మోసము బయల్పడగా నొక వ్యాఘ్రముచే జంపబడుట యిందలి కథావస్తువు.

ఈ యాక్షేప గర్భనాటకము సంఘములోగల వివిధ దురాచరణములను వెల్లడిపరచి వానిని మాన్పింపవలెనన్న ముఖ్యోద్దేశముతో వినోదకరముగా వ్రాయబడినదని తమ స్వీయచరిత్రమునందు పంతులుగారు వ్రాసిరి. ఈ ప్రహసనము తమ్ముద్దేశించియే వ్రాయబడినదని రాజమహేంద్రవరమునందు పాఠశాలోపాధ్యాయులుగానున్న ఏలూరు లక్ష్మీనరసింహముగారు, పంతులుగారిపై మాననష్టమునకై యభియోగము తెచ్చిరి. ఈ యభియోగము చాలకాలము న్యాయసభయందు నడిచినది.

ఇందలి పాత్రములన్నియు సృగాల మహారాజు, జంబుకేశ్వరశాస్త్రి, కుర్కుర సోమయాజులు, శునకాచార్యులు, సారమేయశ్రేష్ఠి, భషకచయనులు, గ్రామసింహదాసు, వృకేశ్వరరావు పంతులు, సింహసార్వభౌముడు, వ్యాఘ్రేశ్వరరావు, భల్లూకేంద్రుడు, హరిణావధానులు, శశకశాస్త్రి, మహిషేశ్వరుడు, మొదలగు పేర్లతో నుండి, మృదువైన వ్యంగ్య ధోరణిలో, మిక్కిలి నవ్వుపుట్టించునట్లుండును. సంఘములోని పెద్దలు స్వార్థపరులై ఎట్లు ప్రవర్తింతురో, ధూర్తులై ఇతరుల నెట్లు మోసగింతురో, యీ ప్రహసనమునందు నిశితముగ వర్ణింపబడినది. ఏలూరు లక్ష్మీనరసింహముగారు, పంతులుగారిపై తెచ్చిన యభియోగము, ఆంధ్రదేశమునంతటి నాందోళనమునకు గురిచేసినట్లు, చెన్నపట్టణమునుండి వెలువడుచుండిన హిందూజన సంస్కారిణి వలన తెలియనగును.[26] చిలకమర్తివారు తమ స్వీయచరిత్రమున నీవిషయము ప్రస్తావించినారు. ఈ యభియోగము మూడు సంవత్సరముల కాలము నడచినదని పంతులుగారు తమ స్వీయ చరిత్రమునందు వ్రాసిరి. ఈ వ్యవహారమున న్యాపతి సుబ్బారావు పంతులుగారు, వీరేశలింగంగారి పక్షమున న్యాయవాదిగనుండిరి.

## 17. తిర్యగ్విద్వన్మహాసభ, మూషకాసుర విజయము :

తిర్యగ్విద్వన్మహాసభ నాటకముకాదు, ప్రహసనమే. పంతులుగారీ పుస్తకమును 1889వ సంవత్సరమున ముద్రించి ప్రకటించిరి. పంతులుగారి ప్రాణమిత్రులగు బసవరాజుగారు 1888వ సంవత్సరమున మరణించగా, నా సమయమున దహన సంస్కార విషయకముగా వారి బంధువులును, పురోహితులును పెట్టిన బాధలను జూచినప్పుడు పంతులుగారి మనస్సు కష్టపడి, ఆ బంధువుల, పురోహితుల, దుశ్చర్యలనెల్ల వెల్లడించుటకు, నీ యాక్షేపగర్భ సంభాషణమును రచించిరి. గవర్రాజుగారు పంతులుగారికి చిరకాల మిత్రులు. మిక్కిలి సద్వర్తనులు. సంఘ

సంస్కరణమునకై పాటుపడిన కర్మయోగి. అన్ని విషయములందు పంతులుగారికి కుడిభుజమువలెనుండి పాటుపడిన పుణ్యులు. స్త్రీ పునర్వివాహ విషయకముగను, ఇతరములైన సంస్కరణములందును పంతులుగారి కండదండయైనిలిచి, గవర్రాజుగారు చాల కష్టములనుభవించిరి. అయినను వారు సంస్కరణ కార్యప్రవృత్తిపట్ల విముఖులుకాలేదు. ముప్పది సంవత్సరముల చిన్న వయసుననే వారు మరణించగా, రాజమహేంద్రవరమునందలి సంస్కరణాభిలాషులు మిక్కిలి దుఃఖించిరి. అట్టి పుణ్యాత్ముడు కాలగతిజెందగా, దహన విషయమున పురోహితులును, బంధువులును, ఆ కుటుంబమువారిని చాల బాధలకుగురిజేసిరి

సంఘమునందలి దురాచారములయెడ, దుష్టవర్తనులయెడ విప్లవధ్వజమెత్తిన పంతులుగారు, వారి హేయవర్తనము సహింపలేదు పురోహితులను, బంధువులను నిరసించుచు, పరిహసించుచు, తీవ్రముగా యధిక్షేపించుచు, తిర్యగ్విద్వన్మహాసభ యను ప్రహసనమును వెలయించిరి. గవర్రాజుగారిని కామధేనువుతోబోల్చి, కామధేనువు మరణింపగా, అంతవరకు దానియండన బ్రతికిన మృగ సమూహములన్నియు, శవమును పీకుకొని భక్షింపవలయునని అచ్చటచేరి, శవమును దహనముసేయగూడదనియు, ప్రాణోత్క్రమణము జరిగిన తిధి మంచిదికాదనియు, శాంతి జరుపవలెననియు, బ్రాహ్మణులకు భూరి దక్షిణలనిచ్చి జపహోమములు చేయవలయుననియు, ఖననముచేయుట శాస్త్రవిధియని కొందరును, దహనము శాస్త్రోక్తమని కొందరును, రెండు పక్షములై వాదులాడు కొందురు.

పురోహితులనైచ్యము, కుక్షింభరత్వము, స్వార్థము, జుగుప్సావహమైన హేయవర్తనము, బంధువులనబడువారి అక్రమవర్తనము, పంతులీగారీ ప్రహసనమున తీవ్రముగా నిరసించిరి.

వృషభేంద్రరావు, మేషేశ్వరుడు మొదలగువారు బంధువులుగను, కొంకనక్కదీక్షితులు, రామబంధుశాస్త్రి, బక సోమయాజులు, వ్యాఘ్రావధానులు, వరాహభట్టు, మొదలగువారు సభాపతులుగను, గార్ధభేంద్రశాస్త్రి, కామధేనువు బంధువుడైన యొక విద్వాంసుడుగను, ఆంజనేయశర్మ, మర్కటచయనులు, మొదలగువారు సభికులుగను, దర్మనమిత్తురు ఈ ప్రహసనముందు పంతులుగారి మృదుహాస్యధోరణి, కటువ్యంగ్య విన్యాసము, కూడ ద్యోతకములగును. దహన సమయమున పురోహితు

వ్వరును స్మశానమునకువచ్చి సహకరింపకపోగా, పంతులుగారును వారి మిత్రులును నవహనమునందుపాల్గొని, పంతులుగారు పుస్తకమునుజూచి మంత్రములుచదువగా, హనకాండను జరిపిరట ఈ రచనయందుకరుణ, హాస్యములమేళనము జరిగినది.

## 8. మూషకాసురవిజయము

ఇది ప్రదర్శనయోగ్యముకాదు దీనిని తిర్యగ్విద్వన్మహాసభతో కలిపి ప్రచురించిరు పంతులుగారు. కనుక దీని రచనాకాలముకూడ 1889 కావచ్చును కుందేలుతో టీపడి, ఉపాయమున మూషికము జయించుట యిందలి యితివృత్తము. మూషకట్టరు, శశకపతిరావు, మూషికాంబ ఇందలిపాత్రలు. మూషకభట్టరు ఒక పందికొక్కు. ూషికాంబయాతని భార్య. శశకపతిరావు ఒక కుందేలు. ఓడియుతామే గెలిచితిమని ంతరులను మోసగించువారి మాయోపాయము లీ ప్రహసనమునందు వర్ణింపబడినవి ుహారణ్యపురాధి పత్యమునకు సంబంధించి పంతులుగారిపై యభియోగములురాగా ందరు విద్వాంసులీ తిర్వగ్విద్వన్మహాసభలోని యాయా పాత్రములుకూడ తమ్ముద్దే ంచి వ్రాయబడెనని తమ సాక్ష్యములలో చెప్పిరట.

తిర్యగ్విద్వన్మహాసభ భారతములోని గృధ్రజంబుకోపాఖ్యానము నాధారముగా సికొని రచింపబడినదని పంతులుగారు స్వీయచరిత్రమున వ్రాసిరి.

## 9. కల్యాణకల్పవల్లి :

పంతులుగారీ నాటకమును 1894వ సంవత్సరమున ప్రకటించిరి. తాము దించిన నాటకములలో ఇది చివరిదని పంతులుగారు స్వీయచరిత్రమున వ్రాసినారు. ి ఐదంకముల నాటకము ఇది రాగమంజరి కథ కన్నను హృదయాకర్షకముగ ండునని తాము తెనిగించితిమని వారు వ్రాయుచు "అయినను మనవారికాదేశస్థుల హచారవ్యవహారములు క్రొత్తవిగాను తమవానికి విరుద్ధములుగాను కనబడుటచేత ట్టివాని నంతగా నాదరింపరని" స్వీయచరిత్రమునందు వ్రాసియున్నారు.

ఇతర యాంగ్లానువాద రూపములందువలెనే దీనియందును దేశకాల పాత్రము ను పంతులుగారు మార్చిరి ఈ నాటకము నందలి కథ యంతయు పిఠాపురమునందు రిగినట్లు పంతులుగారు కల్పించిరి కాని కథాసన్నివేశము లన్నియు విదేశీయము గా కనపడుటవలన తెలుగువారి కిదిరుచించదని పంతులుగారు భావించుట వింతకాదు.

ఈ నాటకమునందు మూలమునందుగల మిసెస్ మేలప్రాప్ పాత్రసృష్టి చిత్రమైనది పాండిత్య ప్రకర్షను చూపుటకుగాను, పదముల యర్థము తెలియక పోయినను, ఒక పదమునకు బదులు వేరొక పదమును బడాయిగా ప్రయోగించుట యీ పాత్రలక్షణము. ఇట్లామె తాను పెద్దపెద్ద మాటల నుపయోగించుచున్నానని యనుకొనుట పాఠకులకు నవ్వుపుట్టించును. ఈ నాటకమునందలి మేలప్రాప్పాత్ర, ఆంగ్లసాహిత్యమున చిరస్థాయిగ నిలిచినది. దర్పమునకుబోయి ఇట్టిమాటల నుపయో గించుచు, అపహాస్యము పాలగుటను 'మేలప్రాపిజమ్' అని వ్యవహరింతురు. దీనిని బట్టి మిసెస్ మేలప్రాప్ పాత్రకెట్టి విశిష్టస్థానమున్నదో తెలియుచున్నది.

పంతులుగారు మిసెస్మేలప్రాప్ పాత్రను సుభద్రమ్మగా తెనుగున మార్చిరి. ఈ పాత్రయందు మేలప్రాప్ పాత్రలోని చమత్కారమును తీసికొనివచ్చుటకు ప్రయ త్నించిరిగాని, కృతకృత్యులు కాలేకపోయిరి. రాగమంజరిలోవలె దీనియందు కూడ దేశీయ సంప్రదయానుగుణముగ పంతులుగారు కొన్ని మార్పులు చేసియున్నారు. అయినను కొన్ని వర్ణనలు, వాక్యనిర్మాణము, ఆంగ్లవాసనావాసితములుగానేయున్నవి. పాశ్చాత్యపౌరాణిక పాత్రలను మన పౌరాణిక వ్యక్తులనుగా కొన్నిమార్పులు పంతులు గారు చేసినారు. ఇందలి పాత్రలు, వానిపేర్లు పంతులుగారిట్లు మార్పుచేసియున్నారు

Sir Anthony Absolute – వీరసేనుడు

Captain Absolute – విక్రమసేనుడు

Faulkland – దర్పసారుడు

Acres – దామోదరవర్మ మొదలగు పురుష పాత్రములనుగాను,

Mrs Malaprop – సుభద్రమ్మ,

Lydia – కళావతి

Julia – చారుమతి

Lucy – మంథర మొదలగు స్త్రీ పాత్రములనుగాను మార్చినారు

దేశీయ వాతావరణమును తీసికొనివచ్చుటకు ప్రయత్నించినను, ద్వంద్వ యుద్ధములు, మారువేసములతో ప్రియురాండ్రు ప్రియుల నభిసరించుట మొదలగు సన్నివేశములు విదేశీయములుగానే కన్పించుచుండును. వాక్యనిర్మాణము కూడ

సహజముగా కన్పట్టదు. ఇది పంతులుగారి యనువాదము లన్నిట సామాన్యముగా కన్పట్టుచునే యుండును. ఉదాహరణమునకు

"MrsMal-An ill-tempered little devil! She'll be in a passion all her life-will she? (Aside)" అను వాక్యమును పంతులుగారు

"సుఖ - (తనలో) ఓసి దుస్స్వభావపు చిఱుభూతమా? ఇది యావజ్జీవమును కోపోద్రేకమును విడుపనే విడువదట ఏమి దీనిమిడిసిపాటు". అని యనువదించిరి. ఇట్టిభాగము లనేకము లీ నాటకమునందు చూపవచ్చును నైలునదిని గోదావరిగా మార్చుట, కళావతి (Lydia) చదువుట కిష్టపడు శృంగార ప్రబంధము లన్నిటిని, తెలుగు ప్రబంధములుగా మార్చుట, మొదలగు దేశీయమునైన మార్పులను పంతులుగారీ నాటకమునందు చేసియున్నారు. విచిత్రమైన మనస్తత్త్వములతో గూడిన పాత్రలతో నీ నాటకము హృదయాకర్షకముగా నుండును. షెరిడన్ కవీశ్వరుని నాటకములలో దీనిని, 'దిడ్యూయన్నా'యను వేరొక నాటకమును పంతులుగారు తెనిగించిరి

పంతులుగారి నాటకరచనమును గూర్చి యీ విషయములు క్రోడీకరింపవచ్చును. పంతులుగారు 1875 వ సంవత్సరమున నాటకరచనమునకు బూనుకొనిరి. ఆంగ్లానువాదములో రూపకరచనకు ప్రారంభించిరి 1875లో రెండును, 1880లో ఏడును 1885లో ఐదును, 1886లో ఒకటియు, 1889లో మూడును, 1894లో ఒకటియు, పంతులుగారు రచించుటకు పూనుకొని, కొన్ని యసంపూర్ణములుగాను, కొన్నిటినిపూర్తిగను రచించిరని తెలుసుకొనవచ్చును. ఆంగ్లరూపకానువాదములందును, సంస్కృతానువాదము లందును, మూలావిదేయములగు మార్పులు కొన్ని చేసిరి తమకు పూర్వులిరువురు షేక్స్పియర్ నాటకములనే యనువదించుటబట్టి, తాము కూడ షేక్స్పియర్ నాటకమునే యనువదించుటకు పూనుకొనిరి. షెరిడన్‌కవి నాటకములందలి సంఘదురాచార నిరసనము పంతులుగారి నాకర్షించుట వలన వానిని పంతులుగారనువదించిరి. షెరిడన్ నాటకానువాదములను చేపట్టునాటికి పంతులుగారు, సాంఘిక దురాచారములను నిరసించు రచనలెన్నియో వెలువరించియుండిరి. మూలము గద్యపద్యాత్మకముగా నున్నను, కొన్నిటిని కేవలము గద్యనాటకములుగానే పంతులుగారు రచించిరి. కొన్ని యెడల మూలసన్నివేశములను విస్తృతపరచిరి సంస్కృతానువాదములందు తమ పూర్వు లవలంబించిన పద్ధతులు కాక క్రొత్త పద్ధ

తులను ప్రవేశపెట్టిరి. నాంది ప్రస్తావనలందు తమను గూర్చి చెప్పికొనలేదు సంస్కృత రూపకానువాదములందు పాటలు ప్రవేశపెట్టుటలోకూడ వీరాద్యులు పాండిత్య ప్రకర్షకాక, భావానుసరణమునకు, వైశద్యస్ఫూర్తికి ప్రాధాన్యమిచ్చిరి.

స్వతంత్ర పౌరాణికరూపకములందును తమ యభిరుచుల కనుగుణముగా మార్పులను ప్రవేశపెట్టిరి. సాంఘికరూపకములను వ్యావహారిక భాషయందురచించిరి. వ్యావహారికమునందు రసానుగుణముగ గ్రంథములు వ్రాయవచ్చుననుట వారి కంగీ కార్యమని బ్రాహ్మవివాహము, వ్యవహార ధర్మబోధినుల వలన గ్రహింసవచ్చును రూపకములందు పాత్రోచిత భాషను ప్రవేశపెట్టిన వేదంవేంకటరాయశాస్త్రిగారికిని, గురజాడ అప్పారావుగారికిని, వ్యావహారిక భాషోద్యమమును నిర్వహించిన గిడుగు వెంకటరామమూర్తి పంతులుగారికిని పూర్వమే, వీరేశలింగం పంతులుగారు వ్యావహా రికభాషను, తమ ప్రహసనములందు కూర్చి యున్నారు సమకాలీన సంఘమును కథావస్తువుగా స్వీకరించిన వారిలో ఆధునిక కాలమున పంతులుగారాద్యులు.

ప్రథమాంధ్రనాటక సమాజమును స్థాపించుటయు, తొలిసారిగ రూపక ప్రద ర్శనము నిర్వహించుటయు, పంతులుగారికే దక్కినవి. ప్రదర్శన సౌలభ్యమునెడ వారు మిక్కిలి శ్రద్ధవహించిరి ఆంగ్ల రూపక సంప్రదాయానుసారముగా, అంకములను రంగములుగా విభజించుపద్ధతిని పంతులుగారు ప్రవేశపెట్టిరి. పంతులుగారు రచించిన నాటకములు, ప్రహసనములు సమకాలీన సంఘమును మిక్కిలి ప్రభావిత మొనర్చి నవి. తెలుగునాట ప్రబోధ వాఙ్మయమును సృష్టించుటయందు పంతులుగారాద్యులు, అగ్రగణ్యులునునై యున్నారు. పంతులుగారు నాటక సాహిత్యమున కొనర్చినసేవ బహుముఖమును, గణనీయమునునై యున్నది.

—: ౦ :

## నవల

నవ్యవాఙ్మయ శాఖలయందు నవలకుగల స్థానము విశిష్టమైనది ఆంగ్ల ాహిత్యప్రభావమున తెలుగు భాషయందు వెలసిన సాహిత్య ప్రక్రియలలో 'నవల' ిందినట్టి ప్రాచుర్యము మరియే ఇతర శాఖయు పొందలేదని చెప్పవచ్చును

తెలుగు సాహిత్యమునందు, నవలారచనమునకు క్రీ శ. 1872వ సంవత్సర ాంతమున శ్రీకారముచుట్టబడినది. ప్రాథమిక దశయందు 'నవల'ను సాహితీ ులు వచన ప్రబంధమని పిలుచుచుండిరి. అనగా వచన ప్రబంధమను పేరు వలకు సమానార్థకముగా నుపయోగింపబడుచుండెను. దీనికి కారణము, మనవారు ంగ్లసాహిత్యము నందలి యీ ప్రక్రియావిశేషమును, మన ప్రబంధలక్షణములు లదానినిగా భావించి యుండుటే యని చెప్పవచ్చును

"ఈ వఱకు మనయాంధ్రభాషలో జనుల యాచార వ్యవహారములను లుపుచు నీతి బోధకములుగానుండు వచన ప్రబంధము లేవియు లేకపోవుట యెల్ల ారికిని విశదమయియే యున్నదిగదా?" అని పంతులుగారు రాజశేఖర చరిత్రము ుదటికూర్పు పీఠికయందు వ్రాసియున్నారు. తొలితెలుగు నవల యనుకొనబడు ున్న శ్రీరంగరాజ చరిత్రము ముఖపత్రమునందుసైత మా గ్రంథమునుగూర్చి హిందువుల యాచారములు తెలుపునట్టి నవీన ప్రబంధమ"నియే యున్నదికాని నవల ని లేదు.

కనుక ఆంగ్లమునందు నవల (Novel) యను దానిని మనవారు వచన ్రబంధముగా మొదట మొదట పిలుచుచుండినట్లును, క్రమముగా తెలుగునందు కూడ చన ప్రబంధము స్థానమును నవల యాక్రమించి, తెలుగు సాహిత్యమునందీ నూతన ్రక్రియకు 'నవల' యను పదము రూఢమయ్యెననియు గ్రహింపనగును.

వీరేశలింగంపంతులుగారు కూడ ప్రథమమున తమ నవలలను వచన ్రబంధములనియే పిలిచియుండిరి. పంతులుగారి విగ్రహరచనమునకు సంతోషించి మద్దిరంగయ్య సెట్టిగారు వారికి,

"Can you not undertake the writing of an original Novel in Telugu" అని వ్రాయగా నీ భావమును పంతులుగారిట్లు తెనిగించిరి.

"తెనుగులో నొక స్వయం కల్పితమైన వచన ప్రబంధమును వ్రాయుటకు మీరు పూనుకొనలేరా ?' 1

పంతులుగారు నావలె (Novel) అను నాంగ్లపదమునకు సమానార్థకముగ వచన ప్రబంధమను తెలుగు పదము ననేకసందర్భము లందుపయోగించియున్నారు 2

వీరేశలింగంపంతులుగారేకాక, వారి సమకాలికులును 'నవల' యను పదమునకు వచన ప్రబంధమను పదమునే సమానార్థకముచేసి యున్నారు. దీనికి దృష్టాంతముగా శ్రీరంగ రాజచరిత్రమును నాటి పత్రికా లోకమునందు విశిష్ట స్థానము గడించిన పురుషార్థప్రదాయిని, వచన ప్రబంధమని పేర్కొనుచ, నీ భావమునే ఆంగ్లమునందిట్లు వెల్లడించినది

"Rangarajucharitra, by N Gopalakrishnamachetty Caru is a **Novel** in a sweet easy grammatical and idiomatic Telugu Prose" 3

ఈ రంగరాజు చరిత్రమును గూర్చి 1872 వ సంవత్సరము అచ్చయిన పుస్తకములను గూర్చి తెలుపు ఫోర్టుసెయింట్ జార్జిగెజెటులో, ఇట్లు వివరింపబడినది

"This is apparently the first attempt ever made in this part of India at novel writing in Telugu prose..." 4

కాని ఈ పుస్తకము ముఖపత్రము పైని

శ్రీరస్తు
శ్రీరంగరాజచరిత్ర
సోనాబాయి పరిణయము
హిందువుల యాచారములు తెలుపునట్టి నవీన ప్రబంధము
నరహరి గోపాలకృష్ణమచెట్టిచే ప్రణీతంబు
Madras
Printed at the Viyavahara Tarangini Press
1872
Registered copy right

అని కలదు

ఇంకను తెలుగుభాషయందు నవలారచనమును ప్రోత్సహించు నుద్దేశముతో పోటీలను నిర్వహించిన చింతామణి పత్రికగూడ ఆంగ్లములోనినవల(Novel) యను పదమునకు వచన ప్రబంధమనుపదమునే సమానార్థకముగా నుపయోగించినది.[5] ఈ బహుమాన నిబంధనలం దెచ్చటను నవలయను పదముపయోగింప బడలేదు ఆంగ్లమున (Novelelte) అనుపదమునకు సమానార్థకముగా తెనుగున ప్రబంధ మని యనుపదింపబడినది. చిలకమర్తి లక్ష్మీనరసింహ కవిగారు చింతామణి బహుమానములను గూర్చి చెప్పుచు నవలను ఆఖ్యాయిక యని పిలిచిరి.[6]

కాని 1897 వ సంవత్సరమునందు వివేకచంద్రికావిమర్శనమను రాజశేఖర చరిత్ర విమర్శనమును ప్రచురించిన కాశీభట్ల బ్రహ్మయ్య శాస్త్రిగారు సాహిత్య ప్రక్రియను నవలయనియే సంభావించి యున్నారు.[7] కాని వారు సైతము దీనిని వచన ప్రబంధమనియే తలంచిరి సంస్కృతమునందున్న కాదంబరి, వాసవదత్త మొదలగు వచనకావ్యము లీ నవలయనబడు సాహిత్య ప్రక్రియకు సంబంధించినవని బ్రహ్మయ్యశాస్త్రిగా రభిప్రాయ పడిరి

"ఈవిధమగు గ్రంథము లింగ్లీషుభాషయందు విశేషముగాఁ గలవుకాని మన భాషలయందంతగా గానరావు. అందులోఁ దెనుగునందు బొత్తుగాలేవు. సంస్కృతమునందన్నను వాసవదత్త, కాదంబరి లోనగువానినీతరగతిలోనివానిగా జెప్ప వచ్చును. ఆంధ్రమందుగల కళాపూర్ణోదయము గద్యపద్యాత్మకముగాక కేవల వచన భూయిష్ఠమైనచో నీవిధమగు దానినిగానే జెప్పవచ్చును..."[8]

కాని యీ ప్రక్రియకు నవలయను పదమే సార్థకమని బ్రహ్మయ్యశాస్త్రిగారు సాంస్కృతికముగా నీ పదమును సాధించియున్నారు.

"ఆంగ్లేయ భాషలో నావల్ (Novel) అను పదము 'క్రొత్త' యను నర్థము గల 'నవ్' అను పదమునుండి పుట్టినది – ఈ 'నవ్' అనుదానికి 'నవ' యను మన సంస్కృత పదంబునకునుఁగల సంబంధము తేటతెల్లమెకదా? కావున నవల యనగా నవాన్‌విశేషాన్, లాతిగృహ్ణాతీతినవలా— అనగా గ్రొత్త విశేషంబుగలదని యర్థము వచ్చుచున్నది హూణభాషయందు నీమాట కిదేయర్థ మగుటచే 'నావల' ను పదమునకు సరియైన వేఱొక సంస్కృతపదమునకయి ప్రయత్నము చేయక 'నవల' యని యీ పదమునే నిట వాడుచున్నాను[9]"— కనుక ప్రాధ

మిక దశయందీ ప్రక్రియను వచన ప్రబంధమని పిలుచుచుండిరనియు, క్రమముగా 'నవల' యను పదము రూఢమయ్యెననియు స్పష్టమగుచున్నది

ఇంకను యీ నవలాప్రక్రియ యనునది ఆంగ్లభాషా ప్రభావమువలననే తెలుగు భాషయందుద్భవించి వికాసముజెందిన దనియు విమర్శకులు తలంచుచున్నారు సంస్కృతమున నీలక్షణములుగల వచన కావ్యములున్నను, ఆంగ్లవాఙ్మయ ప్రేర ణముననే నీశాఖ తెలుగునందు వెలసినదని యనేకుల యభిప్రాయమై యున్నది. ఈ యభిప్రాయమునే బ్ర. శ్రీ. వేదము వేంకటరాయశాస్త్రిగారు సైతము వెల్లడించిరి.

"మనవారు మేఁకదాటుగా చిరకాలము పురాణముల నాంధ్రీకరించి తర్వాతం బ్రబంధంబుల విసిగి యిపుడు అన్యములం దొడంగినారు. మరియు గీర్వాణనాటకముల నెత్తింగియు హూణనాటకములం జదువుపఱకు నాటకముల వ్రాయరైరి. గీర్వాణ కథల నెఱింగియు హూణ నవలలంగాంచిన దనుక నవలలవయింబడరైరి "[10]

ఇక తొలితెలుగు నవలనుగూర్చి విచారింపవలయును. తెలుగుభాషయందు వెలువడిన తొలినవలనుగూర్చి, సాహితీపరులలో ఏకాభిప్రాయములేదు.

వీరేశలింగంపంతులుగారు తమ స్వీయచరిత్రమున "తెలుగున మొదటి వచన ప్రబంధమును నేనే చేసితిని" అని వ్రాసికొని యున్నారు నరహరి గోపాలకృష్ణమ్మ చెట్టిగారి శ్రీ రంగరాజ చరిత్రము తొలి తెలుగు నవలయని కొందరు తలంచు చున్నారు. అట్లు తలంచుటకు కొన్ని యాధారములు గలవు. కాని వీరేశలింగం పంతులుగారి రాజశేఖర చరిత్రముకన్నను, దీనికి ఆరుసంవత్సరములు ముందు వెలువడిన శ్రీ రంగరాజ చరిత్రముకన్నను, పూర్వమే శ్రీ కొక్కొండ వేంకటరత్నము పంతులుగారు 'మహాశ్వేత'యను నవలను రచించియుండిరనియు, అది యే తెలుగు భాషయందు తొలి నవలయనియు శ్రీ నిడుదవోలు వేంకటరావుగా రభిప్రాయపడు చున్నారు.

"పై వానియన్నింటికన్న ముఖ్యమైనది మహాశ్వేత నవలారచన పంతులుగారు క్రీ. శ 1877 వ సం॥న రచించిరి – తెనుగున నవలారచనకు పంతులుగారు ప్రథములు ఈ నవలలో కొంతభాగము 1895 వ సంవత్సరమున వైజయంతీ పత్రికయందు ప్రకటితమైనది – ఇది వీరేశలింగం పంతులుగారి రాజ శేఖరచరిత్రకన్న యిరువది రెండేండ్లు ముందుగ వెలసినది."[11] ఈ విషయమునే

వేంకటరావుగారు పలుతావుల ప్రస్తావించి యున్నారు రాజశేఖరచరిత్రముకన్న మహాశ్వేత ఇరువదిరెండేండ్లు ముందువెలువడెననుట ప్రమాదపతితము. 'మహాశ్వేత' 1867 వ సంవత్సరమున రచింపబడగా రాజశేఖరచరిత్రము 1878 వ సంవత్సరమున వివేకవర్ధనియందు భాగభాగములుగా వెలువడినది. కనుక 11 సంవత్సరములు మాత్రమే మహాశ్వేత రాజశేఖర చరిత్రముకన్న ముందు వెలువడినది. తమవాదమున కాధారముగా వేంకటరావుగారు శివశంకర పాండ్యాజీయనువారు వేంకటరత్నము పంతులుగారి సాహిత్య జీవితమను వ్యాసమునందు వ్రాసిన "In 1867, he (Venkataratnam pantulu) composed in first Telugu Novel by name Mahasweta founded on the pleasant story of kadambari the masterpiece of Banabhatta in sanskrit..." అను వాక్యముల నుదాహరించుచున్నారు

కాని వేంకటరత్నము పంతులుగారి నవలను 1895 వ సంవత్సరము దనుక ప్రచురింపలేదు. 1895వ సంవత్సరమున చెన్నపట్టణమునుండి శ్రీపనప్పాకము ఆనందాచార్యులవారి యాజమాన్యమున వెలువడుచుండిన 'శ్రీ వైజయంతి' యను సారస్వత మాసపత్రికయందు 'మహాశ్వేత' లోని కొంతభాగము వెలువడినది అప్పుడైనను యీ నవల ఆ పత్రికయందు పూర్తిగా వెలువడియుండలేదు కనుక యీ 'మహాశ్వేత' నవలగా నెక్కుడుప్రచారమును బొందియుండలేదు ఇది వెలువడు నాటికి చింతామణి పోటీఫలితములు వెలువడుటయేగాక చిలకమర్తి లక్ష్మీనరసింహ కవిగారివంటివారు నవలారచనమునకు బూనుకొనిరి.

వీరేశలింగంపంతులుగారు 1875 వ సంవత్సరమున శివశంకరపాండ్యాగారు ప్రకటించిన విగ్రహతంత్ర టిప్పణమును చూచియే యున్నారు ఆ టిప్పణమును, వేంకటరత్నము పంతులుగారి విగ్రహతంత్రమును పంతులుగారు తమ వివేకవర్ధనియందు విమర్శించియున్నారు. వేంకటరత్నము పంతులుగారు తొలి తెలుగు నవలా కర్తలను పాండ్యాగారి వాక్యములను వీరేశలింగము పంతులుగారు చూచియుండరనుట సత్యముకాజాలదు ఆ వాక్యములను చూచియు, వీరేశలింగం పంతులుగారు తాము "తెలుగున మొదట వచన ప్రబంధమును చేసితిమని చెప్పుకొనుటకు హేతువును విచారింపవలయును 1867 వ సంవత్సరముననే పంతులుగారిచే విరచింపబడెనన్న 'మహాశ్వేత' 1895 వ సంవత్సరము వరకు ప్రచురింపబడక

పోవుట ప్రధమకారణము 1895 లో వైజయంతిలో భాగభాగములుగా ప్రచురింపబడిన 'మహాశ్వేత'ను వీరేశలింగంపంతులుగారు వచన ప్రబంధము (నవల)గా గ్రహింపకపోవుట రెండవకారణము కనుకనే 1913వ సంవత్సరమున పంతులుగారు తమ స్వీయచరిత్రమునందలి ద్వితీయభాగమును వ్రాయుచు, తామే తెలుగున మొదట వచన ప్రబంధమును వ్రాసితి మని చెప్పుకొనుట పొసగినది

''మహాశ్వేత' తొలి తెలుగు నవల యగునా, కాదా యన్న విషయము నిట విచారింపవలెను

'మహాశ్వేత' తొలి తెలుగు నవలయనుటకు శివశంకర పాండ్యాగారి వాక్యములు దక్క నితరాధారము లెవ్వియునులేవు. వారీ 'మహాశ్వేత' కాదంబరి యాధారముగా రచింపబడినదని వ్రాసిరి కాని వేంకటరావుగారు వ్రాసినట్లు ''నవ్య వాఙ్మయ శాఖలలో నాంగ్లేయ భాషాసంస్కార ప్రభావము హెచ్చుగానున్న శాఖ 'నవల' యైనప్పుడు వెంకటరత్నము పంతులుగారి 'మహాశ్వేత' పై ఆంగ్లేయభాషాసంస్కార ప్రభావమును గుర్తింపలేము.

కనుక 'నవల'కు వారు చెప్పిన నిర్వచనము ననుసరించి 'మహాశ్వేత' తొలి తెలుగు నవల కాజాలదు. కాని సంస్కృతమున ప్రౌఢకావ్యమైన కాదంబరిని నవలా లక్షణములుగల దానినిగా గ్రహించి తొట్టతొలుత వచనకావ్యముగా దానిననువదించిన వారు వేంకటరత్నము పంతులుగారే కావున, వారే తెలుగున తొలినవలను రచించినారని వేంకటరావుగారు సాధింపజూచుచున్నారు.[12] కాదంబరివంటి రచన స్వోపజ్ఞమైనప్పుడు దానిని నవల యనవచ్చునుగాని, అనువాదమును 'నవల' యనరాదు కేవలానువాదముకాక అనుసరణమైనను నీ నూత్నప్రయత్నమును 'నవల' యనవచ్చునుకాని, యధామాతృకానువాదమును 'నవల' యని పిలుచుట పొసగదు

ప్రబంధ లక్షణములను పరిశీలించినను నీ విషయము స్పష్టమగును మన ప్రబంధముల ముఖ్యలక్షణమును గమనించిన, గ్రబంధమున ఇతివృత్తమును పూర్వకావ్యములనుండి గ్రహింపవచ్చునుగాని, అది యధామాతృకానువాదము కాగూడదు. కనుకనే శ్రీనాధాదుల శృంగారనైషధము, హర్షచరిత్రాదులు ప్రబంధములు కాజాలక పోయినవి ఆంధ్రకవితాపితామహుని మనుచరిత్రమే మొదటి ప్రబంధముగా ప్రసిద్ధి జెందినది పిల్లలమర్రి పినవీరభద్రుని అభిజ్ఞాన శాకుంతలము సైతము ప్రబంధ

మనిపించుకొనలేకపోవుట కిదియే కారణము. కనుక కాదంబరి కనువాదమైన 'మహాశ్వేత' తెలుగున మొట్టమొదటి వచన ప్రబంధము (నవల) కాజాలదు చింతామణి పత్రిక నిర్వహించిన పోటీ నిబంధనలను, ప్రథమ దశయందు వెలువడిన తెలుగు నవలలను పరిశీలించినచో, వచన ప్రబంధములకును, మనుచరిత్రము, కళాపూర్ణోదయము మొదలగు పద్యకావ్యములకును, భేదము కానరాదు. పద్యకావ్యముల యందున్న ప్రబంధ లక్షణముల ననుసరించి వచన కావ్యములు రచించిన, అవి వచన ప్రబంధములు (నవలలు)గా రూపొందునని వారు నిర్ణయించియుండిరి. చింతామణి పత్రిక వచనప్రబంధ లక్షణములను వివరించుచు,

"ప్రబంధ మనగా కల్పితమైనకథ. ఆ కథను పురాణేతిహాసాదుల నుండిగాని, చరిత్రములనుండిగాని గైకొని కథాసారస్యమున కనుకూలముగా నుండు లాగున దానికి నూతనాంశములను జేర్చి పెంచి వ్రాయవచ్చును; లేదా కవి మొదటినుండి కడవఱకును స్వబుద్ధిచేతనే నూతన కథను కల్పించియైనను వ్రాయవచ్చును......

"శృంగారమో వీరమో యేదో యొకరసమును ప్రధానముగాఁ జేసికొని వివిధ రససంయుతముగ నుండునట్లుగాని, యాయా రసమును పోషించుటకయి వివిధ కష్టసుఖములను ప్రయత్నములను కార్యవిఘాతములను కార్యసాఫల్యములను మధ్య మధ్య సందర్భోచితముగఁ దీసికొని వచ్చుచు కథయంతయు నొక్కని చరిత్రము వలె నుండునట్లు వ్రాయవలెను......"[13] అని సూచించినది

ఈ వివరణమునుబట్టి వచన ప్రబంధము నందలి ఇతివృత్తము అనువాదము కారాదనియు, రసము శృంగారమో, వీరమో, యయి యుండవలయుననియు, ఏక నాయకాశ్రయత్వముండవలెననియు నిర్ధరింపబడుచున్నది. ఇవి ప్రబంధముల (మనుచరిత్రము, కళాపూర్ణోదయము) ముఖ్యలక్షణములనే సూచించుచున్నవి కదా!

ఈ దృష్టితో బరిశీలించిన శ్రీ కొక్కొండ వేంకటరత్నము పంతులుగారి మహాశ్వేత వచన ప్రబంధము కాజాలదు. ఏలయనగా

1 మహాశ్వేత సంస్కృత కాదంబరి కనువాదమై యున్నదేకాని శివశంకర పాండ్యాగారు వ్రాసినట్లు అనుసరణము (founded on the pleasant story of Kadambari the masterpiece of Banabhatta in Sanskrit)కాదు

2. ఆంగ్లభాషా సంస్కార ప్రభావ మీ గ్రంథముపై లేదు.

3. ఇది 1895వ సంవత్సరమున వైజయంతి పత్రికయందు ప్రచురింప బడినది కాన అద్యతన నవలాకారులపై దీనిప్రభావము లేదు.

4 ఇది అసంపూర్ణముగా లభించుచున్నది. కాదంబరి యాధారముగా రచింప బడినదికాక, ఇది కాదంబరి యనువాదమని మూలగ్రంధముతో దీనిలోని కొన్ని భాగములను పోల్చిచూచిన (సమానఘట్టములను) తెలియనగును. ఉదాహరణమునకు,

"నాస్తిఖల్వసాధ్యం నామభగవతో మనోభువః క్వాయం హరిణ
ఇవవనవాస నిరతః స్వభావ ముగ్ధోజనః ? క్వచ వివిధ విలాస
రాశిర్గంధర్వ రాజపుత్రీ మహాశ్వేతా ?..."

కాదంబరి, పుట 151.

"అయ్యో ! అడవి యిఱ్ఱివలె స్వభావ ముగ్ధుండైన యీ మౌని
పుండరీకుండెక్కడ ? వివిధవిలాస రాశియైన యీ గంధర్వ రాజ
పుత్రి మహాశ్వేత యెక్కడ ?"...

మహాశ్వేత-వైజయంతి, 1895 ఆగష్టు.

"...ఇత్యభిధాయ ప్రతివచనకాల మప్రతీక్ష్యైవ పురోయాయినా
అంబాయాః ప్రవిశతా కనకవేత్రలతాకరేణ ప్రతీహారీజనేన
కంచుకి లోకేన గృహీత తాంబూల కుసుమ పటవాసాంగరాగేణ
చామరవ్యగ్రపాణినా కుబ్జ కిరాత బధిరవామన వర్షధవ వికలమూ
కానుగతేన పరిజనేన సర్వతస్సంరుద్ధా ద్వారదేశే కథమప్య
వాప్త నిర్గమః ప్రయయౌ..."

కాదంబరి పుట (151)

"...ప్రతివచనమున్నిరీక్షింపకయే, ముస్ముమ్ము బంగరు బెత్తములఁబట్టు కొని ప్రవేశించు చున్నట్టి పనికత్తెల చేతను, కోజలచేతను, తమ్మలమ్మను బువ్వు లను గందమును గందపుఁ బొడిని గొడుగు సీవురుల నాలవట్టములను, గొని వెంట

నంటిన కుబ్జ కిరాత బధిర వామన బర్బర వికల మూకానుగత పరిజనుల చేతను, అంతట నడ్డగింప బడిన తలవాకిటినుండి యెట్లో వెలువడిపోయెను..."[14]

మహాశ్వేత-వైజయంతి; 1895 ఆగష్టు

ఈ విధముగా 'మహాశ్వేత' మూలగ్రంధమైన కాదంబరిలోని మహాశ్వేత వృత్తాంతమున కనువాదమని స్పష్టపడుచున్నది.

వేంకటరత్నము పంతులుగారు కాదంబరిని సంపూర్ణముగా ననువదింపక, మహాశ్వేత వృత్తాంతమును మాత్రమే తెనిగించి, 'మహాశ్వేత' యని గ్రంధనామ మిడుటతప్ప, మరెట్టి మార్పును చేసియుండలేదు వాక్య నిర్మాణమునందుకూడ వేంకట రత్నము పంతులుగారు సంస్కృత మర్యాదానుసారిగనే రచించిరికాని, మూలకధను గైకొని, నూతనములైన కల్పనలుగాని, క్రొత్తవర్ణనములు గాని కూర్చి, విస్తరించి దీనిని 'నవల' వలె రచించి యుండలేదు

ఇంకను వేంకటరత్నము పంతులుగారి గ్రంధములలో నీ 'మహాశ్వేత' యెట్టి ప్రశస్తినిబొందియుండలేదు. తరువాత నవలారచనమునందు లబ్ధప్రతిష్ఠులైన రచయితలేరును ఈ 'మహాశ్వేత' ను స్మరించి యుండలేదు. కనుక 'మహాశ్వేత' ను తొలితెలుగు నవల యనుట పైజూపిన కారణములవలన సంభవింపదు.

దీని తరువాత పేర్కొనదగినది నరహరి గోపాలకృష్ణమ్మచెట్టిగారిచే విరచిత మైన శ్రీరంగరాజ చరిత్రము దీనిని తొలితెలుగు నవలయని కొందరు పరిశోధకులు తలంచుచున్నారు.[15] ఈ వచనప్రబంధము 1872వ సంవత్సరమున వెలువడినది. అనగా వీరేశలింగము పంతులుగారి రాజశేఖర చరిత్రమునకు ఆరు సంవత్సరముల ముందుగానే యీ రంగరాజు చరిత్రము వెలువడినది దీనికి సోనాబాయి పరిణయ మని మరియొక పేరుకూడ కలదు. ఈ వచనప్రబంధ మైదుఉల్లాసములుగ విభజింప బడినది· దీనికి ఆంగ్లమునందును, తెనుగునందును రెండు ఉపోద్ఘాతములు చేర్ప బడినవి. ఈ గ్రంధముయొక్క అవతరణమును గూర్చి రచయిత ఉపోద్ఘాతమునం దిట్లు తెలిపిరి

"పదినెలలనాడు లార్డుమేయోగారు బంగాళుల యాచారంబులు తెలుపు ప్రబంధముగావించువానికి బహుమానంబు చేయబడునని ప్రచురము చేసిరి. అది నేను చదివినప్పుడు తెలుగుదేశమువారి యాచారంబులు తెలుపునట్టి ప్రబంధంబొకటి

రచియించుట తెలుగువారి కుపయు క్తంబగునని తలంచి నానేర్పుకొలదిని ప్రబంధంబు చెప్పబూనితిని".

ఈ శ్రీరంగరాజు చరిత్రము లార్డుమేయోగారి కంకితము సేయబడినది. గోపాలకృష్ణమచెట్టిగారు (1833 - 1888) కర్నూలుజిల్లాకు డెప్యూటీ కలెక్టరుగా పనిచేసిరి. వీరు ఆంధ్ర వ్యాకరణమును కూడ రచించిరి అంగ్లేయభాషలో కర్నూలు జిల్లా వృత్తాంతము (Kurnool District Manual) రచించిరి. స్ట్రేంజిదొర వారి హిందూధర్మశాస్త్రమునకు పరవస్తు చిన్నయసూరిగారి తెనుగుసేతయందుగోపాల కృష్ణమచెట్టిగారు తోడ్పడియున్నారు వీరుకూడ కాదంబరిని తెనుగుసేయవలెనని తలంపు గొనినట్లును కాని సఫలీకృత మనోరథులు కానట్లును వీరి జీవితచరిత్రమును సీసపద్యశతకమునందు గూర్చిన వీరి కొమారులు రాజామణి సెట్టిగారు వ్రాసి యున్నారు.[16] ఈ రాజామణిసెట్టి విజయనగర ప్రభువులగు శ్రీమదానందగజపతి మహారాజులచే సన్మానింపబడెను. వీరు మహారాజుల ఆస్థాన విద్వాంసులుగానుండిరి చెన్నపట్టణమునుండి 'మహా వినోదిని' యను పత్రికను గూడ కొన్నాళ్ళు నడిపిరి.

శ్రీరంగరాజ చరిత్రమునందలి ఇతి వృత్తము కల్పితమే యైనను, కథా పాత్రములు చారిత్రికేతివృత్తముల యందలి వానివలె కన్పట్టుచుండును. ఇట్లు కల్పించుటకు కారణమును గోపాలకృష్ణమసెట్టిగారిట్లు వివరించియున్నారు.

"ఇది కేవలము కల్పితంబు కథానాయకుండు - మహాకులీనుడై యుండ వలయునను యాదేశంబున మున్ను దొరతనము చేసిన విద్యానగరరాజువంశము వారిలో శ్రీరంగరాజనుపేరు గై కొంటినిగాని యిందుఁ జెప్పిన చరితము యథార్థముగా జరిగినకథయని యెంచగూడదు ఇందు జెప్పిన యాచారములు మాత్రము యథార్థ ముగా నాచరింప బడునవి. ఈకథ 400 సంవత్సరములనాడు జరిగినట్లుగా చెప్పఁ బడియెగాని యప్పటి యాచారములకు నిప్పటి యాచారములకు లేశంబుగాని భేదంబు లేమింజేసి యిందుదాహరింపబడిన యాచారంబులన్ని యిపుడాచరింప బడుచున్నవని యెఱుంగునది..."

ఈ గ్రంథము హిందువుల యాచారములు దెలుపునట్టి నవీన ప్రబంధము కావున కులాచారములు, వర్ణభేదములు, శకునములు, గ్రహశాంతులు, వేశ్యాలంపటత్వము మూఢాచారములు, అంధవిశ్వాసములు, మొదలగునవి బాగుగా విమర్శింపబడినవి

'నవల'కు తెలుగు భాషయందు వచన ప్రబంధమను పదమును సృష్టించి, వ్యాప్తిలోనికి తెచ్చినది గోపాలకృష్ణమసెట్టిగారే. ఆధునిక యుగమున జనుల యాచార వ్యవహారములను విమర్శించు గ్రంథములను రచించుటకును వీరాద్యులు వీరి రంగరాజు చరిత్రముయొక్క ప్రభావము వీరేశలింగంపంతులుగారిపై కలదని చెప్పుటకు సాక్ష్యము లున్నవి. వీరేశలింగంపంతులుగారి తొట్టతొలుతటి వచన ప్రబంధమైన రాజశేఖర చరిత్రమునకును శ్రీరంగరాజ చరిత్రమునకును నామ సామ్యము కూడ నున్నది. శ్రీరంగరాజ చరిత్రమునకు సోనాబాయి పరిణయమను మరియొకపేరుకూడ కలదు. అట్లే రాజశేఖర చరిత్రమునకు వివేకచంద్రిక యను మరియొకపేరుకూడ కలదు

వీరేశలింగంపంతులుగారి రాజశేఖర చరిత్రమును, శ్రీరంగరాజ చరిత్రముతో తులనాత్మకముగ పరిశీలనము చేసినచో, పంతులుగారు, జనుల యాచార వ్యవహారములను విమర్శించుటయందును, కథాసంఘటనములు కల్పించుటయందును శ్రీరంగరాజ చరిత్రము యొక్క సాహాయ్యమును కొంత పొందియున్నారని తెలియ నగును. శ్రీరంగరాజ చరిత్రము నందలి వర్ణనలు, సంఘటనలు కూడ రాజశేఖర చరిత్రమునందు కొన్ని పట్టుల ననుకరింపబడినవి.[17] కాని వీరేశలింగంపంతులు గారీ విషయమును రాజశేఖర చరిత్రము పీఠికయందుగాని, స్వీయచరిత్రమునందుగాని పేర్కొనకుండుట అనూహ్యము. పంతులుగారీ శ్రీరంగ రాజచరిత్రమును సలక్షణమైన వచన ప్రబంధముగా గుర్తింపని హేతువుచేతనో, యేమో, తెలుగుభాషయందు మొదటి వచన ప్రబంధమును తామే విరచించితిమని చెప్పికొనిరి పంతులుగారి తరువాత నవలలు రచించిన వారు సైతము శ్రీరంగరాజు చరిత్రమును స్మరింపలేదు. కనుక శ్రీరంగరాజు చరిత్రము నవలగా అంతప్రసిద్ధిని బొందియుండలేదు 'చింతామణి' పత్రిక నిర్వహించిన పోటీ పరీక్షలయందు సైతము నవలలు రచించు వారికి మార్గదర్శకములుగా రాజశేఖరచరిత్రము, సత్యవతీచరిత్రము, సత్యసంజీవని, సత్యరాజా పూర్వదేశయాత్రలు, పేర్కొనబడినవే కాని శ్రీరంగరాజచరిత్రము స్మరింపబడలేదు.[18] కనుక 1893వ సంవత్సరము నాటికే శ్రీరంగరాజచరిత్రము విస్మరింపబడినదని చెప్పవచ్చును. అందువలన వీరేశలింగంపంతులుగారే తెలుగు భాషయందు నవలా రచనమున కాద్యులని ప్రసిద్ధిని బడసిరి. లోకమునందు అర్వాచీనులైన సాహితీపరుల కెవరు మార్గదర్శకత్వమును వహింతురో, యెవరు అను

సరణీయులగుదురో, వారు ఆద్యులనియు, ఆచార్యులనియు కీర్తింపబడుట సహజమే! ఇంకను నవలయను నీసాహిత్యప్రక్రియ ఆంగ్లభాషా సంస్కార ప్రభావమున తెలుగులో వెలసినదిగా నిశ్చయించినప్పుడు, రాజశేఖర చరిత్రముపై గల ఆంగ్లవాఙ్మయ ప్రభావము, శ్రీరంగ రాజచరిత్రముపైన లేదు. అప్పటి రాజప్రతినిధియైన లార్డు మేయోగారి కంకితము గావింపబడుట, మేయోగారిబహుమానప్రకటనము శ్రీరంగ రాజచరిత్రము యొక్క అవతరణమునకు హేతు భూతమగుట, దక్క[19] ఆంగ్లభాషా సంస్కార ప్రభావము శ్రీరంగ రాజచరిత్రముపై నిలేదు. ఈ శ్రీరంగ రాజచరిత్రము నకు ఆంగ్లమునందొక యుపోద్ఘాతము కూడ కూర్పబడినది జనుల యాచార వ్యవహారములను తెలుపునిట్టి ప్రబంధ రచనా కుతూహలము, గోపాల కృష్ణమ సెట్టి గారికి కలుగుటకు, వారికిగల ఆంగ్లభాషాపాండిత్యమే కారణమై యుండునోపును. కాని శ్రీరంగ రాజచరిత్రముపై ఆంగ్లనవలల ప్రభావము గుర్తింపదగినంతగా లేదు.

కనుక సర్వలక్షణ సముపేతమైన తొట్టతొలుతటి తెలుగు నవల రాజశేఖర చరిత్రమనియే చెప్పవలసియున్నది. రాజశేఖర చరిత్రముతో బోల్చి చూచినచో శ్రీరంగ రాజచరిత్రము నందలి కథాకల్పనము, పాత్రగత సన్నివేశములు, సాంఘిక విమర్శనము, శైలి, పేలవముగా కన్పట్టక మానవు కాని కాలమునుబట్టి శ్రీరంగ రాజచరిత్రము, రాజశేఖర చరిత్రముకన్న ఆరు సంవత్సరములు ముందు వెలువడి యుండుటనుబట్టి, తెలుగు నవలారచనాపరిణామమునందు శ్రీరంగ రాజచరిత్రము నకు సముచితమైన స్థానము గలదు.

కనుక, కొక్కొండ వేంకటరత్నము పంతులుగారి 'మహాశ్వేత' యందును, నరహరి గోపాలకృష్ణమసెట్టిగారి 'శ్రీరంగరాజచరిత్ర'మునందును వచన ప్రబంధ లక్షణములు కొన్ని యున్నను, 'నవల' లక్షణము లన్నియును సంపూర్ణముగా సంతరించుకొని వెలసినది రాజశేఖర చరిత్రమే యని గ్రహింపవలెను కనుకనే రాజశేఖర చరిత్రము తెలుగు సాహిత్యమునందు తొలి నవలగా వినుతి కెక్కినది.

వీరేశలింగంపంతులుగారు మొత్తము నాలుగు నవలలను రచించిరి. పంతులుగారి సత్యసంజీవనిని కూడ వచన ప్రబంధముగా చింతామణి పత్రిక పేర్కొనెను కాని, పంతులుగారి ఇతర నవలలైన సత్యవతీ చరిత్రము, చంద్ర మతీ చరిత్రము, సత్యరాజా పూర్వదేశయాత్రలతోపోల్చి చూచిన, 'సత్యసంజీవని' పెద్దకథవలె సాగినదికాని, నవలా లక్షణములను కలిగియుండలేదు.

పంతులుగారి నవలలయందు మాత్రమేగాక, వారి సర్వసాహిత్య సృష్టి యందును, అద్యతనాంధ్ర వాఙ్మయమునందును, విశిష్టమైనస్థానము నలంకరించినది వారి రాజశేఖర చరిత్రము.

పంతులుగారి రాజశేఖర చరిత్ర రచనముతో ఆంధ్రవాఙ్మయమునందొక యుజ్జ్వలాధ్యాయము ప్రారంభింప బడినదని చెప్పవచ్చును. రాజశేఖర చరిత్రము రచించు కాలమునకు పంతులుగారి వయస్సు ముప్పదియేండ్లు పంతులుగారి జీవితము నందు రాజశేఖరచరిత్ర రచనాఘట్ట ముజ్జ్వలమైనది పంతులుగారి విశ్వాసములందు అభిరుచులయందు, ఆదర్శములందు, రాజశేఖర చరిత్ర రచనాకాలము, పరిణామ ఘట్టమును సూచించుచున్నది. సాహిత్య ప్రయోజనమును గూర్చిన పంతులుగారి యభిప్రాయములలో గొప్ప మార్పునకు రాజశేఖర చరిత్రము లక్ష్యప్రాయమై వెలయుచున్నది అంతకు పూర్వము పంతులుగారు శృంగార నిరోష్ఠ్య నిర్వచన నైషధము, రసికజనరంజనము, శుద్ధాంధ్రోత్తర రామాయణము, శుద్ధాంధ్ర భారత సంగ్రహము మొదలగు పద్యకావ్యములను, విగ్రహము మొదలగు వచనకావ్యము లను వెలయించి యున్నారు 1878 వ సంవత్సరమున రాజశేఖర చరిత్రమును రచించి, భాగభాగములుగా 'వివేక వర్ధని' యందు ప్రచురించియున్నారు. 1880 వ సంవత్సరమున దీనిని పుస్తకరూపముగా ప్రచురించి, అప్పటి విద్యావిచారణాధికారి యైన మేక్డోనాల్డు దొరగారికి అంకితము గావించిరి.

ఈ నవలారచనమునకు 'ఆలివర్‌గోల్డుస్మిత్' అను ఆంగ్లకవీశ్వరుని 'The Vicar of wake field' అను గ్రంథ సాహాయ్యమును తాము పొందియున్నా మని పంతులుగారు పీఠికలో తెలిపియున్నారు

"ఈ గ్రంథముయొక్క కథను గల్పించుటలో గోల్డుస్మిత్తను నింగ్లీషు కవీ శ్వరుని గ్రంథ సాహాయ్యమును గొంత బొందినను దానికిని దీనికిని విశేషసంబంధ మేమియు నుండదనియు, దీనియందు వ్రాయబడిన విషయములన్నియు నూతనములే యని గూడ విన్నవించుచున్నాడను "[20]

"పంతులుగారు The vicar of wake field అను గ్రంథమును దృష్టి యందుంచుకొని రాజశేఖరచరిత్రమునందలి ఇతివృత్తమును గల్పించినమాట వాస్తవమగునుగాని, పంతులుగారు చెప్పినట్లు "ఇంగ్లీషు కథకును దీనికిని విశేష

సంబంధములేదు. అది యొకయుద్దేశముతో చేయబడినది, ఇది వేఱొక యుద్దేశముతో చేయబడినది " మనలోగల మూఢవిశ్వాసములను పోగొట్టవలెనన్న ముఖ్యోద్దేశముతో...పంతులుగారీ రాజశేఖర చరిత్రమును రచించిరి.[21]

మూల గ్రంథమునందలి ప్రధానఘట్టములను, బలమైన సన్నివేశములను దృష్టియందుంచుకొని, వీరేశలింగంపంతులుగారు దేశకాలపాత్రములను మార్చి రాజశేఖర చరిత్రమును రచించిరి. దీనిని స్వేచ్ఛానువాదమని చెప్పుటకును వలను పడదు. ఇంచుమించుగ నిది స్వకపోల కల్పితమని పంతులుగారు చెప్పికొనుటను బ్రహ్మయ్యశాస్త్రిగారు తీవ్రముగ అధిక్షేపించినను, మూలగ్రంథమగు "వికర్ ఆఫ్ వేక్‌ఫీల్డు" నకును రాజశేఖర చరిత్రమునకును, కథాగమనమునందును, దేశీయములగు సాంఘిక దురాచారములను నిరసించుట యందును, వ్యత్యాసము కలదు. దేహబంధమందును, పాత్రనిర్మాణమునందును ఈ రెండు గ్రంథములకు భేదములకన్నను సాదృశ్యములే యెక్కుడుగా నున్నవని డా॥ వీరభద్రరావుగారు తమ పరిశోధక వ్యాసమునందు వ్రాసియున్నారుగాని, అందువలన పంతులుగారి మౌలికమైన ప్రతిభకు అపకర్ష కలుగదు. పంతులుగారు 'వికర్ఆఫ్ వేక్‌ఫీల్డు" గ్రంథముననుసరించి రాజశేఖర చరిత్రమును రచించితిమని తామే చెప్పికొనిరి.

ఈ రెండు గ్రంథములందు ప్రధాన పాత్రముల కిట్టి పోలికలు గలవు.

| | | |
|---|---|---|
| డా॥ ప్రిమ్‌రోజ్ | ... | రాజశేఖరుడు |
| బర్చెల్ | ... | రామరాజు |
| విలియంతారన్‌హిల్ | ... | కృష్ణజగపతి |
| జార్జి | ... | సుబ్రహ్మణ్యము |
| ఎడ్‌తారన్‌హిల్ | ... | శోభనాద్రిరాజు |
| జంకిన్సన్ | ... | మంచిరాజు పాపయ్య |
| ఒలివియా | ... | రుక్మిణి |
| సోఫియా | ... | సీత |
| డిబేరా | ... | మాణిక్యాంబ. |

రాజశేఖర చరిత్రమునందు నాయకుని స్వగ్రామము ధవళగిరి. 'వికరాఫ్ వేక్‌ఫీల్డు'నందు 'వేక్‌ఫీల్డు' గ్రామము. ఇదేవిధముగా రాజశేఖరుడుగారి కొమారుడు

సుబ్రహ్మణ్యము ఉద్యోగాన్వేషణమునకై పిఠాపురమునకు పోవును 'వికరాఫ్ వేక్‌ఫీల్డు' గ్రంధమునందు డా ప్రిమ్‌రోజ్‌కొమారుడైన 'జార్జి' లండను నగరమును గూర్చి పోవును ఈవిధముగా రెండుగ్రంధముల యందును కొన్ని పోలికలు గలవు

పంతులుగారి రాజశేఖర చరిత్రమునకు పూర్వమే ఆంగ్ల గ్రంధములలోని దేశకాలపాత్రములను భారతీయసంస్కృతి కనుగుణముగ మార్చి, తెనుగునకనువదించుట జరిగినది. గురజాడ శ్రీరామమూర్తిగారి చిత్రరత్నాకరము (Arabian Nights నందలి The sleeper Awakened అను కధను ఆధారముగా చేసికొని రచింపబడినది) ఇట్టి వానిలో పేర్కొనదగినది ఆలివర్ గోల్డ్ స్మిత్ (1728 - 1774) ఆంగ్ల కవులలో లబ్ధప్రతిష్ఠుడు. 1764 వ సంవత్సరమునందీ కవీశ్వరుడు The vicar of wake field ను రచించి 'న్యూ బెరి' అను ప్రచురణ కర్తకు విక్రయించెను. 1766 వ సంవత్సరమునందీ నవల ప్రప్రధమమున ప్రచురింపబడెను. ప్రపంచ మహాకవులలో నొకడుగా విఖ్యాతినందిన జర్మన్‌మహాకవి గెటే (Gothe) యు, ఆంగ్ల నవలారచయితలయందగ్రేసరుడైన 'సర్ వాల్టర్ స్కాట్' మహాశయుడును (Sir walter scott యీ నవలవలన (The vicar of wake field ప్రభావితులు కాగా, వీరేశలింగంపంతులుగా రాకర్షింపబడుటలో విశేషములేదు ఈ గ్రంధము ఫ్రెంచి జర్మనీ, స్పెయిన్, ఇటాలియన్, డచ్, హంగరీ, గ్రీకు, రష్యన్, ఫిన్నిష్, రుమేనియా, బొహిమియన్ భాషలలో కనువదింపబడినది మహారాష్ట్రమునందు కూడ The vicar of wake field) నకు అనువాదము వెలసినది మన రాజశేఖర చరిత్రము కన్నడమున కనువదింపబడుట గమనింపదగిన విశేషము వీరేశలింగంపంతులుగారు గోల్డుస్మిత్ మహాశయుని కావ్యమగు The Traveller అనుదానిని 'పధిక విలాస'మను పేరున 1892 వ సంవత్సరమున అనువదించి ప్రకటించియున్నారు. గోల్డుస్మిత్ కవీశ్వరుడు 'The Bee' అను సమకాలీనాంగ్ల పత్రికయందు రచనలను వెలువరించిరి. వీరేశలింగం పంతులుగారు తమ వివేకవర్ధని కనుబంధముగ The Indian Bee అను ఆంగ్ల పక్షపత్రికను నిర్వహించియున్నారు. కనుక పంతులుగారిపై గోల్డుస్మిత్ కవీశ్వరుని ప్రభావ మధికముగా కలదని చెప్పవలెను.

ఇదివరలో రాజశేఖర చరిత్రమును, మూలగ్రంథమైన "వికరాఫ్ వేక్‌ఫీల్డుతో" సరిపోల్చి చూచి విమర్శించినవారు, ఈ రెండు గ్రంథములందు గల సాదృశ్యములను విపులముగ చర్చించియున్నారు. కాని వీరేశలింగంపంతులుగారి మనోగతాభిప్రాయములను సరిగా గుర్తింపరైరి. రాజశేఖర చరిత్రమును పంతులుగారు నాటికాలమున తెలుగుదేశమునందలి మూఢాచారములను ఖండించు నుద్దేశముతో విరచించిరి. మూల గ్రంథమైన 'వికరాప్‌వేక్ ఫీల్డు' నందును సాంఘికవిమర్శనమున్నను, ఆ గ్రంథము కావ్యసౌందర్యమునకు ప్రసిద్ధినందినదేకాని, సాంఘిక విమర్శనమునకుకాదు. రాజశేఖర చరిత్రమునందు కథాకల్పనముకన్నను, సాంఘిక విమర్శకు ప్రధానస్థానము కలదు. ఆంగ్లనవలయందు కథకును, పాత్ర చిత్రణమునకును ప్రధానస్థానముకలదు. మూలగ్రంథమునందు కథానాయకుడైన డా॥ ప్రిమ్‌రోజ్, తన కథనంతను ఉత్తమ పురుషయందు వినిపించును రాజశేఖర చరిత్రమునందట్లుకాదు. డా॥ ప్రిమ్‌రోజ్ అమాయకుడుకాదు. పరిస్థితుల ప్రభావమున నాతడు నిర్ధనుడై కష్టములపాలై, కథా గమనమునకు తోడ్పడుచుండును. రాజశేఖర చరిత్రమునందు రాజశేఖరుని అమాయకత్వము, అవివేకము, సర్వానర్థములకు హేతుభూతములగును అతని స్వయంకృతాపరాధములే, రాజశేఖరు డనుభవించిన కష్టనష్టములకు కారణములగును. రాజశేఖర చరిత్రమునందు కథాకల్పనమునందు బిగితక్కువ. ఆంగ్ల గ్రంథమునందు గోల్డుస్మిత్ కవీశ్వరుడు చూపిన నేర్పు తెలుగునవలయందు పంతులుగారు చూపలేదు.

తెలుగు నవలయందు ప్రతి సంఘటనము కూడ ఒకానొక సాంఘిక దురాచారమును, జనులలోగల మూఢ విశ్వాసమును, విమర్శించు నుద్దేశముతో పంతులుగారు కల్పించిరి ఈ విషయమునందాంగ్ల గ్రంథమునకును, తెలుగు నవలకును పోలికలే లేవు. రుక్మిణి కాసులపేరు పోవుట ప్రశ్న జెప్పువారి దాంభిక వర్తనమును విప్పి చూపుటకు పంతులుగారు కల్పించిరి. అట్లే నృసింహస్వామి మరణవార్తను ఎఱుక చెప్పువారి వర్తనమును, ఎఱుక నమ్మువారి మౌఢ్యమును, పరిహసించుటకు పంతులుగారు కల్పించిరి. ఆంగ్ల నవలయందు, కథా సన్నివేశముల కిట్టి ప్రయోజనము లేదు హరి శాస్త్రుల భూతవైద్యము, పిరాపురమునందు అంజనమువేసి రాజభటులు సుబ్రహ్మణ్యమును దొంగగా నిరూపించుట, ధవళగిరియందు స్వర్ణయోగము తెలిసిన బైరాగి వృత్తాంతము, సిద్ధాంతి కూతురు యొక్క గ్రహబాధ, రుక్మిణిని బ్రతికి యున్న నరసింహస్వామియే దయ్యమై బాధించుట, రుక్మిణి పురుషవేషము ధరించి,

పతులు విద్యవలన పొందెడు లాభములను నిరూపించుట, బొమ్మకంటి సుబ్బారాయుని ఆతురసన్యాసము, హరి పాపయ్యశాస్త్రులవారి భోజన పాండిత్యము, పీఠాధిపతుల యార్భాటములు, మఠాధిపతుల కుక్షింభరత్వము, పెద్దాపురము నందిండ్లు కాలిపోవుట మొదలగు వర్ణనములు, మూలగ్రంథమైన 'వికారాఫ్‌వేక్‌ఫీల్డు'నందులేవు. ఇట్లే డా॥ ప్రిమ్‌రోజ్ ఇల్లు కాలిపోవుట, ప్రిమ్‌రోజ్ కుమారుడైన జార్జి, నాటకములందు వేషములు వేయుట, ఒలీవియాను స్క్వైర్‌ధారన్‌హిల్ వివాహమాడుట, మోసెస్ సంతయందు మోసపోవుట, జార్జిస్క్వైర్‌ధారన్‌హిల్‌ను, ద్వంద్వయుద్ధమునకు పిలుచుట, జార్జి బంధింపబడి చెఱసాల యందుంచబడుట, మొదలగు సంఘటనములు రాజశేఖర చరిత్రమునందు లేవు. మిస్ విల్మంట్ వృత్తాంతము రాజశేఖర చరిత్రమునందు లేనే లేదు

కాని యీ రెండు గ్రంథములందును క్రిందివిషయములు సమానముగా వర్ణింపబడినవి కనుక, పంతులుగారి రెండు గ్రంథములకు విశేషముగా సంబంధములేదని వ్రాయుట ఆక్షేపణీయమని బ్రహ్మయ్యశాస్త్రిగారు విమర్శించి యున్నారు. వారుచూపిన సామ్యాంశములివి .

1 గుళ్ళు 2. శుభనక్షత్రాదికముల జూచుట, 3 కలలనమ్ముట 4. శకునమడుగుట 5 స్త్రీవిద్య 6 పునర్వివాహము 7. పండుగలు 8. స్త్రీ ప్రసంగము 9 ఎలుక యడుగుట 10 భాగ్యము 11 బీదతనము 12. దొంగతనము 13 నాగరికము 14 పాండిత్యము 15 సాముద్రికము 16 జారత్వము 17. దేశయాత్రలు 18. నాటకములు 19 పెండ్లిండ్లు 20. సంతలు 21. ముఖస్తుతులు 22. బళ్ళు 23 రాజరీవి 24. వర్తకము 25 వేదాంతము 26. మతము 27. మతగురువులు 28 రోగములు 29 వైద్యము 30. కారాగృహము 31. రిఫారము (Reform) 32 దంపతుల కలహము 33 స్త్రీలదౌ యలంకారముల యందలి యాశ 34. ఇండ్లు కాలుట 35 రాజభటుల దుర్నీతి 36. మూఢభక్తి 37 కవుల స్థితి 38 ఆతిథ్యము.

కనుక రాజశేఖర చరిత్రము, 'వికరాఫ్ వేక్ ఫీల్డు' అను ఆంగ్లనవల కనువాదమని బ్రహ్మయ్యశాస్త్రిగారు భావించిరి ఇది సరికాదు. ఇంకను ఆంగ్లగ్రంథమునందలి వాక్యములను, భావములను, పంతులుగారు రాజశేఖర చరిత్రమునందు

యధాతధముగా అనువదించిరను బ్రహ్మయ్యశాస్త్రిగారి యభిప్రాయము నిర్హేతుకమని చెప్పనొప్పును. ఏలయనగా మూలగ్రంధమునందు లేని యీక్రింది వర్ణనములను పంతులుగారు రాజశేఖర చరిత్రమునందు కూర్చి యున్నారు.

1 స్వర్ణయోగము 2. గ్రహబాధ (దేవతావేశము) 3, లంకెల బిందెలు 4 బాల్యవివాహములు 5 వితంతువుల కేశఖండనము 6. దేవుని మాన్యములు 7 అమ్మవారి (గ్రామదేవత) జాతరలు 8 జ్యోతిషశాస్త్రచర్చలు 9 స్వయం పాకము చేసికొనువారి నిష్ఠ 10 వంటబ్రాహ్మణులు 11. గ్రహణములు 12. పర్వ దినములయందు నదీస్నానములు 13 సూతకము – మైలబొట్టు 14 ఆతుర సన్న్యాసము 15 అంజనము వేయించి దొంగను కనుగొనుట 16. పంచాంగ శ్రవణము 17 శవవహనము 18 కులాచారములు 19 నీళ్ళరేవులం దాడువారి ముచ్చట్లు 20 వివాహ వ్యయములు 21 సంగీతవిద్వాంసులు 22 బాంధవ్యము 23. పురిటిలో సందుగొట్టుట 24 బాలరోగము (చిన్నపిల్లచేష్ట) 25 భోగముమేళ ములు 26 వివాహములయందు బ్రాహ్మణసంభావనలు 27. పెండ్లివేడుకల యందలి మోటుసరసములు 28 గౌళిపాటు 29 శివపూజ (పార్థివము) 30 ప్రయోగ ములు 31 పురాణపఠనము 32 భూతవైద్యము 33 ప్రశ్నచెప్పుట (పోయిన వస్తువులను గూర్చి చెప్పుట) 34 వర్ణభేదములు 35 శ్రీముఖములు (ఆంక్ష పత్రికలు) 36. పండుగలు (దేశీయాచారములు) 37. మూఢవిశ్వాసములు 38 రిక్షరేకులు 39. సప్తసంతానములు 40 శాస్త్రచర్చలు 41 శాఖాభేదములు (వైష్ణవులందు వడహలె, తెంగలెశాఖలు) 42 రిధోత్సవము 43 సాలగ్రామా ర్చన (దేవతార్చన, మొదలగు విషయములు రాజశేఖరచరిత్రమునకు పరిమితములు. కావున దేహబంధము (Structure) నందు ఆంధ్రాంగ్ల నవలలకు విశేషించి సామ్య ములున్నను, ఇతివృత్తము (Plot) నందు చెప్పదగిన వైషమ్యము లున్నవని చెప్పవలెను

రాజశేఖర చరిత్రమునందు పంతులుగారు చూపిన మౌలికత యిట్లు నిరూ పింపదగును

1. పంతులుగారు స్వీయచరిత్రమునందు "రాజశేఖరుడుగారి గృహవర్ణన మంతయు నించుమించుగా మా (తమ) గృహవర్ణనమే" యని వ్రాసియున్నారు [22]

2 నృసింహస్వామి దేశాంతరగతుడగుట స్వీయచరిత్రమునందు పంతులు గారు వర్ణించిన తమ చిన్ననాటి వృత్తాంతము నొకదానిని పోలియున్నది.[23]

3. నృసింహస్వామి మరణించినాడని ఆతని మిత్రుడు చెప్పుటచే, రుక్మిణియు మాణిక్యాంబయు, నృసింహస్వామి దయ్యమై తిరుగుచున్నాడని భ్రాంతిపొందుట, వివేకవర్ధని ప్రథమ సంచికయందు వెలువడిన నొక జాబులోని వృత్తాంతమును పోలి యున్నది.[24]

4. రాజశేఖర చరిత్రమునందు, తెలుగు దేశమునందు వాడుకలోనుండిన సామెతలు, లోకోక్తులు, తెలుగు దేశమునందలి పల్లెటూళ్ళ యాచారవ్యవహారములు మిక్కిలి రసవంతముగా వర్ణింపబడినవి.[25]

5. రాజశేఖర చరిత్రమునందు వచ్చు పాత్రలైన, జోస్యులకామావధాని, ముష్టి సర్వశాస్త్రి, నంబిరాఘవాచార్యుడు, వామరాజు భైరవమూర్తి, బులుసుపేరయ్య సోమయాజులు (స్వయంపాకి), నీళ్ళకావిడి వెంకయ్య, పురాణం శాస్త్రులుగారు, మంత్రిప్రగడబాపి రాజుగారు, చాకలి సర్విగాడు, హరిశాస్త్రులు (భూతవైద్యుడు) జంగము బసవయ్య (గ్రామవైద్యుడు), పీనుగుల విస్సన్న, పిడపర్తి శ్రీరామ సిద్ధాంతి, కృష్ణజగపతిమహారాజు, కోయరామిరెడ్డి (బందిపోటు ప్రసక్తి), బొమ్మగంటి సుబ్బారాయుడు, మంచిరాజు పాపయ్య, యంత్రజ్ఞుడైన వీరదాసు (మరిడీమహాలక్ష్మికి చేసిన యాజ్ఞావృత్తాంతము), చాకలి సామిగాడు, నంబివరదాచార్యుడు, హరిపాపయ్య శాస్త్రులు, నేతిరామయ్య, మొదలగువారి వర్తనములను పరిశీలించిన పంతులుగారి మౌలికత ప్రస్ఫుటము కాగలదు

పైన చూపిన హేతువుల వలన రాజశేఖర చరిత్రమున కాంగ్లగ్రంథము యొక్క సాహాయ్య మున్నను, పంతులుగారు తమకుగల అనన్య సామాన్యమైన ప్రతిభతో, ఇంచుమించుగ రాజశేఖర చరిత్రము స్వకపోలకల్పిత మనుకొనునట్లుగ రచించిరి పంతులుగారి మహాయశస్సునకు శరత్కౌముది వంటిది వారి రాజశేఖర చరిత్రము. రాజశేఖర చరిత్రము, ప్రభవించిన నాటినుండి నేటిదనుక, తెనుగు నవలా రచనమునకు మార్గదర్శకత్వమును వహించుచు, తెనుగు సాహితీపరులను, అందును ముఖ్యముగా నవలా రచయితలను, ప్రభావితులను జేయుచునే యున్నది

కనుకనే రాజశేఖర చరిత్రమే తెనుగున తొలి నవలయను నభిప్రాయము కూడ, తెలుగు సాహితీపరులందు నెలకొనినది.[26]

ఈ రాజశేఖర చరిత్రము ఆంగ్లభాషలోని కనువదింపబడి విదేశీయుల ప్రశంసల నందుకొనినది. శ్రీకాకుళము నందుండిన యమెరికా క్రైస్తవ మతాచార్యులైన రివరెండు హచ్చిన్సనుగారు పంతులుగారి యనుమతినిబొంది, దీని నాంగ్లభాషలో కనువదించి, చెన్నపురి క్రైస్తవ కళాశాలా పత్రికయందు మొదట 1886వ సంవత్సరమున భాగములుగా, ప్రకటించి, తరువాత 1887వ సంవత్సరమునందు 'అదృష్ట చక్రము' (Fortune's wheel) అను పేరుతో పుస్తకరూపమున చిత్రపటములతో లండను నగరమునందు ప్రకటించిరి దీనికి జనరల్ మెక్టానల్డుదొరగా రుపోద్ఘాతమును వ్రాసిరి. ఈ యాంగ్లభాషాంతరీకరణమును హిందూదేశములోని వార్తాపత్రికలు మాత్రమేకాక యింగ్లాండులోని పత్రికలు సహితము శ్లాఘించెను. 1887వ సంవత్సరము సెప్టెంబరు 30వ తేదీన, 'లండన్‌టైమ్స్' (London Times) పత్రిక యీ అంగ్ల భాషాంతరీకరణమును సమీక్షించినది. ఈ రాజశేఖర చరిత్రమునుగూర్చి పాశ్చాత్య పండితు లిట్లు వ్రాసిరి,

"Writeen by a native gentleman of refinement and education, the book is fine and invaluable as an impartial study of native character as seen by native eyes...[27]

రాజశేఖరచరిత్రము, పత్రికాధిపులచేతను, సాహితీపరులచేతను మిక్కిలి ప్రశంసింపబడినదిగాని, దీనిని శ్రీ కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు, ఏడధ్యాయములలో (ఉపన్యాసములలో) తీవ్రముగా విమర్శించి యున్నారు. రాజశేఖరుడుగారి గృహ వర్ణనము పంతులుగారి గృహవర్ణనము కాదనియు, రాజశేఖరుడుగారు ప్రయాణమునకు పెట్టిన ముహూర్తము చోరపంచకమునబడినదికాన, రాజశేఖరుడుగారిని దారిలో దొంగలు కొట్టిరనియు, కనుక పంతులుగారు చూపిన హేతువుల చేతనే, పంతులుగారి వాదములు (జ్యోతిశాస్త్రము నమ్మకూడదనుట) పరాస్తములైనవనియు, "గోల్డుస్మిత్తు పాలలో జక్కెర వైచినట్లుగా కరుణశాంతముల సమ్మేళనమును జేసి రసస్ఫూర్తి గలిగించి యుండగా, నీ మహాకవి (వీరేశలింగము పంతులుగారు) పాలలో నుప్పు వయిచినట్లుగా హాస్యకరుణారసములకు సమ్మేళనంబునుజేసి మిక్కిలి రసభంగమును

గలిగించి" రనియు బ్రహ్మయ్య శాస్త్రులవారు రాజశేఖర చరిత్రమును తీవ్రముగా అధిక్షేపించియున్నారు.[28]

కాని బ్రహ్మయ్యశాస్త్రులవారు చూపిన తప్పులవంటివి ఆంగ్ల గ్రంథమునందు సైతముకలవని, ఈ గ్రంథమును సవిమర్శక వ్యాఖ్యానముతో ప్రచురించినవారు పేర్కొనియున్నారు.[29]

ఇట్లనుటవలన పంతులుగారు గోల్డుస్మిత్ గ్రంథమును యథాతథముగ ననువదించిరని చెప్పుటకాదు. గోల్డుస్మిత్ గ్రంథమునందు సైతము అసంభావ్యములు, అనూహ్యములు, అవినీతికరములు (Moral Flaws) నగు సంఘటనములు వర్ణింపబడినను నీగ్రంథము ప్రపంచమునందలి యనేక భాషలలో కనువదింపబడి, విశేషించి సాహితీపరుల నాకర్షించియుండుట లోకప్రసిద్ధము. ఇట్టే పంతులుగారి రాజశేఖరచరిత్రమునందును చిన్న చిన్న లోపములున్నను,[30] అవి లోపములుగా నెన్నబడక, సాహితీపరుల మన్ననకు పాత్రమైన దీ రాజశేఖర చరిత్రము. ఇప్పటికే గ్రంథము తొమ్మిదిమార్లు ముద్రణభాగ్యము నొందియుండుట పై చెప్పిన విషయమును స్థాపించుచున్నది

పంతులుగారి నవలలలో తరువాత పేర్కొనదగినది "సత్యరాజా పూర్వ దేశ యాత్రల"నునది. పంతులుగా రీ గ్రంథము నాంగ్లేయభాషలో వ్యంగ్య సాహిత్య సృష్టియందు ప్రధాన స్థానము వహించియున్న Jonathan Swift (1667-1745) అను రచయిత యొక్క Gulliver's Travells అను గ్రంథము నాధారముగాచేసికొని రచించిరి

ఈ గ్రంథమునుగూర్చి పంతులుగారు తమ స్వీయచరిత్రమునందిట్లు వ్రాసియున్నారు " 1891-వ సంవత్సరమునందు స్త్రీల విషయమున మన వారు చేసిన యన్యాయములు తేటపడునట్లుగా వ్యాజరీతిని సత్యరాజపూర్వ దేశయాత్రల యొక్క ప్రథమ భాగమునురచించి ప్రకటించితిని. నేనింగ్లీషున 'గల్లీవర్సు ట్రావెల్సు' (Gulliver's Travells)చదివినప్పుడు వ్యాజరూపమున మనలోనిదురాచారములను మూఢ విశ్వాసములను పరోక్షముగా బ్రదర్శించునట్టి పుస్తకమును నాలుగు భాగములుగా జేయవలెనని బుద్ధి పుట్టి మొదట నీ భాగమునుజేసితిని. కాని Gulliver's Travells యందు ప్రథమభాగమైన లిల్లీపుట్ యాత్రకును సత్యరాజ పూర్వ దేశ

యాత్రలందలి ప్రథమభాగమైన ఆడమళయాళముగకును పోలికలెక్కుడులేవు. గ్రంథమును ప్రారంభించుటయందును, ముగింపునందును పంతులుగారాంగ్లగ్రంథము సాహాయ్యము నొక్కింత పొందియున్నారుగాని,[31] కథావిషయమున ఆడమళయాళము నందలి సంఘటనలన్నియు పంతులుగారు కల్పించినవేయని తెలియనగును ఆడమళ యాళమను ప్రథమభాగ మెనిమిది ప్రకరణములుగా విభజింపబడినది కథను కల్పిం చుటలో పంతులుగారు సంపూర్ణమగు స్వేచ్ఛనువహించి, చమత్కారములైన కల్పన లను, సంభాషణములను నీ యాడమలయాళమునందు కూర్చియున్నారు మొదటి ప్రకరణమునందు సత్యరాజాచార్యులను వాని పుట్టు పూర్వోత్తరములు, బాల్యము, విద్యాభ్యాసము, వాని భార్య మరణించుట, అప్పులవారు పెట్టుబాధలకోర్చుకొనలేక, ఆతడు దేశాంతరముపోవలెనని సంకల్పించి, ఓడపై ప్రయాణమై చెన్నపట్టణమును చేరుట మొదలగు విషయములు వర్ణింపబడినవి. ప్రసక్తానుప్రసక్తముగ వ్యంగ్య ధోరణియందు, పూర్వాచారపరాయణుల ఆంగ్ల విద్యాద్వేషము, ఉద్యోగస్థుల లంచ గొండి తనము, గ్రామములందుండు వైద్యుల మౌఢ్యము, మొదలగునవి విమర్శింప బడినవి రెండవ ప్రకరణమునందు చెన్నపట్టణమునందలి మోసములు, దాక్షిణా త్యుల యాచారవ్యవహారములు, సత్యరాజాచార్యులు దక్షిణదేశయాత్రకై బయలు వెడలి తిరువనంతపురముచేరుట, అచ్చటినుండి ఆడమళయాళమునందు ప్రవేశించుట మొదలగు విషయములు నవ్వుపుట్టించునట్లు వర్ణింపబడినవి మూడవ ప్రకరణము నుండి ఎనిమిదవ ప్రకరణమువరకును, సత్యరాజాచార్యు లాడమళయాళమునందు కనుగొన్న వింతలు విశేషములు, పడినబాధలు, చివర కచ్చటనుండిలంకా ద్వీపమును చేరుట మొదలగు కథా ఘట్టములు వర్ణింపబడినవి

ఆడమళయాళమునందు, సర్వహక్కులును స్త్రీలకే సంక్రమించియుండు ననియు, పురుషుల, కేయాజమాన్యమును, నుండదనియు, ఆదేశము మంత్రతంత్రము లకు ప్రసిద్ధిచెందినదనియు, లోకమునందు వ్యాపించియున్న జనశ్రుతి నాధారముగా చేసికొని, వీరేశలింగంపంతులుగారు, హాస్యరసప్రధానమైన కమనీయములగు కల్ప నలుగావించి, వ్యాజరీతిని, తెలుగుదేశమున వ్రేళ్ళు పారియున్న నాటి సాంఘిక దురా చారములను తీవ్రముగా నధిక్షేపించియున్నారు.

నాటి సంఘమునందు పురుషులకే సర్వహక్కులును ధారాదత్తము చేయబడి, స్త్రీ నిస్సహాయురాలై, విద్యావివేకములకు దూరగురాలై, పురుషుల దురాచారములకు,

దురన్యాయములకు, క్రౌర్యమునకు, మౌఢ్యమునకు, అక్రమములకు, గుఱిచేయబడి, యెట్టి నికృష్ట స్థితియందు జీవితమును వెళ్ళబుచ్చుచుండెనో, పంతులుగారు, ఆడమళయాళమునందు పురుషునకుగల యట్టి స్థానమునే నిరూపించుచు, వ్యాజరూపమున మన కనులకు గట్టునట్లు వర్ణించియున్నారు పురుషు డేకాకి, ఒంటరివాడు, నిరాశ్రయుడునై యుండి, జీవిత సాఫల్యమునుండి వంచింపబడునప్పు డెట్టి మానసిక వేదనలకు గుఱియగునో. పంతులుగారు నిరూపించి చెప్పుచు, సత్యరాజాచార్యుల చుట్టును కథ నల్లినారు. ఆడమళయాళము నందాచరింపబడుచున్నవని పంతులుగారు వర్ణించిన వర్ణనము లన్నియు, పంతులుగారి చుట్టును వికృతరూపములతో వికటాట్టహాసము చేయుచున్న నాటి సాంఘిక దురాచారములే! పంతులుగారు, ఆడమళయాళము నందచ్చటి పురుషులు చదువుకొనకూడదనియు, అపత్నీకుల ముక్కులు కోసివేయబడుననియు, సంగీతసాహిత్యముల నభ్యసించు వారచ్చట భోగపురుషులు మాత్రమే యనియు, అపత్నీకుల నాసికాకృంతన మహోత్సవములను దగ్గరనుండి జరిపించుటకా దేశముననున్న పీఠాధికారిణులు దేశపర్యటనము జరుపుచు, పట్టణములకు విజయము చేయుచుందురనియు, తమ యాజ్ఞలను, పూర్వాచారములను, ఉల్లంఘించిన వారికి శ్రీముఖములను బంపుచుందురనియు, వారెట్టి పాపములు చేసినవారైనను, ధన దండనలను విధించియు, వారింట పిండివంటలతో భిక్షలను పొందియు, వారిని మరల కులములో చేర్చికొని జాతి బహిష్కారమునుండి తప్పింతురనియు, పంతులుగారు వర్ణించిరి ఇవన్నియు తెలుగు దేశమునందు, నాడు ప్రబలతరములుగా నున్న దురాచారములే. పురుషు డెట్టిదుష్టుడైనను, దుర్మార్గుడైనను, పత్నియాతని సేవింపవలయునను మన పతివ్రతా ధర్మములను పంతులుగా రాడమళయాళము నందపహసించిరి. మన బాలవితంతువుల కేశఖండనములను, ఆడమళయాళమునందు భార్యమరణించిన వారికి జరుపు నాసికాకృంతనోత్సవములతో పోల్చి నిరసించిరి మన మఠాధిపతుల కుక్షింభరత్వమును, స్వోదరపూరణ పరాయణత్వమును, ఆడమళయాళము నందలి జగద్గురువుల వారి యార్భాటములతో పోల్చి, పరిహసించిరి మన దేశమునందలి సతీసహగమనమువలెనే ఆడమళయాళమునందు సైతము వారొక సదాచారమును పాలింతురట. అది యేదనగా భార్య మరణింపగా, ఆమె శవముతో గూడ బ్రతికియున్న పురుషుడు గూడ పూడ్చిపెట్టబడుట. "అట్టి పుణ్యపురుషుడు పత్నీ మరణ సమయమునందు సహగమనము చేసిన పక్షమున ముప్పదిమూడు

తరముల వఱకును తన తల్లివంక వారిని, తండ్రివంక వారిని మాత్రమేకాక తన పత్నియొక్క తల్లివంకవారిని తండ్రివంక వారిని గూడ తరింపజేసి మహాపాపులను సహితము పుణ్యలోకమునకు బంపునని"[32] ఆడమళయాళము నందలి జనుల విశ్వాసమని పంతులుగారు వర్ణించిరి. ఇది కేవలము పరాశరస్మృతి యందు సతీ సహగమనము వలన పుణ్యస్త్రీకి లభించు ఉత్తమ గతులను గూర్చిన వర్ణనముపై వ్యంగ్య విమర్శ యని చెప్పవలెను. పరాశరస్మృతియందు, భర్తతోడ సహగమనము చేసిన పుణ్యస్త్రీ మనుష్యదేహమున నెన్ని రోమము లుండునో యంత కాలమనగా, మూడుకోట్ల యేబదిలక్షలవేల యేండ్లు స్వర్గసుఖమును పొందునని చెప్పబడినదనియు, కనుక, ఆడమళయాళము నందలి సదాచారములన్నియు, హిందువుల శాస్త్ర గ్రంథములనుండి గ్రహింపబడినవేకాని, ముఖ్యభేదముగా, అచ్చటి స్త్రీలు ఇచ్చట పురుషులైరనియు సత్యరాజాచార్యులు ఆశ్చర్యమును, విషాదమును కూడ నొందెను.

పంతులుగారీవిధముగా పందొమ్మిదవ శతాబ్ది యుత్తరార్ధమున తెలుగుదేశమున కాలూనియున్న, మూఢాచారములను సత్యారాజా పూర్వదేశ యాత్రలయందు ఖండించిరి. మనదేశమునందు బాలికలు నోచుకొనునోములు, వ్రతములు, అర్ధరహితములని పరిహసించు నెపమున పంతులుగారాడమళయాళమునం దచ్చట పురుషులు "ఆదివారమునాడు కందపిలకను పూజింతురు , సాయంకాలమునందు పెండలపు దుంపను పూజచేయుదురు. సోమవారమునాడు మధ్యాహ్నము నన్నెకంటిని పూజింతురు , సాయంకాలమునందు రుబ్బురోటిని పూజచేయుదురు. నడుమ నడుమ వచ్చు విశేష వ్రతములుగాక యీ ప్రకారముగా దినమునకు రెండేసిచొప్పున పురుషులు సంవత్సరమున కేడువందల ముప్పదినోములు నోతురని వ్యంగ్యముగా విమర్శించియున్నారు.

సత్యరాజాచార్యుల వాకకని, ఆడమళయాళమునం దాతని గురువైన చామర్తిగారికిని 'సహగమనము' విషయమై జరిగిన సిద్ధాంతచర్చ నాధారముగా చేసికొని వీరేశలింగము పంతులుగారు, మనదేశము నందలి సతీసహగమనమను దురాచారము యొక్క, పుట్టుపూర్వోత్తరములను, దానిని నిర్మూలించుటకు రాజా రామమోహనరాయలు వారు గావించిన నిర్విరామ కృషియు, వర్ణించిరి. ఒక్క కలకత్తా నగరమునందే 1815 వ సంవత్సరము మొదలుకొని, 1828 వ సంవత్సరము వరకు, ప్రతిసంవత్సర మెంతమంది స్త్రీలు సతీసహగమనముచేసి

యున్నారో, 1881 వ సంవత్సరమునందలి జనపరిగణన (Census) ప్రకారము స్వదేశరాష్ట్రములలోగాక, యింగ్లీషువారి పరిపాలనకు లోబడిన దేశములలో నెంత మంది వితంతువు లున్నారో, వారెట్టి దుర్గతి ననుభవించుచున్నారో, మొదలైన విషయములు వర్ణింపబడినవి.

ఈవిధముగా వీరేశలింగంపంతులుగారు తమకాలమునందు సంఘమున పాదుకొనిపోయి మతము పేరిట, భక్తి పేరిట స్త్రీపురుషులలో ప్రబలియున్న వామాచారమును, మతోద్ధరణము పేరిట మఠాధిపతులు జరుపు అక్రమచర్యలను, పూర్వాచారము పేరిట ప్రజలను శాసించుచున్న మూర్ఖపు విశ్వాసములను, దౌర్జన్యమును, తమ సత్యరాజా పూర్వదేశయాత్రల ప్రథమభాగమగు ఆడమళయాళము నందు గర్హించి యున్నారు. దీనియందలి ఏడవప్రకరణము నందును, ఎనిమిదవ ప్రకరణమునందును, పంతులుగారు స్వీయచరిత్రమునందు, విధవా వివాహశాస్త్ర చర్చలయందును, స్త్రీవిద్యా ప్రోత్సాహకరములగు వాదములు చేసినప్పుడును, తాము పొందిన యనుభవములుగా వర్ణించిన ఘట్టములు, మనము గాంచగలము[33].

ఇట్లు పంతులుగారు Gulliver's Travells లోని కథాసూత్రమును మాత్రము గ్రహించి, స్వకపోల కల్పితముగా, అనుపమానమగు ప్రతిభతో, తమకు సహజమైన వ్యంగ్య చమత్కార, హాస్యయుతమైన శైలితో, సత్యరాజా పూర్వదేశ యాత్రలయందలి ప్రథమభాగమగు ఆడమళయాళమును రచించిరి[34] ఈభాగమును పంతులుగారు ప్రప్రథమమున చింతామణి పత్రికయందు భాగములుగా 1891 వ సంవత్సరమున ప్రకటించి యున్నారు.

సత్యరాజా పూర్వదేశయాత్రల యందలి రెండవభాగమగు లంకాద్వీపము నందు పంతులుగారు Gulliver's Travells లోని రెండవభాగమగు "A voyage to Brobdingnag" ననుసరించియున్నారు. లంకయందుండువారు రాక్షసులు కనుక, పంతులుగారు సత్యరాజును లంకాద్వీపమునకు యాత్రచేయించి, అచట విచిత్రమైన పరిస్థితులలో, వారితో జ్యోతిషశాస్త్ర సంబంధములగు చర్చలు చేయించి, కథను నడిపినారు. బ్రాబ్డింగ్‌నాగ్‌దేశమునందు స్విఫ్టు అతికాయులను, మహాకాయులను వర్ణించుటచే పంతులుగారట్టి పాత్రములను వర్ణించుటకు లంకాద్వీపమును రంగస్థలమునుగా చేసికొనవలసి వచ్చెను. రావణవధానంతరము విభీషణుడు రాజ్యపాలన

మును చేకొన్నప్పటినుండియు లంకాద్వీపమున నరమాంస భక్షణము నిషేధింప బడుటవలన, లంకాద్వీపమున మహాకాయులకు చిక్కియు, సత్యరాజాచార్యులు బ్రతికి బయటపడెనని పంతులుగారు కల్పించిరి

పంతులుగారు బ్రాబ్డింగ్‌నాగ్ దేశములోని వాతావరణము నంతను, లంకాద్వీప మున కారోపించి, మహాకాయుల దేశమున మూలగ్రంథమునందు, కథానాయకుడైన 'గలివర్' యెట్టి కష్టములపాలయ్యెనో, లంకాద్వీపమునందు సత్యరాజాచార్యుల వారట్టి కష్టములపాలైరని వర్ణించిరి.

కాని పంతులుగారు కథాసన్నివేశములను మాత్రమే దృష్టియందుంచుకొని ఆడమళయాళము నందువలెనే, లంకాద్వీపమునందును నాటి మూఢాచారములను విమర్శించిరి. 'బ్రాబ్డింగ్ నాగ్' యాత్రకును, లంకాద్వీపమునకును, దేహబంధము నందు విశేషించి పోలికలున్నను, పంతులుగారు, మూలగ్రంథమునందలి దేశకాల పాత్రములను మార్చి, మన పురాణకథలను దృష్టియందుంచుకొని, నూత్న కల్పనలను జేసి, లంకాద్వీపమును రచించిరి ఆడమళయాళమునందు, సత్యరాజాచార్యులవారి యజమానురాలి తల్లిగారి అనుగ్రహమున, నాతడు మంత్రోపదేశమును పొంది, ఆ దేశమును విడిచిపెట్టిపోవుటకై, ఆ మంత్రమును బహునిష్ఠతో పురశ్చరణ చేయగా, పూర్వకాలమునందు ప్రవరాఖ్యునకు పాదలేపము ననుగ్రహించిన సిద్ధపురుషుడు ప్రత్యక్షమై, సత్యరాజాచార్యులకుగూడ పాదలేపము ననుగ్రహించును అట్టిపాదలేప ప్రభావమున సత్యరాజాచార్యులు లంకాద్వీపమునకు చేరుకొనును. అచ్చట ఆతడొక మఱ్ఱిచెట్టునీడన సేదదీర్చుకొనుచుండగా, ఆటలాడుకొనుటకయి వచ్చిన యొక నాలు గేండ్ల బాలుడు సత్యరాజాచార్యులను వేళ్ళసందున నిరికించుకొని, ఇంటికేగి తండ్రికి చూపును. ఆతండ్రియు నీతని రూపమునుచూచి, విస్మయాధీనమనస్కుడై యీతని తన యజమానున కప్పగించును. ఆ యజమానిపేరు మహాకాయుడు. మహాకాయుడు, సత్యరాజాచార్యులను తన కుమార్తె సంరక్షణమున నుంచును. ఈ సన్నివేశము మూలకథలోని సన్నివేశమునే పోలియున్నది

లంకాద్వీపమునందు గల మఱ్ఱిచెట్లు, మన దేశమునందుగల వానికి శతగుణ ములుగా పరిమాణాధిక్యము కలిగియుండుననియు, మఱ్ఱియాకులు మన తామరాకు లంత యుండుననియు. మఱ్ఱిపండ్లు, మన తాటికాయలంత యుండుననియు, కాకి

అరుపు ఉఱుముఱిమినట్లుండుననియు, నా దేశమునందలి కండచీమలు యెలుకలంత పరిమాణముకలిగి యుండుననియు, నచ్చటి యెలుకలు మనమేకలంత యుండుననియు, పిల్లులు మన గోవులంత యుండుననియు పంతులుగారు కల్పించిరి. మూలగ్రంథము నందు 'బ్రాబ్డింగ్ నాగ్' దేశవాసులు కథానాయకుడైన గలివరును 'మేనికిన్' (Man kin) అని పిలుచుచుందురు ఈ మాటకు పొట్టివాడని యర్థము. అట్లే లంకాద్వీపమునందు రాక్షసులు, సత్యరాజాచార్యులను 'వాలఖిల్యు'డని పిలుచుచుండిరి "గలివర్" సంరక్షణ భారము వహించుచుండిన యజమాని కూతురుపేరు మూల గ్రంథమునందు 'గ్లండల్ క్లిచ్' (Glundalclitch) కాగా పంతులుగారీ పేరును లంకాద్వీపమునందు 'మండోదరి'గా మార్చియున్నారు లంకాద్వీపమునందలి వాతావరణమునంతను పంతులుగారు మన విశ్వాసముల కనుగుణముగ, మార్చియున్నారు అచ్చటి వారిపేరులు, ధూమ్రాక్షుడు, త్రిశిరుడు, ఖరుడు, వృశ్చికరోముడు, సర్పరోముడు, ఖడ్గరోముడు, అగ్నిరోముడు, కంటకరోముడు, వజ్రహస్తుడు, ప్రహస్తుడు, తాటకి, కైకసి, త్రిజట, మొదలైనవిగా పంతులుగారు కూర్చియున్నారు. ఈ లంకాద్వీపముకూడ ఎనిమిది ప్రకరణములుగా విభాగింపబడినది నాలుగైదు, ప్రకరణముల యందు జ్యోతిశ్శాస్త్రమునకు సంబంధించిన చర్చలతో, నీ భాగము మూలగ్రంథము కన్న భిన్నముగ నున్నది. "జ్యోతిశ్శాస్త్రములోని జాతకభాగము యొక్కయు ముహూర్తభాగముయొక్కయు నవిశ్వసనీయతను పరోక్షముగాఁ దెలుపుటకయి పయి యట్ల (అడమళయాళమువలె) లంకాయాత్రయను రెండవభాగమునుగూడ"[35] రచించితిమని పంతులుగారు స్వీయచరిత్రమునందు వ్రాసియున్నారు.

పంతులుగారు తమ కాలమునాటికి జనులలోగల మూఢ విశ్వాసములను, ఆచారవ్యవహారములను, వ్యాజరీతిని లంకాయాత్రయందు విమర్శించియున్నారు సత్యరాజాచార్యులు లంకా ద్వీపమున నొక మేకపిల్లతోఢీకొని దానిని తరిమికొట్టు ఘట్టమును పంతులుగారు హాస్యప్రధానముగా వర్ణించుచు, నీ ఘట్టమును చదివినవారును, విన్నవారును, యెట్టి ఫలితములను పొందుదురో, సత్యరాజాచార్యులవారి నోట యిట్లు చెప్పించినారు

"ఛాగశాబక బ్రాహ్మణకుమార సమరోపాఖ్యానంబను నీ పుణ్యకథను విన్నవారును, భక్తితో జదివినవారును స్థలజలగండములనుండి విముక్తులయి సర్వ కార్యములయందును విజయమునొందుదురు దీనికి సందేహించినవారధో గతులగుదురు".

ఇట్టి సన్నివేశమొకటి మూలగ్రంథమునందుగూడ వర్ణింపబడినదిగాని, పంతులు గారీ యుపాఖ్యానమునకుగూర్చిన ఫలశ్రుతి, మూలమునలేదు అతికాయులును, మహాకాయులునునైన యారాక్షసుల నడుమ సత్యరాజాచార్యులవారి జీవితమును మిక్కిలి నవ్వుపుట్టించునట్లుగ పంతులుగారు వర్ణించిరి.

జ్యోతిశ్శాస్త్రము యొక్క ముహూర్తభాగమును విమర్శించు నుద్దేశముతో పంతులుగారు, కామరూపులైన రాక్షసులు ఒకరి వేషమునే ఇరువురును ధరించి, యొక్క కాంత నిమిత్తమై న్యాయస్థానమునందు తగవులాడు ఘట్టమును కల్పించిరి. ఈ ఘట్టము కళాపూర్ణోదయమునందు, మాయారంభ, మాయానలకూబరుల ఘట్టము వలె మిక్కిలి నవ్వుపుట్టించును. సత్య రాజాచార్యులను పూర్వాచారపరాయణుల ప్రతి నిధినిగాచేసి, నవీనాచారములయెడను, సాంఘికపుమార్పులయెడను, అతనికిగల ద్వేష మును నిరూపించుచు, సవ్యాజముగా దురాచారములను, మూఢ విశ్వాసములను పంతులుగారు లంకా ద్వీపమునందు ఖండించియున్నారు. తన యజమానియైన మహా కాయునితో సత్యరాజాచార్యులు, తమ దేశస్థితిని వర్ణించుచు, తన దేశమునందు జ్యోతిశ్శాస్త్ర విశ్వాసము నశించిపోవుచున్నందుకు వాపోవును. "అయినను మా దేశము నందింగ్లీషు చదువుటచేత నట్టి సత్యములను నమ్మని నాస్తికులు కొందఱిప్పుడు బయలు దేఱుచున్నా"రని సత్యరాజాచార్యులు చింతించును మన దేశమునంచు జ్యోతిశ్శాస్త్రము నకు పార్వతీదేవి శాపముకలదను నమ్మకమున్నట్లుగా వారి దేశమున జ్యోతిష్యము నకు పరమేశ్వరశాపముకలదని, సత్యరాజాచార్యుల తన యజమానునితో ప్రసం గించుచు తెలిసికొనును. ఇట్టి పరమరహస్యమును తమ దేశస్థులెఱుగకపోవుటకు విచారించి, తనయజమానునితో నిట్లనును

"ఇది యత్యంతగుహ్యమైన పరమరహస్యమనుటకు సందేహములేదు ఇది దేవరహస్యమేకాకపోయిన పక్షమున, పురాణములను రచించిన మా దేశములోని సర్వజ్ఞులైన మహర్షుల కొక్కరికైన దెలిసియుండకపోవునా ? నేను మా దేశము చేరినతోడనే దీనిని పద్మపురాణము యొక్క యుత్తరభాగములోని యష్టోత్తరశత సహస్రాధ్యాయమునందుఁజేర్చి వ్యాసప్రోక్తము చేయించెదను. తమరీ శాపకారణము నా మూలాగ్రముగా సెలవియ్యవలెను..." అని ప్రార్థించును

లంకా ద్వీపమున రాహుగ్రహము శుభగ్రహము దేవతాగురువైన బృహ స్పతి వారికి పాపగ్రహము. కనుక మన దేశమునందు రాహుకాల మెట్లు వర్జనీయమో,

లంకా ద్వీపమున బృహస్పతి కాలమట్లు వర్ణనీయము. ఈ విధముగా జ్యోతిశ్శాస్త్ర సంబంధములగు చర్చలతో పంతులుగారి విశ్వాసముల కనుగుణముగా, నీ లంకా ద్వీపము నందలి కథాఘటనలు కూర్పబడినవి [36]

ఈ భాగము ముగింపునందు, బ్రాబ్డింగ్‌నాగ్ దేశమున గలివర్ ఒకరోజున, ఒకానొక కోతిచే నెత్తుకపోబడు ఘట్టమును దృష్టియందుంచుకొని పంతులుగారు సాక్షాత్తుగా హనుమంతులవారే తన భక్తుడైన సత్యరాజాచార్యుల వారిని, రాక్షసుల దేశమునుండి తప్పించి రక్షించిరని, హాస్యముగా కల్పించిరి

నాడీ సత్యరాజాపూర్వ దేశయాత్రలు, పాఠకులను విశేషముగా నాకర్షించెనని పంతులుగారు తమ స్వీయచరిత్రమునందు వ్రాసిరి.

ఈ 'సత్యరాజా పూర్వదేశయాత్రల' తరువాత పంతులుగారినవలలలో పేర్కొనదగినది 'సత్యవతీ చరిత్రము' ఈ 'సత్యవతీచరిత్రము' పంతులుగారి నిరుపమానమైన సృష్టియని చెప్పనొప్పును. దీని కాంగ్లగ్రంథ మెద్దియు నాధారము గాదు. 1883వ సంవత్సరమున స్త్రీల యుపయోగార్థము వీరేశలింగంపంతులు గారు 'సతీ హితబోధిని' యను మాసపత్రికను ప్రారంభించి, ఆ పత్రిక యందీ నవలను వెలయించిరి.

రాజశేఖర చరిత్రమునందు రాజశేఖరుడుగారిని ప్రధాన పాత్రముగా దిద్దితీర్చి, ఆయన చుట్టును కథనల్లినట్లీసత్యవతి చరిత్రమునందు, సత్యవతి ప్రధానపాత్ర. రాజశేఖర చరిత్రమునం దంధవిశ్వాసములు మానవున కెన్ని యాపదలు తెచ్చి పెట్టునో వర్ణించినట్లు, సత్యవతీ చరిత్రమునందు స్త్రీలకు విద్యలేక పోవుట, కుటుంబము నందలి సర్వానర్థములకు మూలకందమని వర్ణింపబడెను. రాజశేఖర చరిత్రము నకుగాక సత్యవతీ చరిత్రమునకు పంతులుగారు వివేకచంద్రిక యని పేరు పెట్టిన సార్థకముగా నుండెడిది. అవిభక్తకుటుంబములలో సంభవించునట్టి యపార్థములు, చదువెఱుగని మూర్ఖురాండ్రైన స్త్రీలు సంసారమును నరక కూపమునుగా చేయుట, అత్తల సాధింపులు, ఆడుబిడ్డల ఆరడితనము, మొదలగు విషయములు సత్యవతీ చరిత్రమునందు వర్ణింపబడినవి. స్త్రీల నజ్ఞానమునందుంచి, విద్యావివేకములకు దూరగులనుగాచేసి, పురుషుడభివృద్ధిని సాధింపలేడనియు, ఉత్తమసంస్కారము పొందలేడనియు, పురుషులు తాము సుఖించవలెనని యాశించిన, స్త్రీల విద్యా, వివేకములయందు

శ్రద్ధవహింపవలెననియు, అట్లు శ్రద్ధవహింపక యుపేక్షచేసినచో, పురుషుడు కూడ స్త్రీలతోబాటుగ నధోగతి పాలగుననియు పంతులుగారీ నవలయందు ప్రబోధించిరి. తెలుగున స్త్రీలు చదువుకొనుటకు మంచి పుస్తకములులేని లోపమును నివారింపవలె నని తలంచి, సత్యవతీ చరిత్రమును తాము రచించినట్లు పంతులుగారు స్వీయ చరిత్రమునందు తెలిపియున్నారు.

రాజశేఖర చరిత్రమునందు పురుషు డెట్టి వివేకమును కలిగియుండవలెనో నిరూపించుచు పంతులుగారు పాత్రలను సృష్టించిరి. ఈ నవలయందు ప్రధానమైన స్త్రీపాత్రలులేవు. అందువలన పంతులుగారు సత్యవతీ చరిత్రమునందు స్త్రీపాత్రలను ప్రధానముగా తీర్చిదిద్ది, కుటుంబ సుఖజీవనమునకు, స్త్రీలెట్టి వివేకమును కలిగి యుండవలెనో నిరూపించిరి అవిభక్త కుటుంబములోని వ్యక్తు లొకరితో నొక రెట్లు ప్రవర్తింప వలసినదియు, ఇంటి ఇల్లాలు యెట్లు సంసారమును చక్కదిద్దు కొనవలసినదియు, ముఖ్యముగా స్త్రీలు చదువునేర్చుటవలన సంసారమునకు కలుగు ఉపయోగములను గూర్చియు పంతులుగారీ నవలయందు వర్ణించియున్నారు

ఈ నవలయందు ముంగొండ అగ్రహారమున వసించుచున్న లక్ష్మీనారాయణ, యశోదమ్మ దంపతుల సంతానమును, వారి వారి సంస్కారములను, వారి వారి జీవన వైచిత్రిని పంతులుగారు వర్ణించియున్నారు లక్ష్మీనారాయణగారి పెద్దకుమారుడు వెంకటేశ్వర్లు. ఈతని భార్య సుందరమ్మ వీరిరువును విద్యావివేకములు లేనివారే. సంసారయాత్రయం దనేక కష్టనష్టముల ననుభవింతురు. వీరి మూఢాచారములు, వివేకవిహీనత, వీరనుభవించిన యాపదల కన్నిటికి మూలకారణమని పంతులుగారు వర్ణించిరి లక్ష్మీనారాయణగారి రెండవ కుమారుడు నారాయణమూర్తి. ఇతనిభార్య సత్యవతి. వీరిరువురునును విద్యావివేకములు కలవారు. కనుక వీరి సంసారము, ఆదర్శమహితముగా వెలయుచుండును. వీరికి దైవికములగు నాపదలు సంభవించినను, నిష్కారణముగా, అయినవారు, కానివారు, వీరిని చిక్కులపాలు చేసినను, వీరికిగల విద్యావివేకముల వలన, సంసారము సుఖముగా సాగిపోవును. నారాయణమూర్తి సుఖజీవనమున కంతకును సత్యవతి విద్యావంతురా లగుటయే హేతువని పంతులుగారీ నవలయందు నిరూపణము చేసిరి. లక్ష్మీనారాయణగారి మూడవ కుమారుడు రామస్వామి. ఇతని భార్య మహాలక్ష్మి. రామస్వామి విద్యాగంధములేక, చెడునడతలబడి దుస్సహవాసములు చేసి, దుర్మార్గపు పోకిళ్ళుపోయి,

కుటుంబసౌఖ్యమునకు భంగము కలిగించుచుండెను. కాని ఇతని భార్యయైన మహాలక్ష్మి విద్యావివేకములు కలిగి, సత్యవతి నాదర్శముగా చేసికొని యుండుటచే, కథాంతమున తన ఓర్పుచేత, వివేకముచేత, భర్త నడవడినిదిద్ది, ఆతనిని మంచి మార్గమున ప్రవేశపెట్ట గలుగును ఈ సోదరులలో కడపటివాడు సుబ్రహ్మణ్యము. ఇతనిభార్య సూరమ్మ ఈమె మూర్ఖురాలు. స్త్రీలు చదువుకొనుట పాపమనియు, నోములు వ్రతములు నోచుట తప్ప ఇహపరములు లేవనియు, చాదస్తపుటాచారము లన్నియు విధిగా పాటించవలెననియు, విశ్వసించు స్వభావము కలది కనుక సుబ్రమణ్యము జీవితమున సుఖశాంతులు లభింపనే లభింపవు ఈ విధముగా నాలుగు రకములైన మనస్తత్వములుగల పాత్రలను సృష్టించి, వారివారి ప్రవృత్తులయందును, ప్రవర్తనల యందును గల తారతమ్యములను వెల్లడించుట వలన, పంతులుగా రాశించిన ఫలిత మీ నవలయందు వారు సాధింపగలిగిరి

ఈ నవలయందు కథా సన్నివేశములలో బిగిలేదు పాత్రచిత్రణమునందును కొన్ని లోపములుకలవు కథా సంఘటనములు క్రమానుగతముగ కూర్పబడక, ఉద్దిష్టార్థమును ప్రచారముచేయు నిమిత్తమే, కథ కల్పింపబడినదన్న భావము కలుగును కథాసంఘటనములందు పాఠకుని దృష్టి యాకర్షింప బడదు నవల యంతటను పంతులుగారి వ్యక్తిత్వము సాక్షాత్కరించు చుండునుగాని, పాత్రోన్మీలనము కాని, పాత్రలకు స్థితికాని యీ నవలయందు కన్పింపదు పాత్రల ముఖమునగాక పంతులుగారు కొన్ని సన్నివేశముల యందు, తాము ప్రవేశించి, ఉపన్యసించుట కలదు. పంతులుగారు సాంఘికదురాచార నిరసనమునకు సాహిత్యము నుపకరణముగా చేసికొనిరని చెప్పుటకీ సత్యవతీ చరిత్రము లక్ష్యప్రాయముగా నున్నది

ఈ నవలయందు ప్రసక్తానుప్రసక్తముగ సతీసహగమనము, ఉద్యోగస్థుల లంచగొండితనము, స్త్రీ పునర్వివాహములు, నాడు రాజమహేంద్రవరమునగల పాఠశాలలస్థితి, మూర్ఖురాండ్రైన స్త్రీల ప్రసంగములు, దేశీయవైద్యుల మూర్ఖత్వము, మంత్రసానుల అజ్ఞానము, మూఢురాండ్రైన అత్తలుపెట్టు కోడండ్రికము మొదలగు విషయములు వర్ణింపబడినవి. ఈ నవలయందు పదునైదు ప్రకరణములుకలవు.

సత్యవతీ చరిత్రము నాడు పాఠకులను విశేషముగా నాకర్షించినట్లును ఈ నవలను స్త్రీలుమాత్రమేగాక పురుషులు సహితమత్యాసక్తితో చదువసాగిరనియు, చదివి

యానందించినవారనేకులు తమకుఁబుట్టిన స్త్రీ శిశువుల కందలి కథానాయకురాలయిన సత్యవతిపేరుపెట్టిచుండిరనియు, ఈ పుస్తక మఱవములోనికిని, కన్నడమునకును, ఇంగ్లీషునకును అనువదింపబడినదనియు, ప్రాడ్వివాకులు మొదలయిన వారి పరీక్షలకు గూడ నీనవల పరనీయ గ్రంథముగాచేయబడినదనియు పంతులుగారు స్వీయచరిత్రము నందు తెలిపియున్నారు [37]

పంతులుగారు స్త్రీలయుపయోగార్థమై రచించిన మరొకనవల చంద్రమతీ చరిత్రము. పంతులుగారీ నవలను 1884వ సంవత్సరమున రచించిరి. ఈ నవల యందును పదునైదు ప్రకరణములుగలవు. చంద్రమతి చరిత్రము కథా వస్తువుగాచేసి కొని పంతులుగారు స్త్రీ విద్యాభ్యాసమును, స్త్రీలు నేర్వదగు విద్యనుగూర్చియు యీ నవలయందు చర్చించియున్నారు. చంద్రమతి కథ యాధారముమాత్రమే ఏదైన నొక కథనుగూర్చి చెప్పినకాని, యిట్టి విశేషములు విశేషాకర్షకములుగా నుండవని, పంతులుగారు తలంచి, చంద్రమతితండ్రియైన ఉశీనరమహారాజు, స్త్రీ విద్యయందు మిక్కిలి యాసక్తిగలవాడగుటవలన, యుక్తవయస్సురాగా తనకుమార్తెను విద్యా సముద్రులను పండితుని కొప్పగించి, ఆమెకు విద్యనేర్పించెనని కల్పనచేసియున్నారు ఈ కథ సావిత్రీదేవికథకుగాని, దమయంతీదేవికథకుగాని కూర్చి చెప్పినను చెప్ప వచ్చును. హరిశ్చంద్రుని కథయందు సత్యనిష్ఠయను మహోన్నత ధర్మముకలదు కాన పంతులుగారీ కథను స్వీకరించియుందురని తలంచవలెను. చంద్రమతితల్లియైన సునంద విద్యావంతురాలయి, విద్యవలన ప్రయోజనములనెఱిగి, కొమార్తెకు విద్యా పరిశ్రమమునం దభిరుచి కల్గించెనని మొదటి ప్రకరణమునందు పంతులుగారు వ్రాసి యున్నారు

కథాప్రారంభము, పంచతంత్రము కథయొక్క ప్రారంభమును పోలియున్నది ఉశీనరమహారాజొకనాడు కొలువుతీర్చియుండగా, ఆస్థాన విద్వాంసుడైనవిద్యాసముద్రు డను పండితుడొకడు రాజానుమతంబున విద్యావిషయకమై యొక యుపన్యాసము చేయును ఆ యుపన్యాసమునందు స్త్రీలకుగూడ విద్య అత్యావశ్యకమని ఆ పండి తుడు నొక్కివక్కాణించును. రెండవ ప్రకరణమునం దుశీనరమహారాజు తన కొమా ర్తెను విద్యాసముద్రుల కొప్పగించి, యామెను విద్యావంతురాలినిగా జేయవలయునని ప్రార్థించును. విద్యాసముద్రుడు చంద్రమతికి విద్యాగురుడై ప్రతిదినమును, ఆమెకు విద్యను బోధించుచుండును. మూడవప్రకరణమునందు భగవత్ సృష్టిని గూర్చియు,

నాలుగవ ప్రకరణమునందు మానవుడు ధర్మమార్గమున నడువవలయుననియు, అయిదవప్రకరణమున దేహమును కాపాడుకొనుట కనుసరింపవలసిన దేహారోగ్య ధర్మములను గూర్చియు, ఆఱవ ప్రకరణమునందు, మానవుడలవరచుకొనవలసిన సుగుణముల గురించియు, ఏడవప్రకరణమునందు తోటిమానవుల యెడ నడుచుకొన వలసిన ధర్మములను గూర్చియు, ఎనిమిదవ ప్రకరణమునందు కుటుంబధర్మము లనగా భార్యాభర్తల ధర్మములు, బంధువులయెడ నడచుకొనవలసిన ధర్మములు గూర్చియు, తొమ్మిదవ ప్రకరణమునందు జీవకారుణ్యమును గురించియు, విద్యా సముద్రుడు చంద్రమతికి బోధించెను. పదవ ప్రకరణమునందు చంద్రమతీదేవి వివాహము, చంద్రమతీ హరిశ్చంద్రుల యన్యోన్య దాంపత్యము వర్ణింపబడినవి. మిగిలిన యైదు ప్రకరణములందు హరిశ్చంద్రునికథ, మూలకథనుండి స్వల్పమైన మార్పులతో చెప్పబడినది. పంతులుగారికథయందు చేసిన ముఖ్యమైన మార్పులలో, దేవేంద్రునిసభలో, హరిశ్చంద్రుని సత్యవాక్య తత్పరత్వమునుగూర్చి, వసిష్ఠ, విశ్వా మిత్రుల వివాదము వదిలివేయబడి, మహర్షులందరొకనాడు సభచేసియుండగా, సత్య మహిమను గూర్చిన ప్రశంసవచ్చి, హరిశ్చంద్రుని ప్రసక్తివచ్చి, హరిశ్చంద్రుని పరీక్షించుటకు విశ్వామిత్రుడు పూనుకొనియెనని కల్పింపబడినది. మూలకథయందు మాతంగ కన్యలు విశ్వామిత్రునిచే సృష్టింపబడినట్లుండగా, పంతులుగారు వారిని విశ్వామిత్రుని వనపాలకురాండ్రుగా మార్చిరి. ఇట్లే నక్షత్రకుడు, కాలకౌశికుడు, వీర బాహువు మొదలైన వారందరు హరిశ్చంద్రుని పరీక్షించుటకు విశ్వామిత్రునిచే సృష్టింపబడినట్లు పురాణకథయందుండగా, పంతులుగారు వారినందరిని స్వతంత్ర వ్యక్తులుగానే సృష్టించిరి మూలకథయందలి అమానుష ప్రభావమును, నాయికా నాయకులకుగల దైవీసంపద పరిహరింపబడి, వారు సత్యమువలన, విద్యవలన, వినయమువలన, వివేకమువలన, కష్టముల నెట్టివైచి, జయించిరని వర్ణింపబడినది.

ఈ నవలయందు మొదటి తొమ్మిది ప్రకరణములు, విద్యా, వివేకములు, మత విషయములు, నీతి విషయములు, ప్రత్యేకవ్యాసములుగా కూర్పబడినవే కాని, కథా భాగమునకు సంబంధించినవికావు స్త్రీలు చదువుకొనుటకై పంతులుగారీ గ్రంథమును రచించిరి కాన, వారికి సుబోధకమగు రీతిని, సులభశైలిలో, హరిశ్చంద్రుని ధర్మపత్ని యైన చంద్రమతి తన బాల్యావస్థయందు గురువువద్ద నేర్చుకొన్నట్లుగా మతవిషయ మునను, నీతివిషయమునను ప్రాథమిక ధర్మములు, వారీ నవలయందు కూర్చిరి.[38]

పంతులుగారీ నవలయందు కథా సౌందర్యమును దృష్టియందుంచుకొన లేదు కావున, కథా కల్పనము విశేషాకర్షకముగా చేయలేదు హరిశ్చంద్రు డిన్నికష్టములు వచ్చినను, గడచిగట్టెక్కుటకు చంద్రమతిబోలు విద్యావంతురాలైన భార్య కలుగుటయే కారణమని పంతులుగారి యాశయము. స్త్రీ విద్యాప్రోత్సాహకరములగు పంతులుగారి రచనలందీ నవల పతాకము వంటిది. పంతులుగారు ప్రధానముగా బోధకులు కనుక వారించుకంత సందర్భము లభించినచో పాఠకులకు బోధింప పూనుదురు అట్టి సన్నివేశములను కల్పింతురు. అట్టి సంఘటనములను కూర్తురు పంతులుగారు 1889వ సంవత్సరమునందు సత్యహరిశ్చంద్ర నాటకమును రచించి ప్రకటించిరి. ఈ నాటకమునందు గూడ చంద్రమతి విద్యావంతురాలని పంతులుగారు కల్పించిరి. తృతీయాంకమునందు హరిశ్చంద్రుని కుటుంబమును కార్చిచ్చు చుట్టుముట్టుగా చంద్ర "మతి నాకు తల్లిదండ్రులు చెప్పించిన విద్యసార్ధకమగు నట్లాశు కవిత్వముగా దండక మొకటి చెప్పి యిప్పుడిప్పావకుని మెప్పించెదన"ని తలంచును.[39]

ఇట్టి కల్పనలతో పంతులుగారు తమ యాశయములను రచనలందు ప్రతిఫలింపజేతురు ఈ సత్యహరిశ్చంద్ర నాటకమునందే ప్రస్తావనయందు సూత్రధారుడు నటునితో పెద్దతడవు నీత్యవినీతులు, ధర్మాధర్మములు, లోక వృత్తము మొదలగు వానిని గూర్చి ప్రసంగించి కడపట "ఓహో! నేనిప్పుడు ధర్మప్రసంగాదర పరవశుడనై ప్రస్తుత కరణీయమును మరచిపోయితినిగదా !" యనును. సూత్రధారుని దృష్టియందు ప్రస్తుత కరణీయము నాటక ప్రదర్శనముకదా ! ఈ సూత్రధారుని పల్కులను పంతులుగారి సాహిత్యదృష్టి కన్వయింపవచ్చును. పంతులుగారి దృష్టి ప్రధానముగా సంఘసంస్కరణము. దాని కుపాంగముగా సాహిత్యమును వారు సృష్టించిరి

పంతులుగారు రచించిన నాలుగు నవలలయందును, పురుషుల నుద్దేశించి రాజశేఖర చరిత్రము, సత్యరాజాపూర్వ దేశయాత్రలు రచింపబడినవి. స్త్రీలనుదృష్టి యందుంచుకొని సత్యవతీ చరిత్రము, చంద్రమతీ చరిత్రము రచింపబడినవి

— 0 —

# 7
# కథావాఙ్మయము

వీరేశలింగంపంతులుగారు తమ కాలమునందు జనసామాన్యమునగల యంధ విశ్వాసములను, మూఢాచారములను పోగొట్టుటకెట్టి కృషిచేసిరో, స్త్రీలదుస్థితికై యంతకన్న నెక్కుడు పరితాపపడి, వారినుద్ధరించుటకై మిక్కిలిపాటుపడిరి. ఆయన స్వీయచరిత్రమునందు చెప్పికొనినట్లుగా "ఆ కాలమునం దెల్లవారికిని దయ్యముల యందలి విశ్వాసమత్యధికముగానుండెను స్త్రీలలో నొకప్పుడును దయ్యముపట్టని వారెక్కడనో కాని లేకయుండిరి. ఎవ్వరికేవ్యాధి వచ్చినను వైద్యుని యింటికి మాఱుగా ముందుగా భూతవైద్యుని యింటికో, సోదెచెప్పువాని యింటికో పరుగెత్తు చుండిరి"

స్త్రీలయందిట్టి మౌఢ్యము, అజ్ఞానమును తొలగింపవలె నన్నచో, వారిని విద్యావివేకములుగల వారినిగా చేయవలెను. అజ్ఞానాంధకారమును బోగొట్టుటకై వివేకసూర్యోదయమునకు మించిన సాధనములేదు. స్త్రీలు విద్యావంతురాండ్రైనగాని సంసారములయందు నెమ్మదియు, సౌఖ్యమును గలుగజాలవని పంతులుగారి విశ్వాసము. పంతులుగారు స్త్రీవిద్యా ప్రోత్సాహక వాదములతోడనే తమ సంఘసంస్కరణమును ప్రారంభించిరి. కొక్కొండ వేంకటరత్నము పంతులుగారివంటి వారితో వివాదపడిరి స్త్రీలకై ప్రత్యేకముగ పుస్తకములు రచించిరి పత్రికలు నడిపిరి.

ఈ ప్రయత్నమునందు స్త్రీల కోమలములైన మనస్సులకు హత్తునట్లు, శాస్త్ర విషయములను, నీతివిషయములను, మతవిషయములను, సాంఘిక విషయములను పంతులుగారు బోధించిరి స్త్రీలకొఱకై వారు ప్రచురించిన వ్యాసములందు చిన్నచిన్న కధలనుకూర్చి వారికి సులభముగా నర్థమగునట్లును, విద్యాసముపార్జనమునం దాసక్తి కలుగునట్లునుచేసిరి ఈ చేయుటలో పంతులుగారు స్త్రీలకొఱకు 'సతీహితబోధిని'యను మాసపత్రికను నడిపిరి. ఈ సతీహితబోధినియందు స్త్రీలు చదువుకొని యానందించు వచనప్రబంధములు, దేహ గేహ పరిశుభ్రతలకు సంబంధించిన విషయములు, నీతి కధలు, పాటలు, పద్దెములు, ఉత్తమ స్త్రీ చరిత్రములు వెలయించిరి. వారికి పుస్తకములు చదువవలయుననని ఆసక్తి కలిగింపవలెనన్న కధలకు మించిన సాహిత్య

ప్రక్రియలేదు. కనుకపంతులుగారు స్త్రీలకై కధలు రచించిరి బిడ్డలను శిక్షించి, విద్యావివేకములు కలవారినిగాచేసి వారి జీవితమును దిద్ది తీర్చవలసినవారు తల్లులే గనుక; పంతులుగారు బాలబాలికలకు తల్లులు తీరిక సమయములయందు కధచెప్పు వ్యాజమున నీతిబోధసేయుటకుగాను, నీతికధా మంజరిని రెండు భాగములుగా చేసి వెలయించిరి

స్త్రీలు వినోదకరముగాఁ జదువుకొని యానందించుటకు పంతులుగారు రచించిన వానిలో ఛార్లస్ ల్యాంబ్ అను కవీశ్వరుని షేక్స్పియర్ నాటకకధల యనువాదములు పేర్కొనదగినవి ఛార్లస్ ల్యాంబను నాతడు తన చెలియలైన మేరీల్యాంబను నామెతో ప్రసిద్ధములైన షేక్స్పియర్ నాటకములలో మోదాంతములైన వానిని కొన్ని కధారూపమున విరచింపజేసి, తానును కొన్ని విషాదాంత నాటకములను కధారూపములుగాచేసి, యీయా కధలను కలిపి 1807 వ సంవత్సరమున పుస్తక రూపమున ప్రచురించెను వీరిరువురును (ఛార్లస్ ల్యాంబ్ 1775-1834 : మేరీల్యాంబ్. 1764-1887) షేక్స్పియర్ మహాకవీశ్వరుని ప్రసిద్ధ నాటకములలో ఇరువదిని మాత్రము కధారూపమున ప్రచురించి యున్నారు, వీరేశలింగం పంతులుగారా నాటకకధలలో పదునారింటిని గ్రహించి తెలుగు చేసిరి. ఇట్లాకధలను తెనుగు సేయుటయందు, పంతులుగారు, ఇంగ్లీషువారి దేశాచారములు, తెలుగు వారి కింపుగా నుండవని, ఆ కధలలోని దేశములను భరతఖండములోని దేశములు గను, వారి యాచార వ్యవహారములను, మన యాచార వ్యవహారములకు సరిపడు నట్లును, ఆ పాత్రల నామములను, మన దేశమునకు తగియుండునట్లును, మార్పు చేసిరి

పంతులుగా రనువదించిన కధలును, వానికి పంతులుగారు పెట్టిన పేర్లును నీ విధముగా నున్నవి.

| | |
|---|---|
| చమత్కార రత్నావళి | The comedy of Errors |
| సతీమణి విజయము | All's well that Ends well |
| సుమిత్ర చరిత్రము | The winter's Tale |
| రఘుదేవరాజీయము | Pericles, Prince of Tyre |
| కురంగేశ్వర వర్తక చరిత్రము | The merchant of Venice |
| కళావతీ పరిణయము | Cymbeline |

| | |
|---|---|
| గయ్యాళిని సాదుచేయుట | The Taming of the shrew |
| చిత్రకేతు చరిత్రము | King Lear |
| దానకేసరి విలాసము | Timon of Athens |
| వైదర్భీ విలాసము | As you like it |
| భానుమతీ కళ్యాణము | Much Ado About Nothing |
| సరసజన మనోభిరామము | Twelfth Night or what you will |
| ధర్మకవచోపాఖ్యానము | Measure for Measure |
| కుమారద్వయ విలాసము | The two gentlemen of Verona |
| పద్మినీ ప్రభాకరము | Othello |
| మాలతీ మధుకరము | Romeo and Juliet |

ల్యాంబ్ రచించినవానిలోనే A Midsummer Nights Dream, Macbeth, Hamlet, The Tempest, అను కథలను పంతులుగారేలనో యనువదింపక విడిచిపెట్టిరి పై కథలలో వచ్చు దయ్యములు, భూతములు, దేవ దూతలు, మానవ సాధ్యములుకాని అసంభావ్యములైన విషయములు, పంతులుగారి యభిరుచికి సరిపడక వీని ననువదింపక విడిచియుందురు

పంతులుగారీ కథలను యథోచితముగ ననువదించినను, కొన్ని యెడల వాక్యనిర్మాణమునందును, సన్నివేశ కల్పనము లందును, పూర్తిగా తెలుగుతనమును తేలేకపోయిరి ఇవి అనువాదములని తలపించు వాక్యములు, విదేశీయము లనిపించు కథా ఘట్టములు, పంతులుగారీ యనువాదము లందు పరిహరించ లేకపోయిరి ఇట్టి కథల ననువదించుట యందును, అనుసరించుట యందును, నీవిధములగు లోపములు సహజముగ దొరలుచుండును

పంతులుగారీ కథలయందలి దేశకాల పాత్రములను మార్చుటలో ప్రజ్ఞ చూపి రనుట నిస్సంశయము ఈ కథలయందు, చోళదేశము, మాళవదేశము, ఘూర్జరము, ఓఢ్రదేశము, కోసల దేశము, కురుదేశము, విదర్భదేశము, కళింగ దేశము, మొదలగు దేశములను, కాంచీనగరము, మధురానగరము, అయోధ్యాపురము, కురంగేశ్వర పురము, బృందావనపురము, బెజవాడ, నీలపల్లె, హస్తినాపురము, కళ్యాణపురము, మిథిలానగరము, కాశికాపురము, మొదలగు నగరములను, పంతులుగారు రంగస్థల ములు గావించిరి ఇట్లే ధర్మపాలుడు, వర్ధమానుడు, సుమిత్రుడు, చంద్రవర్మ, రఘు

దేవరాజు, దుష్టబుద్ధి, సత్యకీర్తి, కాంచనవర్మ, ప్రభాకరుడు, చిత్రకేతుడు, ప్రతాపరుద్రుడు, ధర్మపాలుడు, రాజవాహనుడు మొదలగు పురుషనామములును, చారుమతి, సాగరిక, వసుమతి, చతురిక, గౌరి, పద్మావతి, మధురవాణి, మంజుభాషిణి, మనోహారిణి, మోహిని, చాతుర్యవతి, దయామతి, పద్మిని, మాలతి, రతీసుందరి, మొదలగు స్త్రీల నామములును, పంతులుగారీ కథలయందు కల్పించియున్నారు.

సుమిత్ర చరిత్రమునందు రాజైన చంద్రవర్మయు, ఆతని ప్రాణమిత్రుడైన బహుమానుడును, రాజకుమారుని రహస్యవర్తనమును పరీక్షించుటకై, వృద్ధగోపకుని యింటికేగినప్పుడు, నాడా ముసలి గొల్లయింట ఇంద్రోత్సవము జరుగుచుండెనని పంతులుగారు వర్ణించిరి మూలమునందీ ఘట్టముకూడ గొల్లవారికి సంబంధించిన యుత్సవముగానే వర్ణింపబడినను పంతులుగారు దీని నింద్రోత్సవముగా వర్ణించుట వారి యుపజ్ఞకు తార్కాణము ఈ ఘట్టము నాధారముగా పంతులుగారు దేశీయాచారములను, వేడుకలను వర్ణించిరి. చిన్న పిల్లవాండ్రు గృహము ముందఱనున్న పచ్చికబయలుపైన గంతులు వేయుచుండగా, పెద్దలు మన్నారు వానియొద్ద బొమ్మసామానులను, ఇత్తడి నగలను, అద్దములను గొనుచుండిరని పంతులుగారు వర్ణించి, కథకు దేశీయ వాతావరణమును కల్పించిరి.[1]

ఇదేవిధముగా సతీమణి విజయమునందు, రాణి చిన్ననాటి విషయములను స్మరించుచు, సతీమణి ప్రేమవృత్తాంతమును గూర్చి "కేతకీ కుసుమమును కంటకములంటి యుండునట్లుగా యౌవనదశను కామపీడ యాశ్రయించి యుండుట నైసర్గికమనియు, అది యప్పుడు దోషముగా దోచకపోయినను మానవ దేహమును ధరించిన వారికెల్ల నీ దోషముండునదియే యనియు తలపోయుచుండెనని" పంతులుగారు వర్ణించిరి. మూల గ్రంథమునందు కేతకీదళము నందలి కంటకముల ప్రసక్తి లేదు. గులాబి పుష్పమును యవ్వనముతో పోల్చి, దానికిగల కంటకమును యవ్వనులైన వారి ప్రేమతోపోల్చి మూల గ్రంధమునందు చెప్పబడినది. పంతులుగారు తెలుగున కేతకీదళము ప్రసక్తిని దెచ్చుట, దేశీయతాముద్రను కల్పించుటయే.[2]

ఇదే విధముగా 'గయ్యాళినిసాదుచేయుట'యను కథయందు పంతులుగారు మిక్కలి కోప స్వభావురాలైన కథానాయికకు గౌరీదేవియనిపేరుంచి, ఆమెను గయ్యాళి గౌరియని వర్ణించుట, ఆమెను వరించవచ్చిన రుద్రమూర్తియను క్షత్రియవీరుని

దుర్వాసునిమించిన కోపశీలునిగా వర్ణించుట, దేశకాలపాత్రములయందు పంతులుగారు తెచ్చిపెట్టిన దేశీయతాముద్ర కుదాహరణములుగా చూపవచ్చును[3]

కురంగేశ్వరవర్తక చరిత్రమునందు పంతులుగారు మూలకథలోని యూదుడైన 'షైలాకు'ను బౌద్ధవర్తకుడగు దుష్టబుద్ధిగను, క్రైస్తవుడైన ఆంటోనియో'ను హిందువర్తకుడగు సత్యకీర్తిగను మార్చియున్నారు. వెనీసు నగరమును కురంగేశ్వరపురముగను, 'బెల్మంట్' గ్రామమును నీలపల్లెగను, పోర్షియాను, వసుమతిగను, నెరిస్సాను చతురికగను పంతులుగారనువదించిరి.[4] ఇట్లే 'మాలతీ మధుకరమను' కథయందు మూలకథలోని వైరముగల కుటుంబములను (Capulets and Montagues) "రుద్రవరపువారనియు గణపవరపువారనియు శైవమతస్థులయిన రెండు క్షత్రియకుటుంబములు"గా పంతులుగారనువదించిరి. రుద్రవరపువారి కుటుంబమునకు పెద్ద, ప్రతాపరుద్రుడనియు, గణపవరపువారి కుటుంబమునకు పెద్ద; గణపతి దేవుడనియు పంతులుగారువర్ణించుట, యీరెండు కుటుంబములవారికి పూర్వవైరముండుట, ఒకరోజున రుద్రవరపువారి యింట ప్రతాపరుద్రుడు మహేశ్వరవ్రతమును సంకల్పించి యా పట్టణమునున్న స్వజాతివారినందరిని, ఒక్క గణపవరపువారిని దక్క యాహ్వానించుట, గణపవరపువారి చిన్నవాడైన మధుకరుడాయుత్సవ సందర్భమున రుద్రవరపు వారింటికేగుట 'వెరోనా' నగరమును 'కాశికాపురమునుగా మార్చు'ట, మాలతీ మధుకరులకు వివాహముజరిపిన యాచార్యులను బసవనారాధ్యులనుగా చెప్పుట, మొదలగుకథను పంతులుగారుకల్పించుటనుబట్టి, వారు విదేశీయాచరములను, కథాసందర్భములను, వాతావరణమును, ఎట్లు దేశీయములుగాచేసిరో స్పష్టమగుచున్నది.[5] ఇట్టి ఉదాహరణములెన్నియేని యీ యనువాధకథలందుగాంచవచ్చును. ఇట్లు పంతులుగారు విశేషించి తెలుగువారి యాచారవ్యవహారములకనుగుణముగా అనువాద విధానము నేర్పరచుకొన్నను కొన్ని యెడల నా మార్పులు సైతము విదేశీయములుగానే యున్నవి.

'గయ్యాళినిసాదుచేయుట' యనుకథయందు పెండ్లిచూపులకువచ్చిన రుద్రమూర్తి తనకుకాబోవు భార్యయైన గౌరీదేవికి తన యెడలగల యనురాగమును గూర్చి కాబోవుమామగారికిచెప్పుచు. యాతని సమక్షముననే "ఓగౌరీ! నా ప్రాణేశ్వరీ! నా కొక్కముద్దిమ్మయని సంభావించుట" దేశీయసాంప్రదాయముకాదు.[6] ఇట్లే కాంచనవర్మ రెండవ కుమార్తెయైన పద్మావతిని వివాహమాడు ధృడసేనుని తండ్రి, తన

కుమారుని వివాహ విషయముతనకు తెలియకనే ఒంటరిగా, కాంచీనగరమునకు ప్రయాణముచేయుచు రుద్రమూర్తిగౌరీదేవులకు, మధురానగరమునుండి కాంచీపురమునకు పోవుమార్గమున నెదురుపడుట దేశీయ సంప్రదాయ విరుద్ధము.[7]

ఇదే విధముగా మాలతీమధుకరము కథయందు రుద్రవరపు వారియింట వృద్ధప్రలాపరుద్రుడు మహేశ్వరవ్రతముచేసి బంధుగుల నందరిని యాహ్వానించుట సమంజసమేకాని, రాత్రివేళ అచ్చట చేరిన వివాహములుకాని రాజకుమారులును, రాజకుమారికలును గలిసి నృత్యవినోదము జరుపవలపినదని కోరుట విదేశీయముగా వాసించుచునే యున్నది. పంతులుగారది నాటిదేశాచారమని యొక వాక్యమును చెప్పినను, శైవమతస్థులైన వారియందు ఏకాలమందును మన దేశమున కన్యలు, పరపురుషులను కూడి నాట్యములుసల్పు సంప్రదాయములేదు. మరి ఆంగ్లదేశాచారముల ననుసరించి, ఉత్సవసమయము లందును, పండుగుల యందును, స్త్రీ పురుషులు చేయిచేయి కలిపి నాట్యములు సల్పుట సహజము.[8]

ఇట్లే కురంగేశ్వర వర్తక చరిత్రమునందు యూదుడైన 'షైలాక్' అను నిర్దయుడైన వర్తకుని, బౌద్ధునిగాను, సుగుణవంతుడైన 'ఆంటోనియో'ను హిందూ వర్తకుడైన 'సత్యకీర్తి'నిగాను పంతులుగారనువదించిరి. దుష్టబుద్ధిని బౌద్ధవర్తకునిగాకాక, ఇంకేదైన మతమునకు సంబంధించిన వానినిగా చెప్పియుండిన బాగుండెడిది. బౌద్ధులు జీవహింస నొల్లరు, వారు మిక్కిలి కరుణాహృదయులు. ఎంతటి పగయున్నను, దుష్టుడైనను, దుష్టబుద్ధియను బౌద్ధుడు రాజసభయందు సత్యకీర్తి హృదయమునుండి సేరుమాంసమును కోసికొనుటకై పట్టుదలచూపుట, యనుఘట్టము, సరియైన కల్పనకాదు.[9] మూలకథ ననుసరించవలయునన్న ఇట్టి కల్పన తప్పని సరియగునుకాని, ఇచ్చట ఆ దుష్టుడైన వర్తకుని బౌద్ధునిగాగాక, మరియే మతస్థునిగానైన చిత్రించి యుండవలసినది. ఈ విధముగా అనేకములైన ఘట్టములు తెలుగు కథలయందు విదేశీయవాసనా వాసితములుగా నున్నవి. ఇక నీ కథలయందు కొండొకచో వాక్యనిర్మాణమునందు ఇంగ్లీషు నుడికారము కానవచ్చుచున్నది. అందువలన ఆ సన్నివేశములు కూడ తెలుగు పాఠకునకు విదేశీయములుగానే తోచును. అట్టి వాక్యములు, వాని యాంగ్లమూలముతో కూడ క్రింద నుదాహరింపబడుచున్నవి.

"నీ వనుభవింపబోయెడు ప్రపంచ సుఖము లన్నిటిని అడచివేయదగిన యీ మాతృవియోగదుఃఖము నిన్ను సుఖహీనురాలినిగాఁ జేయకుండునుగాక !"[10]

"Even at the first, your loss, meaning in the death of her mother" is more than all the Joys which you shall find upon this earth to which you are come a new visitor, shall be able to recompense "[11]

"ఒచక్కని నిష్కారుణ్యదేవతా! సెలవుగైకొనెదను" అని చాతుర్యవతి వెడలిపోయెను ...[12]

"And viola departed, bidding the lady farewell by the name of Fair cruelty... [13]

"నేను నీ కిచ్చెదనన్న లంచము భగవంతునికిగూడ ప్రీతికరమయినదే అది ధనకనకరత్నమయమయిన లంచముకాదు. 'ఇప్పుడు నీకు సమర్పింపబోవునది దయాళుడయిన ప్రాణదాతయొక్క మేలుగోరిరక్షితుడును తనజీవనము నీశ్వరసేవకయి ధారపోసిన విశుద్ధకన్యయు నీశ్వరుడు మెచ్చునట్లుగా కృతజ్ఞతతోజేయు ప్రార్ధనా రూపమయిన లంచము' అని యామె తనభావమును వివరించెను "[14]

"Ay," said Isabel, "with such gifts that Heaven itself shall share with you, not with golden treasures, or those glittering stones whose Price is either rich or poor as fancy valueas them, but with true prayers that shall be up to Heaven before sunrise-prayers from preserved souls, from fasting maids whose minds are dedicated to nothing temporal......"[15]

ఈ ఆంగ్ల వాక్యములకు పంతులుగారు చేసిన యనువాదము బైబిలు యనువాదమువలెనున్నది కాని తెలుగు నుడికారముకాదు. ఇదేవిధముగా పంతులుగారు కొన్ని ప్రదేశములందు ఆంగ్లవాక్యము నందలి భావమునుకాక, కర్త కర్మ క్రియలను యధాతధముగ తెలుగున కనువదించుటవలన, ఆ వాక్యములు తెలుగు వాక్యములవలె లేకుండుట సంభవించినది. మాలతీ మధుకరమను కథయందు, కథానాయకుడైన మధుకరుని నిర్వేదమును పంతులుగారిట్లు వర్ణించిరి. "వేదాంత వేత్తయైన బసవ నారాధ్యుడాతనికి వైరాగ్యోపదేశముచేసి దుఃఖోపశమనముచేయ జూచెను గాని

యున్మత్తునివలె మతిహీనుడయియున్న యత డావృద్ధుని బోధవినక వెఱ్ఱివానివలె తల విరియఁబోసికొని తనసమాధికయి భూమి పొడవుకొలుచుచున్నాడోయనునట్లు నేల మీఁదఁబడి పొరలుచు విలపింప జొచ్చెను.[16]" సమాధికయి నేలను కొలుచుట యనునది ఇంగ్లీషు నుడికారము దీనికాంగ్ల మూలమిట్లున్నది.

"The good friar would have applied the consolation of Philosophy to his griefs, but this frantic young man would hear of none, but like a mad man he tore his hair and threw himself all along upon the ground as he said, to take the measure of his grave"[17]

పంతులుగారీకథలనన్నిటిని ప్రప్రథమమున పత్రికాముఖమున వెలువరించినట్లు కన్పట్టదు. కొన్ని కథలను 'సతీహితబోధిని' యందును, కురంగేశ్వర వర్తక చరిత్రమును 'చింతామణి' యందును ప్రపథమమున వెలువరించిరి [18] తక్కిన వానిని పుస్తకరూపముననే వెలువరించి యుండవచ్చును.

పంచతంత్రము, శుకసప్తతి, మొదలగు కథలు మాత్రమే పంతులుగారికి పూర్వము తెలుగునందు కలవు అవియును పంతులుగారి కాలమునకు గ్రాంధిక భాషలో నున్నవి. అందువలన పంతులుగారు స్త్రీలు చదివి యానందించుటకును, వారికి పుస్తకములు చదువుటయం దాసక్తి కలిగింపవలెననియు, కథలను రచించి, తెలుగు భాషలోని యాలోపమును నైతము తీర్చి, తరువాత వారికి మార్గదర్శకులైరి. ఈ పదహారు కథలను పంతులుగారు వేరువేరు పుస్తకములుగా ప్రచురించి క్రీ. శ. 1898 వ సంవత్సరమున ప్రప్రథమమున తమ గ్రంథముల నన్నిటిని సంపుటములుగా ప్రచురించుచు నీ కథలను స్త్రీలకుపయోగించు పుస్తకములను, ఐదవ సంపుటమునందు చేర్చియున్నారు. వీనిలో కొన్ని ప్రవేశపరీక్షకు పాఠ్యపుస్తకములుగా కూడ నొనర్పబడినవని పంతులుగారు స్వీయచరిత్రమునందు వ్రాసి యున్నారు

ఈ కథల తరువాత పంతులుగారు స్త్రీలకొఱకును, బాలబాలికల కొఱకును రచించిన కథలలో పేర్కొనదగినది 'సత్య సంజీవని' యను పెద్దకథ ఈ కథను తాము రచించిన సందర్భమును గూర్చియు కథనుగూర్చియు చెప్పుచు 1887 వ

సంవత్సరమున స్త్రీలకొఱకు తాము సత్యసంజీవనియను నీతిబోధకమయిన యొక పుస్తకమును, ఒకానొక ఇంగ్లీషు పుస్తకములోని కథ నాధారముగా చేసికొని రచించితి మనియు, ఆ పుస్తకమేదో తమకు జ్ఞప్తికివచ్చుట లేదనియు, నీ కథయందసత్య మాడుటవలని యనర్థములు విదర్శనపూర్వకముగా మనస్సున నాటుకొనునట్లు చెప్పబడినవనియు, నీ కథ చదివినప్పుడొక బాలిక తానావఱకాడిన యసత్యము స్మరణకురాగా పుస్తకమును విడిచి యేడువదొడగెనవియు, పంతులుగారు స్వీయ చరిత్రమునందు వ్రాసిరి 'సత్యసంజీవని' యను నీకథ తొమ్మిది ప్రకరణములందు చెప్పబడినది ఈ కథయు, తదుపరి పంతులుగారి సంపుటములలో ఐదవసంపుటమైన స్త్రీల కుపయోగించు పుస్తకములయందు చేర్చబడినది మాణిక్యమను నొకబాలిక తన యప్పయైన భ్రమరాంబ ముత్యాలహారమును, తన ముత్తవ యనుజ్ఞ పొందకనే, దొంగతనముగా ధరించుకొనగా, యది పెరిగిపోవును. దానిని కప్పిపుచ్చుటకు మాణిక్య మాహారము సంగతి తానెరుగనే యెరుగనని యసత్యము చెప్పును. ఆ యసత్యమును రక్షించుకొనుట కిట్లే ఒకదానిపైనొకటి, యసత్యములు కల్పింపవలసి వచ్చును. చివరకు సత్యము బయల్పడి మాణిక్యమెంతో మనస్తాపమును పొందును అసత్యమాడరాదని కోమలములైన మనస్సులకు హత్తుకొనునట్లు సులభశైలియందు కథ కూర్చబడినది. వాక్య నిర్మాణమునందుకాని, సన్నివేశ కల్పనమునందుకాని, యిసుమంతయు, ఆంగ్ల భాషావాసనలు కన్పట్టవు ఒకటి రెండు సన్నివేశములందు తప్పనించుమించుగ స్వతంత్ర కథయనియె యనిపించును కాని నీతిబోధను ప్రధానముగా దృష్టియం దుంచుకొని పంతులుగారు కావ్యసౌందర్యము నాదరింపలేదని యీకథ చదినవారికి తెలియును సత్యమహిమనుగూర్చి బలవత్తరముగ బోధించు నీ కథ భోజరాజీయము లోని గోవ్యాఘ్ర సంవాదమునుగాని, పారంపర్యముగా చెప్పికొనబడుచున్న పులి–గొల్లపిల్లవాని కథనుగాని పోలియుండలేదు ఇట్లు పోలియుండకపోవుటకు కారణము పంతులుగారు నీతిబోధకే ప్రాధాన్యమునిచ్చి కావ్యసౌందర్యమునందు దృష్టి నిలుపక పోవుట.

ఈ కథయందు, సన్నివేశముల కూర్పునందది యప్రధానమేయైనను నొక చిన్న ప్రమాదము దొరలినది. పంతులుగారుకాని, తదితరులెవ్వరైనకాని యా ప్రమా దమును గుర్తించి తరువాత ముద్రణము లందైనను దానిని సరిదిద్దలేదు. మొదట ప్రకరణమునందు లక్ష్మీదేవమ్మ యప్పకోడలైన పూర్ణమ్మయొక్క పెద్దకొమార్తె

సరస్వతి పుట్టినదినమగుటచే, పనిమనిషి రామినిచ్చి, ముత్తవ (లక్ష్మీదేవమ్మ) తన మనుమరాలైన మాణిక్యమును, పూర్ణమ్మగారింటికి భోజనమునకును, ఆడుకొనివచ్చుటకును పంపును. మాణిక్యము, అప్పుడైన ముత్యాలహారమును దొంగచాటుగా ఒడియందుంచుకొని రామివెంట నడచి పూర్ణమ్మగారిల్లుచేరును. అచ్చట తోడ బాలబాలికలతో ఆటలాడుకొనుటకు, మాణిక్యమునకు తన మెడలోని ముత్యాలహారము గొప్ప ప్రతిబంధకముగా పరిణమించును మాణిక్యమునకు మనస్సులో తాను తోడి బాలబాలికలవలె స్వేచ్ఛగా నాటలాడుకొనలేక పోవుచున్నాననను చింత కలుగును దీనికి కారణమా ముత్యాలహారమేకదా, దీనిని తీసుకొనిరాకున్న నెంతబాగుండి యుండునని తలంచుచు ఖిన్నురాలై యొక మూలనొదిగియుండగా, నేస్తములు ఆటలోనికి రావలసినదని మాణిక్యమును బలవంతము చేయుదురు. అట్లు బలవంతపెట్టుటలో, "ఆ సందడిలో నొకచిన్నదానిచేయి తగిలి హారము, దారము తెగిపోయి ముత్యములన్నియు నేలమీద జలజలరాలెను " అని ముత్యముల హారము తెగిపోవుటకొక చిన్నదాని చేయితగుటట కారణమని పంతులుగారు వర్ణించిరి.

కాని ఎనిమిదవ ప్రకరణమునందు పూర్ణమ్మగారి కూతురైన సరస్వతి, మాణిక్యముయొక్క ముత్యాలహారము, నాడు తన పుట్టినదినమున, తెగిపోవుటకు కారణము, నిట్లనిచెప్పెను. "అవ్వా! హారము తెగిపోవుట మాణిక్యము తప్పిదము గాదు. ఆటలో నరసింహముచేత బట్టుకొని లాగినాడు. అందుచేత దారములుతెగి పూసలు క్రిందపడిపోయినవి..."19.

కనుక మొదటి ప్రకరణమునందు పంతులుగారు వర్ణించిన విధమునకు ఎనిమిదవ ప్రకరణమునందు లక్ష్మీదేవమ్మగారికి సరస్వతి హారముతెగిపోవుటకు కారణమును వివరించిన విధమునకును, సమన్వయము కుదురలేదు మొదటి ప్రకరణమునందొక చిన్నదానిచేయి తగిలి హారము తెగిపోగా, ఎనిమిదవ ప్రకరణమునందు నరసింహమను బాలునిచే త్రెంపబడినదని వర్ణింపబడినది పంతులుగారీ విషయమును గమనింపలేదు. పంతులుగారు, తుడుపులును, దిద్దుబాట్లును లేకుండ మిక్కిలి వేగముగా వ్రాసికొనిపోవు నలవాటు కలవారు కావున నీ కథను త్వరితగతిని రచించియుందురు ఈ కథయందు సైతము విశాలాక్షమ్మ వృత్తాంతము, దేశీయసంప్రదాయములకు విరుద్ధముగా నున్నది. మాణిక్యము నేడేండ్ల బాలికనుగా వర్ణించుట, ఆమె యప్పయైన భ్రమరాంబను తొమ్మిదేండ్లా బాలికగా వర్ణించుట, కథలో వారు

మాట్లాడు మాటలకుగాని, వారి ప్రవర్తనకుగాని, వారి మానసిక సంఘర్షణ వ్యక్త పరుపబడిన రీతికిగాని, సమన్వయపడలేదు ఏడేండ్ల బాలిక మనస్సున కథలో చెప్ప బడిన సంఘర్షణ, పశ్చాత్తాపము, దుఃఖము, కలుగుట సహజముకాదు. కాని మాణిక్యము యొక్కకథ యీ సత్యసంజీవనియందు మిక్కిలి జాలిపుట్టునట్లు వర్ణింప బడినది. మాణిక్యము యొక్క ప్రవర్తన పాఠకులకు, ఆమెయందు దయను, జాలిని పుట్టించును అందువలననే పంతులుగారు స్వీయచరిత్రమునందు వ్రాసినట్లీకథ బాలబాలికల మనస్సులకు బాగుగా హత్తుకొనుట కవకాశము కలిగినది. మాణిక్యము యొక్క మానసిక సంఘర్షణమునకును, పశ్చాత్తాపమునకును, మనస్సు ద్రవించి, యీకథను చదివిన యొకానొక బాలిక పుస్తకము క్రిందపెట్టి, యేడ్చియుండును మొత్తమునకు బాలబాలికలను బాగుగా నాకర్షించగలిగినకథ యీ సత్యసంజీవనియని చెప్పవలెను

ఈ సత్యసంజీవనికథ ప్రథమమున సతీహితబోధినియందు 1884 వ సంవత్సరమున పంతులుగారు వెలువరించిరి తదుపరి యిది 1887 వ సంవత్స రమున పుస్తకరూపమున వెలువడినది.

పంతులుగారు రచించిన కథలలో తరువాత పేర్కొనదగినవి ఈసప్ నీతి కథల ననుసరించి చేయబడిన నీతికథా మంజరియును రెండుభాగములు ఈ కథలను పంతులుగారు 1893 వ సంవత్సరమున చిత్రపటములతో రెండుభాగములుగా చేసి ప్రకటించిరి ఈ కదలు పంతులుగా రింగ్లీషులో నున్న ఈసపు కథల ననుసరించి చేసితిమని స్వీయచరిత్రమునందు తెలిపి యున్నారు ఈ కథలు మిక్కిలి మనోహర ములుగాను నీతిబోధకములుగాను నుండును ఈసప్‌కథలను తెలుగున పుస్తకరూప మున ప్రకటించినవారిలో పంతులుగారే ప్రథములు. ఈకథలు తెలుగున ప్రప్రథ మమున హరికథా పితామహులు శ్రీ అజ్జాడ ఆదిభట్ల నారాయణదాసుగారు రచించి రనియు, ఆ కథలను పుస్తకరూపమున తెచ్చుటకై వీరేశలింగంపంతులుగారి ముద్రణాలయమున నొప్పజెప్పగా దానిని చూచి పంతులుగారు నారాయణదాసుగారి గ్రంథము నచ్చొత్తింపక, త్వరితగతిని తామా కథల ననువదించి పుస్తకరూపమున ప్రచురించిరని యొకానొక యపప్రథను, అపకీర్తిని పంతులుగారి విషయమున కొందరు వ్యాప్తిచేసిరి. శ్రీనారాయణదాసుగారు తమ స్వీయచరిత్రమునందీ విషయ మును వ్రాసియున్నారు [20] వీరి జీవితచరిత్రమును రచించినవారు సైతము నారాయణ

దాసుగారి మాటలాధారములుగా నీదేవిషయమును వ్రాసిరి.[21] శ్రీనారాయణదాసుగారు తాము 'నూర్గంటి' యనుపేర ఈసప్స్ ఫెబిల్స్‌లోని కొన్ని కధలు (ఏనూరుకధలు) రచించి ప్రతి కధ చివరను రెండుపాదములలో నీతియు, రెండు పాదములలో కధయు నిమిడ్చి, గీతములు విరచించినామని తమ ఆత్మకధయందు వ్రాసియున్నారు

కాని నారాయణదాసుగారికన్న పది సంవత్సరములకు పూర్వమే వీరేశలింగం పంతులుగారు ఈసప్ కధలలో కొన్నిటి ననువదించి తమ సతీహిత బోధినియందు ప్రచురించియుండుట వారెరిగి యుండరు[22] కనుక నారాయణదాసుగారు ఆత్మకధ యందు వ్రాసిన విషయమును, వారి జీవిత చరిత్రకారుడు వ్రాసిన విషయమును సరికావని స్పష్టమగుచున్నది పంతులుగారీఈసప్ కధలను 1893, 94 వ సంవత్సరములయందు 'చింతామణి' పత్రికయందు కూడ వెలువరించి యున్నారు. కనుక 1883 వ సంవత్సరమున, ఈసప్ నీతికధలచే నాకర్షింపబడి వానిననువ దించుట ప్రారంభించి, యెడనెడ కొన్ని కధల ననువదించి, తాము నడపుచున్న పత్రి కలలో ప్రకటించుచు 1893 వ సంవత్సరమున పుస్తకరూపమున ప్రచురించిరని స్పష్టపడుచున్నది [23]

పంతులుగారు మొత్తము 158 కధల ననువదించిరి. మొదటి సంపుటము నందు 75 కధలును, రెండవ సంపుటమునందు 83 కధలును, చేర్చి రెండు భాగ ములుగా ప్రచురించిరి. రెండుభాగములలో కలసి తొమ్మిది పద్యకధలుగూడ నున్నవి ఈ పద్యకధలు వచనమునందుగూడ నున్నవి. అయినను వీనిని పంతులుగారు పద్యకధలుగాకూడ గూర్చుటకు కారణము వీనిలో కొన్నిటిని తాముకూర్చిన వాచక పుస్తకములందుచేర్చు నుద్దేశమై యుండవచ్చును. ప్రతికధకును చివర ఒక నీతి పద్యము చేర్పబడినది. ఆ పద్యమునందు మూడు పాదములలో కధాభావము విస్త రింపబడి, నాలుగవ పాదమునందు నీతి కూర్పబడినది.

ఈసప్‌నుగూర్చి వివరములు తెలియవు. ఇతడు క్రీస్తుకు పూర్వమారవ శతా బ్దిలో నివసించుచుండెనని తెలియుచున్నది. ఆసియామైనరులోని ఫ్రిజియాదేశ మీతని నివాసస్థానముగానుండెననియు, మొదట బానిసగనుండి, దాస్య విమోచనమును పొందిన తరువాత గ్రీసుదేశముకరిగెననియు తెలియుచున్నది. మొట్టమొదట నివి గ్రీకుభాషలో నుండెను. వేయి సంవత్సరములివి అజ్ఞాతముగానుండ, తదుపరి 'బాబ్రియస్'యను నతడు మూడవ శతాబ్దమునందు వీనిని వెలుగులోనికితెచ్చెను. తరువాత నివి సిరియన్

భాషలోనికిని, లాటిన్ భాషలోనికిని పరివ_ర్తితములయ్యెను తదుపరి ప్రాచ్యదేశపు కథలుకూడ కొన్ని వచ్చివీనిలోచేరి వీని సంఖ్యయధికమయ్యెను.[24] ఈసప్ తన కథలను గ్రంథస్థముచేయలేదు. తోచినవి తోచినట్లుగా కథలనల్లి జనులకు వినిపించు చుండెడివాడు. తరువాత తరువాత జనులు తమ జ్ఞప్తిననుసరించి యీ కథలను ప్రచారముచేయుచుండెడివారు. ఈసప్ మరణానంతరము రెండు శతాబ్దముల తరువాత ప్రప్రథమమున నీ కథలు సంపుటీకరింపబడినవి కాని యిట్లు కూర్చినవాని పేరు తెలియదు. మూడవ శతాబ్దమునందివి వెలుగులోకివచ్చినను 1844 ప్రాంతమునకు కాని యనేకదేశభాషలలో కనువదింపబడి ప్రచారమునకురాలేదు.[25]

మన వేమన పద్యములవలె ఈసప్ కథలుకూడ క్రమక్రమముగ పెరుగుచువచ్చినవి ఇట్టి నీతికథలనెవరు రచించినను నీ కథల కంటగట్టుట యాచారమయిపోయినది. అందువలన వీని సంఖ్య పరిమితముగనుండక యెక్కువగుచువచ్చినది ఆంగ్లేయ విద్య మనదేశమునందు వ్యాపించుచుండిన మొదటిదశలో ఈసప్ కథలకు జనాదరణ మెక్కుడుగనుండెను. ఆ కాలములో ఆంగ్లవిద్యనభ్యసించుచున్న ప్రతి విద్యార్థియు ఈసప్ కథలను చదువుచుండెను విద్యార్థులలో నీ కథలకుగల యాదరమునుజూచియే పంతులుగారు, వీనిని తెలుగుజేయవలెనని సంకల్పించియుందురు.[26]

ఈ కథలను మన వ్యవహారమునందుగల పిట్టకథలతో బోల్చవచ్చును. మన 'పిట్టకథ' లెప్పుడెట్లు పుట్టినవో ఊహించుటకాధారములులేవుగాని, ఇవి మన దేశమున తొట్టతొలుతటి కథావాఙ్మయమైన, అతిప్రాచీన వాఙ్మయమునకు సంబంధించిన బౌద్ధ పిటక కథలనుండి యవతరించియుండునని విమర్శకులూహించుచున్నారు.

వినయపిటకము, సు_త్తపిటకము, అభిధమ్మపిటకము మొదలైన బౌద్ధపిటకములలో సు_త్తపిటకమునందు గౌతమబుద్ధుని పూర్వజన్మకు సంబంధించిన కథలుకలవు. ఈ జాతకకథలలోని పాత్రలన్నియు సాధారణముగ మృగ, పశు, పక్ష్యాదులేయై యున్నవి. బౌద్ధ జాతకకథల తరువాతపుట్టినవి పంచతంత్రకథలు. ఈ పంచతంత్ర కథలపై బౌద్ధజాతకకథల ప్రభావమనల్పమని పరిశోధకులు నిరూపించిరి. ఈ పంచతంత్రమే తరువాత కొన్నిమార్పులతో 'హితోపదేశము'గా వెలసినది. పంచతంత్ర కథలుతొలుత పారశీక దేశపుభాషయైన 'పహ్లవీ' భాషలోని కనువదింపబడి, తరువాత సిరియాభాషలోకి పరివ_ర్తితములై, అరబ్బీభాషలోనికి సైతమనువదింపబడినవి. ఈ విధముగా ప్రాచ్యదేశములలోనీ పంచతంత్ర కథలకు విశేషమగు ప్రచారముగలిగినది

అరబ్బీభాషనుండి ఐరోపాఖండములోని వివిధ దేశభాషలలోనికి కథలనువదింపబడి నవి. 13వ శతాబ్దమునందీ పంచతంత్రకథలు హీబ్రూభాషలోనికి, స్పెయినుదేశీయుల భాషలోనికనువదింపబడినవి. ఈ కథలకు ల్యాటిన్ అనువాదము 1480 ప్రాంతమున ముద్రింపబడినది జర్మనీ, ఫ్రెంచి, ఇంగ్లీషుభాషలలోనికి కథలు క్రమముగావచ్చిచేరి నవి. కనుక అతిప్రాచీన వాఙ్మయమైన బౌద్ధజాతకకథలనేక రూపాంతరములను బొంది, అనేకభాషలలో, ననేకదేశములలో వ్యాపించెనని యూహించవచ్చును.[27]

ఈసప్ నీతికథలకును బౌద్ధజాతక కథలకును విశేషించి పోలికలున్నట్లు విమర్శకులు తలంచుచున్నారు [28] కాని పంతులుగారినాటికీ విషయము పరిశోధింప బడలేదు. ఈసప్ నీతికథలవంటి కథలు మనదేశమున పూర్వమునుండియు వ్యవహారమున నున్నను. అవి సంస్కృతభాషలోనే, తెలుగు పద్యకావ్యములలోనే యుండుటవలన, బాలబాలికల కందుబాటులో లేవని తలచి, పంతులుగారు ఆంగ్ల భాషా సాహాయ్యమున నీకథలను తెలుగు చేసినారు. ఈసప్‌నీతికథ లనువదించుచున్న కాలముననే జనపారంపర్యముగా వచ్చుచున్న కథలను సైతము పంతులుగారు కొన్నిటిని గ్రహించి తమ పత్రికలయందు వెలయించియున్నారు.

మార్గస్థులు - ఎలుగుబంటి కథయు, బ్రాహ్మణి - ముంగిస కథయు, 1883 వ సంవత్సరముననే పంతులుగారు సతీహిత బోధినియందు ప్రచురించి యున్నారు. ఈసప్ నీతికథలయందు ప్రసిద్ధివహించిన "కప్పలు దేవుని రాజునిమ్మని కోరుకొను కథను" పంతులుగారు 1888 వ సంవత్సరముననే గ్రహించి సతీహిత బోధినియందు ప్రకటించిరి. ఈసప్ కథలన్నిటి యందును నీ కథ మిక్కిలి ప్రసిద్ధి జెందినది. ఈకథ కొన్ని చారిత్రక విషయములను, కూడ వెల్లడించుచున్నదని పరిశోధకుల తలంపు నాడు దేశమును పరిపాలించుచుండిన రాజును కాదని మరి యొక రాజును ప్రజలేర్పరచుకొనగా, ఆతడు జనకంటకుడయ్యెననియు, నీ విషయమును గ్రహించి ఈసప్ 'కప్పలు రాజును కోరుకొనుట' అను కథను కూర్చె ననియు పరిశోధకుల తలంపు.[22]

పంతులుగారీ కథలో కప్పలు ఇంద్రుని తమకు రాజునిమ్మని కోరుకొనినవని క్రైస్తవుల భగవంతుడు, మనకథలో ఇంద్రుడయ్యెను ఈ విధముగా పంతులు గారు ఈసప్ నీతికథలను గూడ సాధ్యమైనంతవఱకు దేశీయాచారముల కనుగుణ ముగ తీర్చి, రచించినారు. పశుపక్ష్యాదులును, మృగకీటములును ప్రపంచమున సర్వ

సామాన్యముగ నొకే తీరున ప్రవర్తించుచుండును కనుకను మానవుల ప్రవృత్తియం దట్టియడుగుచగల ప్రేమ, ద్వేషము, మోసము, అవివేకము, పగ, యను ప్రాథమి కోద్వేగము లందరియందు నొకేతీరున నుండును గనుకను, ఆ ప్రాథమిక సత్యము లను గూర్చి చెప్పబడిన కదలు గావున, పంతులుగారీ కథలను విశేషముగ మార్పు చేయవలసిన యవసరము లేకపోయెను. పంతులుగారీ కథలందు చేర్చిన చిత్రపట ములు మనదేశీయ వాతావరణమును చూపుటలేదు మనుషుల చిత్రములన్నియు పాశ్చాత్య వేషములతో నొప్పుచున్నవి

ఈ కథలను పంతులుగారు వేర్వేరు పత్రికలలో ప్రచురింపటయేగాక, కొన్ని కథలను వేర్వేరు పత్రికలలో రెండు మూడు మార్లు ప్రచురించియేయున్నారు. 1893-94వ సంవత్సరములలో నీ ఈసప్‌కథ లన్నియు చింతామణిలో వెలువడి నవి పూర్వము 1883, 1884, 1888వ సంవత్సరములలో సతీహితబోధిని యందు ప్రచురింపబడిన కథలు గూడ మరల చింతామణియందు ప్రచురింపబడినవి. పంతులుగారు స్వీయచరిత్రమునందు తాము 1893వ సంవత్సరముననే ఈసప్ కథలను, నీతికథామంజరి యనుపేరున రెండు భాగములుగా చేసి పుస్తకరూపమున ప్రకటించితిమని వ్రాయుట ప్రమాదపతితమని తోచుచున్నది. 1893వ సంవత్స రముననే పుస్తకరూపమున ప్రకటింపబడిన యెడల 1894వ సంవత్సరమున మరల ఆ కథలు చింతామణి పత్రికలో వెలువడుటకు హేతువు కన్పట్టదు పంతులుగారీ కథల చివర ప్రతికథకును నొక నీతిపద్యమును రచించుటచే, బాలురు నీతుల నొక్క వాక్యమున నేర్చుకొనుట కవకాశము కలిగినది ఈ కథలవలన బాలురు నీతిని, లోకజ్ఞతను నేర్చికొనుటయేగాక, కథావాఙ్మయమన్న వారికొక యభిరుచి కలుగుటకు కూడ పంతులుగారు దోహదము చేసిరి

ఈసప్ నీతికథ లాధారముగా జేసికొనిరచించిన కథలేగాక పంతులుగారు మరికొన్ని నీతి కథలనుగూడ రచించిరి. ఈ కథలలో కొన్ని పంతులుగారి స్వకపోల కల్పితములు మరికొన్ని పెద్దలు చిన్నపిల్లలకు చెప్పుచు రాగా పారంపర్యముగా వచ్చుచున్న నీతికథలు కొన్ని పంచతంత్రము, ఈసప్ కథలను దృష్టియందుంచు కొని కొలది మార్పులతో రచింపబడినవి. ఇట్టి కథలను పంతులుగారు 1896వ సంవత్సరమున కొన్నిటిని చింతామణిలో ప్రకటించిరి. ప్రతిధ్వని, పరోపకారము, వెలలేని చిన్నమూలిక, మూడు తియ్యమందులు, బాదముకాయ, వరికంకులు, కణుదు

రీగ, రొట్టెలు, వరాలచెట్టు, యోగ్యదాయము, అను నీ కథలు పంతులుగారి స్వకపోలకల్పితములనియే చెప్పవలెను బాదముకాయ అనుకథ రెండు పిల్లులు రొట్టెముక్కను తెచ్చి, దానిని పంచుకొనుటకు కలహించుచుండగా, నొక పిల్లివచ్చి తీర్పుచెప్పి, ఆ రొట్టెముక్కను నోటవేసుకొనిపోవు కథను పోలియున్నది కణుదు రీగయను కథ, పెద్దలు రహస్యములు మాటాడుకొనుచున్నప్పుడు పిల్లలు రహస్యముగా పొంచుండివినరాదను నీతిని బోధింపుచున్నది. వరికంకులను కథ నిండు కుండ తొణకదు, పండ్లచెట్టు వంగియుండును, అను సామెతను, నీతిని, యాధారము చేసికొని రచింపబడిన కథ రొట్టెలను కథయందు, తనకు లభించిన దానితో తృప్తి పొందిన మేలగునను నీతి బోధింపబడినది. యోగ్యదాయము, పరోపకారము, అను కథల కింగ్లీషు ఆధారములుండునని తోచుచున్నది. కాని వరాలచెట్టు, మూడు తియ్య మందులు, వెలలేని చిన్నమూలిక, పంతులుగారి స్వకపోలకల్పితము లనియే చెప్ప వచ్చును. ప్రతిధ్వని యను కథ మన ప్రవర్తననుసరించి ఇతరులు మనయెడల ప్రవర్తింతురను నీతిని బోధించుచున్నది ఇవికాక లక్ష్మీశనైశ్చర విలాసము, సంజ్ఞల పండితుడు, అను కథలను గూడ పంతులుగారు చింతామణిలో ప్రకటించిరి. ఇవి నీతి కథలని చెప్పుటకు వలను పడకపోయినను, వినోదముకొరకు పంతులుగారు వీనిని రచించిరనుకొనవచ్చును లక్ష్మీశనైశ్చర విలాసమునందు కష్టసుఖములు మానవుని సహజముగా నంటిపెట్టికొని యుండునవేయనియు, కష్టములు వచ్చినప్పుడు నీతిదూరులుకాక ప్రవర్తించిన కడపట సుఖులగుదురనియు పంతులుగారొక నీతి వాక్యమును చేర్చియున్నారు చింతామణియందు 'చంద్రహాస చరిత్రము'ను కూడ కథా రూపమున రచించి పంతులుగారు ప్రచురించియున్నారు. దుష్టబుద్ధియను మంత్రి, కుంతలదేశపు రాజునకు మంత్రిగా నుండి, దిక్కులేని వాడైన చంద్రహాసుని కడతేర్చుటకు ప్రయత్నించి, కడకు తన కొమార్తెయైన విషయ నిచ్చి యాతనికి వివాహముగావించుట యను కథ యిది. దుష్టబుద్ధి తన కొమారుడైన మదనునకు, చంద్రహాసునిచే నొక లేఖనంపుచు దానియందు చంద్రహాసునకు విషమునిమ్ము అని వ్రాసి పంపగా, అతడు దారిలో పురోద్యానవనమునందు బడలిక దీరుటకై కొంత తడవు విశ్రమించి నిద్రింపగా, ఆ సమయమున దైవికముగా నుద్యానవనమునందు విహరింప వచ్చిన మంత్రి కొమార్తె విషయ, చంద్రహాసుని వద్దనున్న కమ్మను గాంచి, దానియం దాతనికి విషమిమ్మని వ్రాసి యుండుటకు వగచి, తానాతనియందు

బద్ధానురాగ యగుటవలన విషమునకు బదులు విషయనిమ్ము అని 'ము' వర్ణమును, 'య' వర్ణముగా దిద్దుట, తదుపరి చంద్రహాసుడాలేఖను గొనిపోయి మంత్రి కుమారున కీయగా నాతడు తన చెల్లెలిని చంద్రహాసునకు వివాహము గావించుట, ఈ కథ యందలి యితివృత్తము ఈ కథ పిల్లలమర్రి పినవీరన రచించిన జైమినీ భారతము నందు కలదు ఈకథ మిక్కిలి వినోదమును కలిగించునది కావున పంతులుగారు దీనిని 1896వ సంవత్సరమునందు చింతామణియందు ప్రచురించిరి. ఇట్లే 1895వ సంవత్సరమున నవంబరు నెలయందు చింతామణిలో పంతులుగారు 'బదరికాశ్రమయోగి' యను కథ నొకదానిని ప్రచురించిరి. ఈ కథను పంతులుగా రేదేనొక పత్రికావృత్తాంత మాధారముగా కల్పించినటుల తోచుచున్నది బదరికా వనమునందు యాత్రికులను మోసముచేసి, వారి ధనమును దొంగిలించుచుండిన మాయయోగి వృత్తాంత మారోజులలో నేదేనొక వార్తాపత్రికయందు ప్రచురింప బడియుండును ఆ వార్తను చదివి పంతులుగారు దానిని కథారూపమున చింతామణి యందు వెలువరించిరని తోచుచున్నది ఇవికాక పంతులుగారు 1904 వ సంవత్స రమున 'హిందూసుందరి' యను స్త్రీల మాసపత్రికలో కొన్ని నీతికథలను వెలయిం చినారు. ఇంతటితో పంతులుగారు కథలుగా రచించినవాని పరిశీలన పూర్తియగును. కాని పంతులుగారు మత సాంఘిక రాజకీయ నైతిక విషయములను పరిశీలించుచు ప్రబోధాత్మకములగు పెక్కు వ్యాసములను, తాము నిర్వహించిన వివేకవర్ధని, సతీహితబోధిని మొదలగు పత్రికలలో వెలువరించి యున్నారు. అనేకోపన్యాసములను చేసియున్నారు. ఆ వ్యాసము లందును, ఉపన్యాసము లందును పంతులుగారు విషయము సుబోధకమగుటకు, మనస్సునకు హత్తుకొనుటకు, విషయసౌలభ్యము కొరకు, మధ్యమధ్య చిన్నకథలను చేర్చుచుండిరి. వారి వ్యాసములందు, ఉపన్యా సములం దిట్టి కథలనేకములు గలవు ఉదాహరణమునకు 1875 వ సం॥ మేనెలలో వివేకవర్ధనియందు ప్రచురించిన 'వైద్యులు' అను వ్యాసమునందు పంతులుగారు తెలివిమాలిన వైద్యుని కరక్కాయ వైద్యమును గూర్చిన చిన్నకథను చేర్చి యున్నారు ఈ కథలోని వైద్యుని మూర్ఖత్వము మనకు జాలిపుట్టించును. వాని యవస్థ నవ్వు తెప్పించును. ఇట్లే 1886 డిసెంబరు నెలయందు వివేకవర్ధనిలోనే ప్రచురించిన "అర్థస్య పురుషో దాసః" అను వ్యాసమునందు మానససరోవరము నందు నత్తగుల్లలుండునా యని హంసలను ప్రశ్నించి, అవి లేవని తెలిసికొని

హంసలను పరిహసించిన కొంగల కథ (బక హంస సంవాదము) చెప్పబడినది. 'వేశ్యకాంతల'ను నుపన్యాసమునందు, 'బలవానింద్రియగ్రామో విద్వాంస మపి కర్షతి' యను వ్యాసులవారి వచనము దిద్ది, వ్యాసుల వారిచే పరీక్షింపబడి, పరిహాస భాజనుడైన జైమినికథ చెప్పబడినది ఇంద్రియ నిగ్రహము దుర్లభమని చెప్పుటకు పంతులుగా రీ కథ నుద్ధరించి యా యుపన్యాసమునందు వ్రాసిరి.

ఈ విధముగా పంతులుగారు 'సతీహితబోధిని' యందు స్త్రీలకొరకై వ్రాసిన వ్యాసములలో పెక్కు చిన్నచిన్న కథలను కూర్చిరి. స్త్రీలకొఱ కుద్దేశింపబడిన వగుటవలన, 'సతీహితబోధిని'యందలి వ్యాసములన్నియు మిక్కిలిసులభశైలిలో వ్రాయుటయేగాక, చక్కని చిన్నచిన్న యుదాహరణములను, వినోదాత్మకములును విజ్ఞానదాయకములును నగు పిట్టకథలను నీ వ్యాసములందు పంతులుగారు చేర్చి యున్నారు.[30] ఇట్టి చిన్నచిన్నకథలను కూర్చుటవలన అవి వ్యాసములవలెగాక విషయ సంగ్రహణమునకు మిక్కిలి సులభముగానుండి, విజ్ఞానదాయకములై, ఆకర్షవంత ములై, స్త్రీలకు పత్రికలును, పుస్తకములును చదువవలయునను నభిలాషను కలి గింపవలెనను పంతులుగారి యాశయమును సఫలీకృతముగాజేయుచున్నవి. ఇవికాక పంతులుగారు తమజంతు స్వభావచరిత్రమునందుకూడ, జంతువుల స్వభావమును తెలియజెప్పు చిన్నచిన్నకథలను కూర్చియున్నారు.

ఈ విధముగా వీరేశలింగంపంతులుగారు, తక్కిన యన్ని సాహిత్యప్రక్రియ లను చేపట్టి, వానినెట్లు సుసంపన్నములుచేసిరో, అట్లే కథావాఙ్మయమునుకూడ తెలుగు భాషయం దభివృద్ధిపరచిరి.

— 0 —

# 8
# పత్రికానిర్వహణము

వీరేశలింగపంతులుగారి సారస్వతకృషికి, సంఘసంస్కరణమునకు, సాధించిన ఘనవిజయములకు, సలిపిన దురాచారనిర్మూలనమునకు, వారు నడిపిన పత్రికలే ప్రధానాయుధములైనవని చెప్పవచ్చును పంతులుగారికి వచ్చిన ఖ్యాతికి, వారు నడిపిన పత్రికలు ముఖ్యకారకములు.

పంతులుగారు నిర్వహించిన వివేకవర్ధని నామసార్థక్యమున వరలుచుండెడి దని సమకాలీనములైన పత్రికలచే, సాహితీపరులచే ప్రశంసలను బొందెను. పంతులుగారు వివేకవర్ధనిని భావనామసంవత్సర ఆశ్వయుజ మాసమునకు సరియైన క్రీ. శ. 1874 సం॥ అక్టోబరు నెలయందు ప్రారంభించిరి ఆ సుముహూర్త మెట్టిదోకాని, ఆ పత్రికా ప్రారంభముతో ఆంధ్రసారస్వత ప్రాగ్దిశా విహాయసమున తెలిరేకలు తోచి, చిత్రవర్ణకిర్మీరములై వివిధ సాహిత్యప్రక్రియా రూపకాంతుల పరిఢవిల్లెను. తెలుగు సాహిత్యమును సుసంపన్నముచేసి తెలుగు సారస్వతమునందు ప్రక్రియా వైవిధ్యమును దెచ్చిపెట్టి, పంతులుగారికి, వివేకవర్ధని శాశ్వతమగు యశస్సును సముపార్జించిపెట్టెను. తెలుగు సాహిత్యము నందొక నూతనాధ్యాయమునకు శ్రీకారము చుట్టిన రాజశేఖర చరిత్రము వివేకవర్ధనియందే ప్రప్రథమమున భాగభాగములుగా వెలువడెను. ఆంధ్రసారస్వత చరిత్రయందు రాజశేఖర చరిత్రము ఒక మైలురాయి వంటిది. పంతులుగారు కవుల చరిత్రమును వివేకవర్ధనియందే ప్రారంభించిరి. శారీర శాస్త్రమును వివేకవర్ధనియందే తెనిగించిరి. అపూర్వ బ్రహ్మచర్యప్రహసనము మొదలగు ప్రహసనములను వివేకవర్ధనియందే ప్రారంభించిరి. కొక్కొండ వేంకటరత్న కవి కృతవిగ్రహతంత్ర విమర్శనమును వివేకవర్ధనియందే వెలయించిరి. ప్రాచీనాంధ్ర కావ్యముల నెన్నిటినో తాము నిర్వహించిన పత్రికలందు వెలువరించి భాషకు మహోపకారము గావించిరి ప్రప్రథమమున వివేకవర్ధనియందు వెలువడిన ప్రాచీనాంధ్ర ప్రబంధము కవిరాజమనోరంజనము ఇట్లు పంతులుగారు తాము నిర్వహించిన పత్రికల మూలమున సంఘసంస్కరణము, సారస్వతకృషి సాగించి కీర్తికాయులైరి.

దేశ భాషలయందు వార్తాపత్రికలను నిర్వహించుట యనునదికూడ పాశ్చాత్య సంస్కార వాసనావాసితమేయని చెప్పవచ్చును. పాశ్చాత్యసాహిత్య సంస్కృతుల ప్రభావము భారతీయుల రాజకీయార్థిక నైతిక జీవితములందు గొప్పమార్పులను తెచ్చెను భారతీయుల వేషభాషలు, విద్యావిధానము, ఆచారవ్యవహారములు, మతము, విశ్వాసములు, ఒకటన నేల సర్వసంస్కృతి యందును గొప్ప విప్లవము సంభవించెను

ఇట్టి గొప్పమార్పునకు, ప్రధానముగా దోహదభూతములైనవి ఇంగ్లీషు చదువులు, అచ్చుకూటములునని చెప్పవలెను

భారతదేశమునందు పాశ్చాత్య ప్రభావము ప్రప్రథమమున వంగదేశమున గాఢముగా ప్రసరించెను. సంఘసంస్కర్త, మహానుభావుడు, అచంచల కర్మదీక్షా పరుడు, నవీనయుగప్రవర్తకుడు నగు రాజారామమోహనరాయల వారి యుద్యమము వంగదేశమును ప్రభావితము చేసెను

భారతదేశమునందు నవీన యుగారంభమునకు, పాశ్చాత్యభావానుసరణమే యుపాదేయమని పందొమ్మిదవ శతాబ్ది పూర్వార్ధమున మేధావు లందరును తలంచుచుండిరి. ప్రజలలో పాశ్చాత్యభావములను, వారి సంస్కృతిని ప్రచారము చేయుటకై మతాంతరులైన మిషనరీలు కూడ తీవ్రముగ కృషిచేయసాగిరి. క్రైస్తవ మిషనరీల జీవితాదర్శము, నేల నాలుగుచెఱగుల క్రైస్తవ మతవ్యాప్తియే కావున, అన్యమతనిరసనము వారికి తప్పనిసరి యయ్యెను. హిందూమతము నందలి లోపములు, దురాచారములు, దేశీయులలో, దేశభాషలయందు ప్రచారము చేయవలసిన యగత్యము వారికి దోచెను అందువలన భారతదేశమునందు తొట్టతొలుతగా భారతీయభాషలలో క్రైస్తవ మిషనరీలు వార్తాపత్రికా నిర్వహణమునకు దారి తీయవలసి వచ్చెను దేశభాషలలో వార్తాపత్రికా నిర్వహణమునందు కూడ వంగదేశమే దారి తీసెను. వంగదేశమున శ్రీరామపురము నందలి మిషనరీలలో 'మార్షమేన్' అనునతడు క్రీ. శ. 1818 సం॥ ఫిబ్రవరి నెలలో 'దిగ్దర్శన్' అను నొక మాసపత్రికను ప్రారంభించెను తదుపరి ఆతడే ఆ సంవత్సరము మే 23వ తేదిన'సమాచారదర్పణ్' అను వారపత్రికను కూడ ప్రారంభించెను. భారతీయభాషలలో తొలుత వెలువడిన పత్రిక లవియేయని చెప్పవచ్చును. బొంబాయి యందుకూడ క్రీ. శ 1822 సం॥ నందు తొట్టతొలుతటి వార్తా పత్రిక 'బొంబాయి సమాచార్' యనునది వెలసినది.

మదరాసు రాజధాని యందుకూడ క్రైస్తవ మిషనరీలే ప్రాంతీయ భాషలలో పత్రికా నిర్వహణమునకు దారి చూపిరి.

క్రీ. శ. 1835వ సం॥ వరకు ప్రత్యేకముగా తెలుగున పత్రికలు వెలువడ లేదు. మత వ్యాప్తికై పత్రికలు ప్రారంభింపబడినను భారతీయ భాషలకు, భారతీయ నాగరకతకు, భారతీయ సంస్కృతికి వార్తాపత్రిక లెనలేని సేవ చేసినవి.

డచ్చివారి పరిపాలన యందున్న శ్రీరామపురమునుండి (Seramapore) బాప్టిస్టు మిషనరీలు క్రైస్తవ మతప్రచారమునకై 23-5-1818 తేదిన సమాచార దర్పణమను బంగాళీవార పత్రికను సాపించి హిందూమతమును నిరసించుచుండిరి. వీరికి ప్రతిగా రామమోహన రాయలుగారు పరిశుద్ధాస్తిక మతమును గూర్చి ప్రచారము చేయుటకును, మిషనరీల దుష్ప్రచారము నరికట్టుటకును 4-12-1821 తేదీన 'సంవాదకౌముది' అను బంగాళీ వారపత్రికను స్థాపించిరి. వారే 12-4-22 తేదిన 'మిరాత్ ఉల్‌అక్బర్' అను నింకొక పత్రికను పారసీభాషలో వెలువరింపజొచ్చిరి అంతట రామమోహనరాయలవారికిని, క్రైస్తవ మిషనరీలకును వాదోపవాదములు చెలరేగెను [1]

ఈ విధముగా భారతీయ భాషలలో భారతీయులచే నడుపబడిన మొట్టమొదటి వార్తాపత్రికను ప్రారంభించినారన్న కీర్తినిగూడ, నవయుగస్థాపనాచార్యులయిన రాజారామమోహన రాయలవారే పొందగల్గిరి.[2] వారు తాము నిర్వహించిన పత్రికల యందు రాజకీయములు, చారిత్రక వ్యాసములు, సాహిత్యవిషయములు, ప్రకృతిశాస్త్ర విషయములు వ్రాయుచు మతవిషయకముగ మిషనరీల వ్రాతలను తీవ్రముగా ఖండించుచుండిరి. వారి సదుద్యమమునకు ఆకాలమునందు కొందరు పాశ్చాత్య విద్వాంసులుకూడ తోడుపడుచుండిరి. ఇట్టి వారిలో 'జేమ్సు సిల్కు బక్కింగ్‌హామ్' యను పాశ్చాత్య విద్వాంసుడు 2-10-1818వ తేదిన 'కలకత్తాజర్నల్' అను నాంగ్ల పత్రికను స్థాపించి రామమోహనరాయల వారి వ్యాసములను ఇంగ్లీషు నందనువదించి తన పత్రికయందు ప్రకటింపసాగెను. దీనివలన క్రైస్తవ మిషనరీల మత వ్యాప్తికి గొప్ప ఆటంకము కలిగెను. అందువలన మిషనరీల నభిమానించుచుండిన ప్రభుత్వమువారు 'సిల్కుబకింగ్‌హామ్'ను ప్రవాసమంపి పత్రికా స్వాతంత్ర్యము నరికట్టుచు నొక శాసనము నమలు జరిపిరి.[3]

తెలుగుదేశమునందుకూడ తెలుగువారి యాజమాన్యమున ఆంగ్లభాషలోకొన్ని పత్రికలు బయలుదేరి దేశమునందలి సాంఘికార్థిక, రాజకీయాందోళనములందు పాల్గొనియుండెను అట్టి పత్రికలలో ప్రముఖముగాను, ప్రథమముగాను పేర్కొన వలసినది గాజుల లక్ష్మీ నరసుచెట్టిగారు నిర్వహించిన 'క్రెసెంటు' అను పత్రిక 'క్రెసెంటు' యొక్క ప్రారంభసంచిక 2-10-1844 నాడు వెలువడినది. ఆ కాలమునందు చెన్నపట్టణమున నారాయణస్వామియనునతడు 'నేటివ్ సర్క్యులేటర్' అను వార్తాపత్రికను నడుపుచుండెను ఆ పత్రికను, దాని ముద్రాక్షరశాలను లక్ష్మీ నరసుచెట్టిగారు విక్రయమునకుగొని 'హార్లీ'యను దొరనుతమ పత్రికకు సంపాద కునిగ నియమించి పత్రికను ప్రారంభించిరి. 'క్రెసెంటు' పత్రిక దేశీయుల యభివృద్ధికై విశేషమగు కృషిచేసెను మత విషయమున ఆ కాలమున 'క్రెసెంటు' చేసినకృషి యపారము. రాజకీయోద్యోగులలోని యక్రమములనుకూడ 'క్రెసెంటు' నిశితముగ విమర్శించుచుండెను అందువలన నాడు ప్రభుత్వమువారికి 'క్రెసెంటు' పత్రికయన్న కంటగింపయ్యెను దేశభాషావార్తాపత్రికలకు ప్రభుత్వమువారుచేయు సహాయము 'క్రెసెంటు' పత్రికకు లభింపదయ్యెను. అయినను గాజుల లక్ష్మీ నరసుచెట్టిగారు కష్టనష్టములకోర్చి పత్రికను ప్రచురించుచుండిరి ఆంధ్రదేశమునందు రాజకీయ సంస్కరణములకై బ్రిటిషు ప్రభుత్వమువారితో పోరాడినవారిలో లక్ష్మీనరసుచెట్టిగారు ప్రథములు.[4] పత్రికాయాజమాన్యమును వహించిన తెలుగువారిలోకూడ వీరు ప్రథములే అయినను వీరు ఆంగ్లపత్రికను నడిపినందున, తెలుగు పత్రికా నిర్వహణము నందున వీరికి ప్రాథమ్యమురాలేదు.

తెలుగువారి యాజమాన్యమున తొలి తెలుగు పత్రికను నిర్వహించిన కీర్తి మహామహోపాధ్యాయ కొక్కొండ వేంకటరత్నము పంతులువారిదని శ్రీనిడుదవోలు వేంకటరావుగారువ్రాసిరి [5] కాని 'సుజనరంజని'యను సాహిత్య మాసపత్రిక శ్రీయుతులు బహుజనపల్లి సీతారామాచార్యులు, వింజమూరి కృష్ణమాచార్యులు, కార్మంచి సుబ్బరాయలునాయడుగార్ల సంపాదకత్వమున, వేంకటరత్నము పంతులవారి 'ఆంధ్ర భాషా సంజీవని'కి పూర్వమే వెలువడియుండెను.[6] 'సుజనరంజనికి' పూర్వమువెలువడిన తెలుగు పత్రికలన్నియును మతాంతరులైన క్రైస్తవులు నడపినవి.

చెన్నరాజధానియందు తెలుగు పుస్తకములచ్చుపడుట క్రీ. శ 1806వ సంవత్సరముననే ప్రారంభమైనను క్రీ. శ. 1830వ సంవత్సరమువర కభివృద్ధిని

పొందియుండలేదు. క్రీ. శ. 1802వ సంవత్సరమున ఫోర్టుసెంటు జార్జి కళాశాల నిమిత్తము, చెన్నపట్టణమునందు కాలేజి ప్రెస్ (College Press) అను పేరున తొట్టతొలుతటి యచ్చుకూటమువెలసినది. ఆ కాలమునందు 'ఫోర్టుసెంటు రాజకీయ వృత్తాంతిని '(Fort'st George Gazette) మాత్రమే తెలుగునందు వెలువడు చుండెడిది అటుతరువాత క్రీ. శ. 1835 ప్రాంతమున క్రైస్తవమత ప్రచారకులు తెలుగు భాష యందు వార్తా పత్రికలను వెలువరించుటకు పూనుకొనిరి.

'సత్యదూత' యను పత్రిక బళ్ళారి క్రైస్తవ సంఘము వారి యాజమాన్య మున వెలువడినది. ఇది తెలుగు పత్రికలలో మొదటిదని చెప్పవలెను. ఈ పత్రిక చెన్నపురినుండి వెలువడుచుండెను కేవలము మతవిషయములగు వార్తలే యీ పత్రికయందు ప్రాధాన్యము వహించుచుండెను. దీని తరువాత పేర్కొనదగినది 'వృత్తాంతిని' యను పత్రిక. దీనియందు ప్రచురింపబడిన "వివాహములను గురించిన దుర్వ్యయము" అను లేఖను గిడుగు రామమూర్తిపంతులుగారు తమ గద్య చింతా మణి యందుదాహరించి యున్నారు.[7]

ఇదే విధముగా ఆ కాలమున వర్తమాన తరంగిణి (1842-1850), సంవాదకౌముది (1852), దిన వర్తమాని (1861-68), హితవాది (1862-67), శ్రీ యక్షిణి (1863-67) మొదలగు పత్రికలు మత విషయకములు, సాంఘిక విషయకములు, దేశవార్తలు, ప్రచురించు చుండెను.[8]

సారస్వత విషయములకు ప్రాధాన్య మొసగిన తొట్టతొలుతటి తెలుగు పత్రిక సుజనరంజని ఇదియును చెన్నపట్టణమునుండి వెలువడుచుండెను ఈ కాలమునకు దేశీయులుకూడ అచ్చుకూటములు స్థాపించి పత్రికా నిర్వహణమునందును, అముద్రిత గ్రంథ ప్రకటనమునందును సామర్థ్యము బడయగలిగి యుండిరి క్రీ. శ. 1853 వ సంవత్సరమునకు ఇంగ్లీషువారు స్థాపించిన ముద్రాక్షరశాలలుగాక హిందూదేశీయులు స్థాపించిన ముద్రాక్షరశాల లెనిమిది యుండెనని బ్రౌనుదొరగారు 1854వ సంవత్స రమునందు ప్రకటించిన తెలుగు-ఇంగ్లీషు నిఘంటువు పీఠికయందు వ్రాసియున్నారు. చిన్నయసూరి క్రీ. శ. 1853 వ సంవత్సరమున 'వాణీ దర్పణ ముద్రాక్షరశాల' ను నెలకొల్పియున్నారు.

సుజన రంజని క్రీ. శ. 1864-67 సంవత్సరముల మధ్యకాలమున వెలువడియుండెనని శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు వ్రాసిరి. ఇంకను వారు ప్రఖ్యాత

పండితులు పరవస్తు చిన్నయసూరి రచనము లిందు ప్రకటితములైనవని వ్రాసిరి.[9] ఈ విషయమును దృష్టియందుంచుకొనియే కావచ్చును "తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము" అను తమ పరిశోధక గ్రంథమునందు డాక్టర్ కొత్తపల్లి వీరభద్ర రావుగారు సుజన రంజనిని గూర్చి యిట్లు వ్రాసిరి.

"ఈ సంధియుగములో తెలుగుపత్రిక లెన్నియో బయలుదేరెను పండితులైన వారందరును ఎప్పుడో ఒకప్పుడు ఏదో ఒక పత్రికను నడిపినట్టి వారే యనుటలో నతిశయోక్తి లేదు. చిన్నయసూరి 'సుజనరంజని' అను పత్రికను నడపెను ఈ పత్రిక 1867 వరకు నడచి ఆగిపోయెను "[10]

ఇట్లే ఆంధ్ర రచయితలను గ్రంథమునందు శ్రీ మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రిగారు కూడ చిన్నయసూరి "సుస్థిర యశస్సంపాదకుడేకాదు, సుజనరంజనీ సంపాదకుడు కూడను" అని వ్రాసియున్నారు.[11]

ఇంకను, రామరాజ భూషణునకు భట్టుమూర్తియను బిరుదు నామము కలదా యను విషయమును జర్చించుచు, నరసభూపాలీయము, వసుచరిత్ర, హరిశ్చంద్ర నలోపాఖ్యానమను మూడు గ్రంథములకు కర్త భట్టుమూర్తియని "చిన్నయసూరి లోనగువారు ముద్రింపించుచు వచ్చిన సుజనరంజనియందు" వ్రాయబడియున్నదనియు, యిట్లు వ్రాయుట కాధరములెవ్వియో వారు తెలుపలేదనియు శ్రీ పూండ్లరామకృష్ణయ్య గారు అముద్రిత గ్రంథ చింతామణి యందు విమర్శించి యున్నారు.[12]

పై వ్రాతలనుబట్టి చిన్నయసూరి సుజనరంజని పత్రికను నిర్వహించెనని స్పష్టమగుచున్నది

కాని శ్రీనిడుదవోలు వేంకటరావుగారు వ్రాసినట్లు సుజనరంజని 1864-67 సంవత్సరములమధ్య కాలమున వెలువడియుండెనన్నచో, యీ పత్రికకు చిన్నయ సూరి సంపాదకత్వము వహించెననుట పొసగదు అందువలననే శ్రీ వేంకటరావు గారు సుజనరంజని సంపాదకత్వమునుగూర్చి యీ సందర్భమున ప్రస్తావింపక చిన్నయసూరి రచనములిందు ప్రకటితములైనవని మాత్రమువ్రాసిరి.

కాని 1864 వ సంవత్సరమునందు వెలువడిన సుజనరంజని ప్రథమసంపుటమునందు చిన్నయసూరి రచనము లెవ్వియును ప్రకటింపబడలేదు ఇంకను సుజన రంజని 1864 - 67 సంవత్సరముల మధ్యనుమాత్రమే వెలువడి యుండెనన్నచో

అముద్రిత గ్రంథచింతామణి వాక్యములు బాధకము లగుచున్నవి ఇంకను డాక్టర్ వీరభద్రరావుగారు వ్రాసిన "చిన్నయసూరి సుజనరంజని అను పత్రికను నడపెను" అను వాక్యము లాలోచనీయము లగుచున్నవి. చిన్నయసూరి క్రీ. శ. 1862 వ సంవత్సరమున పరమపదము జెందిరి. కనుక క్రీ. శ. 1864 వ సంవత్సరమున ప్రారంభింపబడిన సుజనరంజని కాయన సంపాదకత్వము వహించుట పొసగదు. వారు కీర్తిశేషులైన తదుపరి వారి యభిమాను లేరైనను 'సుజన రంజని' యందు వారి యముద్రిత రచనలను వెలువరించి యున్ననేమోకాని, వారి రచనలీ పత్రికయందు వెలువడి యుండెననుట కూడ యనూహ్యము సూరి క్రీ. శ. 1853 వ సంవత్సరమున వాణీదర్పణ ముద్రాక్షరశాలను నెలకొల్పి యుండెను. కనుక సుజనరంజనీ నామము వహించిన యొక సారస్వత పత్రికను నడిపియుండెనేమో ? అట్లయినగాని సుజనరంజనిని సూరి నిర్వహించి యుండెననుట పొసగదు సుజనరంజని పత్రికను నడపినవారు వింజమూరు కృష్ణమాచార్యులు, బహుజనపల్లి సీతారామాచార్యులు, కార్మంచి సుబ్బరాయలు నాయుడుగారలు కాని, చిన్నయసూరికాదు వీరు నడిపిన సుజనరంజనియందు, చిన్నయసూరి కృత నీతి చంద్రికకు (మిత్రలాభ, మిత్రభేదములకు) టిప్పణము ప్రచురింపబడెను. కాని సూరి రచనము లెవ్వియును బ్రకటింపబడలేదు. ప్రమాదవశమున చిన్నయసూరి రచనములు సుజనరంజనియందు ప్రకటింపబడె ననియు, చిన్నయసూరి సుజన రంజనికి సంపాదకత్వము వహించెననియు, లోకమునందొక యభిప్రాయము వ్యాప్తిలోనికి వచ్చియుండి యది చర్వితచర్వణమగుచు వచ్చెనని తలంపవలసి యున్నది. సుజనరంజని యందు నీతిచంద్రికా టిప్పణమేగాక, భారత, భాగవత, రామాయణములకు (భాస్కరరామాయణము), మనుచరిత్రమునకు టిప్పణములు వెలువడుచుండెను ఏది ఎట్లున్నను తెలుగుదేశమునందు వెలువడిన సారస్వత పత్రికలలో సుజనరంజనికి విశిష్టమైన స్థానము కలదనుట నిర్వివాదాంశము. ఈ పత్రిక ఆకాలమున ఆంగ్లభాషయందు వెలువడుచుండిన The Journal of Education అను పత్రికను పోలియున్నదనియు, నిది నిలిపివేయబడుట త్రిలింగదేశస్థుల దౌర్భాగ్యమనియు, దీని సమకాలపు పత్రికయగు తత్వబోధిని వ్రాయుటనుబట్టి, సుజనరంజని వైశిష్ట్యము తేటతెల్ల మగుచున్నది.[18]

సుజనరంజని తదుపరి పేర్కొనదగినది 'తత్త్వబోధిని' యను పత్రిక. ఈ పత్రిక వేదసమాజమువారి యాజమాన్యమున చెన్నపట్టణము నుండి వెలువడు చుండెడిది ఈ వేదసమాజము నేటి బ్రాహ్మసమాజమునకు పూర్వరూపము. తత్త్వబోధిని ప్రధానముగా మతవిషయములను, సంఘసంస్కారవిషయములను ప్రచురించు చుండెడిది వీరేశలింగం పంతులుగారు తత్త్వబోధిని పత్రికవలన ప్రభావితులైరని చెప్పుట కాధారములు కలవు. ప్రథమమున పంతులుగారి వివేకవర్ధనియందు తత్త్వబోధిని కార్యస్థానమున లభించు పుస్తకములను గూర్చి వ్యాపార ప్రకటనము లుండెడివి తదుపరి ఆ పుస్తకములు వివేకవర్ధనీ కార్యస్థానము నందుగూడ వెలకు లభింపగలవను వ్యాపార ప్రకటనము లుండెడివి. తత్త్వబోధిని పత్రికయందు ప్రకటింపబడిన మత సాంఘిక నైతిక విషయములను, సంపుటీకరించి, వేదసమాజమువారు, తత్త్వబోధిని పుస్తకము 1, తత్త్వబోధిని పుస్తకము 2, తత్త్వబోధిని పుస్తకము 3, అని ప్రకటించినట్లే వీరేశలింగంపంతులుగారును, వివేకవర్ధనియందు ప్రచురింపబడిన వివిధ వ్యాసములను, వివేకవర్ధని 1, వివేకవర్ధని 2, వివేకవర్ధని 3, అను సంపుటములుగా ప్రకటించి యున్నారు. తత్త్వబోధినియందు వెలువడిన స్త్రీ పునర్వివాహ విషయకమైన యొక వ్యాసము, తాము స్త్రీ పునర్వివాహ విషయక ప్రథమోపన్యాసమును గూర్చుకొనుటలో మిక్కిలి యుపకరించి యుండెనని వీరేశలింగం పంతులుగారు తమ స్వీయచరిత్రమునందు వ్రాసిరి [14]

తత్త్వబోధిని 1864 వ సంవత్సరమున చెన్నపురియందు ప్రారంభింపబడినది. ఈ పత్రికయందు స్త్రీపునర్వివాహ విషయకములైన వ్యాసములు సులభశైలియందు ప్రచారము చేయబడుచుండెను.[15]

ఈ పత్రికలుకాక వీరేశలింగంపంతులుగారు వివేకవర్ధనిని ప్రారంభించు నాటికి తెలుగుదేశమున మిక్కిలి ప్రచారమును పొందియుండిన పత్రికలు రెండు కలవు. అందొక్కటి కొక్కొండ వేంకటరత్నము పంతులుగారి యాంధ్రభాషా సంజీవని. రెండవది మచిలీబందరునుండి వెలువడుచుండిన పురుషార్థ ప్రదాయిని. ఆంధ్రభాషా సంజీవని పంతులుగారి కీర్తికి పతాకమని చెప్పవలెను. వీరు తమ పత్రికాముఖమున అముద్రితగ్రంథ చింతామణి సంపాదకులు పూండ్ల రామకృష్ణయ్యగారితోడను, వేదము వేంకటరాయ శాస్త్రులవారితోడను సలిపిన వాదవివాదములు లోక విఖ్యాతములు ఆ కాలమునందు వేంకటరత్నము పంతులవారితో వివాదపడని

సారస్వతేయుడులేడు, వారి యాంధ్రభాషా సంజీవనితో వివాదపడని సారస్వతపత్రిక లేదన్నచో ఆయన యెట్టి దుర్ధర్షులో తెలియగలదు. వేంకటరత్నము పంతులవారికిని వీరేశలింగం పంతులుగారికిని పత్రికాముఖమున నెన్నియో వాదవివాదములు కలిగినవి.

ఆంధ్రభాషా సంజీవని ప్రజోత్పత్తినామ సంవత్సర ఆశ్వయుజ శు॥ ౧౦ సోమవారమునకు సరియైన 1871వ సంవత్సరము నవంబరు నెల 28వ తేదిన వెలువడినది. ఇది ప్రతి పూర్ణిమా సాయంత్రమున వెలువడుచుండెడిది. ఈ పత్రిక యందు సారస్వత విషయకచర్చలు, సాంఘికరాజకీయ విషయములు, గ్రంథ సమీక్షలు మొదలగు విశేషములుండెడివి. వేంకటరత్నము పంతులవారి గ్రాంధికభాషా వాదము, గ్రాంధికభాషాభిమానము సర్వజనవిదితము. ఆంధ్రభాషాసంజీవనియందు రచనలన్నియును గ్రాంధికభాషయందేయుండెడివి రాజకీయ వృత్తాంతములు, దేశ వార్తలు, సారస్వతచర్చలు మొదలైనవన్నియును గ్రాంధికభాషయందే వెలువడు చుండెను. ఆంధ్రభాషా సంజీవని యించుమించుగా నిరువది సంవత్సరములు వెలు వడినది. పంతులవారీ పత్రికను ప్రథమమున 1883 వఱకును పండ్రెండేండ్లు ప్రక టించి, తిరిగి క్రీ శ 1892 లోఁ బునరుద్ధరించి క్రీ శ. 1899 వఱకును ప్రకటిం చిరి. ఈ పత్రికగూర్చి వారు తమ బిల్వేశ్వర శతకమునం దిట్లు చెప్పియున్నారు.

"ధరణిన్సజ్జనులెల్ల మెచ్చ ననవద్యంబౌ ప్రజోత్పత్తి వ
త్సరమందు న్విజయాది రాఘవకృప న్సంజీవనీ నామ వి
స్ఫురితంబేనిడ మానపత్రికయదింపుంబెంచి పండ్రెండు వ
త్సరముల్నిండగ నంతరించె జగదీశా బిల్వనాథేశ్వరా"

"శ్రీమన్నందన వత్సరాదిగ వికారిన్భాద్ర మంతంబుగా
దామోదమ్మున వెండియుం జిగిరిచెన్ దైవారసంజీవనీ
నామాఢ్యంబది మానపత్రిక సుధీనంద్యంబు త్రైలింగ భా
షా మాన్యంబు తదీయ సన్మతిహిమశ్రీశా బిల్వనాథేశ్వరా"

వేంకటరత్నము పంతులవారు, తమ పత్రికయందాంగ్లభాషా పదములకు పారి భాషిక పదములు సృష్టించుచుండిరి పత్రిక శైలి తెలియుటకు ఆంధ్రభాషసంజీవని ప్రథమ సంపుటము, రెండవ సంచికనుండి యొక వృత్తాంత ముదాహరింపబడు

చున్నది. చెన్నపట్టణపు సుప్రీముకోర్టునందు అడ్వకేటు జనరలుగాపనిచేసి, దేశీయుల విద్యాభివృద్ధి నిమిత్తమై మిక్కిలి పాటుపడి, దేశీయులమన్ననలకు పాత్రుడైన జాన్ బ్రూస్ నార్టన్ దొరగారుద్యోగవిరమణానంతరము స్వదేశమునకుబోవుచుండిన వార్తను ఆంధ్రభాషాసంజీవని యిట్లు ప్రకటించినది.

"మనయీ రాజధానియందు ముప్పదియేండ్లనుండి న్యాయవాదదురంధరత్వము వహించియుండి తుదకు రాజకీయ న్యాయవాదిత్వమహత్వము గాంచి మించి, మనవారికి బహూపకారముగావించి మహాయశస్సుబొంది స్వదేశమందు వార్ధకకాలము సుఖముగా గడపగడగి కట్టకడపట నింగ్లండునకు బోవనుండిన గౌరవమునెందిన జే. బి. నార్టన్ దొరగారికి మనవారు తమ కృతజ్ఞతాసూచకమైన యొకవందన పత్రికను వ్రాయించి యర్పించిరి. మఱి యిందయొక విద్యార్థి పారితోషికమును వారిపేరిట గల్పించుట కెంచిరి. వాలాజావంతెననుండి పచ్చెయప్ప మొదలారిగారి ప్రధాన పాఠశాలవరకు రథ్యకిరుగడల కొడికంబముల బారుకొలుపబడెను. తోకనంబులుబిట్టుగట్టబడెను అది యటుండ ఆ పాఠశాలా సౌధమునకెదుర పూలపందిలి యొకటి పొందుపరుపబడెను. వివిధ వాయిద్యములు మ్రోయుచుండెను. మత్తాబులు, చిచ్చుబుడ్లు మొదలగునవియు నెచ్చుగా బిచ్చలించుచుండెను."[16]

'ఆంధ్రభాషా సంజీవని'ని గూర్చి సమకాలిక పత్రికయైన 'పురుషార్థప్రదాయిని' యిట్లు సమీక్షించినది

"శ్రీ ఆంధ్రభాషా సంజీవని అను నామరత్నమును వహించియున్న మాస పత్రికా రత్నమొకటి కవిరత్నమును పండితరత్నమునునగు కొక్కొండ వేంకటరత్నము పంతులు వారివలన నూతనముగ జెన్నపురియందున రచింపబడి యిదివరకు సుమారొక సంవత్సరము నుండి యనఁగను గడచిన విజయదశమిని మొదలుగ గొని జయప్రదముగఁ బ్రతిమాస పూర్ణిమయందును బూర్ణచంద్రునివలె నుదయించుచు నత్యంతాహ్లాదకరమై మా హృదయంబుల నభినందింపుచు సుజనుల నందరిని ఆనందింపజేయుచు నాంధ్రభాష కొక చంద్రికవలె నొప్పుచున్నదని గొప్పబుద్ధిశాలు లూహింప బ్రకాశించుచున్న యది. ఈ పత్రికయందు జదువుటకు మిగుల యానందముగాను ఉపయుక్తముగాను నుండు ఆంధ్రభాషావిషయములును..............

"దేశభాషాభివృద్ధికరము లగు నికరములైన పద్ధతులును మంచి వృత్తాంతములును ఇంకను కొన్నికొన్ని విషయములును యెన్నికకు రాదగిన తిన్నని మధుర

మైన శైలితో వ్రాయబడుచున్నవి." ఈ విధముగా పురుషార్థప్రదాయిని ఆంధ్రభాషా సంజీవనిని మిక్కిలి ప్రశంసించినది. ఈ సమీక్షాభాగము క్రిందనే ఆంగ్లమునందు కూడ యాంధ్రభాషా సంజీవనియందలి వృత్తాంతములను, శైలిని శ్లాఘించుచు, పురుషార్థ ప్రదాయిని ఇట్లువ్రాసెను.

"The paper which we are now speaking about is his own production The beautiful style of its composition is neither difficult nor very easy. It is strictly grammatical, idiomatic and attractive It touches upon various points- Literary, Educational, Political, Religious etc..." అని వేంకట రత్నము పంతులవారినిగూర్చియు, ఆంధ్రభాషా సంజీవనినిగూర్చియు పురుషార్థ ప్రదాయిని మిక్కిలి ప్రశంసించినది [17]

వీరేశలింగంపంతులుగారు తాము రచించిన శుద్ధాంధ్రభారతమునందలి సభా పర్వములోని కొంతభాగమును ఆంధ్రభాషా సంజీవని యందు ప్రచురించిరి. వేంకట రత్నము పంతులవారి సంజీవనిని బొగడుచు గ్రాంధికమున పంతులుగారిపేరిట లేఖయు వ్రాసిరి.[18]

ఆంధ్రభాషా సంజీవనికా కాలమున, వివేకవర్ధని, అముద్రిత గ్రంథ చింతామణి, హిందూజన సంస్కారిణి, రాజయోగి మొదలగు పత్రికలతో వాదవివాదములును, చర్చలును కలుగుచుండెను.

ఆంధ్రభాషా సంజీవనికి తదుపరి పేర్కొనదగినది పురుషార్థప్రదాయినియను పత్రిక. ఈ పత్రిక బందరునుండి వెలువడుచుండెడిది. ఈ పత్రికకు దైవసమాజిని, తత్త్వప్రకాశినియనికూడ పేర్లుండెను. దీనిలో కొంతభాగ మాంగ్లమునకూడ వెలువడు చుండెను ముఖపత్రమునందును, లోపలిపుటలందును పురుషార్థప్రదాయిని(or) Nature and Man, అని ప్రచురింపబడుచుండెను.

పురుషార్థప్రదాయిని ప్రజోత్పత్తినామ సంవత్సర పుష్యమాసమునకు సరియయిన క్రి. శ. 1872వ సంవత్సరము జనవరి నెలనుండి మచిలీబందరునుండి వెలువడుచుండెను. ఈ పత్రిక చెన్నపట్టణమునందు వర్తమాన తరంగిణీ ముద్రాక్షరశాలాధిపతులైన పువ్వాడ వెంకటరావుగారిచే ముద్రింపబడి, మచిలీబందరులోని

దైవసమాజిని యధ్యక్షులైన ఉమారంగనాయకులునాయుడుగారిచే ప్రకటింపబడు చుండెను.[19] తదుపరి 1872వ సంవత్సర మాగష్టు నెలనుండి బందరుపురమున క్రొత్తగా నెలకొల్పబడిన 'కేశవరాజు అండ్ కో' వారి ముద్రాక్షరశాలయందే ముద్రింప బడి ప్రచురింపబడుచుండెను పురుషార్థప్రదాయిని కా కాలమున రాజమహేంద్రవర మండల న్యాయాధిపతియగు హెన్రీమారిసుదొర[20] గారు చందాదారులుగానుండిరి. వీరేశలింగంపంతులుగారు, కొక్కొండ వేంకటరత్నము పంతులవారు, రాజ మహేంద్రవర ప్రభుత్వపాఠశాల ప్రధానోపాధ్యాయులగు చెంగల్వ కుప్పు స్వామి శాస్త్రిగారు, విశాఖపట్టణమునుండి వెలువడిన సకల విద్యాభివర్ధనియను పత్రికకు సంపాదకులైన గూడూరి వేంకటకృష్ణరావు పంతులుగారు పురుషార్థప్రదాయినికి చందాదారులుగానుండిరి పురుషార్థప్రదాయినికి ఆంధ్రదేశము నలుమూలలందును చందాదారులుంట చెప్పతగినవిశేషము. ఈ పత్రికయందు సామెతలు, సమస్యా పూర ణములు, సాంఘికరాజకీయార్థిక, మతనైతిక విషయములు, శాస్త్రచర్చలు, సారస్వత విమర్శలు, ప్రకృతిశాస్త్రములు మొదలగు నుపయుక్తములగు విషయములు ప్రచురింప బడుచుండెడివి. ఆంధ్ర మహాభారతోద్యోగ పర్వమునకు టిప్పణి, కూచిమంచి తిమ్మ కవి అచ్చతెనుగు రామాయణమునకు టీక, మొదలగునవి పురుషార్థప్రదాయిని మొదటి సంపుటమునందు ప్రచురింపబడినవి పురుషార్థప్రదాయిని యా కాలమునందాంధ్ర సార స్వతమునకును, నాంధ్రుల సాంఘిక పురోభివృద్ధికొరకును చేసినసేవ గణనీయము.

పురుషార్థప్రదాయిని యందాకాలమున స్త్రీ పునర్వివాహము శాస్త్రసమ్మతమా ? యను విషయముపై చర్చలు జరుగుచుండెడివి.[21] మహామహోపాధ్యాయపరవస్తు వేంకటరంగాచార్లయ్య వారలుంగారి యుపన్యాసము లీ పత్రికయందు ప్రచురింపబడు చుండెను [22] ఈ పత్రికయందు వీరేశలింగంపంతులుగారి శుద్ధాంధ్రోత్తర రామా యణము, రసికజన రంజనము మొదలగు కావ్యములు వెలువడియుండెను. వీనికి పంతులుగారు లఘుటిప్పణినిగూడ నీ పత్రికయందు ప్రచురించిరి కొక్కొండ వేంకట రత్నము పంతులుగారి నీతి చంద్రిక యుత్తరార్థము, నరహరి గోపాలకృష్ణమసెట్టి గారి 'రంగరాజ చరిత్రము' యీ పత్రిక ప్రథమ సంపుటమునందు కృతి విమర్శనము గావింపబడినవి [23]

"ఈ పత్రికయందు శాస్త్రము, భాష, మతము, వైద్యము, ఔషధములు, నీతి, వ్యవసాయము, దోహదము, వర్తకము,కళలు, చేతిపనులు, విద్యా విషయములు, దేహా

రోగ్య విషయములు, గృహవిద్యలు, దేశకాల జీవచరిత్రలు, పురాతనస్థితులు, ధర్మ శాస్త్ర విషయములు, వృత్తాంతములు"... మొదలగునవి ప్రచురింపబడుచుండునని ప్రథమ సంచికయందు ప్రకటింపబడినది [24]

పురుషార్థప్రదాయిని పరమ ప్రయోజనకరములైన విషయములను ప్రచురించుచుండెనని యాంధ్రభాషా సంజీవని సమీక్షించినది [25]

బందరుపురమునకును, దానివలన కృష్ణాజిల్లాకును, పురుషార్థప్రదాయినియెట్టి సేవచేసియుండెనో, యీ పత్రికయందెట్టి యుపయుక్తములగు విషయములు ప్రచురింపబడుచుండెనో మచిలీబందరు చరిత్రమునందు ప్రశంసింపబడినది [26]

ఈ కాలమునందు బందరునుండి 'స్వధర్మప్రకాశిని'యను పత్రిక శ్రౌతము కోటీశ్వరశాస్త్రిగారి సంపాదకత్వమున వెలువడుచుండెను ఈ పత్రికయందు సంఘ సంస్కారవాదులవాదములకు ప్రతివిమర్శలు వెలువడుచుండెడివి పురుషార్థప్రదాయిని వెలువడుటకుపూర్వమే బందరునుండి రివరెండ్‌షర్కీదొరవారి సంపాదకత్వమున 'హితవాది'యను పత్రిక కొన్నినాళ్ళు వెలువడియుండెను ఇది క్రైస్తవమత సంబంధమయిన పత్రిక ఈ కాలమునందు చెన్నపట్టణమునుండి 'వ్యవహారతరంగిణి'యను నొకపత్రిక వెలువడుచుండెను. ఇది కేవలము కోర్టు ప్రకటనలు, దావాలు, తీర్పులు, మొదలగు న్యాయశాస్త్రసంబంధములగు విషయములనే ప్రచురించుచుండెను.

వీరేశలింగపంతులుగారి వివేకవర్ధని వెలువడుటకు పూర్వము ఆంధ్రదేశమున కొన్ని యాంగ్లేయ పత్రికలును వెలువడియుండెను అందు ముఖ్యముగా పేర్కొనదగినది చెన్నపట్టణమునుండి క్రైస్తవమిషనరీల యాజమాన్యమున వెలువడుచుండిన (The Native Public opinion) యనునది ఈ పత్రికయందు కొలదికాలము తెలుగువిభాగముకూడ వెలువడియుండెను.ఆతెలుగుభాగమునుకొక్కొండ వేంకటరత్నము పంతులుగారు నిర్వహించుచుండెడివారు. ఈ పత్రికయందు తెలుగు విభాగమ చిరకాలముననే నిలిపివేయబడుటచే వేంకటరత్నము పంతులవా రాంధ్రభాషా సంజీవనిని స్థాపించిరి. ఈ యాంగ్లపత్రిక వివేకవరని వెలువడిన తరువాతకూడను చాల కాలము వెలువడినది వీరేశలింగంపంతులుగారీ పత్రికయందలి వార్తలను, విశేషములను తమ వివేకవర్ధనియందు ప్రచురించుచుండెడివారు. ఈ విధముగానే కాకినాడనుండి (The Coconada Advertiser) అను నొక పత్రిక యీ కాలమున వెలువడు

చుండెడిది. దీనియందలి వార్తలను, విశేషములనుకూడ పంతులుగారు వివేకవర్ధని యందు ప్రచురించుచుండిరి. ఇవికాక రాజమహేంద్రవరమునుండి 'The Godavary Educationist' యనునొక పత్రిక వెలువడుచుండెడిది ఇది మాసపత్రిక. దీని సంపాదకులు రాజమహేంద్రవర ప్రభుత్వ పాఠశాల ప్రధానోపాధ్యాయులగు రెవరెండు బారోదొరగారు. ఈ పత్రికయందుకూడ కొంతకాలము తెలుగు విభాగముకూడ వెలువడుచుండెను ఈ తెలుగు విభాగమును వీరేశలింగంపంతులుగారు నిర్వహించుచుండిరి. పంతులుగారి శుద్ధాంధ్రనిరోష్ఠ్య నిర్వచన నైషధములోని కొంతభాగము ప్రప్రథమమున నీ పత్రికయందే వెలువడినది. కాని యీ పత్రికయందు తెలుగు విభాగము కొలదికాలములోనే నిలిపివేసిరి. కావున వీరేశలింగంపంతులుగారు తమ రచనల నా కాలమున యాంధ్రభాషా సంజీవనికిని, పురుషార్థప్రదాయినికిని బంపుచు వచ్చిరి. The Godavary Educationist (గోదావరీవిద్యాప్రబోధిని)యను నీ పత్రిక 1870వ సంవత్సరమున ప్రారంభింపబడి కొంతకాలము వెలువడెనుకాని, యిందులోని తెలుగు విభాగముమాత్రము రెండుమూడు నెలలలోనే యెత్తివేయబడెను

ఈ పత్రికలుకాక వీరేశలింగంపంతులుగారి వివేకవర్ధనికి పూర్వమే చెన్నపట్టణమునుండి 'లోకరంజని', 'బ్రహ్మాండరంజని'యను పత్రికలును, కాకినాడనుండి 'సుధీరంజని'యను పత్రికయు వెలువడుచుండెను విశాఖపట్టణమునుండి వెలువడుచుండిన 'సకలవిద్యాభివర్ధని'యను పత్రికయు, నరసాపురమునుండి వెలువడుచుండిన 'విద్వన్మనోహారిణి'యను పత్రికయు 'వివేకవర్ధని'తో నించుమించుగానేకకాలమునందు పుట్టినవని చెప్పవలెను.

వీరేశలింగంపంతులుగారు వివేకవరనిని స్థాపించునాటికి పత్రికా నిర్వహణము నందును, పత్రికారచనమునందును అనుభవమును సంపాదించియుండిరి వివేకవర్ధనికి పూర్వమే వెలసి యంతరించిపోయినవియు వివేకవర్ధనితో నించుమించుగనేకకాలము నందు బుట్టినవియు, వివేకవర్ధనికి పూర్వమే వెలసి, నాడు ప్రచారమునయుండినవియు నగు పత్రికలనీ క్రింది పట్టికయందు గాంచనగును

1. సత్యదూత
2 వృత్తాంతిని
3 వర్తమానతరంగిణి
4. సంవాదకౌముది

5 దినవర్తమాని
6. హితవాది
7 శ్రీయక్షిణి
8. సుజనరంజని
9. తత్త్వబోధిని
10 గోదావరీ విద్యాప్రబోధిని
11. స్వదేశజనాభిప్రాయిని
12. ఆంధ్రభాషాసంజీవని
13 పురుషార్థప్రదాయిని
14. వ్యవహారతరంగిణి
15 సుధీరంజని
16. స్వధర్మప్రకాశిని
17. లోకరంజని
18. బ్రహ్మాండరంజని
19. సకలవిద్యాభివర్ధని
20. విద్వన్మనోహారిణి

కనుక వీరేశలింగంపంతులుగారు వివేకవర్ధనిని స్థాపించునప్పటికి, తెలుగు దేశమునందించుమించుగ, ఇరువదిపత్రికలు వెలువడియుండెనని స్పష్టమగుచున్నది. పంతులుగారి వివేకవర్ధని ప్రారంభింపబడుకాలమునకా పత్రికలందెన్నియోయంతరించి పోయినవి. పురుషార్థప్రదాయిని, యాంధ్రభాషా సంజీవనియనునవి నాటికి మిక్కిలి ప్రచారములోనున్నవి.

పంతులుగారు వివేకవర్ధనిని స్థాపించుటకు ముఖ్యకారణము స్త్రీవిద్యాప్రోత్సాహ కరములైన తమ స్వీయాభిప్రాయములను లోకమునకు వెల్లడించు నొక వృత్తాంత పత్రిక తమ యధీనమునందుండుట యుక్తమనిభావించుట—యని తమ స్వీయచరిత్రము నందు వ్రాసియున్నారు.[27] వివేకవర్ధని ప్రారంభమున నాలుగుపెద్దపుటలుగల యొక చిన్న మాసపత్రికగా వెలువడెను ప్రప్రథమమున వీరేశలింగంపంతులుగారు తమ వివేకవర్ధనిని చెన్నపట్టణమున కొక్కొండ వేంకటరత్నము పంతులవారి సంజీవనీ ముద్రాక్షరశాలయందు ముద్రించుచుండిరి. నాలుగవ సంచికనుండి శ్రీధరముద్రాక్షర

శాలయను వేరొక ముద్రాక్షరశాలయందు ముద్రింపించుచు, 17 పుటలుగల పుస్తక రూపమున ప్రకటించుచుండిరి

వివేకవర్ధని నడుమనడుమ యాగిపోయినను 1891వ సంవత్సరమువరకును వెలువడుచుండెను ఒక్కొక్కతఱి మిక్కిలి యాలస్యముగా బ్రచురింపబడుచుండెను. వీరేశలింగంపంతులుగారు నిరంతరకార్యవ్యగ్రులగుటవలన పత్రికా ప్రచురణము నందు వారెన్నియో కష్టనష్టముల కోర్వవలసివచ్చెను

వివేకవర్ధనియందు వృత్తాంతములు, కథలు, సంఘ సంస్కారవిషయములు, సారస్వతవిషయములు ప్రచురింపబడునని పంతులుగారు ప్రథమ సంచికయందు ప్రకటించియున్నారు. ఈ పత్రికాప్రకటనమునందు తమ యుద్దేశములు భాషాభివృద్ధియు, దేశాభివృద్ధియు ననియు, వీనికై తామేర్పరచుకొనిన మార్గములు, తెలుగుభాషలో మృదువైన సులభ శైలిని సలక్షణమైన వచనరచనచేయుట, జనులలోగల దురాచార దుర్వర్తనములఁ బాపి, వృద్ధి పద్ధతులజూపి వారి నధికనీతిమంతులనుగాజేయుట, యనియు, పంతులుగారు స్వీయచరిత్రమునందువ్రాసిరి.[28]

రాజకీయోద్యోగులయందు లంచగొండితనమును మాన్పుటకును, జనులలో నీతి మానమును వృద్ధిచేయుటకును, కులాచారములను సంస్కరించుటకును, పరిశుద్ధా స్తికమత సిద్ధాంతములను ప్రచారముచేయుటకును వివేకవర్ధనినాడు మిక్కిల కృషి చేసినది.

పంతులుగారు తామేర్పరచుకొనిన మార్గము నెట్లాచరణమునందు చూపినదియు, వివేకవర్ధని ప్రథమసంపుటమునం దెట్టి విషయములను తాము ప్రచురించినదియు, దాని వలన జనులలో కలిగినమార్పులనుగూర్చియు, ప్రథమ సంపుటము యొక్క చివరి సంచికయందు సమీక్షించియున్నారు [29]

ఈ విధముగా వివేకవర్ధని మత సాంఘిక, రాజకీయ నైతికవిషయములను బ్రకటించుచు, దుర్మతులకు కంటిలోనలుసై, దురాచారములకు ప్రక్కలోబల్లెమై, పూర్వనాగరకకోటికి కన్నెఱ్ఱయై, నవనాగరికులకుఁ దలలోని నాలుకయై, మూఢాచార పిశాచావిష్టులైన వారికుపద్రవకారణమై, లంచగొండులగు రాజకీయోద్యోగులపాలిటి యశనిపాతమై, విటజనములకు కంటగింపై, సరససారస్వతేయులకు రసానంద సంధాయియై, పండితపామరాశేషజన సందోహమునకు హృదయానందకారిణియై,

వీరేశలింగంపంతులుగారి కీర్తికి వైజయంతియై విలసిల్లినది. ఆ కాలమున రాజమహేంద్రవరమునందు వివేకవర్ధని పేరు విన్న, జడుపుగొనని దురాచారులైన రాజకీయోద్యోగులులేరన్న నది యతిశయోక్తికాదు.[30]

వీరేశలింగంపంతులుగారి 'వివేకవర్ధని' సంఘదురాచార నిర్మూలనమునకై తన సర్వశక్తులను ధారపోసెను సాహిత్యవిషయమునకూడ వివేకవర్ధని తగినంత కృషిచేసెనుగాని, పంతులుగారి సాహిత్యసృష్టియందు వివేకవర్ధనికి ప్రథమస్థానమేగాని ప్రధానస్థానములేదు. అట్లుగాక వీరేశలింగంపంతులుగారి సంఘ సంస్కారోద్యమము నందు వివేకవర్ధనిది ప్రధానస్థానము పంతులుగారు చింతామణి, సతీహితబోధిని, సత్య సంవర్ధని మొదలగు నితర పత్రికలనుగూడ నిర్వహించియుండుటవలన, వారి సాహిత్య జీవితమునందు వివేకవర్ధనికి సముచితమైనస్థానము లభించనుగాని అది ప్రధానస్థానము నాక్రమింపజాలదు పంతులుగారి సమకాలికులకైనను, అర్వాచీనుల కైనను, వివేకవర్ధని పేరు స్ఫురించినంతమాత్రమున పంతులుగారి సంఘ సంస్కారోద్యమము స్ఫురించునేకాని పంతులుగారి పదిసంపుటముల సాహిత్యచరిత్రము స్ఫురణకురాదు పంతులుగారికి సాహిత్యవేత్తగాపేరుతెచ్చిన రచనలలో 'రాజశేఖర చరిత్రము' వివేకవర్ధనియందే వెలువడినది. కాని యట్టిదేయగు 'సత్యరాజాపూర్వ దేశయాత్రలు' చింతామణియందు వెలువడినది కవుల చరిత్రము 'వివేకవర్ధని' యందే ప్రారంభింపబడినను చింతామణియందు ముగింపబడినది. స్వతంత్రనాటకములైన 'దక్షిణగోగ్రహణము' 'ప్రహ్లాద' నాటకములు చింతామణియందు వెలువడినవి. పంతులుగారి ప్రహసనములలో కొన్ని వివేకవర్ధనియందు వెలువడినవి శారీరశాస్త్ర సంగ్రహముకూడ వివేకవర్ధనియందే వెలువడినది. ఏదియెట్లున్నను పంతులుగారు నడిపిన 'వివేకవర్ధని' సంఘ సంస్కారవిషయములకు ప్రాధాన్యమిచ్చినదని చెప్పవచ్చును. పంతులుగారు సంఘ సంస్కరణమునకు సాహిత్యమును సాధనముగాచేసికొనిరిగాన వారు నిర్వహించిన పత్రికలన్నిటియందును సంఘ సంస్కరణమును దృష్టియందుంచుకొనియే రచనలువెలయించిరి పంతులుగారు సర్వ విషయముల యందును సంస్కర్త. సంస్కారమాయన జీవితాదర్శము. ఆయన పత్రికలు నడపినను, ఉపన్యాసములిచ్చినను, ప్రహసనములు రచించినను, నవి సంఘ సంస్కరణైక విషయ ప్రాధాన్యములుగానుండును.

యథార్థవాది లోకమునకు విరోధియగునను సూక్తికి లక్ష్యభూతముగ వివేక వర్ధని పలుబాములకు గురియై నడుమనడుమ నిలిపివేయబడుచు, మరలమరల పునరుద్ధరింపబడుచువచ్చెను. కాని యెన్నడును తన లక్ష్యముల నేమరించియుండలేదు. వివేక వర్ధని కొన్నాళ్ళు పక్షపత్రికగను, కొన్నాళ్ళు వారపత్రికగనుగూడ వెలువడియుండెను. వివేకవర్ధనినిగూర్చి సమకాలీన పత్రికలిట్టి యభిప్రాయములను ప్రచురించియుండెను.

"ఇది మన మండలములో జిరకాలమునుండి జరుగుచున్నపత్రిక ఇదియే యిచ్చటి మొదటిపత్రికయని చెప్పనొప్పు ఇది ముఖ్యముగా ప్రజల వివేకవర్ధనమునకై యేర్పరుపబడినది. (ప్రబంధకల్పవల్లి 1880 అక్టోబరు నెల సం. 1 సం. 4 ఈ పత్రిక గురజాడ శ్రీరామమూర్తిగారి సంపాదకత్వమున పెద్దాపురమునుండి వెలువడు చుండెను). 'గతమాసవర్తమాన సంగ్రహము'—'వర్తమానము-వివరణము' అను శీర్షికల క్రింద 'హిందూజన సంస్కారిణి' వివేకవర్ధనినిగూర్చి ఇట్లువ్రాసినది. ఈ పత్రిక చెన్నపట్టణమునుండి శ్రీమన్నవ బుచ్చయ్య పంతులుగారి సంపాదకత్వమున వెలువడుచుండెడిది.

"మ—రా—శ్రీ-బ్రహ్మశ్రీ-కందుకూరి వీరేశలింగముపంతులుగారి "శ్రీవివేక వర్ధని" పత్రికారత్నమప్పుడప్పుడు నిలిచిపోవుటను గమనించి దుఃఖింపనివారెవరు నుండరు. శ్రీవీరేశలింగముపంతులుగారీ లోపమునికమీద సవరింపగోరి వివేకవర్ధని పత్రికలో నేకముగా ప్రచురింపఁబడుచుండిన ఇంగ్లీషును తెలుగును, వేఱువేఱుగచేసి ప్రత్యేకమైన పత్రికలుగా ప్రచురింప నిశ్చయించి ఇప్పుడు తెలుగుభాగమును జనవరి వివేకవర్ధనిని ప్రచురించిరి. హిందూజన సంస్కారిణి (పు. 3. సంచిక ౮, ౧౮౮౮ మార్చి) "రాజమహేంద్రపురములోని "గోదావరి సమాజస్థాపకులు" సమస్త వ్యయములను దాముపెట్టుకొని "వివేకవర్ధనిని" పునరుద్ధారణముచేయుటకయి నిశ్చయించు కొని, పత్రికా విలేఖకు నొకని జీతమునకేర్పఱచి, పదునాలుగవ వాల్యూము, మొదటి సంచికను కడచిన ఆగష్టు ౧౪ తా॥ నుండి యధాపూర్వము వారపత్రికగా ప్రారంభించి ముద్రించి ప్రచురించినారు. ఈ పత్రిక ముఖ్యముగా తెలుగుదేశమువారికొఱకే యుద్దేశింపబడినందున విస్తారభాగము తెలుగుననేవ్రాయుచు, దొరతనమువారికిని, తెలుగురాని, రాజకీయోద్యోగులకును, వేగముగా దెలియవలసిన సంగతులు మాత్రమే ఇంగ్లీషున వ్రాయుచుందురు. పత్రిక వెనుకటివలెనే ప్రతివారమును రెండు కాగితముల చొప్పుననుండును............"

–'హిందూజన సంస్కారిణి' ౧౮౭౬సంవత్సరము శెప్టెంబరునెల (పుస్తకము ౩, సంచిక ౨. 1876వ సంవత్సరము జూలై నెలనుండి పక్షపత్రికగను, 1888వ సంవత్సరమునుండి వారపత్రికగను వివేకవర్ధని వెలువడుచుండెను

నాడు వివేకవర్ధనికిగల ప్రాచుర్యమును, ప్రభావమును, పంతులుగారి 'స్వీయ చరిత్రము'నుండియే యీ విధముగా గ్రహింపవచ్చును.

"వివేకవర్ధని యంతకంతకువృద్ధియై దేశాభివృద్ధికి భంగకరములైన పూర్వాచారములను పూర్వ పక్షముచేయుచు, దేశాభివృద్ధికరములైన నూతనాచారములను సిద్ధాంతముచేయగడగినది."

(స్వీ. చ, ప్ర భా, మూ. ప్ర; పు. 102)

"ఆ కాలమునందు మా వివేకవర్ధనిచేసిన పనులనన్నిటిని వివరింపబూనినచోఁ బుస్తకములు నిండవలసియుండును! ..."

(స్వీ. చ, ప్ర భా, మూ ప, పు. 102)

"మేమీ పనిని (పత్రికా ప్రకటనమును) పూనుకొనుట దేశముయొక్కయు ప్రజలయొక్కయు క్షేమలాభములకొఱకేకాని ధనలాభమునకాశపడికాదు. లౌక్యాధికారధూర్వహులై, యున్నకొందఱ దుశ్చేష్టలను వెల్లడిచేయుటవలన అట్టివారు మాకు శత్రువులుగానేర్పడిరి. అయినను ఒకరి యనుగ్రహమున కపేక్షపడిగాని, ఒకరి నిగ్రహమునకు వెరచిగాని, పత్రికావిలేఖకత్వము ననుసరించి మాకు విధిగానేర్పడిన కృత్యమునుండి తొలగకుండుట మా పూనికగాన కొందఱతో విరోధపడియైనను జన సంఘమునకు, మేలుచేయగలిగితిమిగదాయని యానందించుచున్నాము,"

(స్వీయచరిత్ర; మూ. ప్ర; పుట 142).

"ఆ కాలమునందలి రాజకీయోద్యోగులలోని లంచములు మొదలైన యకృత్యములనణఁచుటకును, కులములోని దురాచారములను మాన్పుటకును, సంఘ సంస్కారములను దేశమునందంతటను వ్యాపింపజేయుటకును మాచేతిలో వివేకవర్ధనీ పత్రిక యమూల్యాయుధముగానుండెను".

(స్వీ. చ, ప్ర. భా, నా. ప్ర, పుట 217. ద్వితీయముద్రణము.)

"నేను ప్రకటించుచుండిన వివేకవర్ధని పత్రిక దుష్టవర్తనముగలవాఱ కంద ఱకిని గర్భనిర్భేదకముగా నుండెను."

(స్వీ. చ; ప్ర. భా, నా. ప్ర, పు 342, ద్వి. ము.)

ఈ విధముగ పంతులుగారు నడిపిన వివేకవర్ధని పత్రిక, దేశాభివృద్ధికరము లగు సమస్త ప్రయత్నములయందును, నిర్విరామముగకృషి యొనర్చుచుండెను.

వీరేశలింగంపంతులుగారికి కొక్కొండ వేంకటరత్నము పంతులవారితో స్త్రీ విద్యావిషయమున వాదవివాదములు సంభవించినప్పుడు, వేంకటరత్నము పంతులు గారు వీరేశలింగంపంతులుగారి వ్రాతలను తమ ఆంధ్రభాషా సంజీవనియందు ఖండించుచుండిరి వీరేశలింగంపంతులుగారును వివేకవర్ధనియందు వేంకటరత్నము పంతులవారిని నిరసించుచుండిరి. ఇట్లు వారిరువురమధ్యను కులాచార సంస్కరణ విషయముగను, కులలలనాపరనా సిద్ధాంతమునుగూర్చియును. స్త్రీ పునర్వివాహ విషయ కముగను, పత్రికా ముఖమున విమర్శలు, ప్రతి విమర్శలు, జరుగుచున్న కాలమున, వేంకటరత్నముపంతులవారు, వీరేశలింగంపంతులుగారిని, వివేకవర్ధనిని, పరిహ సించి, న్యూనపరుపవలయుననియు, వారి వ్రాతల నధిక్షేపించవలయుననియు, తమ యాంధ్రభాషా సంజీవని కనుబంధముగా, 'హాస్యవర్ధని'యను పత్రికను వెలువరించిరి. వీరేశలింగంపంతులుగారును వేంకటరత్నముపంతులుగారికి ప్రతిగ 'హాస్యసంజీవని' యను పత్రికను తమ వివేకవర్ధని కనుబంధముగ ప్రచురించుచువచ్చిరి అంతటవారు తమ పత్రికలయం దొకరినిగూర్చి యొకరు తీవ్రములైన విమర్శలు వెలువరింపసాగిరి. 'హాస్యవర్ధని' 1875 అక్టోబరునెలయందు ప్రారంభనంచిక వెలువడెను 'హాస్య సంజీవని' 1876జూలై నెలనుండి ప్రారంభింపబడెను వేంకటరత్నముపంతులు వారు తమ పత్రికా ముఖపత్రముపైని దంతిముఖుడైన విఘ్నేశ్వరు డిరుపార్శ్వముల యందును మూషకములు తన్ను సేవింప నిలుచుండి తాండవమాడుచుండినట్లు ప్రచురిం పగా, వీరేశలింగంపంతులుగారు తమ పత్రికా ముఖపత్రముపైని సింహముఖుఁడైన విఘ్నేశ్వరు డిరుపార్శ్వములయందును మార్జాలములు తన్ను సేవింపనిలుచుండి తాండవమాడుచున్నట్లు ప్రచురించెడివారు. గజ సింహములకును, మూషకమార్జాలము లకునుగల స్వాభావికవైరము నీ విధముగా వీరిరువురునుబూనిరి. కాని 'హాస్యవర్ధని' ఆంధ్రభాషా సంజీవన్యనుబంధముగా నెక్కువకాలము వెలువడలేదు కొలదికాలము లోనే అది ఆంధ్రభాషాసంజీవనియందంతర్భాగమైపోయెను. అట్లే 'హాస్యసంజీ వని'యు అనుబంధరూపమున నదృశ్యమై, వివేకవర్ధనియందే యొకభాగముగ వెలు వడజొచ్చెను.

ఆంధ్రభాషా సంజీవనిలోని పూర్వాచారపోషక వ్యాసముల హేతు దౌర్బల్య మును ప్రకాశముచేయుటకుగాను, 'హాస్యసంజీవని' కృషిచేయుచుండెడిది. స్త్రీలకు విద్యకూడదు' అనునిట్టి వ్యాసము లాంధ్రభాషా సంజీవనియందు పొడచూపగానే త త్ఖండనముగా నందలి యుక్తులనేగైకొని "పురుషులకు విద్యకూడదు" అనునిట్టి వ్యాస ములనువ్రాసి, యాంధ్రభాషాసంజీవనియందలి వ్యాసములందలి హేత్వాభాసములను, వీరేశలింగపంతులుగారు తమ హాస్య సంజీవనియందు ప్రచురించుచుండిరి.

వివేకవర్ధనియందు ప్రథమమున నింగ్లీషు విభాగము లేకుండెను. కాని ఒక సంవత్సరముగడచిన తరువాత వివేకవర్ధనియం దింగ్లీషు విభాగముకూడ ప్రారంభింప బడెను.[31] ఈ సమయముననే నరసాపురమునుండి వెలువడుచున్న 'విద్వన్మనోహారిణి' యను పత్రిక వివేకవర్ధనియం దంతర్భాగమైపోయెను 'విద్వన్మనోహారిణి' సంపాదకు లైన మీర్ షుజాయతల్లీ ఖాన్ యనువారలు, వివేకవర్ధనియందింగ్లీషు భాగము వ్రాయుచుండుట కేర్పాటుగావింపబడెను

తదుపరి 'వివేకవర్ధని' పత్రిక, హాస్య సంజీవనినేకాక, నింకొక యాంగ్లపత్రి కనుగూడ యనుబంధముగా ప్రచురింప నిశ్చయించెను.[32] వివేకవర్ధని పత్రికయందు వీరేశలింగంపంతులుగారును, అప్పుడప్పు డింగ్లీషున వ్రాయుచుండెడివారు [33]

హాస్యసంజీవనియను పక్షపత్రికయేగాక, 'చింతామణి'యను పేరుతోనొక పత్రికగూడ వివేకవర్ధని కనుబంధముగా కొంతకాలము వెలువడినది. ఈ చింతామణికి శ్రీవావిలాల వాసుదేవశాస్త్రులుగారు సంపాదకత్వము వహించెడివారు. ఈ పత్రిక 1881వ సంవత్సరము జనవరినెలయందు ప్రారంభింపబడి సుమారొక సంవత్సరము నడచి, ఆగిపోయినట్లుతోచుచున్నది. ఈ పత్రికయందు వీరేశలింగంపంతులుగారి యభిజ్ఞాన శాకుంతలమును, వావిలాల వాసుదేవశాస్త్రిగారి యుత్తరరామచరిత్రమును వెలువడియుండెను.[34]

1891వ సంవత్సరమున న్యాపతి సుబ్బారావుపంతులుగారి యాధ్వర్యమున ప్రారంభింపబడిన 'చింతామణి'కి పది సంవత్సరముల పూర్వమే, ఆ పేరుతోనొక పత్రిక వివేకవర్ధని కనుబంధముగా కొంతకాలము వెలువడియుండెననుట యిట గమ నార్హము. వీరేశలింగంపంతులుగారే, న్యాపతి సుబ్బారావు పంతులుగారొక మాస పత్రికను ప్రచురింపపూనుకొనినప్పుడు, దానికి 'చింతామణి'యను పేరును సూచించి

యుండవచ్చును. 1881వ సంవత్సరము జనవరినెలనుండి ప్రారంభింపబడిన చింతామణి యెంతకాలము వెలువడియుండె నోచెప్పుట సాధ్యముకాకపోయినను, ఒకటి రెండు సంవత్సరములకన్న నెక్కుడు కాలము వెలువడియుండలేదని యూహింపవచ్చును.

1883వ సంవత్సరమునందు వీరేశలింగంపంతులుగారు శాకుంతలానువాదమును పత్రికయందు పూర్తిచేసి, పుస్తకరూపమున ముద్రించుట జరిగినది ఇంకను 1883వ సంవత్సరము జనవరినెలనుండి 'సతీహితబోధిని'యను మాసపత్రికను పంతులుగారు స్త్రీల యుపయోగార్థమై ప్రారంభించి, వివేకవర్ధనీ ముద్రాక్షరశాలయందే ముద్రించి వెలువరించుచుండిరి. అందువలన నీ'సతీహితబోధిని' ప్రారంభించుటకు పూర్వమే 'వివేకవర్ధని' కనుబంధముగ వెలువడుచుండిన వావిలాల వాసుదేవశాస్త్రిగారి 'చింతామణి' నిలిపివేయబడి యుండవచ్చును 'వివేకవర్ధని' కనుబంధముగా నింగ్లీషున ప్రచురింపబడిన పత్రిక యెంతకాలము వెలువడెనో చెప్పుట కష్టము.[35]

పై విషయముల దృష్టియందుంచుకొని 'వివేకవర్ధని' పత్రికనుగూర్చిన విశేషములనిట్లు క్రోడీకరింపవచ్చును

౧ వివేకవర్ధని పత్రిక ప్రప్రథమమున మాసపత్రికగా వెలువడియుండెను. ఒక సంవత్సరకాలము గడచినతదుపరి, ఆ కాలమున నరసాపురమునుండి వెలువడుచుండిన 'విద్వన్మనోహారిణి'యను పత్రిక దీనియందు కలిసిపోగా, వివేకవర్ధని పక్షపత్రికగా రూపొందెను, నాటినుండి దీనియం దింగ్లీషు విభాగముకూడ చేర్పబడెను. 1888వ సంవత్సరప్రాంతమున వివేకవర్ధని వారపత్రికగా రూపొందెను

౨. వివేకవర్ధనియందు భాష సరళగ్రాంధికమున నుండెడిది. వృత్తాంతములు, చిక్కులెక్కలు, సంపాదకునకులేఖలు, సాంఘికరాజకీయ మతనైతిక విషయములను గూర్చిన వ్యాసములు ప్రచురింపబడుచుండెడివి.

౩. రాజమహేంద్రవరమునందలి ప్రభుత్వోద్యోగుల యక్రమచర్యలు వివేకవర్ధనియందు నిశితముగ విమర్శింపబడు చుండెడివి.

౪. ప్రాచీనాంధ్ర కావ్యములు లేఖక ప్రమాదాది దోషరహితములుగ ప్రచురింపబడుచుండెడివి. వచనప్రబంధములు, ప్రహసనములు, నాటకములు, కవుల చరిత్రమునందలి ఘట్టములు వెలువడుచుండెడివి. అభిజ్ఞానశాకుంతలానువాదము 1876వ సంవత్సరమునందు వివేకవర్ధనియందే ప్రారంభింపబడినది. గ్రంథములు సమీక్షింప

బడుచుండెను. వావిలాల వాసుదేవశాస్త్రిగారి 'సీజరు చరిత్రము',మండపాక పార్వతీశ్వర కవిగారి జగద్రక్షక శతకము, మొదలగు గ్రంధములు 'కృతిప్రశంస'యను శీర్షిక క్రింద సమీక్షింపబడియుండెను.

౫ 'వివేకవర్ధని' అప్పుడప్పుడు పత్రికానుబంధములు ప్రకటించుచుండెను. వానిలో 'హాస్యసంజీవని' చింతామణి, The Indian Bee యనునవి ముఖ్యములు.

౬. వివేకవర్ధని పత్రిక అప్పుడప్పు డాగిపోవుచువచ్చినను, పునరుద్ధరింప బడుచు 1894వ సంవత్సరమువరకు వెలువడుచునేయుండెను

౭ వీరేశలింగంపంతులుగారి సంఘ సంస్కారోద్యమమునకు 'వివేకవర్ధని' యమూల్యాయుధముగానుండెను.

౮. వివేకవర్ధని పత్రికయందు సమకాలీనములైన యితర పత్రికలనుండి, వృత్తాంతములు, విశేషములు, సాభిప్రాయప్రకటనములు, నుద్ధరింపబడి ప్రచురింప బడుచుండెను. ఆ కాలమున దేశమునందలి యితరరాష్ట్రములయందు ప్రచురింపబడు చుండిన ఆంగ్లవార్తాపత్రికలయందలి యుద్ధతాంశములుకూడ వివేకవర్ధని పత్రిక నలంకరించుచుండెను అట్టివానిలో The Pioneer, The Bombay Gazette, Indian Mirror, The Native Public Opinion, Indian Daily News, The Bombay Samachar, The Coconada Advertiser, మొదలగు ఆంగ్లపత్రికలు ముఖ్యముగా పేర్కొనదగినవి. ఇదే విధముగా, ఆంధ్ర భాషా సంజీవని, స్వదేశి, సకలవిద్యాభివర్ధని, పురుషార్ధప్రదాయిని, లోకరంజని, బ్రహ్మాండరంజని, సుధీరంజని, మొదలగు తెలుగు పత్రికలయందలి వార్తలను విశేష ములను, సాభిప్రాయ ప్రకటనములను గైకొని, ప్రచురించుచుండెను.

౯. లోకహితముకొరకు, సర్వశక్తులను వెచ్చించి వివేకవర్ధని పాటుపడు చుండెను.

౧౦ వివేకవర్ధనికి రాజమహేంద్రవర ప్రభుత్వకళాశాలాధ్యక్షులగు ఇ. పి. మెట్కాఫ్‌దొరగారు, చెన్నపురి క్రైస్తవ కళాశాల గణితశాస్త్రోపన్యాసకులగు సమర్ధి రంగయ్య చెట్టిగారు, లోకవిఖ్యాతులు బహుజనపల్లి సీతారామాచార్యులవారు, కొమాండూరి అనంతాచార్యులుగారు, చదలువాడ సీతారామశాస్త్రులుగారు, వల్లూరి జగన్నాధ రావుగారు మొదలగు పండితులు చందాదారులుగా నుండెడివారు.

వివేకవర్ధని తరువాత పంతులుగారు నిర్వహించిన పత్రికలలో ముందు పేర్కొన దగినది చింతామణి ఈ పత్రిక శ్రీన్యాపతి సుబ్బారావు పంతులుగారి యాజమాన్యమున రాజమహేంద్రవరమునుండి వెలువడుచుండెడిది. ఇది సారస్వతమాసపత్రిక వివేక వర్ధనియందువలె దీనియందు లోకవార్తలకును, సంఘ సంస్కారవిషయములకును, విమర్శలకును ప్రాధాన్యములేకుండెను. 'చింతామణి' వెలువడునాటికి వివేకవర్ధని నిలిపివేయబడెను ''నాయారోగ్యహీనతనుబట్టి 'వివేకవర్ధని' నిలుపుచేయబడినతరువాత 1891వ సంవత్సరమునందు న్యాపతి సుబ్బారావు పంతులుగారు తెలుగులో 'చింతామణి'యను మాసపత్రికను స్థాపించి మావివేకవర్ధని ముద్రాశాలలోనే దానిని ముద్రింపించుచువచ్చిరి దానికి నేను వ్రాతలో సహాయుడనయి వ్రాయుచుంటిని. దానికయిన సమస్తవ్యయములను సుబ్బారావుపంతులుగారే భరించుచుండెడివారు."

స్వీయచరిత్రము-ద్వి భా, మొ. ప్ర, పు-86 ద్వితీయముద్రణము-1936.

ఈ చింతామణి 1898వ సంవత్సరమునందు నిలిపివేయబడినది చింతామణి ప్రారంభసంచిక 1891జూలై నెలయందు వెలువడెను

చింతామణియందు వీరేశలింగంపంతులుగారు సత్యరాజాపూర్వదేశయాత్రలు, జంతుస్వభావచరిత్ర, నీతికథామంజరి, స్వదేశసంస్థానచరిత్రాదులు, అలంకార సంగ్రహము, దక్షిణ గోగ్రహణము, ప్రహ్లాద, మొదలగు రచనలను వెలువరించియున్నారు. ఆంధ్రకవుల చరిత్రమునందలి ఆధునికకవుల చారిత్రములను పంతులుగారు చింతామణియందే వెలువరించిరి. ఆ కుండివ్యాసమూర్తిశాస్త్రులవారి శుద్ధాంధ్రబుతు సంహారము చింతామణియందే వెలువడినది ఈ పత్రికయందుకూడ ప్రాచీన ప్రబంధములు లేఖక ప్రమాదాది దోషములనుండి సరిచూడబడి, ప్రచురింపబడుచుండెడివి. ఇట్లీ పత్రిక యందు వెలువడిన ప్రాచీనకావ్యములలో దూబగుంట నారాయణకవి పంచతంత్రము, చరిగొండ ధర్మన్నకవి చిత్రభారతము, పింగళిసూరనార్యుని ప్రభావతీ ప్రద్యుమ్నము, మొల్లరామాయణము, కాకుమానుమూర్తికవి పాంచాలీ పరిణయము, కేతన విజ్ఞానేశ్వరము పేర్కొనదగినవి ఈ ప్రబంధములన్నియు వీరేశలింగంపంతులుగారు సంపాదించి ప్రచురించినవే.

ఇవికాక చింతామణి యాంధ్రసారస్వతమునకు చేసిన మహోపకారమొకటి యున్నది. ఆ యుపకారమువలన ఆధునికాంధ్రవాఙ్మయ చరిత్రమునందు చింతామణి

పేరు శాశ్వతముగా నిలిచిపోవును ఆ యుపకారము చిలకమర్తి లక్ష్మీనరసింహము గారిచే నవలలు వ్రాయించుట.

చింతామణి 1893వ సంవత్సరమున తెలుగుభాషలో వచన ప్రబంధములు రచించుటను ప్రోత్సహించు నిమిత్తమై నగదురూపమున బహుమతులనిచ్చు పోటీ నొకదాని నేర్పరచెను ప్రప్రథమమున నేర్పాటుచేసిన యీపోటీయందు ప్రథమ బహుమానము డెబ్బదియైదురూపాయలుగాను, ద్వితీయబహుమాన మేబదిరూపాయలుగాను సుబ్బారావు పంతులుగా రేర్పరచిరి బహుమానధనము స్వల్పముగానుండుటవలన మంచి నవలలురాలేదని యభిప్రాయపడి సుబ్బారావు పంతులుగారు మరుసటి సంవత్సరమునుండి ప్రథమగణ్యమైన నవలకు నూట ఇరువదియైదు రూపాయలును, ద్వితీయముగ గణింపబడినదానికి డెబ్బదియైదురూపాయలును బహుమానముగనిచ్చునట్లు ప్రకటించిరి 1894వ సంవత్సరమునందు చిలకమర్తివారు చింతామణి నవలల పోటీయందుపాల్గొనిరి. ఆ సంవత్సరము వారు రచించిన రామచంద్ర విజయమునకు ప్రథమ బహుమానము లభించెను 1896వ సంవత్సరమునందు చిలకమర్తి లక్ష్మీనరసింహకవిగారు తిరిగి చింతామణి నవలల పోటీయందుపాల్గొనిరి. ఈ పోటీయందు చిలకమర్తివారి 'హేమలత'యను చరిత్రాత్మక నవలకు ప్రథమ బహుమానము లభించెను. 1897వ సంవత్సరమునందుకూడ చిలకమర్తివారి 'యహల్యాబాయి'కే ప్రథమ బహుమానము వచ్చెను

ఈ విధముగా ఆంధ్రభాషయందు వచన ప్రబంధములు (నవలలు) వెలయుటకు 'చింతామణి' చేసినకృషి స్మరణీయమయినది. "1893వ సంవత్సరమున సుబ్బారావు పంతులుగారు పాశ్చాత్యదేశపద్ధతిని మనభాషలోగూడ నాఖ్యాయికలను (నవలలు) వ్రాయింపదలచి పోటీపరీక్షలుబెట్టి, వారి స్వధనములోనుండి బహుమానములనీయ నారంభించిరి. ఈ యుత్కృష్టకార్యమువలననే మనదేశములో క్రొత్త నవలలెన్నో తలయెత్తినవి" అని చిలకమర్తి లక్ష్మీ నరసింహకవిగారు స్వీయచరిత్రము, నందు వ్రాసియున్నారు.

చింతామణి పోటీలలో ప్రప్రథమమున బహుమతిపొందినవారు ఖండవల్లి రామచంద్రుడుగారు. వీరినవల 'ధర్మవతీవిలాసము' 1893వ సంవత్సరమునందు ప్రథమ బహుమానము వడసెను ఈ సంవత్సరము రెండవ బహుమానము పొందినవారు తల్లాప్రగడ సూర్యనారాయణగారు. వీరినవల 'సంజీవరాయచరిత్రము'

1895వ సంవత్సరము చింతామణి బహుమానములు
ప్రధమబహుమానము

త్రివిక్రమ విలాసము-లేకుమళ్ళరాజగోపాలరావుగారు.
ద్వితీయబహుమానము

మాలతీరాఘవము-ఖండవల్లిరామచంద్రుడుగారు.
1896 రామచంద్రవిజయము-చిలకమర్తిలక్ష్మీనరసింహం (ప్రథమబహుమానము), వివేకవిజయము-గోటేటికనకరాజు

1897 అహల్యాబాయి - చిలకమర్తి ప్రధమబహుమానము. ఈ సంవత్సరము ద్వితీయబహుమానములేదు ఈ పోటీ పరీక్షలకు న్యాయమూర్తులుగ వీరేశలింగం పంతులుగారును, వావిలాల వాసుదేవశాస్త్రిగారును, ఆ చంటసుందర రామయ్యగారును, న్యాపతి సుబ్బారావుపంతులుగారును వ్యవహరించుచుండిరి.

చింతామణి తరువాత వీరేశలింగంపంతులుగారు నిర్వహించిన పత్రికలలో పేర్కొనదగినది 'సతీహితబోధిని'. దీనిని వీరేశలింగంపంతులుగారు 1883వ సంవత్సరము ఏప్రియల్ నెలనుండి ప్రారంభించిరి. ఈ పత్రిక మధ్యమధ్య నిలిపి వేయబడుచువచ్చినను 1889వ సంవత్సరమువరకు వెలువడినది ఈ పత్రికను పంతులుగారు స్త్రీలయుపయోగార్ధమై ప్రచురింపుచువచ్చిరి పంతులుగారి పత్రికయందు సత్యవతీ చరిత్రము, సత్యసంజీవని, దేహారోగ్యధర్మబోధిని, పత్నీహితసూచని మొదలగు రచనములను వెలువరించియున్నారు సులభశైలియందు స్త్రీల కుపయోగించు కొరకు శాస్త్ర విషయములను, ఆరోగ్యవిధులను, నీతికథలను పంతులుగారి పత్రికయందు వ్రాయుచుండిరి.

ఛార్లస్‌ల్యాంబ్ రచించిన షేక్స్పియర్ నాటకకథలను పంతులుగారు భారతీయాచార వ్యవహారముల కనుగుణముగా దేశకాలపాత్రములను మార్చి, స్త్రీలు చదువుకొని యానందించుటకు, కథలుగా ననువదించి, వానిలో కొన్నిటి నీపత్రికయందే ప్రచురించిరి గర్వము, బిడ్డల నాజ్ఞలోనుంచుట, భవిష్యత్తునుజెప్పుట, గృహిణీ ధర్మము, దేహమనస్సౌందర్యములు, శకునములు, ఆభరణములు, జీవకారుణ్యము, హిందూసుందరుల ప్రస్తుతస్థితి మొదలగు వ్యాసములను సరళమైన శైలియందు పంతులుగారు 'సతీహితబోధిని'యందు ప్రచురించిరి. ఈ పత్రిక ముఖపత్రమునందు పంతులుగారి శ్లోకమును ప్రచురించుచుండిరి.

శ్లో॥ అరక్షితా గృహేరుద్ధాః పురుషైరా ప్తకారిభిః
ఆత్మానమాత్మ నాయాస్తురక్షేయుస్తాస్సురక్షితః॥

(ఆప్తులైన పురుషులచే గృహమున నిర్బంధింపబడు స్త్రీలు రక్షితురాండ్రు కారు, ఏస్త్రీలు తమ యాత్మను తామే కాపాడుకొందురో వారే సురక్షితురాండ్రు-అని ఈ శ్లోకమునకర్థము. ఈ శ్లోకము మనుస్మృతి తొమ్మిదవ యధ్యాయమునందలి పన్నెండు సంఖ్యగలది )పంతులుగారు సతీహితబోధిని చందాదారులకిల్లు విజ్ఞప్తిగావించిరి."స్త్రీలు చదువుకొనుట కుపయోగించెడి యీ పత్రికను పూర్ణముగా పెద్దక్షరములతోనే ముద్రింప వలసినదని మమ్మనేకులు కోరినందున సతీహితబోధినినంతను మేమిప్పుడు పెద్దక్ష రములతోనే ముద్రింపించుచున్నాము. ......... ...స్త్రీల కుపయోగించెడు విచిత్ర నూతన వచన ప్రబంధములను.......... . ప్రచురింప నిశ్చయించినాము. ఈ జనవరినెల పత్రికలో ఇంగ్లీషుమహాకవియైన షేక్స్పియరుయొక్క "సింబలయిన్" అను నాటక కధననుసరించి "కళావతీ పరిణయమ"ను పేరనొక కధను ప్రచురింప నారంభించినాము. దీనినొక పత్రికలో ముగించి, మతియొకకధనుకూడ నీ సంవత్స రాంతములోపలనే పూర్ణముగా ప్రచురించెదము. మా చందాదారులు తమ మిత్రులను పరిచితులను ప్రోత్సాహపటిచి చందాలువేయించి పత్రిక నిరంతరాయముగా జరుగుటకు దగిన సాహాయ్యమునుజేయుదురని ప్రార్థించుచున్నాము".

(కందుకూరి వీరేశలింగంపంతులు, రాజమహేంద్రవరము-హిందూజన సంస్కా రిణి పుస్తకము ౪. సంచిక. ౯. ౧౮౮౯ సం. ఏప్రియల్). నూటికి నూరుపాళ్ళు వీరేశలింగంపంతులుగారితో సంబంధములేకపోయినను, పంతులుగారు నిర్వాహకత్వ మును పూని, నడపినపత్రికలలో 'సత్యసంవర్ధని' యొకటి ఈ పత్రిక రాజమహేంద్ర వర ప్రార్థనా సమాజము పక్షమున వెలువడుచుండెడిది. ఈ పత్రిక ప్రథమసంచిక 1891 జూలై 29వ తేదీన వెలువడినది

ఈ పత్రికయందు పంతులుగారు 'కలిపురుష శనైశ్చరవిలాసము, యోగా భ్యాసము, హిందూమతసభ' మొదలగు ప్రహసనములును, విద్యాధికులధర్మములు, వర్ణము, జీవితముయొక్క పరమార్థము, దానిపొందు మార్గములు, విద్యాధురీణుల యర్హకృత్యములు మొదలగు నుపన్యాసములును, రాజారామమోహనరాయలవారి జీవిత చరిత్రమును వెలువరించిరి. 'సరస్వతీ నారదవిలాపము' అను వ్యంగ్యరచన సత్య

సంవర్ధనియందే వెలువడినది. సత్యసంవర్ధని ముఖపత్రముపై ఇట్లు ప్రచురింపబడు చుండెను

"A Monthly Anglo - Telugu Journal Mainly devoted to Religious, Social and Moral Topics

శ్లో॥ సువిశాల మిదం విశ్వం, పవిత్రం బ్రహ్మమందిరమ్
చేతస్సు నిర్మలం తీర్థం, సత్యంశాస్త్రమనశ్వరమ్
విశ్వాసో ధర్మమూలంహి, ప్రీతిః పరమసాధనమ్
స్వార్థనాశస్తువైరాగ్యం, బ్రాహ్మైరేవం ప్రకీర్త్యతే॥

Printed by K Ramayya at the Vivekavardhani Press for the Prardhana Samaj"

ఈ సత్యసంవర్ధనికి ప్రతిగ రాజమహేంద్రవరమునుండి 'సత్యాన్వేషిణి'యను పత్రిక వెలువడుచుండెను. ఈ 'సత్యానేషిణి'కి బజులుల్లాసాహెబ్‌యను నాతడు సంపాదకుడు. పంతులుగారు 'సత్యాన్వేషిణి'లోని వ్రాతలను సత్యసంవర్ధని యందు తీవ్రముగా నిరసించుచుండిరి 1892వ సంవత్సరము మార్చినెలలో 'సత్యాన్వేషిణి' ప్రథమసంచిక వెలువడెను.

1897వ సంవత్సరమునందు వీరేశలింగంపంతులుగారు తమ యుపాధ్యాయ వృత్తియందు సెలవుగైకొని చెన్నపట్టణము చేరినందున, ఆ తరువాత పంతులుగారికి సత్యసంవర్ధనితో సంబంధము తగ్గిపోయెను.

వీరేశలింగంపంతులుగారు 1904వ సంవత్సరమువరకును చెన్నపట్టణమున రాజధానీ కళాశాలాంధ్ర పండితపదవిని నిర్వహించి, 1905వ సంవత్సరమున రాజమహేంద్రవరము వచ్చిచేరిరి నాటికి వీరేశలింగంపంతులుగారి సంఘ సంస్కారోద్యమమును, తీవ్రముగా నిరసించువారు కొందరు బయలుదేరిరి అట్టివారిలో శ్రీ కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగా రగ్రేసరులు వీరు కాకినాడనుండి 'ఆర్యమతబోధిని'యను మాసపత్రికనునడపుచు వీరేశలింగంపంతులుగారిని తీవ్రముగా విమర్శించుచుండిరి. వీరేశలింగంపంతులుగారి సంఘ సంస్కరణోద్యమము, గ్రంథములు, వీరి నిరసనమునకును,నిశితవిమర్శకును గురియైనంతగా మరియెవరి విమర్శకును గురియైయుండ లేదు వీరి వివేకచంద్రికావిమర్శనము, అభిజ్ఞాన శాకుంతలా విమర్శనము, ఉత్తర

సరస్వతీ నారద విలాపము, పర్వత సందర్శనము, వీరేశలింగంపంతులుగారిపై విమర్శనములే పంతులుగారి ప్రహసనములను, నాటకములను, ఉపన్యాసములను, చివరకు కవుల చరిత్రమునుగూడ బ్రహ్మయ్యశాస్త్రిగారు విమర్శించిరి పంతులుగారికిని, బ్రహ్మయ్యశాస్త్రిగారికిని జరిగిన వాదవివాదములు జగద్విదితములు. 'ఆర్యమత బోధిని' 1905వ సంవత్సరము జనవరినెలయందు ప్రారంభింపబడెను ఈ పత్రికకు ప్రతిగ వీరేశలింగంపంతులుగారు 'సత్యవాదిని'యను వారపత్రికను 1905వ సంవత్సరము మార్చి 1వ తేదీనుండి వెలువరింప ప్రారంభించిరి బ్రహ్మయ్యశాస్త్రుల వారి వ్రాతలనుఖండించుట పరమోద్దేశముగ తామీ పత్రికను ప్రారంభించితిమని పంతులుగారు వ్రాసియున్నారు.[36]

సత్యవాదినియందు సాంఘిక సమస్యలు, రాజకీయ సంస్కరణములు, ప్రధాన స్థానము నాక్రమించుచుండెను. ఆ కాలమున పరిషద్ధాస్తికమత సభలయందు పంతులుగారిచ్చిన యుపన్యాసము లీ పత్రికయందు ప్రచురింపబడుచుండెను పంతులుగారీ పత్రికయందు అద్వైతమత సంగ్రహము, విశిష్టాద్వైతమత సంగ్రహము, ద్వైతమత సంగ్రహము, మొదలగు మత విషయకములగు వ్యాసములు, గ్రేస్‌డార్లింగుకన్య, జోన్ ఆఫ్ ఆర్కు, లేడీ జేన్‌గ్రే, మేరీ కార్పెంటరు, మొదలగు ఉత్తమ స్త్రీ చరిత్రములు వెలువరించియున్నారు పంతులుగారీ సత్యవాదినిని నాలుగైదు సంవత్సరములు మాత్రమే నిర్వహించిరి.

దీని తరువాత పంతులుగారు నిర్వహించిన పత్రికలలో 'తెలుగుజనానా' పత్రికను పేర్కొనవలెను. ఈ పత్రిక 1893వ సంవత్సరమునందే ప్రారంభింపబడెను. 1894వ సంవత్సరమునుండి దీనిని రాయసం వేంకటశివుడుగారు నిర్వహించుచుండిరి.[37] ఈ విషయము శ్రీరాయసం వేంకటశివుడుగారి ఆత్మచరిత్రమునందిట్లు ప్రస్తావింపబడినది.

"నా పూర్వగురువులగు మల్లాది వేంకటరత్నముగారు 1893వ సంవత్సరము జూలై నెలలో స్త్రీవిద్యాభివృద్ధినిమిత్తమై "తెలుగుజనానా పత్రిక"యను నొక మాస పత్రికను నెలకొల్పి యొక సంవత్సరమునడిపి, అదియిపుడు విరమింప నుద్యమించి, నేనద్దానిగైకొని సాగింతునాయనిమెయి 28వ తేదిని నాకువ్రాసిరి".[38]

వారికోరిక నంగీకరించి శ్రీవేంకటశివుడుగారు 1894వ సంవత్సరమునుండి 'తెలుగుజనానా పత్రికను'తాము నిర్వహించుటకుపూనిరి. ఇట్లు పది సంవత్సరములు

తాము నిర్వహించుచుండగా, 1904వ సంవత్సరమున తమతోపాటు వీరేశలింగం పంతులుగారుకూడ జనానా పత్రికకు సంపాదకులగుట వారి ఆత్మచరిత్రమునందే ప్రస్తావింపబడియున్నది

వీరేశలింగంపంతులుగారు "తెలుగుజనానాపత్రిక"యందు భౌతికభూగోళ శాస్త్ర సంగ్రహము, విదేశనారీమణుల చరిత్రములను ప్రచురించియున్నారు ఇవికాక కొన్ని ప్రహసనములను, నాడు సావిత్రి, హిందూ సుందరి మొదలగు పత్రికలలో జనానా పత్రికను విమర్శించెడి వ్రాతలకు ప్రతి విమర్శలను, పంతులుగారు జనానా పత్రికయందు వెలువరించుచుండిరి

పంతులుగారు తమ యాంతర్యమునకు సరిపడని సంగతులెవరైనను, ఏ పత్రికయందైనను వ్రాసినప్పుడు, మిక్కిలి ఖండితముగను, నొక్కొక్కప్పుడు పరుషముగను, వారినితమ పత్రికయందు ఖండించుచుండెడివారు దీనినిగూర్చి వేంకటశివుడుగారిట్లు వ్రాసియున్నారు. "శాంతముగబనులు చక్కబెట్టుకొనుచు పత్రికా పుత్రిక నెటులో పండ్రెండేండ్లు బెంచిననేను పంతులవారి శౌర్యోద్ధతివలన పత్రికకేమి హానివాటిల్లునోయని లోనభీతిల్లుచుంటిని".

పంతులుగారు కోపస్వభావులనియు, న్యాయవిషయమునందు మిక్కిలి పట్టుదల కలిగియుండెడివారనియు, వారి స్వీయచరిత్రమువలనను, వేంకటశివుడుగారి ఆత్మచరిత్రమువలనను, ఇంకను పంతులుగారిని గూర్చి యితరుల ప్రస్తావనలయందును, తెలిసికొనగలము.

ఈ విధముగా పంతులుగారు ముప్పది సంవత్సరములకాలము వివిధములగు పత్రికలను నిర్వహించి, పత్రికా నిర్వహణమునం దనేకులకు మార్గదర్శకత్వమును వహించి కీర్తిగాంచిరి.

విక్టోరియా మహారాజ్ఞి చరిత్రమునందు, రాణిగారు రాజ్యపాలనమునకువచ్చిన తరువాత హిందూదేశస్థులు గాంచిన యభ్యుదయమును వివరించుచు "రాణిగారు రాజ్యమునకు వచ్చునప్పటికీ దేశమునందు స్వదేశీయులచేఁ బ్రచురింపబడు వృత్తాంత పత్రికలు నాలుగైదేయుండెను. ఇప్పుడవి నన్నూఱువరకు వృద్ధిపొందినవి."[89]యని దేశీయులచే నడపబడు వృత్తాంతపత్రికల సంఖ్యయధికమగుటకూడ రాణిగారి పరిపాలనమున హిందువులు సాధించిన యభివృద్ధికి తార్కాణముగా పంతులుగారు పేర్కొనియున్నారు

పంతులుగారు 'వివేకవర్ధని'ని ప్రారంభించుటకు పూర్వము, తెలుగుదేశమున పట్టుమని పదిపత్రికలైనను లేక, పంతులుగారు వివేకవర్ధనిని ప్రారంభించిన తరువాత పాతిక సంవత్సరముల కాలములో, ఆంధ్రదేశమునందు పల్లెయనక, పట్టణమనక, ప్రతియూరినుండియు, వార్తాపత్రికయో, సారస్వత పత్రికయో వెలువడుచుండుట పంతులుగారి మహత్త్వమని చెప్పవలెనుగదా! [40]

అరువది సంవత్సరములలో నాంధ్రదేశమున కలిగిన మార్పులను సమీక్షించుచు వీరేశలింగంపంతులుగారు తమ స్వీయచరిత్రమునం దిట్లు వ్రాసియున్నారు.

"ఇప్పుడు మన యాంధ్రదేశము మేలుకొని కన్నులుతెరచి మాంద్యమును మాని చురుకుదనమునుపూని దేశాభివృద్ధికరములైన నానాక్షేత్రములయందు మహోత్సాహముతో కృషిచేయుచున్నందుకు నేనెంతయు సంతోషమొందుచున్నాను. ఇది మనదేశముయొక్క పురోభివృద్ధికి శుభసూచకముగానున్నది. ఇటువంటి స్థితిమన మాతృభూమికి కలుగగాజూడవలెనని నేను ముప్పదినలువది సంవత్సరముల క్రిందట నభిలషించుచుంటిని... ......

"అప్పుడాంధ్ర వార్తా పత్రికలంతగాలేకయు, ఉండిన యొకటి రెండును జదువువారునులేకయు దివానక్షత్రములవలె తేజరిల్లకుండెను, ఇప్పుడు దేశభాషా వృత్తాంత పత్రికలసంఖ్య యధికమయి వేలకొలంది చదువరులనుగలవయి కొన్నిపట్ట పగటి సూర్యునివలె ప్రకాశించుచున్నవి."

ఈ వాక్యములు సత్యములనుటకు వివేకవర్ధనిని ప్రారంభించిన తరువాత ఆంధ్రదేశమునందు కలిగిన నవచైతన్యమే తార్కాణము.

పంతులుగారు వివేకవర్ధనిని ప్రారంభించునాటికి, ఆంధ్రభాషాసంజీవని, పురుషార్థప్రదాయిని, లోకరంజని, బ్రహ్మాండరంజని మొదలగు పత్రికలు మాత్రమే వెలువడుచుండెను. తరువాత పాతిక సంవత్సరములలో ఆంధ్రదేశమునందు పత్రిక లపరిమితముగా వెలువడెను.

1900వ సంవత్సరము నొక హద్దుగాచేసికొని, 1874వ సంవత్సరమున వివేకవర్ధని ప్రారంభింపబడెను కావున, యీ పాతిక సంవత్సరములకాలమున నాంధ్ర దేశమునందలి వార్తాపత్రికల, సారస్వత పత్రికల యభివృద్ధిని పరిశీలించినచో, పందొమ్మిదవ శతాబ్ది చరమ పాదమునందలి యాంధ్రదేశ సాంఘిక, రాజకీయ,

మత, నైతిక, సారస్వత స్థితిగతుల సమగ్రస్వరూపము వెల్లడియగును. ఈ పత్రికలలో, అముద్రితగ్రంథ చింతామణి, హిందూజన సంస్కారిణి, ప్రబంధకల్పవల్లి, రాజయోగి, ఆంధ్రప్రకాశిక, వైజయంతి, శశిలేఖ, సూర్యాలోకము, మొదలగునవి ముఖ్యముగా పేర్కొనదగినవి.

పందొమ్మిదవ శతాబ్ది యుత్తరార్ధమునందు పత్రికలు తెలుగు సారస్వతమునకు చేసినట్టిసేవ యింతింతనరానిది ఆ కాలమున ప్రతిపండితుడును నొక సారస్వత పత్రికను నిర్వహించిరి. తాశీదళార్ణవంబుల నొదిఁగి వికాసంబుంబొరయనేటిక రూపబు ప్రబంధమణుల ననేకములను, ఆ పత్రికలు జగద్బాంధవ కరోత్కరంబుల విభాభాసమానములుగ నొనర్చినవి.

శ్రీ కొక్కొండ వేంకటరత్నముపంతులవారు, శ్రీపూండ్లరామకృష్ణయ్యగారు, పనప్పాకము ఆనందాచార్యులుగారు, గురజాడ శ్రీరామమూర్తిగారు, మొదలగు వారెందరో మహానుభావులు, అపూర్వములగు ప్రాచీన కావ్యములను లేఖక ప్రమాద జనిత దోషరహితంబుగ బరిష్కరించి తమతమ పత్రికలయందు వెలయించిరి

వీరేశలింగంపంతులుగారును, ఇరువది గ్రంథములకుపైగా, ప్రాచీనకావ్యములను పరిష్కరించి ప్రకటించియున్నారు. కావున పత్రికా నిర్వహణమువలననే పండితులు మరుగుపడిన మాణిక్యములకై వెదుకసాగిరని చెప్పవలెను. ఈ విషయము అముద్రిత గ్రంథ చింతామణి, రాజయోగి, చింతామణి, మొదలగు పత్రికలను పరిశీలించిన తెల్లమగును.

ప్రాచీనకావ్యములను పరిష్కరించి పత్రికయందు ప్రచురించుటవలన ఆ పత్రికలకు ప్రచారమెక్కుడుగనుండెడిది. అముద్రిత గ్రంధ చింతామణియందు, ఆ పత్రిక పదారుపుటల పరిమాణముకలదై యుండగా, పన్నెండుపుటలలో ప్రాచీన ప్రబంధములు ప్రచురించెడివారు. నాడు సారస్వత పత్రికలు చందాదారుల నాకర్షించుటకు, వాని యందు ప్రచురింపబడు ప్రాచీన గ్రంథములు (అముద్రితకావ్యములు) విశేష ప్రాధాన్యము వహించుచుండెడివి. అందువలన పత్రికా సంపాదకులు అపూర్వ గ్రంధములను సంపాదించుటకు విశేషముగ కృషిచేయుచుండెడివారు.

వీరేశలింగంపంతులుగారు, పత్రికా నిర్వహణమునందుఁగూడ సమానులలోనుత్తమశ్లోకులు వారు నిర్వహించిన ప్రతి కార్యమునందును వారి ప్రత్యేకవ్యక్తిత్వము ప్రస్ఫుటమగుచుండును.

# 9
# వ్యాసము

ఉపన్యాసమను పదమునకు నేడు, ప్రత్యేకముగా సభలయందు, సమావేశము లందు లిఖితరూపముగా చదువుటగాక, వాగ్రూపమున చెప్పువిషయ వివరణమని, యర్థము రూఢమై పోయినది. కాని వీరేశలింగంపంతులుగారి ప్రక్రియను చేపట్టు కాలమునకాపదము వ్యాసమను దానికి పర్యాయపదముగా కూడ నుపయోగింపబడు చుండెనని చెప్పవచ్చును, వీరేశలింగంపంతులుగారు గొప్ప వక్తకారు ఈ గుణము పంతులుగారియందు దోషమగుటకు మారుగా గుణమేయయ్యెను, పంతులుగారు వివిధ సందర్భములందుపన్యాస వేదికలపైనిల్చి యొనగిన ఉపన్యాసములన్నియు, ముందింటివద్ద వారు వ్యాసరూపమున సిద్ధపరచుచుండెడివారు. వానినే మరల వివేక వర్ధని మొదలగు పత్రికలయందు ప్రచురించెడివారు

పంతులుగారు ఉపన్యాసము, వ్యాసములను పదములను సమానార్థకములు గను, పర్యాయపదములుగను గ్రహించిరనుట కుదాహరణములు చూపవచ్చును. ప్రత్యేక సమావేశములందుగాని, ప్రార్థనాసమాజములందో, సంఘసంస్కార సమాజ ములందో, గాని యుపన్యసించిన విషయములనేగాక, వివిధవిషయములపై వివేక వర్ధని పత్రికలయందు వ్రాసిన వ్యాసములనుకూడ పంతులుగా రుపన్యాసము లనియే వ్యవహరించిరి.

వివేకవర్ధని స్థాపనమును, వివేకవర్ధనిద్వారా తాము సాధించిన సంస్కార ములనుగూర్చి ప్రసంగించుచు,పంతులుగారు''ఆస్తిక్యము,వివేకము,సత్యము,అహింస, మొదలైనవే మొదట పత్రికలయందు వెలువడిన యుపన్యాసముల''ని వాని నుపన్యాస ములుగా పేర్కొనియున్నారు[1]. ప్రప్రథమమున వివేకవర్ధనియందు వెలువడిన యీ విషయములను పంతులుగారు, అంతకుపూర్వ మేసమాజ పక్షమున నుపన్యసించి యుండలేదు ఇంకను ''వివేకవర్ధనియొక్క ప్రథమ, ద్వితీయ, తృతీయ భాగములు ఉపన్యాసమంజరి యనునవి నేను పత్రికలకప్పుడప్పుడు......వివిధవిషయ వివరణ ములుగాను, నీతిమతధర్మబోధకములుగాను వ్రాసిన వ్యాసములెత్తి ప్రత్యేకముగా ముద్రింపబడిన పుస్తకములు[2]'', అని వ్రాసియున్నారు. కనుక ఉపన్యాసమంజరిలో

సంపుటీకరించినవియు, వివేకవర్ధనియందు ప్రచురపరచినవియు వ్యాసములనియే పంతులుగారభిప్రాయపడుచున్నట్లు స్పష్టమగుచున్నది. కాని 1897–99 వ సంవత్సరముల మధ్యకాలమున తమ గ్రంథములనన్నిటిని సంపుటములుగా ముద్రించునప్పుడు పంతులుగారు వానిని 'ఉపన్యాసము'లను సంపుటమునందు చేర్చియున్నారు పూర్వోక్త విషయములను పరిశీలించిన పంతులుగారు వ్యాసమును, ఉపన్యాసమును ఏకార్థబోధకములుగా గ్రహించిరని తెలియుచున్నది. ఇంకను నాటికీప్రక్రియ కుపన్యాసమన్న పేరే ప్రచారములో నుండెననియు, వ్యాసమన్న పేరు దీనికి సమానార్థకముగా గ్రహింపబడుచువచ్చినను, నంతప్రాచుర్యమును వహించియుండలేదనియు సిద్ధాంతమగుచున్నది. పంతులుగారు తమ స్వీయ చరిత్రమునందనేక సందర్భములయందు వ్యాసమును, ఉపన్యాసమునకు సమానార్థకముగ నుపయోగించియున్నారు.

"ఆంధ్రభాషా సంజీవనిలోని పూర్వాచారకవ్యాసముల హేతుదౌర్బల్యమును ప్రకాశము చేయుటకనగా "స్త్రీలకు విద్యకూడదు" అనునిట్టివ్యాసములా పత్రికయందు పోడచూపగానే తోడనే తత్ఖండనముగా నందలియుక్తులనే గైకొని "పురుషులకు విద్యకూడదు" అనునిట్టి వ్యాసములనువ్రాసి .." తాము ప్రచురించుచుండెడివారమని పంతులుగారు వేంకటరత్నము పంతులుగారితో తమకు సంభవించిన వివాదములను గూర్చి వ్రాసియున్నారు[8]. పంతులుగారొండు, రెండుచోటులదప్ప వ్యాసమన్నపదము నుపయోగింపలేదు ఉపన్యాసమన్న పదమునేక సందర్భములయందుపయోగించినారు. ఈ దిగువ నాయాసందర్భములు కొన్ని యుదాహరింపబడుచున్నవి

"తత్త్వబోధినిలో బ్రకటింపబడిన యుపన్యాసమొకటియు, పురుషార ప్రదాయినిలో బ్రకటింపబడిన యుపన్యాసమొకటియు నాకు లభ్యములైనవి . "

"నా యుపన్యాసధోరణిని దెలుపుటకయి 'విద్యార్థికుల ధర్మముల' నుండి కొన్ని పంక్తులిచట నెత్తి వ్రాయుచున్నాను..."

"దేశీయ మహాసభనుగూర్చి నేనిచ్చిన యుపన్యాసము..."

"నేను పదునాలుగేండ్లు వివేకవర్ధనికి విలేఖకుడనుగా నుండి దానిలో రాజ్యాంగ విషయకములైన వ్యాసములను వ్రాసితిని . "

ఈ విధముగా పంతులుగారు ఉపన్యాసములను లిఖితరూపములుగా చేసి, యాధునిక సాహిత్యమునందీ ప్రక్రియకొక విశిష్టమైనస్థానమును నిర్మించిరి. పంతులుగారు, రాజమహేంద్రవర ప్రార్థనాసమాజము, దేశపారశాలాసమాజము, విజయ

నగరమహారాజావారి బాలికా పాఠశాలలయందు, వివిధ విషయములనుగూర్చి యుప న్యసించుచుండెడివారు అట్లు తాముపన్యసింపబోవు విషయములను, ముందుగా వ్యాసరూపమున, నుపక్రమోపసంహారములతో దిద్దితీర్చి, ఆ యాసభాసమావేశము లందుపన్యసించి, పిమ్మట వానిని గ్రంథరూపమున వెలయించుచుండిరి. ఇవి ప్రప్రథ మమున పుస్తకరూపమున వెలువడినప్పుడు వాని ముఖపత్రము లిట్లుండెనట.

"ఐకమత్యము. తే 15-8-1875 దిని, రాజమహేంద్రవరమున, విజయ నగరము మహారాజావారి బాలికాపాఠశాలయందు కందుకూరి వీరేశలింగముచే నీయ బడిన యుపన్యాసము[4]."

ఇదేవిధముగా ఆ కాలమునందు ప్రత్యేక సమావేశములందు ప్రత్యేక విషయ ములపై ప్రసంగింపబోవువారుకూడ, తమ యుపన్యాసములను లిఖితరూపములుగా నొనర్చి, వాని నాయా సమావేశములందు చదువుచుండిరనుటకుగూడ నిదర్శనము లున్నవి. బ్రహ్మశ్రీవావిలాల వాసుదేవశాస్త్రులుగారును, కందుకూరి వీరేశలింగం పంతులుగారును రాజమహేంద్రవర దేశపాఠశాలా సమాజపక్షమున జరుగు సభలకు నియతోపన్యాసకులుగా నుండెడివారు. శ్రీవాసుదేవశాస్త్రిగారు తమ యుపన్యాసములను వ్రాసికొనివచ్చి చదివి వినిపించుచుండెడివారు. దేశపాఠశాలా సమాజస్థాపనమును గూర్చి వివేకవర్ధనియందు వెలువడిన వృత్తాంత ప్రశంసయందీ విషయము ప్రక టింపబడినది ఈ సభవారు నీతివిషయములను బ్రసంగించుటయు, ఉపన్యసించు టయు, తామాప్రకారము నడుచుకొనుటయు, ఇతరుల నా రీతి నడిపించుటయు, ముఖ్యోద్దేశములుగా గలిగియుండిరి వీరు ప్రతి భానువారమునాడును మధ్యాహ్నము మూడు గంటలు మొదలుకొని యాఱుగంటలవఱకును హూణపాఠశాలామందిరమున సమావేశమగు చుండెడివారు. ఒకవార మింగ్లీషు నందును, ఒకవారము తెలుగు నందును, వివిధవిషయములనుగూర్చి యుపన్యాసము లీయబడుచుండెడివి. "అగ్రా సనాధిపతి (President) గారిచే నియమింపబడిన సామాజికుడొకడు తన యుప న్యాసమును వ్రాసికొనివచ్చును " అని వ్రాయుచు వివేకవర్ధనియందట్టి యుపన్యాస ములు వెలువడుచుండుననికూడ ప్రకటింపబడినది[5].

అహింసయను నొక యుపన్యాసము శ్రీవావిలాల వాసుదేవ శాస్త్రిగారిది, వివేకవర్ధనియందు ప్రచురింపబడినది. ఆ ఉపన్యాసమునందు శ్రీ వాసుదేవశాస్త్రిగారు 'ఉపన్యాసము' నిట్లు నిర్వచించినారు

"ఉపన్యాసమనగా బహుజనములకెదుట నిలబడి, వినువారి కందఱకు నింపు గలట్టి, యుపయోగకరమైన యొక్కయంశమునెత్తి శ్రావ్యమైనకంఠముతోఁ బాద హస్తాద్యభినయంబులచే నర్థంబు విస్పష్టంబుగాఁబొడచవులుట్టిపడ నితరధ్యానంబు మాని తనయందె దృష్టినిలిపి యెల్లరు వినునట్లు గొంతెత్తి పలుకపలుకులు..."[6] ఈ విధముగా నుపన్యాసము నిర్వచింపబడినను దేశపాఠశాలా సమాజము వారి సమావేశములందు సభ్యులు తమ తమ యుపన్యాసములు చదివి వినిపించుచుండిరి.

ఈ విధముగా సంఘసంస్కారైక విషయములను జర్చించుననియును, సారస్వత సమాజములును, ఆంధ్రదేశమునందలి వివిధ పట్టణములందు వెలయుటకు ఆంగ్లేయ విద్యాభ్యాసమే కారణమని చెప్పవచ్చును. వివిధ సాహిత్యప్రక్రియల వలెనే, నీ ఉపన్యాసము ఆంగ్లేయ సంస్కార ప్రభావమువలననే తెలుగున ప్రభవించెనని చెప్పవచ్చును. 1870 వ సంవత్సరప్రాంతమున నీ యుపన్యాసమను శాఖ తొట్టతొలుత నాంధ్రవాఙ్మయమునందు ప్రతిష్ఠాపితమైనది. శ్రీ కొక్కొండ వేంకటరత్నము పంతులుగారు చెన్నపట్టణమునందు 'హిందూశ్రేయోభివర్ధనీసభ' స్థాపించి, యా సభా సమావేశములందు తాము వివిధ విషయములపై నుపన్యసించుచుండెడివారు 1872 వ సంవత్సరమునాటికే విశాఖపట్టణమునందు శ్రీమాన్ పరవస్తు వేంకటరంగాచార్లయ్య వారలుంగారు 'ఆర్షమతసభ' ను స్థాపించి, హిందూమతోద్ధరణమునకై, క్రైస్తవుల మతప్రచారమును ఖండించుచు, ఆర్షమత సభా సమావేశములందుపన్యసించుచుండిరి. ఈ సభలకు పూర్వమే 1865 వ సంవత్సరమున మచిలీ బందరునందు 'దైవసమాజిని' యను పేరున నొక సమాజము స్థాపింపబడినది. కాని యీ సమాజమువారు 1871 వ సంవత్సరము ఫిబ్రవరినెలలో నొక పత్రికను స్థాపింపవలెనని యుద్దేశించి, 1872 జనవరినుండి 'పురుషార్థ ప్రదాయిని' యను పేరున నొక మాసపత్రికను వెలువరించుటకు పూనుకొనుటకు పూర్వము, అంతగా కృషిచేసినట్లులేదు 1872 వ సంవత్సరమున 'పురుషార్థ ప్రదాయిని' ప్రారంభింపబడిన నాటినుండియు, నీ సమాజము వారి కృషి దేశ వ్యాప్తమైనది. ఈ సమాజమునందు శ్రీ కోరాడ రామచంద్రశాస్త్రిగారు, శ్రీ వావిలాల వాసుదేవశాస్త్రిగారు మొదలగువారు సభ్యులుగా నుండిరి తదుపరి మచిలీ బందరునందే స్థాపింపబడిన "ఉత్తమబాల సమాజము" (1872-73) పక్షమునకూడ వావిలాల వాసుదేవ శాస్త్రిగారు బందరుపురమునం దనేక యుపన్యాసములు గావించియున్నారు.

ఇట్టి సమాజము లేర్పడుట, ఉపన్యాసములు గావించుట, సంఘసంస్కారణాభిలాష, దేశాభిమాన మాననీయత, మనదేశమునందు నెలకొనుటకు, ఆంగ్ల విద్యా ప్రభావమే కారణము కావున, ఉపన్యాసమనునది, ఆంగ్లసాహిత్య సంస్కార ప్రభావజనితమైనదనియే చెప్పవలెను. ఉపన్యాసమనునదీవిధముగా 1870 వ సంవత్సరమున తెలుగు సాహిత్యమున కాలూనగా, వ్యాసమను పదము, ఇంతకు పూర్వమే తెలుగు సాహితీపరులకు పరిచయమై యుండెను. వ్యాసరచనా ప్రక్రియకును, పత్రికాప్రకటనమునకును నవినాభావ సంబంధముండియుండెను కావున, నీ వ్యాసరచనా ప్రక్రియ, తెలుగుదేశమునందు పత్రికా ప్రకటనముతోనే ప్రారంభమై యుండును. 1852 వ సంవత్సరమున వెలువడిన బ్రౌన్‌దొరవారి ఇంగ్లీషు తెలుగు నిఘంటువునందు వ్యాసమును గూర్చిన ప్రసక్తికలదు.

"Essay n s (add) is commonly called in Madras వ్యాసము. Essayist n s, he who makes an attempt, who writes an essay, an author ప్రయత్నముచేసేవాడు (in Madras commonly called వ్యాసము వ్రాసేవాడు, గ్రంథకర్త)"[7]

కనుక 1852 వ సంవత్సరమునకే వ్యాసమను పదము తెలుగు సాహిత్యమునందు ప్రచారమున నుండెనని స్పష్టమగుచున్నది. ఆ కాలమునందు వెలువడిన తెలుగు పత్రికలలో వివిధ విషయములను గూర్చిన వ్యాసములు ప్రచురింపబడుచుండెనేమో ! ఆ కాలమునందు తెలుగు పత్రికలలో మతసంబంధములైన చర్చలు, కులాచార సంస్కరణ ప్రాధాన్యములైన విషయములును మాత్రమే ప్రచురింపబడుచుండెను. తెలుగు పత్రికలన్నియు తొలినాళ్ళలో క్రైస్తవమత వ్యాప్తికై క్రైస్తవ మిషనరీలచే నిర్వహింపబడుచు వచ్చినందునను, వానికి ప్రతిగ హైందవులుకొన్ని పత్రికలు నిర్వహించియున్నను, వానిలోకూడ ఆ కాలమున మతసంబంధములైన విషయములకే ప్రాధాన్యముకలిగి యుండవచ్చును. ఈ విషయమును సైతము బ్రౌను దొరవారి ఆంగ్లాంధ్ర నిఘంటువునుండి మనము గ్రహింపవచ్చును. ఆంధ్ర దేశమునందు ముద్రాయంత్రముల వ్యాప్తినిగూర్చి వారు వ్రాయుచు 'తమిళులు ముద్రణకళను వంద సంవత్సరములనుండి యెరిగియున్నను, తెలుగుదేశమునందు, ముద్రాయంత్రములు 1806 వ సంవత్సరమున మాత్రమే నెలకొలుపబడెననియు, 1830 వ సంవత్సరమువరకు, ముద్రణము తెలుగున అభివృద్ధి పొందియుండ

లేదనియు, 1835 వ సంవత్సరమునుండి, కొన్ని తెలుగు కావ్యములు, సంస్కృత కావ్యములు (తెలుగులిపియందు) చెన్నపట్టణమున ప్రచురింపబడు చున్నవనియు, ప్రస్తుతకాలమున కొన్నివార్తాపత్రికలుకూడ తెలుగున వెలువడుచుండెననియు, ఆ వార్తాపత్రికలందు, మతవిషయకములైన వాదవివాదములు ప్రధానస్థాన మాక్రమించు చుండెననియు" బ్రౌనుదొరవారు వ్రాసియున్నారు[8] కనుక నాటి తెలుగు పత్రిక లన్నియు, మతసంబంధములైన, కులాచార సంస్కారైక విషయకములైన వ్యాస ములను ప్రచురించుచుండెనని నిశ్చయింపవచ్చును. 1835 వ సంవత్సరమునందు స్థాపింపబడిన 'సత్యదూత' యను తెలుగు పత్రిక, క్రైస్తవమిషనరీల యాజ మాన్యమున, నెలకొల్పబడుటయు, తదుపరి ఇరువది ముప్పది సంవత్సరముల దనుక తెలుగున వెలువడిన పత్రికలన్నియుఌ క్రైస్తవమిషనరీల యాజమాన్యముననే వెలువడుటయు, పై విషయమునె నిరూపించుచున్నది అనగా 1852 వ సంవత్స రమునకు పూర్వమే వ్యాసరచనా ప్రక్రియ తెలుగుసాహిత్యమునందు వెలసినదని తెలియుచున్నది. (1842-1850) సంవత్సరముల మధ్యకాలమున వెలువడిన వర్తమానతరంగిణి, వృత్తాంతినియను, పత్రికలయందు వ్యాసములు వెలువడి యుండవచ్చును కాని నేడవి యనుపలభ్యములు. 1870 వ సంవత్సరమునందు ప్రారంభింపబడిన 'గోదావరీ విద్యాప్రబోధిక' యను పత్రికయందు భాషావిషయిక ములగు కొన్ని వ్యాసములు ప్రచురింపబడినట్లు తెలియుచున్నది కాని మొట్టమొదటి సారిగా వ్యాసములను ప్రకటించినవారు శ్రీ సామినేని ముద్దు నరసింహులు నాయని వారు వీరు 'హితసూచని' యను పేరున వ్యాసముల సంపుటమును 1862 వ సంవత్సరమున ప్రకటించియున్నారు. వీరు రాజమహేంద్రవరపుజిల్లా పష్టుక్లాసు డిస్ట్రిక్టు మునసపుగా నుండిరి. 'హితసూచని' ముఖపత్రమునందు "ఈ లోకము నందు సకల శ్రేయస్కరంబులకు సాధకంబులగు సుగుణ వివేకసంపత్తులకు వలసిన చర్చ విషయములనేకము లుండినను, వానిలోని కొన్ని విషయములు, ప్రజలకు సుబోధ యగునట్లు..." ముద్దు నరసింహనాయనివారు సంకల్పించి యీ ప్రయత్నము నకు పూనినట్లు వర్ణింపబడినది ఇందు ఎనిమిది ప్రమేయములు కలవు. ముద్దు నరసింహనాయని వారిగ్రంథమున ప్రమేయమను పదమును వ్యాసమునకు పర్యాయ పదముగా వాడినారు దీనిలో విద్యాప్రమేయము, వైద్యప్రమేయము, సువర్ణ ప్రమే యము, మనుష్యేతరజంతుసంజ్ఞా ప్రమేయము, రక్షః ప్రభృతి ప్రమేయము, మంత్ర

ప్రమేయము, పరోక్షాది జ్ఞాన ప్రమేయము, వివాహ ప్రమేయములను ఎనిమిది ప్రమేయములు కలవు. ఈ ప్రమేయములు 1862 సంవత్సరము నాటికే విద్యాధికులైన వారిపై ఆంగ్ల విద్యాప్రభావ మెంత గాఢముగా ప్రసరించినదో విశదీకరించు చున్నవి. 1862 వ సంవత్సరము నాటికే తెలుగుదేశమున ఆంగ్లవిద్యా, విజ్ఞాన, సంస్కృతులు తమ ప్రభావము ననల్పముగా, సాహితీపరులపై, విద్యాధికులపై ప్రసరింపజేసి, చిరకాలానుగతములైన వారి విశ్వాసములను, ఆచారములను, పద్ధతులను, కుల క్రమానుగతములైన కట్టుబాట్లను యెట్లు సడలజేయుచున్నవో, యీ ప్రమేయములు స్పష్టముగా తెలియజెప్పుచున్నవి.

'హితసూచని' గ్రంథమునందు మరియొక విశేషమేమనగా సామినేనిముద్దు నరసింహనాయనివారు దీనిని వ్యవహారిక భాషయందు రచించుట చిన్నయసూరి గారు, నీతి చంద్రికను వెలయించునాటికి తెలుగుదేశమున పత్రికలన్నియు వ్యావహారిక భాషనే యుపయోగించుచున్నట్లు పత్రికలవలన తెలియుచున్నది. పత్రికలేగాక రావి పాటి గురుమూర్తిశాస్త్రిగారి 'ద్వాత్రింశత్సాలభంజికల కథలు' 'పంచతంత్రము', యెణ్ణమిల్లి మల్లికార్జునుల 'చార్దర్వేష' మొదలగు గ్రంథములుకూడ ఆకాలమున వ్యావహారిక భాషలోనే వెలువడియుండెను. ముద్దు నరసింహ నాయనివారు పీఠికలో గ్రంథస్థములైన విషయములను గూర్చియు, భాషనుగూర్చియు, విపులముగ చర్చించి "గనుక సాధారణమయిన భాషయందు వాడుకలో నున్న గ్రామ్యపదములు చాల మట్టుకు సరసమయిన వాక్యరచనలో నంగీకరించతగినవిగా నేను ఎంచుకుంటున్నాను" అని వ్రాసియున్నారు.[9] ఇదే విధముగా 'చార్దర్వేష' అను గ్రంథమునందు తాము "..స్త్రీ పురుషులు వకరితో నొకరు మాటలాడునట్లు సులభముగా అర్థమయ్యేలాగున సంక్షేపముగా, జాతీయ రసముతో (భాషాంతరులకు పూర్వోత్తరములు తెలియడము నకు ముఖ్యమయిన రిమార్కులతో) యీ గ్రంథము రచించ నిశ్చయించితిమని" గ్రంథకర్త పీఠికలో తెలిపి యున్నారు[10]

ఈ హితసూచని వీరేశలింగం పంతులుగారు రచనా వ్యాసంగమును పూనుకొనుట కెనిమిదేండ్ల పూర్వమే వెలువడినది పంతులుగారు 1866, 67 సంవత్సరములయందు శతకములు రచించినను 1870 వ సంవత్సరముదనుక వచన రచనా వ్యాసంగమునకు పూనుకొనలేదు. 1870 వ సంవత్సర ప్రాంతమునుండియు, రాజమహేంద్రవరమున రెవరెండు బారో దొరగారి సంపాదకత్వమున వెలువడిన

'గోదావరీ విద్యాప్రబోధిక' యందును, చెన్నపట్టణమునుండి శ్రీ కొక్కొండ వేంకట రత్నము పంతులుగారి సంపాదకత్వమున వెలువడిన 'యాంధ్రభాషా సంజీవని యందును, మచిలీపట్టణమునుండి ఉమా రంగనాయకులు నాయుడుగారి సంపాదకత్వ మున వెలువడిన పురుషార్థ ప్రదాయిని యందును, పంతులుగారు తమ రచనలను వెలయించుచుండిరి. భాషావిషయికముగా 'హితసూచని' వీరేశలింగంపంతులుగారిపై ప్రభావము చూపకపోయినను, అందలి విషయముల ననేకములు పంతులుగారు గ్రహించియుండుట స్పష్టము [11] ముద్దు నరసింహనాయనివారు వెలువరచిన యనేకాభి ప్రాయములను పంతులుగారు తరువాత కాలమున వెలువడిన తమ వ్యాసములందు స్వీకరించిరి

కనుక వ్యాసములను గ్రంథరూపమున తొట్టతొలుతగా తెలుగు దేశమునందు వెలయించినవారు 'హితసూచని' గ్రంథకర్తలనుట స్పష్టము

ముద్దు నరసింహ నాయని వారు సులభ సుందరమగు వ్యావహారిక భాషలో వ్యాసములు వ్రాసియుండిరనుట సత్యము. వారు వీనిని ప్రమేయములని వ్యవహరించిరి. శ్రీగిడుగు వేంకటరామమూర్తి పంతులుగారు వీనిని వ్యాసములనియే వ్యవహరించిరి. "వీనిలో ఎనిమిది ప్రమేయములను గురించి రచించిన వ్యాసములున్నవని" రామమూర్తి పంతులుగారు తమ గద్య చింతామణి యందు వ్రాసి యున్నారు.[12] తాము రేఫద్వైవిధ్యమును, అర్ధానుస్వారమును పాటించుటలేదని ముద్దు నరసింహ నాయనివారు తమ 'హితసూచని' పీఠికయందు తెలిపియున్నారు [13] పంతులుగారి వ్యాసములగూర్చి వివరించునప్పుడు 'హితసూచని' వారిపైబరపిన ప్రభావము పరిశీలింపబడును

కనుక తెలుగు సాహిత్యమునందు వ్యాసరచనకొక స్థితిని కల్పించి ప్రాచుర్యమునకు దెచ్చినవారు సామినేని ముద్దు నరసింహనాయని వారని గ్రహింపదగి యున్నది. ఈ విధముగా 'హితసూచని' పందొమ్మిదవ శతాబ్ది నడుమ భాగములో బయలుదేరి, నాటి మేధావుల మనస్సులలోగల భావములకు, వ్యాసరూపమున ప్రకాశము నిచ్చినది"ని శ్రీ కొత్తపల్లి వీరభద్రరావుగారు వ్రాసియున్నారు.[14]

'హితసూచని' తదుపరి పుస్తకరూపమున వెలువడిన వ్యాసముల సంపుటి 'శ్రీ కళాకల్లోలిని' యనునది. ఈ గ్రంథము 1876 వ సంవత్సరమున బెంగుళూరు నందు ప్రకటింపబడి వెలువడినది. ఈ గ్రంథము మూడుభాగములుగా నున్నది.

ప్రథమభాగము 'స్త్రీనీతి' యను శీర్షికతో వెలయుచున్నది రెండవభాగము 'స్త్రీ విద్యామణి' యను శీర్షికతో వెలయుచున్నది. మూడవభాగము స్త్రీ మానము ప్రథమభాగము నందు స్త్రీలకుపయుక్తములగు పాటలు, పద్దెములును గలవు. రెండవభాగము వచన గ్రంథము. 'స్త్రీ విద్యామణి' యను రెండవభాగమునందు 69 వ్యాసములున్నవి. ఈ వ్యాసములు పంతులుగారిని మిక్కిలి ప్రభావితులను చేసినవి. ఈ గ్రంధము 275 పుటల పరిమితి గలిగియున్నది. గ్రంధకర్త జియ్యరుసూరియనువారలు. బెంగుళూరునందు పాఠశాలాధ్యాపకులుగా నున్నవారు ప్రతి వ్యాసమునకును ఆంగ్లమునందు సైతము, శీర్షికానామమీయబడినది చిన్నచిన్న వ్యాసములతో నీ గ్రంథము స్త్రీలకత్యంతోపయుక్తమైన దనుటలో సందేహములేదు పంతులుగారిపై నీ గ్రంథము నెఱపిన ప్రభావముకూడ పంతులుగారి వ్యాసములు సమీక్షింపబడు నప్పుడు పరిశీలింపబడును [15] వీరేశలింగం పంతులుగారు 1874 వ సంవత్సరము నందు తమ వివేక వర్ధనిని ప్రారంభించినను, అంతకుపూర్వముఁగూడ స్త్రీ విద్యా మండన వాదములను, భాషావిషయకములైన చిన్న యుపన్యాసములను నితర పత్రికలందు ప్రచురింపుచువచ్చిరి 1870 వ సంవత్సరము ఆగష్టునెల గోదావరీ విద్యా ప్రబోధికయందు పంతులుగారు తెలుగుభాషలోని 'సంధి' విషయమై నొక చిన్న వ్యాసమును ప్రచురించిరి ఈ వ్యాసమును విమర్శించుచు, గుంటూరు ఆంగ్లో వర్నాక్యులరు స్కూలునందు సహాయోపాధ్యాయులైన పరవస్తు వేంకటరంగాచార్యుల వారు (వీరు మహామహోపాధ్యాయులుకారు) గోదావరీ విద్యాప్రబోధికయందే, ఆ సంవత్సరము నవంబరునెలలో నొక యుపన్యాసమును ప్రచురించిరి. 'గోదావరీ విద్యా ప్రబోధిక' యచిరకాలములోనే నిలిపివేయ బడుటవలన. పంతులుగారు వెంకటరంగాచార్లవారి విమర్శకు, 1872 వ సంవత్సరపు జూన్ నెల పురుషార్థ ప్రదాయినియందు, సమాధాన రూపమైన యొక చిన్న యుపన్యాసమును ప్రచురించి యున్నారు [16] 'గోదావరీ విద్యాప్రబోధికయందు తాము వీరేశలింగం పంతులుగారి సంధి విషయమై వ్రాసినదాని, నుపన్యాసమని వేంకటరంగాచార్లవారు పేర్కొనియున్నారు [17] ఆ కాలమునందు వేంకటరత్నము పంతులవారి 'యాంధ్రభాషా సంజీవని' స్త్రీ విద్యా ఖండన వాదములను వ్యాసరూపమున వెలయించు చున్నట్లు పంతులుగారు తమ స్వీయచరిత్రమునందు తెలిపియే యున్నారు. వేంకటరత్నము పంతులువారు 1872వ సంవత్సరము నుండియే తమ యాంధ్రభాషా సంజీవనియందు స్త్రీ విద్యా నిరసకము

లగు వ్యాసములను ప్రకటించు చుండిరి ఇంకను భాషావిషయకములగు వ్యాసములను గూడ తమ పత్రికయందు ప్రకటించుచుండిరి. ఆంధ్ర భాషా సంజీవనియందు, వెలువడిన యిట్టి వ్యాసములపై పురుషార్థ ప్రదాయినియందు ప్రతి విమర్శలు వెలువడు చుండెడివి ప్రజోత్పత్తినామ సంవత్సరపు ఆంధ్రభాషా సంజీవనియందు (1871) గీర్వాణ భాషావర్ధమాలను గూర్చి యొక వ్యాసము ప్రకటింపబడెనన్న విషయము 1872 వ సంవత్సరపు నవంబరు నెలయొక్క 'పురుషార్ధ ప్రదాయిని' సంచికవలన తెలియుచున్నది.[18] ఇంకను ఆంధ్రభాషా సంజీవని యందును, పురుషార్ధ ప్రదాయిని యందును ఆ కాలమున వివిధ విషయములను గూర్చి వ్యాసములు వెలువడుచుండెడివి ఈ పత్రికలకు పూర్వమే 1865 వ సంవత్సరమున ప్రారంభింపబడిన తత్త్వ బోధిని యందునుకొన్ని వ్యాసములు వెలుపడెనట. ఇది యా కాలమున చెన్నపురి వేదసమాజము వారిచే మాసపత్రికగా ప్రకటింపబడుచుండెను. ఈ వేదసమాజము నేటి బ్రాహ్మ సమాజమునకు పూర్వరూపము ఈ పత్రికయందు పరిశుద్ధాస్తికమతము, విగ్రహారాధనము మొదలగు మత విషయకములగు వ్యాసములు ప్రచురింపబడుచుండెడివి. ఈ పత్రికయందు ప్రచురింపబడిన వ్యాసములు తదుపరి సంపుటీకరింపబడి, తత్త్వ బోధిని 1, తత్త్వబోధిని 2, తత్త్వబోధిని 3, అను మూడుభాగములుగా పుస్తక రూపమున వెలువడినవి. తత్త్వబోధినియందు వెలువడిన వ్యాసములలో, స్త్రీ పునర్వివాహ విషయము, బాలికా విద్యాభ్యాసము, సూర్యగ్రహణము, స్థైర్యము, ఐకమత్యము, పరిశుద్ధాత్మక మత స్వరూపము, పరమాత్మ స్వరూపము, జీవాత్మ స్వరూపము, పరిశుద్ధాత్మక తత్త్వము, మొదలగు వ్యాసములు, సాంఘిక, వైజ్ఞానిక, మత విషయ సంబంధములుగా వెలువడినవి.[19]

వీరేశలింగం పంతులుగారిపై తత్త్వబోధిని వ్యాసముల ప్రభావ మెంతయో గలదు తత్త్వ బోధినియందు ప్రచురింపబడిన స్త్రీ పునర్వివాహ విషయకోపన్యాసము నాధారముగా చేసికొనియే తాము తమ స్త్రీ పునర్వివాహ విషయక ప్రథమ విజ్ఞాపనమును సిద్ధపరచి యున్నామని స్వీయచరిత్రమునందు వారు వ్రాసిరి. ఈ తత్త్వబోధిని 1870 వ సంవత్సరము వరకు వెలువడినది. వీరేశలింగం పంతులుగారు 1863వ సంవత్సరమునుండి 1867 వ సంవత్సము వరకు క్రైస్తవుల యాజమాన్యమున వెలువడిన శ్రీ యక్షిణియను పత్రికను, తమ కొక్కొండ వేంకటరత్న కవికృత విగ్రహ తంత్ర విమర్శనమునందు ప్రశంసించి యున్నారు. పంతులుగారు తాము

1874 వ సంవత్సరమున వివేకవర్ధనిని ప్రారంభించుటకు పూర్వము, నాడు వెలు వడుచుండిన తెలుగు పత్రికలను, బాగుగా పరిశీలించుచుండిరని తెలియుచున్నది. 1872 వ సంవత్సరమున మాసపత్రికగా ప్రారంభింపబడిన పురుషార్థ ప్రదాయిని యందు సంఘ సంస్కారమునకు సంబంధించినవియు, శాస్త్రీయ విషయములకు సంబంధించినవియు, ననేక వ్యాసములు ప్రచురింప బడినవి. జ్యోతిష విషయము, దేహారోగ్యము, భాషోత్పత్తి, చతుర్విధ పురుషార్థములు, స్త్రీ పునర్వివాహము, మొదలైన విషయములపై పురుషార్థ ప్రదాయిని యనేక వ్యాసములను ప్రచురించినది.

ఇవి కాక నీ పత్రికాధిపతియైన శ్రీ ఉమా రంగనాయకులు నాయుడుగారిచే, శారీర శాస్త్రము, 1872 వ సంవత్సరముననే, యీ పత్రికయందు వ్యాసరూపమున వెలువడినది. అనేకాంగ్ల గ్రంథముల నవలోడనముచేసి, నీ శారీరక శాస్త్రమును రంగ నాయకులు నాయుడుగారు పురుషార్థ ప్రదాయిని యందు వెలువరించినట్లు తోచు చున్నది. ఈ వ్యాసములందు తెలుగుపదములు పారిభాషిక పదములుగా కూర్పబడి, వానికి సమానార్థకములైన ఆంగ్లపదములు కుండలీకరణములలో నీయబడినవి దేహారోగ్య లక్షణము- నాడీవివరణము (1872 నవంబరు), దేహారోగ్య లక్షణము- రుధిర వివరణము (1872 డిసెంబరు) దేహారోగ్య లక్షణము- పేశల వివరణము (1872 అక్టోబరు) మొదలైన వ్యాసములను, శారీర శాస్త్ర సంబంధములైన వానిని శ్రీ రంగనాయకులు నాయుడుగారు పురుషార్థ ప్రదాయిని యందు ప్రచురించి యున్నారు శ్రీమాన్ పరవస్తు వేంకట రంగాచార్లయ్య వారలు, విశాఖపట్టణమున తమ యార్షమత సభయందిచ్చిన యుపన్యాసములను ఎఱ్ఱమిల్లి మల్లికార్జునులు పంతులు పురుషార్థ ప్రదాయినికి ప్రచురణార్థము పంపుచుండెడివారు అట్లు పంపబడి పురుషార్థ ప్రదాయినిలో మహామహోపాధ్యాయులవారి జన్మసంగ్రహము, ధర్మ సంగ్రహ ములను వ్యాసములు ప్రచురింప బడినవి. 1872 వ సంవత్సరము మేనెలయందు రంగాచార్లయ్యవారలుగారి ఆర్ష మత సంగ్రహమను వ్యాసము ప్రచురింపబడినది ఈ విధముగా 1872 వ సంవత్సరమున పురుషార్థ ప్రదాయిని, ప్రకృతిశాస్త్ర విష యములు, శారీర శాస్త్రమునకు సంబంధించిన విషయములు, జ్యోతిశ్శాస్త్రము, మతము, భాష, స్త్రీ పునర్వివాహము, మొదలగువానికి సంబంధించిన విషయములు, వ్యాస రూపమున ప్రకటించినది

పంతులుగారుకూడ పురుషార్థ ప్రదాయినియందు స్త్రీ విద్యా ప్రోత్సాహక వాదములను వ్యాసరూపముననుఁ, పద్యరూపమునను 1874 వ సంవత్సర ప్రాంత

మున ప్రచురించి యున్నారు పురుషార్థ ప్రదాయినివలెనే ఆంధ్రభాషా సంజీవనియు వివిధ విషయములపై వ్యాసములు ప్రచురించు చుండెడిది.

"పోతం జానకమ్మ యను విదుషీమణి 1874 వ సంవత్సరమున ఫిబ్రవరి 24 తేది నొక్కవ్యాసమును విదేశ యాత్రంగూర్చి వ్రాసి శ్రీ మదాంధ్రభాషా సంజీవనిలో బ్రకటించియున్నది. ఆ వ్యాసమునందలి శైలియందలి యుక్తులు మిక్కిలి ప్రౌఢములుగా నున్నవి ఈమె తనభర్తతో నింగ్లాండు వెళ్ళివచ్చి పిమ్మట నీ వ్యాసమును వ్రాసి ప్రకటించినది" అని బ్రహ్మశ్రీ కాశీభట్ట బ్రహ్మయ్య శాస్త్రిగారు 'ఆంధ్రదేశమునందలి స్త్రీ విద్య' యను శీర్షిక క్రింద వ్రాసియున్నారు[20] ఆంధ్ర భాషా సంజీవని 1872-75 సంవత్సరముల మధ్య స్త్రీ విద్యను గూర్చియు, స్త్రీ పునర్వివాహమును గూర్చియు, అటుపై అముద్రిత గ్రంథ చింతామణి మొదలగు సౌసన్వత పత్రికలతో 1886 వ సంవత్సర ప్రాంతమున భాషావిషయ ములైన వివాదములు సంభవించినప్పుడును, అనేక వ్యాసములను ప్రచురించినది. ఈ కాలము నందే విశాఖపట్టణమునుండి వెలువడుచుండిన సకలవిద్యాభివర్ధనియను పత్రిక యనేక శాస్త్రవిషయములను ప్రశ్నోత్తర రూపమున నున్న వ్యాసములుగా ప్రచురించినది అశ్వశాస్త్రము, వైద్యశాస్త్రము, వేదశాస్త్రము, మొదలగు శాస్త్రములన్నియు ప్రశ్నోత్తర రూపమున సకల విద్యాభివర్ధని యందు వెలువడినవి ఇంకను ప్రకృతి శాస్త్ర విషయాదికముల ననేకములనీ సకలవిద్యాభివర్ధని ప్రకటించినదని శ్రీ కాశీ భట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు వ్రాసియున్నారు[21] ఇంకను శ్రీ బ్రహ్మయ్య శాస్త్రులవారు తమ పురాతనాంధ్ర వార్తా పత్రికలను వ్యాసమునందు పూర్వ పత్రికలు చర్చించక విడిచిన సాంఘిక రాజకీయ నీతిమతాచార విషయములు లేవని వ్రాసియున్నారు[21]

ఆ కాలమునందు వ్యాసములు ప్రశ్నోత్తర రూపమున గూడ వెలువడుచుండె ననుటకు సకలవిద్యాభివర్ధని యందలి వ్యాసములేగాక, వివేకవర్ధనియందు వీరేశలింగం పంతులుగారుకూడ కొన్ని విషయములను వ్యాసరూపమున ప్రశ్నోత్తర క్రమమున వెలయించుట సాక్ష్యమిచ్చుచున్నది.[22]

ఈ విధముగా వీరేశలింగం పంతులుగారు తెలుగు సాహిత్యమును, వ్యాసములతోను, నుపన్యాసములతోను సుసంపన్నమును చేయుటకు పూనుకొనుటకు పూర్వమే, యీ ప్రక్రియ మన సాహిత్యమునందు విస్తరించినది. అయినను పంతులు

గారికి పూర్వము, వ్యాసరచనా ప్రక్రియయందు, పంతులుగారు చూపినంత వైవిధ్యమును చూపినవారు లేరు పంతులుగారే ప్రక్రియను చేపట్టినను వారిమార్గము విశిష్టమైనది వారు చూపునట్టి విషయ వైవిధ్య మనన్య సామాన్యమైనట్టిది పంతులుగారు మత సాంఘిక, రాజకీయార్థిక, నైతిక విషయముల నన్నిటిని తమ వ్యాసములందు పరామర్శించి యున్నారు. ఆధునిక వాఙ్మయమునందు వీరేశలింగంపంతులుగారికి లభించిన స్థానము, తెనుగువచన రచనా ప్రక్రియా వైశారద్యమును బట్టి వారికి వచ్చిన ఖ్యాతినే వేనోళ్ళ చాటుచున్నది. వచనము వైశద్య ప్రధానమైనది. వీరేశలింగం పంతులుగారి వచనరచన సులభసుందరము. నీతిచంద్రికలోని సంధి, విగ్రహములను, ప్రౌఢమైన సంస్కృత సమాస బంధురమైన శైలిలో రచించిన పంతులుగారు, వ్యాసముల నిట్టి సరళసుందరమైన శైలియందు గూర్చుట, వారి బహుముఖ ప్రజ్ఞాశాలిత్వమును, చాటిచెప్పుచున్నది నేటి వచనరచనకు పంతులుగారు పెట్టినదే భిక్ష. పంతులుగారి వ్యాసముల వలననే వారికి గద్యతిక్కన్న బిరుదము సార్థకమైనది. వారు ప్రకటించిన పది సంపుటములలో నించుమించుగా మూడు సంపుటములకు సరిపడ వారి యుపన్యాసము లున్నవి.

పంతులుగారు వివిధ విషయములపై రచించిన వ్యాసములు, వివిధ సమావేశము లందిచ్చిన నుపన్యాసములు మొత్తము నూటయెనుబదితొమ్మిది కలవు ఈ వ్యాసములు, ఉపన్యాసములు పంతులుగారు ప్రకటించిన సంపుటములలో ఆఱవ సంపుటమునందును, ఏడవ సంపుటమునందును, ఎనిమిదవ సంపుటము నందును, తొమ్మిదవ సంపుటము నందును కలవు. 1897-99 వ సంవత్సరముల మధ్యకాలమున ప్రకటించిన సంపుటములందు, తొమ్మిదవ సంపుటమునందు వ్యాసములు లేవు. కాని పంతులుగారు 1905 వ సంవత్సరమునందు 'సత్యవాదిని' యను పత్రికను ప్రారంభించి, ఆ పత్రికయందు ఉత్తమస్త్రీ చరిత్రములను, స్త్రీ విద్యా విషయకములైన వ్యాసములను, మతవిషయకములగు వ్యాసములను వెలయించినారు. పంతులుగారి మరణానంతరము, వారి సంపుటములను పునర్ముద్రణము గావించిన హితకారిణీ సమాజమువారు తొమ్మిదవ సంపుటమునందు, సత్యవాదినిలో ప్రచురింపబడిన వ్యాసములను చేర్చినారు. తొమ్మిదవ సంపుటమునందు పూర్వము పంతులుగారు ముద్రించిన జ్యోతిశ్శాస్త్ర సంగ్రహము, శారీరశాస్త్ర సంగ్రహము, జంతుస్వభావ చరిత్రముల, స్థానమున హితకారిణీ సమాజమువారు, ఉత్తమ స్త్రీచరిత్రములను, సత్యవాదిని

యందలి వ్యాసములను ప్రచురించిరి ఇవికాక పంతులుగారు వివిధ పత్రికలందు వెలువరించిన యనేక వ్యాసములు సంపుటములలో చేరియుండక పోవచ్చును సంపుటములలో చేరని వ్యాసములుకూడ కొన్ని యీ పరిశీలనమునందు గ్రహింపబడినవి. ధర్మనాథని పత్రికయందు ప్రచురింపబడిన దేశిరాజు పెదబాపయ్యగారిని గురించిన వ్యాసము జనానా పత్రికయందు, భండారు లచ్చమాంబగారిపై వ్రాసిన వ్యాసము, ఆంధ్రపత్రిక ఉగాది సంచికయందు, 1919 వ సంవత్సరమున బమ్మెర పోతరాజును గురించి వ్యాసము, ఈ పరిశీలనలో చేరినవి

పంతులుగారు తమ స్వీయచరిత్రమునందు గ్రంధకర్తృత్వదశ యను ప్రకరణమున, తమ గ్రంధరచనా ముద్రణములను గూర్చి వివరించుచు "ఇందు బ్రకటింపబడినవి గాక నేనువ్రాసిన హాస్య సంభాషణములును, వ్యాసములును, నీతి ధర్మ విలేఖనములును బెక్కులు గలవు" అని వ్రాసియున్నారు. ఇది సత్యము. పంతులుగారు నిర్వహించిన పత్రికలన్నియు నేడు లభించినగాని, ఆ వ్యాసములను, హాస్యసంభాషణములను, నీతిధర్మ విలేఖనములను సంపాదింపలేము పంతులుగారు తమ జీవిత కాలమునందు నిర్వహించిన వివేకవర్ధని, సతీహితబోధిని, సత్య సంవర్ధని, చింతామణి, సత్యవాదిని మొదలగు పత్రికలు నేడు లభ్యములుకావు. పంతులుగారి సంపుటములలో చేరిన వ్యాసములును, సంపుటములలో చేరక వివిధ పత్రికలలో ప్రకటింపబడి, లభ్యములైన వ్యాసములును నిట పరిశీలింపబడు చున్నవి. పంతులుగారు ప్రకటించిన పది సంపుటములలో ఏడవసంపుటము, సంపూర్ణముగా పంతులుగారు వివిధ విషయములపై, వివిధ ప్రదేశములయందు, ప్రత్యేక సందర్భములను పురస్కరించుకొని, వివిధ వేదికలపై నొసగిన యుపన్యాసములు కూర్పబడినవి ఈ సంపుటమునందు స్త్రీ పునర్వివాహ సంబంధములైన వ్యాసములు ఏడున్నవి. తక్కిన యుపన్యాసములు మత, సాంఘిక విషయములకు సంబంధించినవి. ఎనిమిదవ సంపుటమునందు వివేకవర్ధని పత్రికయందు పంతులుగారు 1874 వ సంవత్సరమునుండి 1894 వ సంవత్సరము వరకు ప్రకటించిన వ్యాసములున్నవి. వీనిలో సకృత్తుగా యుపన్యాసములు కూడ చేరినవి ఈ వ్యాసములు, ఉపన్యాసమంజరి, వివేకవర్ధని ప్రథమ భాగము, వివేకవర్ధని ద్వితీయభాగము, వివేకవర్ధని తృతీయభాగమను ప్రత్యేక భాగములుగా ముద్రింపబడినవి వీని సంఖ్య 106 ఇవిగాక నీయెనిమిదవ సంపుటము నందే 'దేశీయ మహాసభయు-దాని యుద్దేశములును' అను ఉపన్యాసమును, వింతా

మణి పత్రికలో పంతులుగారు ప్రచురించిన అనీ బీసెంటు, అహల్యాబాయి, పండిత రామాబాయి సరస్వతి, పండిత ఈశ్వర చంద్ర విద్యాసాగరులను జీవిత చరిత్రాత్మకములైన వ్యాసములును చేర్పబడినవి ఇంకను బసవరాజు గవర్రాజుగారిని గూర్చియు, మాకర్ల సుబ్బారావు నాయుడుగారిని గూర్చియుపురమందిరమునందు సమావేశమైన సంతాపసభలందు, పంతులుగారిచే నీయబడిన యుపన్యాసములు చేర్చబడినవి. ఇవి కాక ప్రార్థనామందిరమున శంకరాచార్యులవారిని గూర్చి చేయబడిన యుపన్యాసము కూడ చేర్చబడినది. ఈ సంపుటమును 'ఉపన్యాసములు-జీవిత చరిత్రములు' అని పంతులుగారు పేర్కొనిరి. కనుక నీ సంపుటమునందు మొత్తము వ్యాసములు, ఉపన్యాసములు, నూటపదునాలుగున్నవి. తొమ్మిదవ సంపుటమునందు సత్యవాదిని నుండి పునరుద్ధరింపబడి చేర్పబడిన వ్యాసముల సంఖ్య 11 ఆఱవ సంపుటమునందు సతీహిత బోధినియను శీర్షికతో స్త్రీల కుపయుక్తములగు వ్యాసములు ముప్పదియైదు చేర్పబడినవి. ఈ వ్యాసము లన్నియు పంతులుగారు 1883 వ సంవత్సరమునందు స్త్రీల నిమిత్తమై ప్రత్యేకముగా నిర్వహించిన 'సతీహిత బోధిని' యను మాసపత్రిక యందు ప్రప్రథమమున వెలువరించినవే వీనినే తదుపరి పంతులుగారు సతీహితబోధిని యను పేరుతో ప్రత్యేకము పుస్తకముగా ప్రకటించిరి ఈ వ్యాసములందు, జ్యోతిశ్శాస్త్రమును గూర్చి యొకవ్యాసము, సూక్ష్మవస్తు దర్శక యంత్రమునుగూర్చి యొక వ్యాసము, మంచుగడ్డనుగూర్చి యొక వ్యాసము, అగ్నిపర్వతములనుగూర్చిన యొక వ్యాసము, మొత్తము నాలుగు వ్యాసములు, శాస్త్రీయ విషయములకు సంబంధించినవి. విక్టోరియా మహారాజ్ఞినిగూర్చిన సంక్షేపమైన వ్యాసముకూడ నీ సంపుటమునందు చేర్పబడినది తక్కిన ముప్పది వ్యాసములు, స్త్రీలవిద్యా, వైజ్ఞానిక విషయములకు సంబంధించినవి ఇవిగాక 'గోదావరి మండల సాంఘికసభ'లో పంతులుగారు చేసిన యుపన్యాసమును, హితకారిణీ సమాజమువారు ప్రకటించిన ఏడవ సంపుటమునందు చేరినది. పంతులుగారు వివిధ పత్రికలయందును, తదుపరి సంపుటములందును వెలయించిన, వ్యాసముల, ఉపన్యాసముల, నీ విధముగా విభజింప వచ్చును

ఆర్థిక విషయములనుగూర్చి 3, సాంఘికములు 68, రాజకీయములు 3, మతము 35, నైతిక విషయములనుగూర్చి 8, జీవిత చరిత్ర 12, స్త్రీవిద్య, స్త్రీ పునర్వివాహములు 46, విద్య 4, శాస్త్రీయ విషయములనుగూర్చి 4, ఇతరములు 6

ఈ విషయ విభాగమువలన పంతులుగారధిక సంఖ్యాకములగు వ్యాసములను సంఘ సంస్కార విషయములనుగూర్చి వెలయించిరనియు, దీని తరువాత స్త్రీ విద్య, స్త్రీ పునర్వివాహములను గూర్చి రచించిరనియు, తదుపరి మత సంబంధములైన విషయములకు ప్రాముఖ్యము నొసగిరనియు గమనింపదగి యున్నది స్త్రీ పునర్వివాహమును గూర్చినవియు, స్త్రీ విద్యా ప్రోత్సాహకములగు వ్యాసములుకూడ సాంఘికములలోనే చేర్పవచ్చును కాని, కులాచార సంస్కారములను గూర్చినవియు, అహింస, సత్యము, ఐకమత్యము, మొదలగు విషయములను గురించియు, సంఘములోని అంధ విశ్వాసములను గురించి వ్రాసినవియు నైన వ్యాసములు సాంఘికములుగా నెన్నబడినవి. ప్రత్యేకముగా స్త్రీ పునర్వివాహ సంబంధములైన యుపన్యాసములు, స్త్రీలవిద్యా, విజ్ఞానాభివృద్ధికై పంతులుగారు వెలయించిన వ్యాసములు, ప్రత్యేక విషయ విభాగమునందు స్వీకరింపబడినవి. 'దేశీయమహాసభ-దాని యుద్దేశములు', 'ఇంగ్లీషు ప్రభుత్వము వలన లాభములు' 'రాజ్యాంగ సంస్కరణము-కులాచార సంస్కరణము' ననునవి పంతులుగారు వ్రాసిన రాజకీయ సంబంధములైన వ్యాసములు. 'హిందూదేశాభివృద్ధి మార్గము', 'కృష్యాదివ్యాపారము' 'స్వయంకృషి' యను వ్యాసములు హిందూదేశము యొక్క నాటి ఆర్థికస్థితిని గూర్చి పంతులుగారి యభిప్రాయములను తెలియచేయునట్టి వ్యాసములు. విద్య, విద్యాభ్యాసోద్దేశము, సంఘ విద్యాభ్యాసము, రాజకీయపాఠశాలలు, అనునవి పంతులుగారు విద్యావిషయకములుగా వ్రాసిన వ్యాసములు. 'కాలమును సద్వినియోగమునకు దెచ్చుట, అసద్గ్రంథములు, కాలము యొక్క విలువ, దేశభాషలు, ఆంధ్రభాషాభివృద్ధి, దేశభాష, మొదలగు వ్యాసములు, ప్రత్యేకమొక శాఖక్రిందికి చేర్చతగినవికావు. కనక ఇతరములను విషయ విభాగమునందు చేర్చబడినవి. అనిబిసెంట్ దొరసానినిగూర్చి రెండు వ్యాసములు, విక్టోరియా మహారాజ్ఞినిగూర్చి యొక వ్యాసము, భండారు అచ్చమాంబగారినిగూర్చిన వ్యాసము, దేశిరాజు పెదబాపయ్యగారినిగూర్చి వ్రాసిన వ్యాసము, పండిత ఈశ్వర చంద్ర విద్యాసాగరులు, పండిత రామాబాయి సరస్వతి, అహల్యాబాయి, బమ్మెర పోతరాజులను గూర్చి పంతులుగారు వ్రాసిన వ్యాసములు జీవిత చరిత్రములకు సంబంధించిన వ్యాసములు. బసవరాజు గవర్రాజుగారు, మాకర్ల సుబ్బారావునాయుడుగార్లను గురించి పుర మందిరమున పంతులుగారు చెప్పిన రెండు ఉపన్యాసములు, శంకరాచార్యులవారిని గూర్చి ప్రార్థనామందిరమున నొసగిన ఉపన్యాసము, మహాపురుషుల జీవిత చారిత్ర

ములకు సంబంధించిన ఉపన్యాసములు. మహాపురుషుల జీవితములకు సంబంధించిన యుపన్యాసములు, వ్యాసములు మొత్తము పంద్రెండింటిని పంతులుగారు వివిధ పత్రికలలో వెలయించినారు

నీతి, సుజ్ఞానము, విద్యకంటె నీతిముఖ్యము, ఇతరులను సత్కార్యములకు త్రిప్పువారి క్రమము, మన బాలుర నీతివర్తనము, నీతివిద్య, మానుషధర్మము, జీవితముయొక్క పరమార్థము, దానిని పొందు మార్గము, అనునవి పంతులుగారు నైతిక విషయములపై వ్రాసిన వ్యాసములు, వర్ణము, ఈశ్వరదత్త పుస్తకములు, ఈశ్వరోపాసనము, అద్వైత సంగ్రహము, ప్రార్థన, వైరాగ్యము, హిందూమతములు మొదలైన వ్యాసములు మత సంబంధములైన వ్యాసములు ఈ విధముగా పంతులు గారు ఆర్థిక, సాంఘిక, మత రాజకీయ, నైతిక విషయములపై ననేకవ్యాసములను వ్రాసిరి స్త్రీ జనోద్ధరణమునకై పంతులుగారు తమ సర్వశక్తులను ధారపోసిరి స్త్రీలను విద్యాసంస్కారములు కలవారినిగా నొనర్చినగాని దేశమునకు సాంఘికోన్నతి కలుగదని పంతులుగారి గాఢ విశ్వాసము. స్త్రీలు విద్యావంతురాండ్రు కావలెనని వారెంతయో ప్రబోధించిరి స్త్రీలకొరకై ప్రత్యేకముగ పత్రికలు నడిపిరి స్త్రీల కొరకై ప్రత్యేకముగ గ్రంధములు రచించిరి వారికి విద్యయందాసక్తి కలుగునట్లు కధలు రచించిరి వచన ప్రబంధములు చేసిరి. దేహారోగ్య ధర్మబోధిని, పత్నీహిత సూచని వంటి గ్రంధములను వెలయించిరి. పందొమ్మిదవ శతాబ్ది పూర్వార్థమునందే ఆంగ్లేయుల ప్రభావమువలన, మన సాంఘికాచారములు, విశ్వాసములు, వేషభాషలు, మారిపోజొచ్చినవి ఆంగ్ల విద్యాధికులైన మహనీయులు స్త్రీ విద్యా ప్రోత్సాహకము లగు ప్రయత్నములు గావించిరి ముఖ్యపట్టణములందు బాలికాపాఠశాలలు స్థాపింప బడెను. పందొమ్మిదవ శతాబ్ది యుత్తరార్థపు ప్రథమ పాదమునందీ ప్రయత్నము ముదింబదిగ జరిగినది విజయనగరము మహారాజావారి యౌదార్యమువలన నాంధ్ర దేశమున పెక్కూళ్ళ బాలికాపాఠశాలలు వెలసినవి. వీరికి పూర్వమే చెన్నపట్టణము నందు స్త్రీ విద్యావ్యాప్తికై యచంచలమగు కృషిజరిగినది. కోమలేశ్వరపురం శ్రీని వాసపిళ్ళ, గాజుల లక్ష్మీనరసుచెట్టి మొదలగు మహనీయులు స్త్రీ విద్యావ్యాప్తికై నవిరళమగు కృషి గావించియున్నారు. ఈ ప్రయత్నములవలన పండితులలోను, పామరులలోను, ఆవరకున్న యభిప్రాయములుపోయి, స్త్రీ విద్యను ప్రోత్సహించు టకు వారి మానసము లున్ముఖములైనవి. ఈ సంధికాలమునందు కొక్కొండ వేంకట

రత్నము పంతులుగారివంటి పూర్వాచారపరాయణులు, స్త్రీ విద్యాఖండన వాదులు కొందరు లేకపోలేదుకాని, వీరి సంఖ్య యల్పమని చెప్పవలెను నాటి మేధావులను, పండితులను, సాహితీపరులను, స్త్రీవిద్యా ప్రోత్సాహక వాదము లాకర్షించెననియే చెప్పవచ్చును.

కావుననే శిష్టు కృష్ణమూర్తి శాస్త్రిగారి వంటి పండితులు 'స్త్రీ నీతిశాస్త్రము' వంటి గ్రంథములు రచించుట. శిష్టు కృష్ణమూర్తికవి 1800 సంవత్సరమున జనన మొందినట్లు గురుజాడ శ్రీరామమూర్తిగారు తమ కవిజీవితములందు వ్రాసియున్నారు. 1870 వ సంవత్సర ప్రాంతమున మరణించినట్లు వీరేశలింగపంతులుగారు తమ కవుల చరిత్రమునందు వ్రాసియున్నారు. కృష్ణమూర్తి కవిగారీ గ్రంథమును గోదావరీ మండల కరగ్రాహివద్ద సిరస్తాదారుగా నుండిన తుళంగసెట్టిగారి ప్రోత్సాహమువలన రచించినట్లీ గ్రంధమున చెప్పబడియున్నది. ఈ గ్రంధము 1834 ప్రాంతములనే రచింపబడి యుండవచ్చునేమోయని వీరేశలింగం పంతులుగారి కవుల చరిత్రమువలన తెలియనగును స్త్రీనీతిశాస్త్రములోని పద్యములను వీరేశలింగం పంతులుగారు తమ కవుల చరిత్రమునందుదాహరించి యున్నారు ఈ గ్రంథ మేకాశ్వాస ప్రబంధము. ఈ గ్రంధమునందు స్త్రీల కుపయుక్తములగు నీతులు మనోహరముగా కూర్పబడినవి 1874 వ సంవత్సరమున గజ్జెల రామానుజులు నాయుడను వారు 'సతీహిత సంగ్రహమను' గ్రంధమును బ్రకటించి యున్నారు. 'ఇది బాలికలకు నుపయుక్తంబుగ రచియింపబడినదని, నీ గ్రంధము ముఖపత్రమునందు గలదు. ఈ గ్రంధమునకు గల పీఠికయందు, తాము శిష్టు కృష్ణమూర్తి శాస్త్రులవారి స్త్రీనీతిశాస్త్రమునుండి కొన్నినీతులు సంగ్రహించితిమని గ్రంధకర్త చెప్పియున్నారు.[24] ఈ సతీహిత సంగ్రహమునందు సావిత్ర్యుపాఖ్యానము. పుణ్యసతీప్రభావము. సత్యా ద్రౌపదీ సంవాదము కూర్పబడినవి ఈ గజ్జెలరామానుజులునాయనివారే బాలురకొరకు 1872 వ సంవత్సరమున వివేక సంగ్రహమను గ్రంథమును కూర్చియున్నారు. బాలురకత్యంతోపయుక్తములగు నీతులీగ్రంధమునందు కూర్పబడినవి. ఈ పొత్తము నాకాలమున పురుషార్థ ప్రదాయిని, ఆంధ్రభాషా సంజీవని, వివేకవర్ధని పత్రికలు ప్రశంసించినవి రామానుజులునాయని వారికి పూర్వమే 1871వ సంవత్సరమునందు స్త్రీ నీతి సంగ్రహమను గ్రంథము కొమ్మి రంగయ్య గారను వారలు కూర్చియున్నారు.

ఒనర స్త్రీ నీతి సంగ్రహమనెడు కృతి నా
నర్తు దీని బరించిన నయవివేక
నీతి చాతుర్యయుతలయి నెలతులాత్మ
పతుల బుఱ్ఱ్యల గావించు పనికిగాక-[25]

అని యీ స్త్రీనీతి సంగ్రహమునందు కొమ్మి రంగయ్యగారు విశదపరచిరి. 1882 వ సంవత్సరమునందు శ్రీమాన్ ఒహుజనపల్లి సీతారామాచార్యులవారు 'సతీ ధర్మ సంగ్రహమ'ను గ్రంథమును స్త్రీల విద్యాభ్యాసము నిమిత్తమై కూర్చియున్నారు. "ఇది విద్యాభ్యాసముచేయు బాలికలకొఱకు భారతాది గ్రంథములందుండి ఏర్చి కూర్చ బడిన"దని యీ గ్రంథమ ముఖపత్రమునందు గలదు ఈ గ్రంథమునందు నలుబది ఎనిమిది పద్యములున్నవి 1884 వ సంవత్సరమునందు వీరేశలింగపంతులు గారు 'బాలికా పాఠశాలలయందలి బాలికలకై కూర్చబడిన నూరుపద్యములని' స్త్రీనీతి దీపికను ప్రకటించిరి. పంతులుగారు 1883 వ సంవత్సరముననే 'సతీహిత బోధిని' యను మాసపత్రికను స్త్రీలకొరకు ప్రారంభించిరి. ఈ పత్రికయందు పంతులుగారు వివిధ విషయములపై వ్యాసములు విరచించియున్నారు.

కనుక పంతులుగారు స్త్రీవిద్యా ప్రోత్సాహకరములగు సిద్ధాంతములు చేయు నాటికే యారంగమున తగినంత కృషి జరిగియున్నదని గమనింపదగియున్నది. గజ్జెల రామానుజుల నాయనివారి సతీహితసంగ్రహమున గల పీఠికయందీ విషయ మిట్లు ప్రస్తావింప బడినది

"విద్య యావశ్యకమను 'టెల్లరకును దెల్లంబుఁగావునఁ బురుషులకువలె స్త్రీలకు నదియుచితంబు

గృహకృత్యములెల్ల నిల్లాండ్రవియవుటంజేసి, వారు నీతి, సదాచారము మొదలగు సద్గుణములు గలిగియుండుటకై గ్రంథములు రచియింపబడి యుండ వచ్చును. అయిన, గేహినులకు విద్యవలనిఫలము పాతివ్రత్యమే యనియు, దత్సదా చార పరిజ్ఞానమునకుఁ జదువు సముచిత సాధనమనియు నిరూపించు సమంచిత గ్రంథము లరుదుగనున్నవి. ఉండెడునొకటి రెండాధునిక కృతులును, ప్రాచీన గ్రంథ భాగములును, నానావిషయ బోధకములుగఁ బరమ సంక్షేపముగ, విశేష విద్యాబలము గలవారికిఁదప్ప, నిస్సంశయముగ నెఱుఁగ దుర్లభమైనవిగ నున్నవి."[26]

వీరేశలింగం పంతులుగారును పై యభిప్రాయముతోనే 'సతీహిత బోధిని' ని ప్రారంభించి, యందు "చదువెఱుగని స్త్రీలు తమ బిడ్డలకు శత్రువులు" "పతివ్రతా ధర్మము" "అత్తగారి కోడంట్రికము", 'బాలశిక్షణము', మొదలగు వ్యాసములను, ప్రథమ సంచికలయందు కూర్చియున్నారు, స్త్రీలకు సుబోధకములైన శైలియందు, లోకజ్ఞానమును కూర్చునట్టి చిన్న చిన్న కథలతో, మనోహరముగా నీ వ్యాసములను పంతులుగారు తీర్చిదిద్దిరి. పంతులుగారికి పూర్వము స్త్రీవిద్యను ప్రోత్సహించు నిమిత్తము కొన్ని గ్రంధములు వెలువడినను, సులభసుందరమైన వచనరూపమున, గృహిణుల మనముల నాకర్షించి హత్తుకొని పోవునట్లు, చిన్నచిన్న వ్యాసములుగా వివిధ విషయములతో వెలువడిన గ్రంధములులేవు.

"పరులమీది దోషములు చెప్పుకొనుట", "సుగుణ దుర్గుణములు", పరివర్తనము (వస్తువు లొండొరులు మార్చుకొనుట), "భార్యాభర్తల ఐకమత్యము" "ఆభరణములు" "బిడ్డల నాజ్ఞలో నుంచుట", దేహమనసౌందర్యములు, గృహిణీ ధర్మము, మొదలగు వ్యాసములను పంతులుగారు స్త్రీలకొరకై రచించిరి. 1888 వ సంవత్సరము తరువాత సతీహితబోధిని వెలువడలేదు. మొత్తము పంతులుగారు సతీహితబోధిని యందు ముప్పదియైదు వ్యాసములు, గృహిణీ ధర్మమును గూర్చియు, గృహ నిర్వాహకత్వమును గూర్చియు, గృహవిజ్ఞానమును గూర్చియు రచించి యున్నారు 1889 వ సంవత్సరమునందు 'సతీహిత బోధిని'లో తాము ప్రకటించిన వ్యాసముల నన్నిటి నొకసంపుటముగ నదేపేరుతో ప్రకటించియున్నారు. పంతులుగారు స్త్రీ విద్యయందును, స్త్రీల యభివృద్ధి యందును, విశేష శ్రద్ధనువహించి, వారి యున్నతికై యెట్టి కృషి గావించినదియు తమ స్వీయచరిత్రమునందు వివరించి యున్నారు. సంఘమునందు స్త్రీల స్థితి బాగుపడిననేగాని, నిజమైన సంఘ సంస్కారము జరుగదని పంతులుగారు తమ సమస్త సత్కార్య ప్రయత్నముల యందును, హెచ్చరించి యున్నారు.

పంతులుగారు సతీహిత బోధినియందు ప్రచురించిన వ్యాసములలో పునరుక్తులనేకములున్నవి. 'బిడ్డల నాజ్ఞలో నుంచుట', 'బాలశిక్షణము' అను వ్యాసములందు పంతులుగారొకేవిషయమును వ్రాసిరి 'స్త్రీలు చదువవలసిన విషయములు' 'సుగుణ దుర్గుణములు' 'హిందూసుందరుల ప్రస్తుతస్థితి' యను వ్యాసములందు పంతులుగారు చెప్పిన విషయములనే చెప్పిరి. కోమలమైన వారిమనస్సులకు హత్తుకొనునట్లు పంతులు

గారీ విషయములను పదేపదిగ బోధించిరని యనుకొనవలయును. హిందూసుందరుల ప్రస్తుత స్థితియను వ్యాసము నందు పంతులుగారిట్లు వ్రాసిరి.

"స్త్రీల యభివృద్ధి నిమిత్తమయి యక్కడక్కడ నుత్తమపురుషులుచేయు ప్రయత్నములకు మూఢతాపిశాచావేశముచేత స్త్రీలే ప్రతిబంధకారిణు లగుచున్నారు. ఇంటి వద్ద స్త్రీల సాహాయమున్నంగాని కులాచార మతాచార విషయములయందు పూర్వాచారములకు విరుద్ధములయిన నూతనసదాచారములను నెలకొలుపుట పురుషులకు సాధ్యముకాదు. కాబట్టి పురుషులు తమ స్త్రీలను మూఢదశయందుంచియే దేశమునకు మహోపకారమును" జేయ జాలుదురన్నది దుర్భ్రమయని పంతులుగారు హెచ్చరించి యున్నారు.[27]

పంతులుగారు 'స్త్రీలు చదువవలసిన విషయముల'ను వ్యాసమునందు, "వారు భగవద్భక్తి, సత్ప్రవర్తనమును, జ్ఞానవినోదమును గలిగించు మంచి గీతములను నేర్చుకొనవలయును... మూఢత్వమును పోగొట్టి యధార్థ జ్ఞానమును కలుగజేసెడు ప్రకృతి శాస్త్రవిషయములను, ప్రవర్తనమును తిన్నపఱిచెడి నీతి పుస్తకములను భగవన్మహిమను బోధించు గ్రంథములను పురుషులవలెనే యవశ్యముగా చదువవలయును".[28] అని వ్రాసియున్నారు. స్త్రీల కుపయుక్తములుగా నుద్దేశించిన నీ వ్యాసములందట్టి విషయములనే వ్రాసియున్నారు స్త్రీలకు వినోదమును, విజ్ఞానమును కలుగునట్లుగా ప్రకృతి శాస్త్రవిషయములగు 'సూక్ష్మ వస్తుదర్శక యంత్రము, మంచుగడ్డ, అగ్నిపర్వతములు, జ్యోతిశ్శాస్త్రము,' మొదలగు వానినిగూర్చికూడ సతీహిత బోధినియందు వ్యాసములు వ్రాసియున్నారు ఉత్తమ స్త్రీచరిత్రములను వారి కాదర్శకములుగా వెలయించినారు, అనీబిసెంటును గూర్చియు, అహల్యాబాయిని గూర్చియు, పండిత రామాబాయి సరస్వతినిగూర్చియు, భండారు అచ్చమాంబగారిని గూర్చియు వివిధపత్రికలందు పంతులుగారు వ్యాసములు రచించిరి. పంతులుగారు అనీబిసెంటు చరిత్రమునందు బిసెంటు దొరసానిని విమర్శించిరి. మత విషయకముగా దివ్యజ్ఞానసమాజమువారి సిద్ధాంతములు పంతులుగారికి సమ్మతములు కాకపోవుటయే దానికికారణమై యుండవచ్చును. 'దివ్య జ్ఞాన సమాజ చరిత్రము' నందువారు వెలువరించిన యభిప్రాయము లీవిషయమును చాటుచున్నవి.

పంతులుగారు బ్రహ్మసమాజ మతావలంబకులు. ఉపనిషన్మత సారమును రాజారామమోహరాయలవారు, బ్రహ్మసమాజ మతమను పేరున ప్రచారముచేసిరి.

పంతులుగారును రామమోహనరాయలవారి సిద్ధాంతములయందు బద్ధానురాగులు. వారు విగ్రహారాధనమును, తమ మత విషయకములగు వ్యాసములందును, నుపన్యాసము లందు తీవ్రముగా నిరసించిరి. 1906 వ సంవత్సరమున వీరేశలింగపంతులు గారు అనుష్ఠానిక బ్రాహ్మమతమును స్వీకరించి జందెమునుకూడ విసర్జించిరి. వారి మతము, వర్ణ, వర్గ, కుల, మత, వివక్షతలు లేని విశ్వమానవ సౌభ్రాతృత్వమును, జగదేక కుటుంబ వ్యవస్థను, ప్రచారముచేయునట్టిది. పరిశుద్ధాస్తిక మత స్వరూపము, విగ్రహారాధనము, ఈశ్వరదత్త పుస్తకములు, ఈశ్వరోపాసనము, ప్రార్థన, బ్రాహ్మ సమాజ సంగ్రహచరిత్ర, ప్రార్థనాసమాజ చరిత్ర మొదలగు వ్యాసములందు, ఉప న్యాసములందు, పంతులుగారి మతసంబంధములైన విశ్వాసములు తెలియగలవు. హిందూమతములు, వర్ణము, ఆత్మ, మత ధర్మములు, సన్మతము, పాపము-ఈశ్వర కారుణ్యము, అద్వైత మత సంగ్రహము, ద్వైతమత సంగ్రహము, విశిష్టాద్వైత మత సంగ్రహము ఈశ్వరుని పితృభావము, జన్మాంతరము మొదలగు వ్యాసము లందు పంతులుగారు బ్రాహ్మసమాజ మత విశ్వాసములను ప్రచారముచేసియున్నారు. మత సంబంధములైన విషయములపై వ్రాసిన వ్యాసములందు వారి బ్రాహ్మ మతాభి మానము స్పష్టము కాగలదు పంతులుగారు బ్రాహ్మసమాజ ప్రభావమునకు లోబడి వీనిని రచించిరనుట నిశ్చయము వారిపై బాల్యమునుండియే బ్రాహ్మమతము తన ప్రభావముచూపినది. తమ బాల్యమున, తాము పాఠశాలయందు విద్యాభ్యాసము చేయుచుండిన కాలమున, ఆత్మూరి లక్ష్మీనరసింహముగారు తమ పాఠశాలకు ద్వితీయోపాధ్యాయులుగా వచ్చిరనియు, వారప్పుడు బ్రాహ్మసమాజ మతమునం దభినివేశము కలిగియుండిరనియు, వారా మత సిద్ధాంతములను విద్యార్థుల కప్పు డప్పుడు బోధించుచుండెవారనియు, ఆయన ప్రోత్సాహమువలన, విద్యార్థులలో కొందరు కూడి, యొక సమాజము నేర్పరచుకొని, యుపయుక్తములగు విషయములను వారమునకొకసారి యొకచోచేరి చర్చించుచుండెడివారమనియు పంతులుగారు తమ స్వీయచరిత్రమునందు వ్రాసియున్నారు. ఆ కాలముననే పంతులుగారు, తమ మిత్రు లగు చల్లపల్లి రంగయ్య పంతులువారి వద్దనుండియో, మరి యెవ్వరివద్ద నుండియో, కేశవ చంద్రసేనుల వారి యుపన్యాసములు గ్రహించి చదివితిమనియు, ఆ యుపన్యా సములు చదువుటవలన తామావఱకు సత్యములని నమ్ముచుండిన కొన్ని విషయము లనుగూర్చి తమకు సందేహములు కలిగెననియు వ్రాసియున్నారు. ఈ విధముగా

పంతులుగారిపై బ్రాహ్మసమాజ మతప్రభావము వారిచిన్ననాటి నుండియే ప్రసరించెను. తత్ఫలితముగా పంతులుగారు బ్రాహ్మమతమునం దధికాదరమును, నమిత విశ్వాసమును కలిగినవారైరి. పంతులుగారు మతవిషయకములుగను, సంఘసంస్కరణ విషయకములుగను వ్రాసిన వ్యాసములందు వారిపై కేశవ చంద్రసేన్ వ్రాసిన వ్యాసముల ప్రభావమున్నది. పంతులుగారు వ్రాసిన యనేక వ్యాసములు కేశవ చంద్రసేన్‌వారి వ్యాసములకు యనువాదములని చెప్పలేము కాని Social Reformation, Great Men వంటి కేశవ చంద్రసేనులవారి వ్యాసముల యందలి భావములను పంతులుగారు తమ వ్యాసములందు గ్రహించిరి[29].

పంతులుగారు మత విషయకములుగ వ్రాసిన వ్యాసములందు సైతము పునరుక్తులు గలవు. అనేక వ్యాసములందు, యనేక యుపన్యాసములందు, ధర్మము, నీతి, సత్యము, అహింస, ఆత్మ, మొదలగు విషయములు ప్రసంగింపబడుటవలన నిట్టిది పంతులుగారి రచనలలో సంభవించి యుండవచ్చునని యూహింపదగియున్నది.

పంతులుగారు వివిధ సందర్భములందు వివిధ పత్రికలయందు, ఒకే విషయమునుగూర్చి వ్యాసములు వ్రాసిరి ఒకే వేదికపైగాక వివిధ సందర్భములందు, వివిధ ప్రదేశములలో నొకే విషయముపై నుపన్యాసముల నిచ్చిరి. కనుక నిట్టి పునరుక్తి తప్పనిసరియగును పంతులుగారు వివిధ పత్రికలయందు ప్రచురించిన మత సంబంధములైన వ్యాసములు, ఉపన్యాసములు, బ్రహ్మశ్రీ కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారిచే తీవ్రముగా విమర్శింపబడినవి. శ్రీ బ్రహ్మయ్యశాస్త్రిగారు తమ 'యార్యమత బోధిని' ద్వారా సనాతన మతమును, దాని వైశిష్ట్యమునుగూర్చి ప్రచారము చేయుచుండెడివారు.

బ్రహ్మయ్యశాస్త్రిగారు పూర్వాచార పరాయణులు. వీరేశలింగంపంతులుగారు సంఘసంస్కర్తలలో ప్రధానులు. కనుక పంతులుగారి వ్రాతలను విమర్శించుట బ్రహ్మయ్యశాస్త్రిగారికి యనివార్యమయ్యెను.

"ఆంధ్రదేశమున హిందూ మత సంఘములను హెచ్చుగ నిరసించి సంస్కరింప గోరినవారు శ్రీ కందుకూరి వీరేశలింగంపంతులు గారగుటచే సహజముగ వారే శాస్త్రిగారి ప్రతిపక్షులలో ప్రధానులైరి" యని బ్రహ్మయ్యశాస్త్రిగారి జీవిత చారిత్రమును రచించినవారు వ్రాసియున్నారు[30]. పంతులుగారు ప్రకటించిన 'యుపన్యాసమంజరి' యను గ్రంథమును విమర్శించుచు, బ్రహ్మయ్యశాస్త్రిగారు 'ఉపన్యాసమంజరీ విమర్శన

మనుపేరున' నొక గ్రంథమును ప్రకటించియున్నారు. పంతులుగారు రచించిన హిందూ మతముల'న్న వ్యాసమును బ్రహ్మయ్యశాస్త్రిగారు తమ 'యుపన్యాసమంజరీ విమర్శనము'నందు తీవ్రముగా విమర్శించి యున్నారు[31]. బ్రహ్మయ్య శాస్త్రిగారు తాము 'ఆర్యమత బోధిని'ని వెలువరింపక పూర్వము శ్రీ గురజాడ శ్రీరామమూర్తి పంతులుగారి సంపాదకత్వమున వెలువడుచుండిన 'రాజయోగి'యను పత్రికయందు తమ వ్యాసములను వెలయించుచుండెడివారు. తదుపరి అట్టి వ్యాసము లన్నియు 1911వ సంవత్సరమునం దుపన్యాసపయోనిధియను పేరున పుస్తకరూపమున ప్రటింపబడినవి. ఈ 'యుపన్యాసపయోనిధి'యను గ్రంథమునందు నలుబదిమూ డుపన్యాసములున్నవి. ఈ యుపన్యాసములలో ననేక సందర్భముల యందు వీరేశ లింగంపంతులుగారు మత విషయకములుగా వెలువరించిన యభిప్రాయము లనేక ములు తీవ్రమైన విమర్శకు గురియైనవి.

బ్రహ్మయ్యశాస్త్రులవారి వ్యాససంపుటియందు "రావుబహదర్ వీరేశలింగము పంతులుగారి యాత్మజ్ఞానమ"ను వ్యాసమునందు, పంతులుగారు రచించిన ఈశ్వర సద్భావము, వైరాగ్యము, స్వయంకృషి, విద్యాధికుల ధర్మములు, మానుషధర్మము, ప్రమాణవిచారము, భగవద్గుణములు, భగవద్విషయక ధర్మములు, భగవన్మహిమయు- కరుణాళుత్వమును, ఆత్మ, దయ్యములు, మొదలగు వ్యాసములందు వారు వెలువ రించిన యభిప్రాయములు తీవ్రముగా విమర్శింపబడినవి[32]. ఇంకను 'తత్త్వమసి' (132-137) 'శ్రీకృష్ణుడు జారుడా' (282-316), 'పాపశిక్షణమను నుపన్యాస విమర్శనము (317-331),'బ్రాహ్మసమాజికులు-విగ్రహారాధనము(395-406), బ్రహ్మజ్ఞానము (98-115), 'అద్వైతము-తద్విరోధులు' (87-97), 'హిందూ మతమును-దాని ధర్మములును (60-64), అను వ్యాసములందు శ్రీబ్రహ్మయ్య శాస్త్రులవారు, వీరేశలింగం పంతులుగారు తమ యుపన్యాసముల యందును, వ్యాస ముల యందును జూపుచు వచ్చిన యుక్తులను తీవ్రముగా నధిక్షేపించియున్నారు. వీరేశలింగం పంతులుగారు సాంఘిక విషయములపై వ్రాసిన వ్యాసములకన్న, మత విషయకములుగా వ్రాసిన వ్యాసములు బ్రహ్మయ్య శాస్త్రులవారి తీవ్రవిమర్శనము నకు గురియైనవని చెప్పవలెను బ్రహ్మయ్య శాస్త్రులవారు పంతులవారి రాజశేఖర చరిత్రమును విమర్శించుచు 'వివేక చంద్రికా విమర్శనము'ను పేర నొక గ్రంథమును వ్రాసియున్నారు. ఆ గ్రంథమునందు పంతులుగారి సంస్కరణ ప్రయత్నములు

విమర్శింపబడినవి ఇవి గాక పంతులుగారి స్వీయ చరిత్రమునుగూర్చియు, పంతులు గారు, తమ సత్యరాజా పూర్వదేశయాత్రల యందు వారు వెలువరించిన జ్యోతిశ్శాస్త్ర సంబంధములగు విమర్శనములను గూర్చియు, బ్రహ్మయ్య శాస్త్రులవారు తమ యార్యమత బోధినియందు ఖండన వ్యాసములను వ్రాసిరి.

పంతులుగారి వ్యాసములందు, సాంఘిక ప్రవృత్తిగలవానిని పరిశీలించినచో ప్రధానముగా, నాడు ప్రజలలో వ్యాపించియున్న దురాచారములను, అంధవిశ్వాసములను, వారు ఖండించిరని ద్యోతకమగును. వీనిలో కన్యాశుల్కము, అతిబాల్య వివాహములు, నిర్బంధవైధవ్యము, వృద్ధవివాహములు, పీఠాధిపతుల దౌర్జన్యములు, లంచగొండితనము, అధికారుల యక్రమ ప్రవర్తన, దయ్యముల యందలి నమ్మకము, ప్రధాన స్థానము వహించి యుండెను.

పంతులుగారికి పూర్వమే జనులలోని దురాచారములను, మూఢ విశ్వాసములను, సాంఘిక అసమానతలను, తమ 'హితసూచని'యందు సామినేని ముద్దు నరసింహనాయనివారు విమర్శించియున్నారు. వీరు ప్రమేయములని పేర్కొన్న నీ వ్యాసములందు, సువర్ణకరణమును గూర్చి నాడు ప్రజలలో వ్యాపించియున్న మూఢ విశ్వాసములను, దయ్యముల, భూతముల యందలి నమ్మికను, కన్యాశుల్కమును, నిర్బంధవైధవ్యమును, ఇంకను సంఘములో స్థిరపడిపోయిన యనేక దురాచారములను నిరసించియున్నారు. వివాహప్రమేయము (163-224) నందు స్త్రీ విద్య, స్త్రీ పునర్వివాహము, రజస్వలానంతర వివాహములు, ప్రేమించి పెండ్లి చేసికొనుట (వధూవరు లొండొరులను ముందుగా చూచి యిష్టపడి వివాహము చేసికొనవలయుననుట), అతిబాల్య వివాహము వలన కలుగు కష్టనష్టములు, పెద్దల విపరీతములగు వేడుకలు, వివాహ సంబంధములైన యమిత వ్యయములు, దాని వలన సంభవించెడి కుటుంబహాని, మొదలైన విషయములు ప్రస్తావింపబడి, లాభనష్టములు చర్చింపబడి, విమర్శింపబడినవి. 'మంత్రప్రమేయ'మను వ్యాసమునందు జ్యోతిశ్శాస్త్రము నందలి ముహూర్త, జాతక భాగములు తీవ్రముగా విమర్శింపబడినవి. ప్రశ్నలు చెప్పువారి వర్తనము, సాముద్రిక శాస్త్ర విషయములు తీవ్రముగా నిరసింపబడినవి[38].

నిర్బంధ వైధవ్యమును గూర్చి నరసింహనాయని వారి యభిప్రాయములు పంతులుగారిపై తమ ప్రభావమును బరపినవనుట సత్యదూరముకాజాలదు.

"బాలికకు అక్కరబట్టని పెండ్లి యనగా చిన్నతనములోనె పెండ్లిజేసి గర్భాధానము కాకమునుపే ఆ పెండ్లి కుమారుడు చనిపోతే ఆ పిల్లకు తిరిగీ పెండ్లి చెయ్యక ఆ చిన్నది ఆవిడయొక్క యౌవనము దుఃఖముతోనే వెళ్ళబుచ్చుకునేలాగు కనిపెట్టడమునకు బాధ్యతగల వాడయ్యే తండ్రి ఎంత పాపమును ఎంత దుఃఖమును పొందవలసియున్నదో వివేకశాల లయినవారు యోచింపవలసినది......."[84].

"పునర్వివాహములు రద్దు పరచినందుచేత నిర్బంధమును పొందిన స్త్రీలలో చాలమందిచేత అనేకములైన అకృత్యములు జరిగించబడి వాటినిబట్టి వచ్చే దురాచార సంబంధములను, దుర్దోషములను ఉపద్రవములను ఆయా కుటుంబములవారు పొందడమునకు హేతువులు కలుగుతున్నవి......"[85].

"సుఖమున్ను సంతోషమున్ను వివాహ స్థితినిన్ని పొందేహక్కు భగవంతుడు స్త్రీ పురుష జాతులకు సమానముగానే కలుగచేసి యున్నాడు గనుక తప్పితమేమీ లేనిది అటువంటి హక్కువల్లనుంచి స్త్రీ జాతిలో కొందరిని తప్పించడమునకు ఎవరికిన్ని న్యాయము ఉన్నట్లు ఎంచేవల్ల లేదు......"[86].

ఏకారణము వలననైనను అయుక్తములైన,సంఘజీవనమున కసౌఖ్యకరములైన ఆచారములు లోకమందు వ్యాపించి యున్నచో, బుద్ధిమంతులైనవారు ఆయా యాచారములు దిద్దుబాటు చేయుట కర్తవ్యమని ముద్దు నరసింహ నాయనివారి యభిప్రాయము[87] వీరేశలింగం పంతులుగారున్ను నిట్టి యభిప్రాయములతోనే సంఘ సంస్కరణమునకు పూనిరి.

ముద్దు నరసింహ నాయని వారి తరువాత వ్యాసములను విరివిగా వెలయించిన వారు పండిత మండలాగ్రగణ్యులైన పరవస్తు వేంకట రంగాచార్యుల్యవారలుగారు. వీరు సంగ్రహములనుపేరిట వ్యాసములను వెలయించియుండిరి. వీరి శైలి సులభ సుందరము వీరు రచించిన సంగ్రహము లన్నియు విపులమగు విషయ వివరణతో గూడుకొనియుండక సంగ్రహముగా నుండును. వీనిని చిన్న చిన్న వ్యాసములనుగా పేర్కొన వచ్చును. ఇట్టి వ్యాసములను ఆచార్యులవారు ఇరువది నాలుగింటిని వెలువరించినట్లు శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు వ్రాయుచున్నారు[88]

'ఆర్షమత సభ' యను సభను స్థాపించి, దాని కుపాంగముగా నార్షముద్రాక్షర శాలను నెలకొల్పి, యా మత సభ పక్షమున ఆచార్యులవారు ఉపన్యాసము లిచ్చుచు

వాని నచ్చోత్తించి పంచిపెట్టుచుండిరి. వీరి ధోరణి గంభీరమైనది వీరి ప్రసంగ కౌశలము నాడు పండితులచే మెప్పువడసినది. వీరేవిషయమునైనను అనర్గళముగా నుపన్యసించెడివారలు వీరేశలింగంపంతులుగారు వీరి సంగ్రహములను చూచిరి. వీరి యుపన్యాసములనువినిరి. వీరిని తమ వివేకవర్ధనియందు మిక్కిలి కొనియాడిరి[39].

"వీరేశలింగంగారి సులభశైలికి వీరిశైలి మాతృక"యని శ్రీకాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు తమ పెద్దాపురం సంస్థాన చరిత్ర విమర్శనమునందు వ్రాసి యున్నారు[40]

పునర్వివాహ సంగ్రహమను పేరుతో స్త్రీ పునర్వివాహము శాస్త్రసమ్మతమని రంగాచార్యులవారు 1875 వ సంవత్సరమున నొక కరపత్రమువంటి గ్రంథమును ప్రకటించిరి. పంతులుగారు దీనిని చూచి యుండిరి ఈ పునర్వివాహ సంగ్రహము తదుపరి హిందూ జనసంస్కారిణియను పత్రికలో ప్రకటింపబడినది. ముద్దు నరసింహ నాయనివారు 'ప్రమేయము'నిన ప్రక్రియనే. రంగాచార్యులవారు 'సంగ్రహము'నిరి. అదియే పంతులుగారి కాలమున నుపన్యాసమైనది. రంగాచార్యులవారి సంగ్రహముల వలెగాక వీరేశలింగం పంతులువారి యుపన్యాసములు మిక్కిలి దీర్ఘములు పంతులు గారు స్త్రీ పునర్వివాహ సంబంధములుగా వెలయించిన యుపన్యాసము లొక్కొకటి యొక్కొక ప్రత్యేక గ్రంథమగును. పంతులుగారు స్త్రీ పునర్వివాహ సంబంధములుగా వివిధ ప్రదేశములందు ఏడుపన్యాసములు గావించియున్నారు. అవి 'స్త్రీ పునర్వివాహ ప్రవర్తక సమాజమువారి విజ్ఞాపనము, స్త్రీ పునర్వివాహ శాస్త్రసంగ్రహము, స్త్రీ పునర్వి వాహ విషయక ప్రథమ విజ్ఞాపనము, స్త్రీ పునర్వివాహ విషయక ద్వితీయ విజ్ఞాపనము, స్త్రీ పునర్వివాహ విషయకోపన్యాసము, స్త్రీ పునర్వివాహ వ్యాపారముయొక్క భూత వర్తమానస్థితులు, రాజమహేంద్రవర స్త్రీ పునర్వివాహ చరిత్రము, అనునవై యున్నవి. పంతులుగారు స్త్రీ పునర్వివాహము శాస్త్ర సమ్మతమని సాధించుటకు, వేద వేదాంగములు, పురాణములు, ఇతిహాసములు, ఉపనిషత్తులు, అవలోడనము చేసిరి అనేక ధర్మశాస్త్ర గ్రంథములను పుక్కిటబట్టిరి. అవిరామముగ శ్రమించిరి. స్త్రీ పునర్వివాహ విషయమయి తాము శ్రమించిన విధము పంతులుగారు తమ స్వీయ చరిత్రమునందు 'స్త్రీ పునర్వివాహ సంస్కార ప్రయాసదశ" యను ప్రకరణమునందు సంపూర్ణముగా వర్ణించియున్నారు. ...... "కాశీఘట్టము నుండియు, కాశీపట్టణము నుండియు, బొంబాయి నుండియు కావలసిన పుస్తకము లన్నియు వచ్చినవి. నే

నప్పుడు ముప్పది స్మృతులకంటె నెక్కువగాగొని తెప్పించినాడను......" అని పంతులుగారు, పండితులైనవారు తమకు గ్రంథములను సహితము చూచుట కిచ్చిన వారుకారని, స్వీయ చరిత్రమునందు వ్రాసియున్నారు. పంతులుగారి స్త్రీ పునర్వివాహ శాస్త్రముపై ననేక ఖండన గ్రంథములు వెలసినవి. శ్రీ వేదం వేంకటరాయశాస్త్రిగారి 'స్త్రీ పునర్వివాహ దుర్వాదనిర్వాపణ' మీ ఖండన గ్రంధములందు పేర్కొనదగినది[41] వీరేశలింగం పంతులుగారు స్త్రీ పునర్వివాహ విషయమై వెలువరించిన యుపన్యాసములు ప్రత్యేక గ్రంథములేయైనను, అవి ప్రత్యేక సమావేశములందు శ్రోతృజనాకర్షకముగా వినిపింపబడినవి గాన నీ ప్రకణమునందే వాని విషయమై ప్రస్తావించుట జరిగినది

సామినేని ముద్దు నరసింహనాయనివారు, పరవస్తు వేంకట రంగాచార్యుల్య వారేకాక పంతులుగారికి పూర్వమే వారికి వ్యాసరచనయందు మార్గదర్శకత్వమును వహించినవారు శ్రీ జియ్యరు సూరిగారు. వీరు బెంగుళూరు నందాంధ్రోపాధ్యాయులుగా నుండిరి. వీరు 1876 వ సం॥న స్త్రీ కళాకల్లోలిని యను గ్రంధమును ప్రకటించిరి. దీని యందలి రెండవ భాగమైన 'స్త్రీ విద్యామణి' యను భాగము నందు 69 వ్యాసములున్నవి. ఈ వ్యాసము లన్నియు స్త్రీల విద్యాభివృద్ధికిని, విజ్ఞానమునకును, సహకరించునట్టివే. ప్రతి వ్యాసమును రెండు మూడు పుటల పరిమితిలో నిమిడి, సులభమై, సుందరమై, సుగ్రాహ్యమై యలరారుచున్నది పంతులుగారిపై నీ వ్యాసముల ప్రభావము కలదనుట పంతులుగారి ప్రజ్ఞావిశేషముల కొక లోపముకాదు. ఈ గ్రంధము నందలి వ్యాసములలో 'స్త్రీలకు విద్యయావశ్యకము' 'చదివిన వారికిని జదువని వారికినిగల భేదము' 'విద్య స్త్రీలను జెఱుపదు' 'భగవంతుని నరయు విద్యవలయు' 'చదువని స్త్రీలు ప్రసంగము విను విధము' మొదలగునవి స్త్రీ విద్యా ప్రోత్సాకము లైనవి.

స్త్రీలు చదివిరేని పురుషులకు సహాయము (63-64).
స్త్రీలు చదివిరేని బిడ్డలకు సహాయము (65-67).
పాతివ్రత్యమునకు విద్యయే రక్షకము (పుటలు 103, 104, 106).
భగవన్మహిమము, జనులందరు సమానులు (147, 149).

మొదలైన వ్యాసములలోని భాగములను పంతులుగారు తమ 'సతీహిత బోధిని'లో స్త్రీ విద్యా ప్రోత్సాహకరములైన వ్యాసములందును, స్త్రీలు చదువవలసిన విషయములనుగూర్చి వ్రాయునప్పుడును, అనుసరించిరి ఈ వ్యాసము

లన్నియు చిన్న చిన్న సామెతలతో స్త్రీలు చదివి యానందించుటకు మనోహర ములుగా నున్నవి[42].

ఈ గ్రంథములో వివిధ విషయములనుగూర్చిన వ్యాసము లున్నవి.

జీవజంతువుల యభిమానము, ప్రాతివ్రత్య భంగము, జీవకారుణ్యము, మొదలగు వ్యాసములు పంతులుగారి పాతివ్రత్యము, జీవకారుణ్యము, మొదలగు వ్యాసములతో పోల్చిచూచిన 'స్త్రీ కళాకల్లోని' యొక్క యత్కృష్టత తెలియగలదు

పురుషుడు స్త్రీనిం బ్రవర్తింప జేయవలసిన ప్రకారము (పు. 224-231) స్త్రీ ధనము (231-234), వితంతు నిర్భాగ్యము (234-242) అను వ్యాస ములనుండి పంతులుగారనేక భావములను సంగ్రహించిరి పంతులుగారు ప్రకటించిన 'భర్తకు భార్య విషయమున నడపవలసిన ధర్మములు (1881 వ సం॥ సెప్టెంబరు నెల, వివేకవర్ధని) కన్యాశుల్కము, (1880 వ సం॥ మే నెల వివేకవర్ధని), అతి బాల్య వివాహము-నిర్బంధ వైధవ్యము (1884 సెప్టెంబరు నెల, 1885 నవంబరు. నెల 1886 అక్టోబరు నెల-వివేకావర్ధని సంచికలు) అను వ్యాసములందు స్త్రీ కళా కల్లోలినిలో జియ్యరు సూరిగారు వెలువరించిన భావములకు సామ్యము లున్నవి. ఇట్లనుటచే పంతులుగారు స్త్రీ కళాకల్లోలిని వ్యాసములను తాము పరిగ్రహించిరని చెప్పుటకాదు. ఆ వ్యాసములు పంతులుగారి వ్యాసరచనమునకు సహాయకారు లయ్యె నని చెప్పుట, మాత్రమే.

ఇక పంతులుగారు రాజకీయ విషయములపై వ్రాసిన వ్యాసములు పరిశీలింప వలసియున్నది. నేడు పంతులుగారి రాజకీయాభిప్రాయములను బరిశీలించినచో, ఆ కాలపు మేధావులపై ఇంగ్లీషు వారి పరిపాలన మెట్టిప్రభావమును బరపినదో తెలిసి కొనగలము. పంతులుగా రింగ్లీషు ప్రభుత్వము నెడల మిక్కిలి భక్తివిశ్వాసములను గలిగియుండిరి. ఈ విషయము నేటి మన దృష్టికి ఆక్షేపార్హమైనదిగా తోచవచ్చును గాని, పంతులుగారి కాలమునాటికి దేశీయులు ధనమాన ప్రాణములకు రక్షణలేని, మిక్కిలి యరాజకస్థితి యందున్నప్పుడు బ్రిటిషు ప్రభుత్వము మనదేశమునందు శాంతి భద్రతలను స్థాపించి యుండుటవలన, పంతులుగారి తరమువారి కాప్రభుత్వము నందు భక్తి విశ్వాసములు కలుగుట విచిత్రముకాదు. పంతులుగారికి పూర్వము దేశమున సంభవించిన యరాజకములు, అలజడులు, కరువులు, కాటకములు మనసున

అనుభవమునకు తెచ్చుకొనగలిగిన యెడల, నటి విశ్వాసవంతులకు బ్రిటిషు ప్రభుత్వము వారిపై కుదిరిన భక్తి శ్రద్ధలు మనకు విస్మయావహములు కావు. 1848-52 సంవత్సరముల మధ్యకాలమున గోదావరిపై యానకట్టను, 1852-55 సంవత్సరములమధ్య కృష్ణానదిపై యానకట్టను నిర్మించి, దేశము కరువుకాటకములపాలు గాకుండ రక్షించిరి. అంతకు పూర్వము, పిండారీదండులను నాశనముచేసిరి. సతీ సహగమనమును రూపుమాపిరి. పాఠశాలలను స్థాపించిరి. రహదారుల నేర్పాటు చేసిరి. చోర భయము మాన్పిరి. వీని నన్నిటిని మించి, దేశమును ముద్రాయంత్ర స్థానములతోను, తంతితపాల పనులు నిర్వహించు కార్యస్థానములతోడను, అయో మార్గములతోడను, సుసంపన్నముచేసి దేశీయులను విభ్రాంతి పరచిరి. ఈయా కార ణమువలన వీరేశలింగం పంతులుగారు 'దేశీయ మహాసభ-దాని యుద్దేశములును', ఇంగ్లీషు ప్రభుత్వమువలని లాభములు మొదలగు వ్యాసములందు వెలువరించిన భావము లాక్షేపార్హములు కావు. ఇంగ్లీషు ప్రభుత్వము వారియందును, తాము లోపములుగా భావించిన విషయములను పంతులుగారు తీవ్రముగా విమర్శించియే యుండిరి[43]. ఇంగ్లీషు ప్రభుత్వము వారివలన దేశమున కనేక విషయములలో మేలు కలిగినను. కొన్ని విషయముల దేశమునకంత కధోగతిపాలగుచున్నదని వ్రాయుటకు పంతులుగారు వెనుకంజ వేయలేదు[44].

పంతులుగారు సకాయ కష్టకర్మలు, కులాచార సంస్కరణము, కృషాద్యదివ్యా పారము, దేశాభిమానము, హిందూదేశాభివృద్ధి మార్గము మొదలగు వ్యాసములందు దేశముయొక్క ఆర్థికస్థితిని గూడ సమీక్షించియున్నారు. దేశము నానాటికి దారిద్ర్యా వస్థకు-లోనగుటను పంతులుగారు నిశితముగ పరిశీలించి, దేశదారిద్ర్యమును బాపుటకై, విద్యాధికులు పూనుకొనవలసిన ప్రయత్నములను పదేపదిగ హెచ్చరించి యున్నారు. మన దేశమునందు, బీదవారును, భాగ్యవంతులును గూడ ఇంగ్లండు దేశములో నేసిన బట్టలనే ధరించుచున్నారనియు, అవి యంత్ర సాహాయ్యమువలన యుత్పత్తి యగుట వలన చౌకగా దొరకుచున్నవనియు, నంచిచేల స్వదేశపు వస్త్రములను మానివేసి యూరపుదేశములో నేయబడిన వస్త్రములనే మనవారు కొనుగోలు చేయుటవలన దేశ మంత కంతకును దరిద్రతావస్థను పొందుచున్నదనియు, పంతులుగారు విచారించిరి. దేశమునందే పరిశ్రమలు స్థాపింపబడవలెననియు, విద్యాధికులు, విత్తవరులునైన వారలు పరిశ్రమలను స్థాపించుటకు పూనుకొనవలసినదనియు, మనదేశమునందు

స్వదేశవస్తు వినిమయమే జరుగవలయును కాని, పరదేశములనుండి వచ్చు వస్తువులను విస్తారముగా నుపయోగింపరాదనియు పంతులుగారు హెచ్చరించిరి ఈ వ్యాసమును పంతులుగారు 1880వ సంవత్సరముననే వివేకవర్ధనియందు వెలయించిరి. 1885వ సంవత్సరమున స్థాపింపబడిన దేశీయమహాసభ వారు (నేషనల్ కాంగ్రెసు) స్వదేశీ వస్తువులనే దేశీయులు వినిమయము చేయవలయునని ప్రచారము గావించుట మన మెరిగిన విషయమే వీరేశలింగంపంతులుగారు దేశీయ మహాసభ స్థాపింపబడుట కైదుసంవత్సరములు పూర్వమే యిట్టి యభిప్రాయములను ప్రచారము చేసిరి. ఈ విషయమువలన పంతులుగారి విజ్ఞత, మేధావిత్వము మనకు విశదములు కాగలవు.

వీరేశలింగంపంతులుగారి వ్యాసములను, ఉపన్యాసములను పరిశీలించి చూచినచో, పంతులుగారు విప్లవవాది యనియు, క్రాంతదర్శి యనియు, దేశోద్ధారకు డనియు, సంఘసంస్కార దీక్షాదక్షుడనియు, స్త్రీ జనోద్ధారకుడనియు, దీనజనరక్షకు డనియు, విశదము కాగలదు.

పంతులుగారు తమ వ్యాసములందు స్పృశింపని విషయములేదు మత సాంఘికార్థిక రాజకీయ నైతిక విషయముల సమగ్రపరిశీలనమే పంతులుగారి వ్యాస పరంపర యని వానిని బరిశీలించినచో స్పష్టపడగలదు. పంతులుగారి వచన రచన సరళమును, ప్రసాద గుణ భూయిష్ఠమునునై యుండును. పేలవముగాని పేశలతయు, కటువుగాని గ్రాంధికత్వమును, వీరేశలింగం పంతులుగారి వచనశైలి సొంపునకు చిహ్నములని శ్రీ రాయసము వేంకట శివుడుగారు వ్రాసియున్నది సత్యము.

"వ్యాసమునకు రచయిత యొక్క వ్యక్తిత్వము ప్రధానము జీవితమును గురించియు, వ్యాస విషయమును గూర్చియు, నీతని యాలోచనలును, అతని భావ పరిణామమును ముఖ్యములు, తన యభిప్రాయముల నెట్లు ఉపక్రమించి, సాగించి, యుపసంహరింపవలయునో యత డెఱిగి యందలి మెలకువలను గ్రహించుచుండ వలయును[45].

పై నిర్వచనమును దృష్టియందుంచుకొని వీరేశలింగం పంతులుగారి వ్యాసము లను బరిశీలించిన, వారి వ్యాసము లుత్తమ వ్యాసరచనమునకు లక్ష్యములుగా మనము గ్రహింపవచ్చును.

వారి వ్యాసరచనము వారికిగల గద్య తిక్కన బిరుదమును సార్థకపరచినది

— 0 —

# 10
# కవుల చరిత్రము

వీరేశలింగం పంతులుగారి కవుల చరిత్ర రచనము ఆంధ్రవాఙ్మయ చరిత్రము నందొక యుజ్జ్వల ఘట్టము ఆంధ్రవాఙ్మయమునకు పంతులుగారి కవుల చరిత్రము వెలలేని భూషణము. సమగ్రమైన, పరిశోధనాత్మకమైన, ప్రణాళికాబద్ధమైన, కవుల చరిత్ర రచనమునకు పంతులుగారే ఆద్యులు. ఆంధ్రదేశమునందు సశాస్త్రీయముగా పరిశోధనమును ప్రారంభించిన వారిలోను పంతులుగారే ప్రధములని చెప్పవలెను. ఆంధ్రవాగ్దేవిని సువర్ణమణిమయ విభూషాదులచే నలంకరించి యనర్ఘములైన కానుకలను గైసేసిన మహాకవుల చరిత్రములు, పంతులుగారు గ్రధితముచేసి శాశ్వత మొనర్చిరి.

పంతులుగారికి పూర్వము కవుల గాధ లన్నియు, కర్ణపరంపరగా పుక్కిటి పురాణములతో నిండియుండెనే గాని, వాఙ్మయ చరిత్రమును రచించుట కాధారములు కాజాలకపోయినవి కవి చరిత్రములను గ్రంధస్థములు చేయవలయునన్న యభిలాషయు, వాఙ్మయ చరిత్ర రచనమునకు, కవుల చరిత్రములే మూల కందములన్న గుర్తింపును, పందొమ్మిదవ శతాబ్ది యుత్తరార్ధము నందలి తెలుగు సాహితీపరులకు, పాశ్చాత్య సాహిత్య పరిచయము కలిగించెను. అందువలన తెలుగునందు కూడ కవి చారిత్రములు వెలువడవలెనన్న ప్రయత్నము, పలాను మేయము కాగలిగెను

పాశ్చాత్యుల సాహిత్యము, వారి నాగరకత, వారు ప్రవేశపెట్టిన విద్యావిధానము, పరిశోధనా పద్ధతులు, తెలుగు సాహితీపరుల నమితముగా ప్రభావితులను చేసినవి తత్ఫలితమే పందొమ్మిదవ శతాబ్ది యుత్తరార్ధమునందు తెలుగు సాహిత్యమునందు విలసిల్లిన ప్రక్రియా వైవిధ్యము.

ఆంగ్లసాహిత్యము నాటి పండితుల నందర నమేయముగ నాకర్షించినది. సంస్కృతాంధ్రముల యందు తల స్పర్శియగు పాండిత్యమును సంపాదించిన మహాపండితులు గూడ ఆంగ్ల భాషను నేర్చుట యందాసక్తిని చూపిరి. లోక వ్యవహారానుకూల్యమునకు గాని, రాజభాష యగుటవలన గాని, ఉద్యోగములు చేయుటకు

గాని, తద్భాషా పరిజ్ఞాన మావశ్యక మగుటవలగాని, నేర్చినను, పండితుల ఆంగ్లేయ భాషా పరిజ్ఞానము తెలుగు సాహిత్యమునకు మహోపకార మొనర్చినది. తెలుగు సాహిత్యమునందు ప్రక్రియావైవిధ్యము లేకపోవుటను గుర్తించి, ఆలోపమును సవరించుటకు పండితులు కృషిని ప్రారంభించిరి. తెలుగున కవుల చరిత్రములు వెలువడుట కూడ యట్టిదే.

వీరేశలింగం పంతులుగారికి పూర్వమునను, సమకాలమునను, కవుల చరిత్ర విషయమై కృషిచేసినవారు కొందరు లేకపోలేదు. కాని వారి గ్రంధములకు పంతులు గారి గ్రంధమునకు వచ్చినంత ప్రాచుర్యము రాలేదు.

గ్రంధరూపములుగా వెలువడుటకు పూర్వము, కవి చారిత్రములు, నాటి సార స్వత పత్రికలలో వెలువడుచుండెను గ్రంధరూపమున కవుల జీవితములను ప్రక టించిన వారిలో శ్రీ గురజాడ శ్రీరామమూర్తి పంతులుగారు ప్రధములు. వీరు సైతము ప్రప్రధమమున కొందరు కవుల జీవితములను 1876వ సంవత్సరమున సంచికారూపముననే ప్రకటించిరి వీరికి పూర్వమే కవి జీవితములను వెలువరించవలె నని యభిలషించిన వారును, తత్ప్రయత్నములు గావించినవారును కొందరు లేకపో లేదు. 1874వ సంవత్సరమునందు శ్రీ కాకర్ల సుబ్బయ్య పంతులువారి సంపాదకత్వ మున చెన్నపట్టణమునుండి వెలువడుచుండిన 'లోకరంజని' యను మాసపత్రికయందు ప్రాచీనాంధ్ర కవి చారిత్రములు వెలువరించు ప్రయత్నము కొంత కొనసాగినది[1]

ఇదే విధముగా 1875వ సంవత్సరమున విశాఖపట్టణమునుండి శ్రీ గూడూరి వేంకటకృష్ణారావు పంతులుగారి సంపాదకత్వమున వెలువడిన 'సకల విద్యాభివర్ధని' యను మాసపత్రిక యందు, కొందఱ కవుల చారిత్రములు వెలువడినవి[2], యువ నామసంవత్సర వైశాఖమాసపు సంచికయందు, కవి రామభద్రయ్య, మల్లనార్యుడు, వెన్నెలకంటి సూరయ్య, కసపర్తి అబ్బయ్యయను వారల చారిత్రములు వెలువడినవి 'ఆంధ్రకవుల'ను శీర్షిక క్రింద వీరి జీవితవిశేషములు, రచించిన కావ్యముల వివర ములు సంగ్రహముగ తెలుపబడి యుండెనేకాని, వీరి కాలాదికములను గూర్చిన ప్రసక్తియేలేదు మిక్కిలి సంక్షేపముగ వీరిని గూర్చి తెలుపబడి యుండెను. ఇట్లే 1872వ సంవత్సరమునందు ప్రారంభింపబడిన పురుషార్ధ ప్రదాయినియను పత్రిక యందు గూడ కవుల జీవితములను గూర్చిన విశేషములు, సంగ్రహముగ నప్పు డప్పుడు వెలువడుచుండెడివి తరువాత కాలమున గూడ కవి చారిత్రముల విషయమై

'అముద్రిత గ్రంధ చింతామణి' పత్రిక యందును, గురజాడ శ్రీరామమూర్తి పంతులు గారి 'రాజయోగి', 'ప్రబంధకల్పవల్లి' యనబడు పత్రికల యందును విశేషములు ప్రకటింపబడుచుండెడివి అముద్రిత గ్రంధ చింతామణియందు కుమ్మరిమొల్లను గూర్చియు, రామరాజ భూషణుని గూర్చియు విశేష విషయములను బయల్పరచు వ్యాసములు కలవు.[3]

గ్రంధ రూపమున కవి చరిత్రములను వెలువరించిన వారిలో గురజాడ శ్రీరామమూర్తిగారే ప్రధములైనను, పూర్వ కవులను గూర్చిన వివరములు సంగ్రహముగా బ్రౌన్ దొరవారి ఆంధ్రాంగ్ల నిఘంటువునందే కూర్పబడినవి బ్రౌణ్యము నందు పీఠికలో పూర్వకవులను గూర్చిన వివరములు కొన్ని కలవు. ఈ నిఘంటువు 1854వ సంవత్సరమునందు వెలువడెను కాని బ్రౌణ్యమునందు వీరిని గూర్చిన వివరములలో కాలాదికములను గూర్చిన వివరములు తక్కువగా నుండెను. బ్రౌను దొరవారికి పూర్వమే కావలి వేంకటరామస్వామిగారనువారు, లమ దక్షిణ హిందూదేశ కవి జీవితములు (Lives of the Deccan Poets) అను గ్రంధమునందు కొందఱు తెలుగు కవుల జీవిత చరిత్రములను గ్రంధస్థము చెపియున్నారు. కావలి వేంకట రామస్వామి రచించిన గ్రంధమునందు, మహారాష్ట్ర, కన్నడ, తమిళ, ఘూర్జర, సంస్కృతాంధ్ర కవుల జీవిత చారిత్రములు కూర్పబడినవి ఈ గ్రంధము నందష్టోత్తర శత సంఖ్యగల కవుల చరిత్రములున్నవి. ఆంధ్ర కవులలో శ్రీకృష్ణ దేవరాయలు, అల్లసాని పెద్దన్న, కుమ్మరిమొల్ల, మొదలగువారి చరిత్రములు విస్తరించి కూర్పబడినవి. ఈ గ్రంధము ఆది శంకరుల జీవిత చారిత్రముతో ప్రారంభింపబడి రచయిత సోదరుడగు కావలి వేంకట బొర్రయ్య (1776-1803) జీవిత చారిత్రముతో ముగింపబడినది. కావలి వేంకట బొర్రయ్యగారు కల్నల్ మెకంజీ దొరకు ఇష్టుడును, సహాయుడునై, మెకంజీ దొర కభిమతములైన కార్యములను నిర్వహించినవారు వీరికి తెలుగు, హిందూస్తానీ, ఫారసీ, ఇంగ్లీషు, కన్నడము, అరవము, మహారాష్ట్రము, అను ఏడు భాషలలో పాండిత్యము కలదు. బొర్రయ్యను గురించి వ్రాయుచు, హిందూవిజ్ఞాన మందిరమున ప్రవేశించుటకు బొర్రయ్య యను ద్వారమే తన కాధారమైనదని కల్నల్ మెకంజీ దొర వ్రాసియున్నారు[4] కావలి వేంకట రామస్వామిగారి గ్రంథమునందు సైతము కవి కాలాదికములను గూర్చిన

విషయములం దసంగతములున్నవి ఈ గ్రంథము అముద్రిత గ్రంథ చింతామణ్యాధి పతులగు శ్రీ పూండ్ల రామకృష్ణయ్యగారిచే తీవ్రముగా విమర్శింపబడినది[6].

ఈ కావలి వేంకట రామస్వామిగారి గ్రంథము ప్రప్రథమమున 1829 వ సంవత్సరమున కలకత్తా నగరమున 'Biographical Skeches of the Deccan Poets' అను పేరుతో ఆంగ్లభాష యందు వెలువడెను. తదుపరి యీ గ్రంథము 1888 వ సంవత్సరమున చెన్నపట్టణమున పునర్ముద్రణము నొందెను. కాని యీ గ్రంథము 1847 వ సంవత్సరమున ఏప్రిల్ నెలలో నొక ముద్రణము నొందినట్లు అముద్రిత గ్రంథ చింతామణి వలన తెలియుచున్నది[6]. ఆంధ్ర రచయిత లను గ్రంథమునందు సైతము గ్రంథము 1847వ సంవత్సరమునందు బొంబాయిలో ముద్రణము నొందినదని శ్రీమధునాపంతుల సత్యనారాయణ శాస్త్రిగారు వ్రాసి యున్నారు [7] కనుక వేంకటరామ రామస్వామి పండితుని యీ గ్రంథము బొంబాయి నగరమున 1847 వ సంవత్సరమున ముద్రణము నొంది యుండునని తలంచ నగును. కనుక ఇది నేటికి మూడుసార్లు ముద్రణ నొందినట్లు భావించవచ్చును. ఆంగ్లేయ భాషయందు వెలువడిన తొట్టతొలుతటి ఆంధ్రకవుల చరిత్రమిదియే యని నిస్సంశయముగా చెప్పనొప్పును. గురజాడ శ్రీరామమూర్తి పంతులుగారును, వీరేశలింగంపంతులుగారును, తమ కవి చారిత్రములందీ గ్రంథమునుగూర్చి ప్రస్తా వించియే యున్నారు.[8] ఈ గ్రంథ మాంగ్లేయ భాషయందు రచింపబడి యుండుటవలన, ఆంగ్లేయ భాషా పరిచితిగల సాహితీపరులకు మాత్రమే కరస్థమయ్యెనుగాని, తెలుగు నాట కవుల చరిత్రముగా విశేష ప్రాచుర్యమును బొందియుండలేదు ఈ గ్రంథము కవి కాలాదికముల విషయమై పరమప్రామాణికమగు గ్రంథముకాదు, కాని 1829వ సంవత్సర ప్రాంతమునకే తెలుగువారి ఆంగ్లసాహితీ పరిచయమునేకాక, వైదుష్య మును కూడ నిరూపించుచున్నది.

పంతులుగారి కవుల చరిత్రము వెలువడుటకు పూర్వమే తెలుగు కవుల జీవిత ములను ప్రాస్తావికముగ గ్రంథస్థములుచేసిన వారిలో బహుజనపల్లి సీతారామాచార్యులు గారును, ఎనమండ్రము వేంకట రామయ్యగారును పేర్కొనదగినవారు, 1885వ సంవత్సరమునందు శబ్దరత్నాకరమును సీతారామాచార్యులుగారు ప్రప్రథమమున వెలువరించిరి శబ్దారత్నాకర పీఠికయందు పూర్వ కవి చారిత్రములను సీతారామా

చార్యులుగారు కూర్చిరి. కాని యీ కవి చరిత్రములు సమగ్రములు కావు. సంక్షేప ముగానున్నవి సీతారామాచార్యుల వారి యీ ప్రయత్నమును కవుల చరిత్ర రచన మని చెప్పుటకు వీలులేకపోయినను, అర్వాచీనులగు కవి చరిత్రకారులకు. వీరి శబ్ద రత్నాకరము సహాయకారియయి యుండుననుట సత్యదూరముకాజాలదు. వీరేశలింగం పంతులుగారు తమ స్వీయ చరిత్రమునందు తాము ప్రాచీన గ్రంధములను పరిష్కరించి ముద్రింపించిన విషయమును ప్రస్తావించుచు, సీతారామాచార్యులవారు, శబ్ద రత్నాకర పీఠికయందు, కొన్ని గ్రంధనామములు తాము వినుటయే కాని, ఆ గ్రంథ ములు తమకు లభించియుండలేదని వ్రాసిరనియు, వారు పేర్కొనిన యట్టి గ్రంధ ములలో పదింటికిపైగా తాము సంపాదించి, పరిష్కరించి ప్రకటించితిమనియు వ్రాసి యున్నారు.[9] ఎనమంద్రము వేంకట రామయ్యగారి గ్రంధమునందు సైతము పూర్వ కవులనుగూర్చిన ప్రస్తావన లున్నవి. వీరి గ్రంధనామము 'పురాణనామ చంద్రిక'. ఇది 'పూర్వగాధలహరి' వంటి పురాణ వ్యక్తులను గురించిన వివరములను తెలిపెడి నిఘంటు గ్రంధము. పూర్వ కవులను గూర్చిన వివరములు ప్రాస్తావికముగా నీ పురాణనామచంద్రిక' యందు గూర్పబడినవి. ఈ గ్రంధము 1885వ సంవత్సరము నకు పూర్వమే వెలువడినది. అముద్రిత గ్రంధ చింతామణి యందీ 'పురాణనామ చంద్రిక'ను గూర్చి పలుచోటుల ప్రస్తావింపబడి యున్నది.[10] రామరాజ భూషణుడు, కుమ్మరిమొల్ల యను వారల చారిత్రములు, అముద్రిత గ్రంధ చింతామణి, ప్రస్తా వించిన సందర్భమున నీ 'పురాణనామచంద్రిక' యందా కవులను గూర్చి వ్రాయబడిన వివరము లుద్ధృతములైనవి

ఇంక కేవలము కవుల చరిత్రముగా గ్రంధరచన ముద్దేశించి, నిర్వహించిన వారిలో ప్రప్రథములు గురజాడ శ్రీరామమూర్తి పంతులుగారే యగుచున్నారు ఈ గ్రంధావతరణికను గూర్చి వారు "ప్రధమములో నేను స్కూలులో విద్యాభ్యాసము చేయుచున్నతతి నింగ్లీషు భాషలో నుండు "Macaulay's critical and Biographical Essays of Poets" అను గ్రంధమువంటి గ్రంధ మాంధ్రభాషలో నుండిన నెంతయు నుపయోగకారిగా నుండునని యూహించి యా విషయమై కొందఱు పెద్దలతో సహవాసముచేసి కొంత గ్రంధము సంపాదించి దేశస్థుల యభిప్రాయముల నరయుటకుగాను గొంత కొంతగా..." ప్రకటింప నారంభించినట్లు తెలిపియున్నారు.[11] శ్రీరామమూర్తి పంతులుగారును ప్రప్రధమమున 1876వ సంవత్సరమున కొందఱు

కవుల జీవితమును సంచికారూపమున వెలువరించిరి ఈ పొత్తము పండితాదరణ పాత్ర మగుటవలన నిది వెలువడిన రెండు సంవత్సరములకు శ్రీకృష్ణదేవరాయల వారిని గూర్చియు, తత్సంస్థానాష్టదిగ్గజములను గూర్చియు కవి జీవితముల రెండవ భాగముగా శ్రీరామమూర్తి పంతులుగారు వెలయించిరి అనగా కవి జీవితములందలి రెండవ భాగము 1878వ సంవత్సరమున వెలువడెను ఈ రెండవ భాగముసైతము విశేషించి పండితుల నాకర్షించుటవలన శ్రీరామమూర్తి పంతులుగారు 1880వ సంవత్సరమున మఱికొందఱు కవుల జీవిత వృత్తాంతములను సేకరించి, వానిని కవి జీవితముల మూడవ భాగముగా వెలయించిరి 1882వ సంవత్సరమున శ్రీరామమూర్తి పంతులుగారి కవి జీవితముల రెండవ భాగము పట్టపరీక్షకు పాఠ్యగ్రంథముగా నిర్ణయింపబడుటజేసి, రెండవ భాగమును మాత్రమే విశేషాంశ సహితముగా నా సంవత్సరమున పునర్ముద్రణము గావించిరి. తమ గ్రంథము పట్టపరీక్షకు పాఠ్యగ్రంథముగా నిర్ణయింపబడుటయు, పండితుల ప్రోత్సాహమును శ్రీరామమూర్తిగారిని సోత్సాహులుగా నొనర్చి, 1882వ సంవత్సరముననే వారు కవి జీవితముల నాలుగవ భాగమును ప్రకటించునట్లు చేసినవి. తదుపరి పంతులుగారీ నాలుగు భాగములను 1893వ సంవత్సరమున నొకే సంపుటముగా ప్రచురించియున్నారు మఱివారు విడివిడిగా కవి జీవితములను వెలువరించియుండ లేదు. కాని, 1882వ సంవత్సరమున పెద్దాపురమునుండి వారు వెలువరించిన 'ప్రబంధకల్పవల్లి'యను మాసపత్రిక యందు కూచిమంచి తిమ్మకవి మొదలగువారి చారిత్రములు కొన్ని వెలువరించిరి. కాని ఈ చారిత్రములు కవి జీవితములలో చేరలేదు శ్రీరామమూర్తి పంతులుగారు ప్రథమ భాగముగా వెలువరించిన కవులలో కవిత్రయము వారిని గూర్చియు, వేములవాడ భీమకవిని గూర్చియు మాత్రమే చరిత్రములు చేర్చినారు. 1893వ సంవత్సరమున తమ కవి జీవితములను సంస్కరించి ప్రకటించుచు పిల్లలమఱ్ఱి పినవీరభద్రుని సైతము కవిత్రయము వారితోజేర్చి భారతాంధ్రకవులను ప్రకరణమునందు చేర్చియున్నారు. 1893వ సంవత్సరమునందు శ్రీరామమూర్తి పంతులుగారు ప్రకటించిన కవి జీవితముల సంపుటమునందు, వేములవాడ భీమకవి, కవిత్రయము వారును, పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడును, ప్రథమ భాగమునందు చేర్చబడిరి. శ్రీరామమూర్తి పంతులుగారు కవి జీవితములను భారతాంధ్ర కవులు, ద్వ్యర్థి కావ్యకవులు, ప్రౌఢప్రబంధ కవులు, ఆంధ్రపంచ కావ్యకవులు, అను విభాగములతో

వెలువరించియున్నారు. వారు 'ప్రబంధకల్పవల్లీ'త్యాదిపత్రికలలో ప్రచురించిన కూచిమంచి తిమ్మకవి, కూచిమంచి జగ్గకవి, ఏనుగు లక్ష్మణకవి, అడిదము సూరకవి, కాకునూరి అప్పకవి, అభినవదండి కేతనయను వారల జీవితములను ప్రత్యేకముగ కవి జీవితములందు చేర్చి ప్రకటించలేదు.

పంతులుగారి కవిజీవితములలో 1. వేములవాడ భీమకవి; భారతాంధ్ర కవులన్న విషయ విభాగము క్రింద 2 నన్నయభట్టు 3 తిక్కన సోమయాజి 4. ఎఱ్ఱాప్రెగ్గడ 5. పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు, రామాయణాంధ్ర కవులను విషయ విభాగమున 6. హుళక్కి భాస్కరుడు 7. అయ్యలరాజు రామభద్రయ్య, 8. జయంతి రామభట్టు, 9. కంకంటి పాపరాజు, ఆంధ్రపంచకావ్య కవులను విభాగమున, 10 అల్లసాని పెద్దన, 11 నందితిమ్మన, 12 తెనాలిరామకృష్ణకవి, 13. శ్రీనాధుడు, ఆంధ్రద్వ్యర్థి కావ్యకవులన్న శిర్షికక్రింద, 14 పింగళి సూరన, 15. రామరాజ భూషణుడు, 16. పిండిప్రోలు లక్ష్మణకవి, 17. శిష్టు కృష్ణమూర్తిశాస్త్రి కవి, ప్రౌఢప్రబంధ కవులను శీర్షికక్రింద, 18 సంకుసాల నృసింహకవి, 19. శ్రీకృష్ణదేవరాయలు, పురాణ కవులను శీర్షికక్రింద, 20 బమ్మెర పోతన, 21. వెన్నెలకంటి సూరనార్యుడు, 22. జక్కన, 23 వెన్నెలకంటి వేంకటాచలము, 24. రామగిరి సింగనకవి, మొదలగు వారల జీవిత విశేషములు విపులముగా కూర్పబడినవి వీరలుగాక ప్రత్యేకముగా పత్రికలలో ప్రకటించిన కూచిమంచి తిమ్మకవి మొదలగు కవులార్గుర జీవితములతో కలిసి, శ్రీరామమూర్తిగారి లేఖినినుండి వెలువడిన కవి జీవితముల సంఖ్య ముప్పది ఈ విధముగా శ్రీరామమూర్తి పంతులుగారు 1876వ సంవత్సరమున కవి జీవితములను వెలువరించుటకు పూనుకొని 1893వ సంవత్సరమునకు ముప్పదిమంది కవుల జీవితములను వెలువరించిరి శ్రీరామమూర్తి పంతులుగారు విజయనగరానందగజపతీంద్రుల యాస్థానవిద్వాంసులై కవి జీవితముల కూర్పునందశేషమైన శ్రద్ధవహించిరి ప్రప్రథమమున వెలువడిన కవి జీవితముల విడివిడి భాగములందు శ్రీరామమూర్తి పంతులుగారు కవుల కాలవిభాగ మేర్పరుపలేదు. కవి కాలనిర్ణయమును వారు తమ కవి జీవితములందు ప్రధానముగ భావించలేదు. ఒకానొక కాలమున సంబంధించిన కవులుగాక, వేర్వేరు కాలములకు సంబంధించిన కవుల జీవితములు, వారు ప్రప్రథమమున భాగభాగములుగా వెలువరించిన గ్రంథములలో కూర్పబడినవి. ఈ విధమైన యెన్నిక యందొక క్రమ

మున్నట్లు కానరాదు. కొందఱు కవుల జీవిత విశేషముల నొకచో చేర్చుటయే శ్రీరామమూర్తి పంతులుగారి యుద్దేశమైనట్లుగా నీకవి జీవితములను పరిశీలించిన మనకు తెలియనగును "ఈ కవి చరిత్రము లన్నియు నొక వరుసను ప్రకటింప బడక అప్పటి కప్పటికి సిద్ధములయిన చారిత్రము లొక్కొక్క భాగముగా ప్రకటించుట గల్గిన"దని శ్రీరామమూర్తి పంతులుగారే వ్రాసియున్నారు [12]

కాని 1893వ సంవత్సరమున శ్రీరామమూర్తి పంతులుగారు ప్రకటించిన కవి జీవితముల రెండవ కూర్పునందు, కవి కాలాదులను గూర్చిన విశేషములను చేర్చినారు. దానికి కారణముగా తాము వీరేశలింగంపంతులుగారి కవుల చరిత్రమును చూచుటయు, వారు చేసిన కాలనిర్ణయములు, తమ నిర్ణయములకు బాధకములుగా నుండుటనుబట్టి, తాము కాలనిర్ణయాదులను స్థిరపరచి, యీ కూర్పు ప్రకటించుచున్నామనియు వారు వ్రాసియున్నారు

ఇక శ్రీరామమూర్తిగారి కవిజీవితములను పరిశీలించినచో వారి శ్రమ యంతయు, కవుల జీవితము లందలి మహిమాతిశయములైన విషయములను గ్రంథస్థములు గావించుటకే పరిమితమయ్యెనని తెలియనగును వీరి గ్రంథమున కవులను గూర్చిన కట్టు కథలను, జనశ్రుతిని, గ్రంథస్థములు చేసిరి వీరి యీ గ్రంథమునందు చారిత్రకదృష్టి మృగ్యము కవి కాలాదికములను నిర్ణయించుట యందుగాని, వారి వారి కవిత్వతత్త్వ విచారమునందుగాని శ్రీరామమూర్తి పంతులుగారు శ్రద్ధవహింపలేదు నన్నయభట్టునకు తిక్కనసోమయాజి సమకాలీనుడని శ్రీరామమూర్తి పంతులుగారు తమ కవి జీవితములందు సాధించుటకు విశేషించి శ్రమించిరి. భట్టుమూర్తి, తెనాలిరామకృష్ణ కవులు శ్రీకృష్ణదేవరాయల సమకాలీనులని పంతులుగారి సిద్ధాంతము. ఇట్లు శ్రీరామమూర్తి పంతులుగారి గ్రంథము, తమకు పరిమితములైన యాధారములతో, సిద్ధాంతములతో, కవులయెడ వారికిగల భక్తిశ్రద్ధలకు లక్ష్యభూతముగ, కవుల మానవాతీతములైన మహత్కార్య నిర్వహణములకు సాక్షిభూతముగ వెలువడినది. కాని శ్రీరామమూర్తి పంతులుగారి గ్రంథమువలన తెలుగు సాహిత్యమునకు మేలుకలుగలేదని చెప్పరాదు. కవి చరిత్ర రచనమునకు మార్గదర్శకత్వమును వహించినది వారి గ్రంథమే.

వీరేశలింగంపంతులుగారి కవుల చరిత్రము, శ్రీరామమూర్తి పంతులుగారి కవి జీవితములపై సంస్కరణ పూరణములు కలదిగ వెలువడిన దనుటలో అసం

ఖావ్య మేమియునులేదు. పంతులుగారు తాము స్వీయ చరిత్రమునందు వ్రాసికొనినట్లు ప్రథమప్రయత్నము లెప్పుడును దోషబహుళములై యుండుట తప్పదు. వీరేశలింగం పంతులుగారి కవుల చరిత్రమునకు కావలి వేంకట రామస్వామి పండితుని దక్కను కవుల జీవిత చారిత్రములను గ్రంథమును, శీరామమూర్తి పంతులుగారి కవి జీవితములను గ్రంథమును సహాయకారులై యుండవచ్చును కాని పంతులుగారికి పూర్వము చరిత్ర పరిశోధనకాని, కవి కాలాదుల నిర్ణయించు ప్రయత్నములకు, సాధనములగు తాళపత్రగ్రంథ సంశోధనముగాని, శాసనములను పరిశీలించుటగాని జరిగి యుండలేదు ఇట్టి పరిస్థితులలో వీరేశలింగంపంతులుగారు, కవుల చరిత్ర రచనమునకు పూనుకొనిరి తమకు పూర్వము నిర్దుష్టమైన ప్రణాళికతో విరచింపబడిన కవుల చరిత్రము లేకపోయినను, అనేక తాళపత్ర గ్రంథములను సంశోధించియు, తంజాపురము నందలి సరస్వతీ పుస్తకనిలయము, చెన్నపట్టణము నందలి ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము, సూయల్‌దొరవారి శాసన సంపుటములు, కల్నల్ మెకంజీదొరవారు సంపాదించిన కైఫియతులనబడు స్థానిక చరిత్ర సంపుటములు బ్రౌన్ దొరవారు సేకరించిన అమూల్యమగు గ్రంథసాధన సంపత్తి, ఆధారములుకాగా వీరేశలింగంపంతులుగారు కవుల చరిత్రములను గ్రంథస్థములు చేయుటకు పూనుకొనిరి. కార్మికేల్ దొరవారి ప్రోత్సాహమున కూర్చబడిన, బుక్కపట్నం రాఘవాచార్యులవారి ఆంధ్రదేశ చరిత్ర సంగ్రహము యొక్క వ్రాతప్రతి కూడ పంతులుగారికి సహాయకారియైనది.[18] వీరేశలింగంపంతులుగారు కవుల చరిత్రములను కూర్చుటకు పరిశ్రమించునాటి కిట్టి చరిత్ర సామాగ్రి, సాధన సంపత్తులున్నను, ఆంధ్రదేశమును పరిపాలించిన రాజుల కాలనిర్ణయము కష్టసాధ్యముగనే యుండెను. ఆంధ్రదేశమును పరిపాలించిన రాజుల కాలనిర్ణయము చేయబడనిచో, ఆయా రాజులకు కృతు లొసగిన కవుల కాలనిర్ణయము చేయవలనుపడదు. ఇట్టి కష్టమేగాక కవి పుంగవులు కొందఱు తమ కావ్యములను రాజులకు కృతినీయక, తమ ఇష్ట దేవతలకు కానుకవెట్టిరి. అందువలన వారి కాలనిర్ణయము చేయుట మరియు కష్టసాధ్యమయ్యెను. ఇట్టివారి కాలములను లక్షణ గ్రంథములలో వారి వారి కావ్యములనుండి యుదాహరింపబడిన పద్యముల సాయమునను, గ్రంథావతారికల యందు, ఆయా కవు లొనర్చిన కవిస్తుతుల వలనను, పంతులుగారు నిర్ణయించి యున్నారు. తాము కవుల చరిత్రమును విరచించుటలో పొందిన శ్రమ యనల్పమని

పంతులుగారు తమ స్వీయ చరిత్రమునందు వ్రాసియున్నారు. ఈ విధముగా పంతులు గారు నిర్దుష్టమగు ప్రణాళికను విరచించుకొని, కవుల చరిత్రమును రచించినారు

వీరేశలింగంపంతులుగారు కవుల చరిత్రమును 1886వ సంవత్సరమున ప్రప్రథమమున వివేకవర్ధనిలో భాగ భాగములుగ వెలువరించిరి. 1886వ సంవత్సరము మే నెల సంచికయందు, నన్నయ్య భట్టారకుని చరిత్రముతో కవుల చరిత్రము ప్రారంభమైనది. వరుసగా తిక్కన సోమయాజి, అధర్వణాచార్యుల చరిత్రములు మరుసటి సంచికలందు వెలువడినవి. కవుల చరిత్రము ప్రథమ భాగమును పంతులు గారిట్లు వివేకవర్ధినియందు ప్రచురించుచు నా సంవత్సరమున నే పుస్తక రూపమున కూడ ప్రకటించినారు. ఈ ప్రదమ భాగము డెబ్బదిరెండు పుటల పరిమితి కలిగి యుండెను. మరుసటి సంవత్సర మీ ప్రథమ భాగము పునర్ముద్రణము నొందెను. 1887వ సంవత్సరమునందు రెండవ కూర్పు వడసిన కవుల చరిత్రము ప్రథమ భాగమునందు, విశేష విషయములనుబంధమున చేర్పబడి, గ్రంధము ఎనుబది నాలుగు పుటల పరిమాణము కలిగి యుండెను అనగా పంతులుగారు మరుసటి సంవత్సరమున ప్రకటించిన రెండవ కూర్పునందు, విశేషవిషయములుగల పన్నెండు పుటల యనుబంధమును, గ్రంధాంతమున చేర్చియున్నారని తెలియనగును. 1890వ సంవత్సరమున వీరేశలింగంపంతులు గారిప్రథమ భాగము యొక్క మూడవ కూర్పు నచ్చొత్తించిరి ఈ ముద్రణమునందు రెండవ కూర్పునందు గ్రంథము చివర చేర్చబడిన యనుబంధము, పుస్తకములోనే చేర్చబడి విస్తరింపబడి, కవుల చరిత్రము తొంబదియారు పుటల పరిమాణముగల గ్రంధముగా ప్రకటింపబడినది. మరల నీ ప్రథమ భాగము 1895వ సంవత్సరమున చతుర్ధ ముద్రణము నందినది. ఈ కూర్పును పంతులుగారు నూటయేబది పుటల సంఖ్యగల గ్రంధముగా విశేష విషయములు చేర్చి, పునస్సంశోధితము గావించి ప్రకటించియున్నారు. చతుర్ధ ముద్రణము నొందిన కవుల చరిత్రము ప్రథమ భాగమున ఇరువది ఒక్కరు కవుల చరిత్రములు వెలువడినవి. ఈ విధముగా తమ గ్రంథమును తొలి ముద్రణమునకును, మలి ముద్రణమునకును, ఆ తరువాత ముద్రణములకును, విస్తరించుట, పంతులుగారి పరిశోధన సామర్ధ్యమునకును, సత్యదీక్షకును, విషయ ప్రామాణికత్వమునకును సాక్షి భూత మగుచున్నది. 1886లో డెబ్బదిరెండు పుటల పరిమితిలో వెలువడిన పంతులుగారి కవుల చరిత్రము ప్రథమ భాగము 1895 నాటికి నూటయేబది పుటల

పరిమాణము నొందినది. 1899లో నీ భాగమును తమ సంపుటములలో చేర్చి తిరుగ ముద్రించునప్పు డిది నూటయిరువది పుటల పరిమాణముగల గ్రంథమయ్యెను కనుకనే 1895వ సంవత్సరమున వెలువడిన కవుల చరిత్రమును అముద్రిత గ్రంథ చింతామణి సమీక్షించుచు "శ్రీ పంతులవారు వళక్షపక్షదివాకరుంబోలె నీ గ్రంథ మును వృద్ధిజేసినందుకు మేము మిగుల నబ్బురపడుచున్నారమ"ని వ్రాసినది.[14] ఈ ప్రథమ భాగమే 1917వ సంవత్సరమున సంస్కరణ పూరణములుగల ముద్రణ ముగా వెలువడినప్పుడు ఆరువందల ఎనుబది నాలుగు పుటల పరిమాణముగల గ్రంథ ముగా వెలువడెను ఇట్లీ కూర్పును సంస్కరించి ప్రకటించుట వీరేశలింగంపంతులు గారి పరిశోధనాప్రాగల్భ్యమును వెల్లడి సేయుచున్నది.

వీరేశలింగంపంతులు గారి ఆంధ్ర కవుల చరిత్రము, ద్వితీయ భాగము ప్రప్రథ మమున 'చింతామణి' పత్రికలో వెలువడినది. 'చింతామణి'యను నీ మాసపత్రికకు న్యాపతి సుబ్బారావు పంతులుగారు యజమానులై యుండినను, వీరేశలింగంపంతులు గారే దీనిని నిర్వహించుచుండెడివారు. ఈ చింతామణి పత్రిక 1891వ సంవత్స రముననే ప్రారంభింపబడినది పంతులుగారు దీనియందు తమ కవుల చరిత్రము ద్వితీయ భాగమును 1892-94 సంవత్సరముల మధ్యకాలమున వెలువరించిరి. 1894వ సంవత్సరమున నీ ద్వితీయ భాగమును పంతులుగారు పుస్తక రూపమున ముద్రించియున్నారు. 1897వ సంవత్సర ప్రాంతమున కవుల చరిత్రము తృతీయ భాగము కూడ 'చింతామణి' పత్రికలోనే వెలువరించిరి. 1897-99 సంవత్సరముల మధ్యకాలమున పంతులుగారు తమ గ్రంథముల నన్నిటిని పది సంపుటములుగా చెన్నపట్టణమునందు ప్రచురించి ప్రకటించియున్నారు అప్పుడు కవుల చరిత్రము, మూడు భాగములను కలిపి ఒకే సంపుటముగ ముద్రించిరి. 1894వ సంవత్సరము నందు ద్వితీయ భాగముగ ప్రకటించిన కవుల చరిత్రమునందు ఏబదిమంది కవుల చరిత్రములను పంతులుగారు కూర్చిరి. 1899వ సంవత్సరమునందు మూడు భాగము లును కలిపి ఒకే సంపుటముగ ముద్రించునప్పు డీ ద్వితీయ భాగము నందలి కవుల సంఖ్య ఏబదియేడైనది మూడవ భాగము నందలి కవుల సంఖ్య నూటముప్పది తొమ్మిది. కనుక వీరేశలింగం పంతులుగారు 1899వ సంవత్సరమున మూడు భాగములును కలిపి ఏకసంపుటముగా ప్రచురించిన ఆంధ్ర కవుల చరిత్రమునందు 218 మంది కవుల చారిత్రములు కూర్పబడినవి. పంతులుగారు మిత్రుల, సాహిత్య

పరుల, ప్రోత్సాహమువలన 1917వ సంవత్సరమునందు తమ కవుల చరిత్ర ప్రథమ భాగమును సంస్కరించి, విపులపరచి ప్రకటించిరి. 1899వ సంవత్సరమున ద్వితీయ భాగమున కూర్చబడిన, గౌరన మంత్రి, వెన్నెలకంటి సూరన, నంది మల్లయ, ఘంట సింగయ్య, దూబగుంట నారాయణ కవుల చారిత్రములు 1917వ సంవత్సరమున పునస్సంశోధిత ముద్రణమునందు ప్రథమ భాగమున చోటు చేసి కొన్నవి. ఈ సంశోధిత ముద్రణము నందలి ముప్పది తొమ్మిదిమంది కవుల చరిత్రములలో పదముగ్గురు కవుల చరిత్రములు క్రొత్తగా చేర్చబడినవి. నలుగురు కవుల చరిత్రములు, క్రొత్తగా లభించిన యాధారములవలన ద్వితీయ భాగమునుండి, ప్రథమ భాగమునందు చెర్చబడినవి. 1917వ సంవత్సరమునకు పంతులుగారు రచించిన కవుల చరిత్రములు 232 అని స్పష్టమగుచున్నది. ఈ సంస్కరణ పూరణములతో వెలువడిన గ్రంథమునందు, పూర్వముద్రణములందు కనపడని నన్నెచోడకవి, ప్రతాపరుద్రుడు, చిమ్మపూడి అమరేశ్వరుడు, రావిపాటి తిప్పన్న, వినుకొండ వల్లభరాయడు, నిశ్శంక కొమ్మన, వగ్గుపల్లి దుగ్గయ్య, భైరవకవి, ఫణిభట్టు, మనుమంచిభట్టు, కేతన మంత్రి, కవిభల్లటుడు, కవిరాక్షసుడు, అను వారల చారిత్రములు అధికముగా చేర్చబడినవి. ప్రథమ భాగమునందలి యనేక సిద్ధాంతములు, కాలనిర్ణయములు, దేశాదికములు, సంశోధిత ముద్రణమునందు మార్పు చెందినవి. 1899వ సంవత్సరమునందు మూడు భాగములును కలిపి, ఏకసంపుటముగా వెలువరించినప్పుడు పంతులుగారు ద్వితీయ భాగమునందు "చరిత్రము తెలియని యితర కవుల గ్రంథములు"ను శీర్షిక క్రింద నొక యనుబంధమును చేర్చియున్నారు. ఈ సంపుటమున నన్నయ భట్టారకునితో నారంభించి, తమ సమకాలీనులగు మండపాక పార్వతీశ్వర కవి వరకును, గల రెండువందల ముప్పదిరెండు మంది కవుల చరిత్రములను పంతులుగారు మూడు భాగములుగా కూర్చియున్నారు. పంతులుగారు చేసిన కాలవిభజనము వారి పరిశోధనా పాటవమును పట్టి యిచ్చుచున్నది. పంతులుగారు నన్నయభట్టారకుని నుండి శ్రీనాథుని వరకునుగల కవులను పూర్వకవులుగను, శ్రీకృష్ణదేవరాయలనుండి కాకునూరి అప్పకవి వరకును గల కవులను మధ్యకవులనుగను, దక్షిణాంధ్ర వాఙ్మయమునందు వర్ధిల్లిన కవుల నుండి పందొమ్మిదవ శతాబ్దమున తమ కాలమువరకును వర్ధిల్లిన కవులను ఆధునిక కవులుగను, నిర్ణయించిరి. పంతులుగారే ద్వితీయ, తృతీయ భాగములను సంస్క-

రించి ప్రకటించి యుండినచో విషయబాహుళ్యమును, విమర్శనామహితమునై, ఆంధ్ర కవుల చరిత్రము పరమ ప్రామాణిక గ్రంధమై విలసిల్లి యుండెడిది

వీరేశలింగంపంతులుగారి కవుల చరిత్రము తక్కిన కవుల చరిత్రములకన్న విశిష్టమై యలరారుటకు, దాని యందున్న మహాగుణములు రెండు. అందొకటి కవి కాలాదులు నిర్ణయించిన పద్ధతి రెండు కావ్యతత్త్వవిమర్శ. పంతులుగారు పండితులును, కవులును నగుటచే, కవుల గ్రంధములు పరిశీలించి విమర్శించి కావ్యతత్త్వ వివేచన గావించి యుండిరి. కనుక వారి కవుల చరిత్రము కేవలము కవికాలాదులను నిర్ణయించు చారిత్రక గ్రంథమేగాక, కొంతలో కొంత సాహిత్యవిమర్శయునై యున్నది. పంతులుగారి కవుల చరిత్రము వాఙ్మయ చరిత్ర రచనమునకు పూర్వరంగమయ్యెను. వారు తమ గ్రంధమునందు, సారస్వత విమర్శ సాకల్యముగ, సమగ్రముగ నొనర్చియుండక పోయినను, కావ్యవిమర్శయందు కొన్ని యుత్తమములైన సంప్రదాయములను నెలకొల్పి యుండిరి. గ్రంధ విస్తర భీతివలనను, కావ్యతత్త్వ వివేచనము, కృతివిమర్శనము, కవుల చరిత్రము నందప్రధాన విషయములగుటచేతను పంతులుగారు వాని విషయమై యధికముగ వ్రాయలేదు. బహుస్థలములయందు కావ్యశైలిని చూపుటకు ప్రతియాశ్వాసము నుండి యొక పద్యమునో, రెండు పద్యములనో యుదాహరించుచు వచ్చిరి. అనేకులైన కవుల కాలములను, కృతులను సమీక్షింపవలసి వచ్చినప్పు డింతకన్న మరియొక మార్గముండదు. ఇది కాక కవుల దేశకాలాదికములను నిర్ణయించుటే పంతులుగారికి శ్రమసాధ్యమయ్యెను. కనుకనే వారు కవుల చరిత్రమును రచించుటకై తాము పడిసశ్రమ మరి యే యితర గ్రంధరచనమునందును పడి యుండలేదని స్వీయచరిత్రము నందు వ్రాసియుండిరి. ఎట్లో 1899వ సంవత్సరమునకు రెండు వందల యిరువదిమంది కవుల జీవిత విశేషములను గ్రంధస్థము చేయగలిగిరికాని, ఇరువదవ శతాబ్ది ప్రధమ పాదము నందు చరిత్ర పరిశోధనము క్రొత్తపుంతలదొక్కి, అనేకములగు శిలాశాసనములు, తాళపత్ర గ్రంధములు, పరిశోధింపబడి నిత్యనూతనములుగా ననేక విషయములు కనుగొనబడుచుండెను పంతులుగారు కవుల చరిత్రము ప్రధమ భాగము నైదవ కూర్పు ప్రకటించునాటికి గూడ కవి రాజశిఖామణి యగు నన్నెచోడ కవిని గూర్చిన విషయములు తెలియలేదు శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు, శ్రీ కొమర్రాజు వేంకట లక్ష్మణరావు పంతులుగారు, శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు, శ్రీ వంగూరి సుబ్బారావు

గారు మొదలగు పరిశోధకాగ్రేసరులు, క్రొత్త శాసనములను, క్రొత్త గ్రంథములను, పరిశోధించి క్రొత్త విషయములను ప్రతిపాదించుచుండిరి కనుక పంతులుగారు తమ కవుల చరిత్రమును పునః సంశోధితముచేసి, సంస్కరించి, ప్రకటించవలసిన యగత్యము కలిగెను. పంతులుగారు కవుల చరిత్రమును తాము జీవించి యున్నంత కాలమును సంస్కరించుచునే యుండిరి. కవుల చరిత్రమునందు వారి కార్యదీక్ష, కావ్యవిమర్శన పాటవము, ఏకాగ్రత, చిత్తశుద్ధి, సత్యదీక్ష, ప్రస్ఫుటములగుచుండును. పందొమ్మిదవ శతాబ్ది యుత్తరార్థము నందాయనతో సరిసమానుడైన పరిశోధకుడు లేడు.[15] పంతులుగారు క్రిందటి శతాబ్దమునందు విలసిల్లిన మహామహులైన పరిశోధకాగ్రేసరులలో నొకరు

పంతులుగారి కవుల చరిత్రమునందు ప్రమాదములు లేకపోలేదు. కాని యవి ప్రమాదములని తెలిసిన తదుపరి పలతులుగారు తమ పొరపాట్లను దిద్దుకొనిరి. తమ కవుల చరిత్రము ప్రథమ భాగమునందలి యనేక సిద్ధాంతములు, కవి కాలాదులు, పరాస్తములుకాగా, పంతులుగారాభాగమును సంస్కరించి ముద్రించునపుడు, ఆ విషయములను తమకు తెలిపిన వారిని కృతజ్ఞతతో నగ్గించుచు, తమ పొరపాట్లను దిద్దుకొనిరి. అనుచితమైన అభినివేశము, తనదే పరమ ప్రమాణమన్న సంకుచితమైన పట్టుదల పంతులుగారియందు కానరావు.

పంతులుగారు కవుల చరిత్రము ప్రథమ భాగమునందు బమ్మెర పోతరాజు చరిత్రమున, పోతన ఒంటిమిట్ట నివాసియని వ్రాసియుండిరి. 1847వ సంవత్సరమున శ్రీమద్భాగవతమును ప్రప్రథమముగా ముద్రించిన పురాణం హయగ్రీవ శాస్త్రిగారి వ్రాతలే పంతులుగారట్లు వ్రాయుట కాధారములయ్యెను కాని తదుపరి ఒంటిమిట్ట, ఓరుగల్లు వాదములందు సత్యము బయల్పడి పంతులుగారు 1917వ సంవత్సరమున కవుల చరిత్రము ప్రథమ భాగమును సంస్కరించి ప్రకటించినపుడు తమ అభిప్రాయమును మార్చుకొనిరి. 1919వ సంవత్సరమునందు బమ్మెర పోతరాజును గూర్చి యాంధ్రపత్రిక ఉగాది సంచికయందు వారు ప్రచురించిన వ్యాసము వారి వాదబలమునకును, ప్రామాణికత్వమునకును, ధీశక్తికిని సాక్షిభూతమై యలరుచున్నది. ఇట్లే కవుల చరిత్ర ప్రథమ భాగమునందు రావుసింగ భూపాలుడు వెంకటగిరి సంస్థానాధీశుడనియు, శ్రీనాథుడు రాజమహేంద్రవర రెడ్ల యాస్థాన విద్వాంసుడై నందనందన చరిత్రమను ప్రబంధమును రచించెననియు పంతులుగారు వ్రాసియుండిరి.

కాని యీ విషయము లన్నియు పంతులుగారు సంస్కరించి ప్రకటించిన కవుల చరిత్ర ప్రథమ భాగమునందు సవరింపబడలేదు. పావులూరి మల్లనను గూర్చి వ్రాయుచు ప్రథమమున పంతులుగారాతడు నన్నయభట్టు సమకాలికుడని సిద్ధాంతీకరించిరి. కాని ప్రథమ భాగము సంస్కరించి ప్రకటించునపు డీ మల్లన నన్నయభట్టు కాలమున నుండి రాజరాజనరేంద్రునిచే నవఖండవాడ యను నగ్రహారమును బడసిన మల్లన మనుమడేమో యని సందేహము కలుగునట్లు వ్రాసిరి. శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రి గారు గణితసార సంగ్రహకర్తయైన పావులూరి మల్లన, నన్నయభట్టు సమకాలీను డైన మల్లన మనుమడని నిరూపించియున్నారు కావున పంతులుగారు తమ యభి ప్రాయమును దిద్దుకొని యుండవచ్చును.[16]

పంతులుగారి కవుల చరిత్రము తృతీయ భాగమునందనేకుల కాలనిర్ణయము చేయబడలేదు. ద్వితీయ భాగమునందు సైతము కొందఱు కవుల కాలములు తెలియ వచ్చుటలేదని పంతులుగారు ఊహలకే వదిలిపెట్టిరి. అయినను ఆ కాలమునందు తమకు లభించిన సాధన సంపత్తితో నట్టి యుద్గ్రంథమును కూర్చుట యనన్య సాధ్యము. అప్పకవీయము, ఆనందరంగ రాట్ఛందము, ఆంధ్రశబ్ద చింతామణి, బాలసరస్వతీయము, వాసుదేవవృత్తి, అహోబల పండితీయము, అధర్వణకారికలు, ఆంధ్రభాషా భూషణము, కవి చింతామణి, కవిలోక సంజీవని, కవిజనాశ్రయము, సర్వలక్షణ సారసంగ్రహము, శారదాదర్పణము, ద్విరేఫదర్పణము మొదలగు లక్షణ గ్రంథముల నవలోడనముచేసి, వివిధ మండల చరిత్రములను బరిశీలించి, కర్ణాటక కవి చరిత్రము, సిద్ధేశ్వర చరిత్ర, సోమదేవరాజీయము, మొదలగు చారిత్రక గ్రంథములను పరిశోధించి పంతులుగారు మిక్కిలి శ్రమపడి కవుల చరిత్రమును కూర్చిరి. "వీరనేకము లైన లక్ష్యలక్షణ గ్రంథములు, చరిత్రములు, శాసనములు పరీక్షించి . యీ గ్రంథ మును వ్రాసియున్నా"రని బ్రహ్మశ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు పంతులుగారి గ్రంథమును సమీక్షించుచు వైజయంతి పత్రికయందు వ్రాసియున్నారు[17] పంతులు గారి కవుల చరిత్రము ద్వితీయ భాగమునందలి ప్రమాదములను రామకృష్ణ కవిగారీ సమీక్షయందు విపులముగా చర్చించియున్నారు పింగళి సూరనార్యుని కాలనిర్ణ యము ప్రమాద భూయిష్టమనియు, రామరాజ భూషణునిశైలి తెలియుటకై పంతులు గారుదాహరించిన "కుదురుమెఱుంగు సిబ్బరపు గుబ్బలపై నయనాంబుపూరముల్" అను పద్యము శంకరకవి కృతమైన హరిశ్చంద్రోపాఖ్యానమున పంచమాశ్వాసమున,

76వ పద్యముగా నున్నదనియు, పంతులుగారు తెనాలిరామకృష్ణుని చరిత్రమునందు, రామకృష్ణకవి 'ఇందుధరోపాఖ్యానము' లోనిదని "ఒకనా డిందుధరుండు పార్వతియు లీలోద్యానకేళీసరి..." అని యుదాహరించిన పద్యము నాచనసోమనాథుని ఉత్తర హరివంశమున పంచమాశ్వాసమున నున్నదనియు, నిట్లే పంతులుగారు పడిన ప్రమాదములను రామకృష్ణకవిగారు చూపియున్నారు.

ఇక వీరేశలింగంపంతులుగారు తమ కవుల చరిత్రమునందు చూపిన సాహిత్య విమర్శ స్తుతిపాత్రముగా నున్నది. నన్నయ భట్టారకుని చరిత్రమునందు, నన్నయ భట్టారకుని యనువాద విధానమును గూర్చి పంతులుగారు లెస్సగా పరిశీలించి యున్నారు. స్థాలీపులాకన్యాయముగా పంతులుగారి కావ్యవిమర్శ యేమార్గము ననుస రించెనో తెలిసికొనుటకీ క్రింద కొన్ని యుదాహరణములు చూడవచ్చును. నన్నయ భట్టును గూర్చి వ్రాయుచు "కవిత్వ నైపుణి యెట్లున్నను కథ మాత్రము మూల గ్రంథమగు వ్యాసవిరచిత సంస్కృత భారతమునకు సరియైన భాషాంతరము కాదు. ఈ కవి యొక్కడు మాత్రమేగాక సంస్కృత పురాణములను తెనిగించిన యాంధ్ర కవు లందఱును గూడ తమ యిష్టానుసారముగాఁ గొన్నిచోట్ల మూలగ్రంథములోని కథలను సంగ్రహపరిచియు, కొన్నిచోట్ల పెంచియు కొన్నిచోట్ల కథలను మార్చి వేఱు కథలను చేర్చియు - మూలగ్రంథములకంటె తమ గ్రంథములు భిన్నములుగా నుండునట్లు చేసిరి"[18] అని పంతులుగారు వ్రాసి యున్నారు. తిక్కనసోమయాజి చరిత్రమునందు, తిక్కన కవనచాతుర్యమును పొగడుచు" ఎక్కడ నే విశేషణము లుంచి యేరీతి నే పదములు ప్రయోగించి రసము పుట్టింపవలయునో యీ కవికి దెలిసినట్లు మరియొకరికి దెలియదు, ఈయన కవిత్వము లోకోక్తులతో గూడి జాతీయ ముగా నుండును; ఈయన పద లాలిత్యమును, యుక్తి బాహుళ్యమును, అర్థగౌరవ మును, రచనా చమత్కృతియు, శయ్యావిశేషమును, సందర్భశుద్ధియు, కల్పనా కౌశలమును, అన్యులకురావు, ఈ కవి శిఖామణి యొక్క కవిత్వము నందొకవంతు సంస్కృత పదములు, రెండు వంతులు తెలుగు పదములు నుండును..." అని వ్రాయుచు, తిక్కన విరాటపర్వము నందలి కథను మూలముకన్న పెంచెననియు, తక్కిన పర్వములను సంగ్రహపరచెననియు, ఉద్యోగపర్వము నందలి సనత్కు మారోపదేశమును మూలములో పది పండ్రెండు పత్రము లున్నదానిని తెనుగున రెండు మూడు పద్యములలో సరిపెట్టెననియు, భగవద్గీతలు, ఉత్తరగీతలు, మొద

లయిన వానిని తెనిగింపనే లేదనియు పంతులుగారు తిక్కనార్యుని కావ్యశిల్పమును సమీక్షించియున్నారు[19]. భాస్కరాదుల రామాయణమును సమీక్షించుచు వారి యను వాద పద్ధతులను పంతులుగారు లెస్సగా పరిశీలించినారు. "అందుచే సంస్కృతమున నిరువదినాలుగువేల గ్రంథముగానున్న రామాయణము, తెనుగున పదునేనువేల గ్రంథ మయినది ఈ కవులు మొత్తముమీద గ్రంథమును సంగ్రహపరిచినను కొన్నిచోట్ల పెంచక సహితము పెంచిరి ఎట్లన యుద్ధకాండమునందు మాఘకావ్యము నందలి యేడవ సర్గము చేర్పబడినది..." యని భాస్కర రామాయణ కవులను గూర్చి వ్రాసిరి.[20]

బమ్మెర పోతరాజు చరిత్రమునందు రేపద్వైవిధ్యమును గూర్చి చర్చించుచు, పంతులుగారు రేప, అకారములకు యతిమైత్రిని, ప్రాసమైత్రిని కూర్చిన పూర్వకవుల గ్రంథములనుండి యుదాహరణములు చూపిరి. అల్లసాని పెద్దనార్యుడు, శ్రీకృష్ణ దేవరాయలు, పింగళి సూరన్న, అయ్యలరాజు రామభద్రుడు, పిల్లలమఱ్ఱి పినవీర భద్రుడు, సంకుసాల నృసింహకవి మొదలగు పూర్వకవులు రేప, అకారముల మైత్రిని పాటించినవారే యని పంతులుగారు నిరూపించి యున్నారు ఇంకను పోతనా మాత్యుని యనువాద పద్ధతినిగూర్చి "పోతన కవిత్వము భక్తిరస ప్రధానమయినది, పదలాలిత్యము గలదయి, యమకాది శబ్దాలంకార భూయిష్టమయి, శ్రావ్యముగా నుండును. ఇతడు భారతమును రచియించిన కవులవలెగాక తన భాగవతమును మూలగ్రంథమునకంటె బెంచి వ్రాసెను. మూలమైన సంస్కృత భాగవత గ్రంథ సంఖ్య యిరువదివేలుగా నున్నను, ఇతడు రచియించిన తెలుగు భాగవతము ముప్పది వేల గ్రంథము కలదిగానున్న"దని వ్రాయుచు, పోతనగారు భగవద్గుణ వర్ణనాదులు వచ్చినప్పుడు తనభక్తి తేటపడునట్లుగా స్వకపోల కల్పితవర్ణనలు గూర్చియు, భాగవతములో లేని విష్ణుపురాణాదులలోని కథలను చేర్చియు, వ్యాసవిరచిత మూల గ్రంథమునకు టీకవలె తెలుగు భాగవతమును, వెలయించిరని పంతులుగారు పోతనా మాత్యుని కావ్యగుణములను బొగడియున్నారు.[21]

ఈ విధముగా పంతులుగారు తమ కవుల చరిత్రము కేవలము, కవికాలాదు లను దెల్పు చారిత్రక గ్రంథమునుగా మాత్రమేదిద్ది తీర్చక, కావ్యతత్త్వప్రకాశికగా గూడ లక్ష్యీకరించియున్నారు.

ఏ గ్రంథము పఠించినను పంతులుగారి ప్రత్యేకవ్యక్తిత్వము వారి గ్రంథములలో ప్రస్ఫుటమగుచుండును. అట్టి ప్రత్యేకవ్యక్తిత్వము కవుల చరిత్రము నందు నైతము ప్రస్ఫుటమగుచుండెనాయని పరిశీలించినచో కొన్ని ఉదాహరణములు గాంచనగును. పంతులుగారు తమ స్వీయ చరిత్రమునందొక సందర్భమున "సంఘ దురాచార సంస్కరణమును, పరిశుద్ధ మతధర్మ ప్రకటీకరణమును నా మనస్సెప్పుడును బాయకుండునుగాన నేనే పుస్తకముజేసినను దానిలో నవకాశమున్నయెడలనే సందర్భమునైనను వాని నించుక చొప్పించుచుందును" అని వ్రాసియున్నారు[22] పంతులుగారి ప్రత్యేకవ్యక్తిత్వమిదియే! ఆంధ్రకవుల చరిత్రమునందు నైతము పంతులుగారి ప్రత్యేకవ్యక్తిత్వమును పట్టియిచ్చు నభిప్రాయములు కొన్ని వారు వెలువరించిరి ధూర్జటి కవిచరిత్రమునందు పంతులుగారు "స్తుతమతియైన యాంధ్రకవి దూర్జటి పల్కులకేలగల్గెనో" యన్న చాటు పద్యమును వ్యాఖ్యానించుచు "పయి పద్యమునుబట్టిమాడగా దూర్జటికవి సంతత వేశ్యాప్రియుడయిన రసిక పురుషుడయినట్టు కనుపట్టుచున్నాడు అట్టి యఖండ శివపూజాదురంధరుడైన భక్తాగ్రేసరుని నిట్టి జారత్వదోషమేల విడువకుండెనో యూహింపజాలకున్నాము. మన దేశము యొక్క దౌర్భాగ్యముచేత చిరకాలమునుండి యిచ్చట విశుద్ధ చరిత్రము మతమునుండి విడిపోయినది. ఎట్టిదుశ్చరిత్రము గలవాడయినను విభూతి, రుద్రాక్షలు మొదలయిన బాహ్య చిహ్నములను ధరించిన మాత్రమున భక్తాగ్రేసరుడుగా బరిగణింపబడుచున్నాడు. అయినను క్రమముగా నిప్పుడిప్పుడు మతమునకు సత్ప్రవర్తన మావశ్యకమన్న సత్యము జనుల మనస్సులలో నాటుకొనుచున్నందునకెంతయు సంతసిల్లవలసియున్న"దని పంతులుగారు వ్రాసియున్నారు[23] ఇదే విధముగా శ్రీనాధమహాకవి చరిత్రమునందును శ్రీనాధమహాకవి అవసానకాలమునందనుభవించిన దైన్యమునకు, దారిద్ర్యమునకు, ఆ కవి సార్వభౌముడు యౌవనమున వేశ్యాగమనాది దోషములచే నీతి బాహ్యమైన జీవనమును గడిపియుండుటే కారణమని పంతులుగారభిప్రాయపడియున్నారు[24] సారంగు తమ్మయ కవిచరిత్రమున ప్రపన్నుడు నీతిబాహ్యుడైనను నిందార్హుడుకాడన్న కవి సిద్ధాంతమును పంతులుగారు విమర్శించుచు "ఇటువంటి సిద్ధాంతములే మన దేశములో నీతికిని మతమునకునుగూడ నమితమైన చెఱుపును కలుగజేయుచున్నవి. నీతిని విడిచిన మతమెప్పుడును దేవునికి ప్రీతికరము కానేరదు"[25] అని వ్రాసియున్నారు. ఇట్లే శేషము వేంకటపతి తారాశశాంక విజయమును.

ముద్దుపళనిరాధికాసాంత్వనమును పంతులుగారు తమ కవుల చరిత్రమునందు విమర్శించియున్నారు.

వీరేశలింగంపంతులుగారి కవుల చరిత్రము, అర్వాచీనులగు కవి చరిత్రకారులకుమార్గదర్శకమైనదనుటలో విప్రతిపత్తి యుండబోదు ఆంధ్రదేశమునందు వాఙ్మయ చరిత్రమును రచించినవారు కాని, భాషాపరిశోధకులు కాని, కవి చరిత్రములు రచించిన వారుకాని, వీరేశలింగంపంతులుగారి నుదాహరింపక, తమ పరిశోధనమును కావింపరు తరువాత వచ్చినకవి చరిత్రకారులపై వారి ప్రభావమనల్పము 1888వ సంవత్సరమున బొద్ది కూరపాడు వేంకటరంగకవియను వారు "పూర్వకవుల చరిత్రము-తొలి భాగము" అను పేరున కవుల చరిత్రము నొకదానిని ప్రకటించియున్నారు. ఈ గ్రంథము నలుబది పుటల పరిమితిగల చిన్న గ్రంథము ఈ గ్రంథమును వీరేశలింగంపంతులుగారి గ్రంథముతో పోల్చి సమీక్షించుచు, వేంకట రంగకవి, వీరేశలింగకవి కవుల చారిత్రమునుండియనేక విషయముల వ్రాసిరేకాని, వారి స్వోపజ్ఞమేమియునులేదని అముద్రిత గ్రంథ చింతామణి వేంకటరంగకవిని విమర్శించినది[26]. ఆ సమీక్షయందే గురజాడ శ్రీరామమూర్తి పంతులుగారి కవి జీవితములు, బొద్దికూరపాడు వేంకటరంగకవిగారి పూర్వకవుల చరిత్రము, బహుజనపల్లి సీతారామాచార్యులుగారు శబ్దరత్నాకరావతారికయందు గూర్చిన కవులచరిత్రములు, కావలి వేంకటరామస్వామి పండితుని దక్కను కవుల జీవిత చరిత్రములను గ్రంథములనుపోల్చుచు "ఇట్టి గ్రంథముల కన్నిటికిని శిరోభూషణమై వీరేశలింగముగారి కవుల చరిత్రము వెలయుచున్నదని" అముద్రిత గ్రంథ చింతామణి పంతులుగారి గ్రంథమును ప్రశంసించినది. పంతులుగారి సిద్ధాంతములతో నాడును, నేడును, అనేకులగు కవి పండిత విమర్శకు లేకీభవింపకపోవచ్చును గాని, పంతులుగారి విమర్శాదక్షతను, సత్యాసత్య వివేక పరిశీలనమును, విషయ ప్రామాణికత్వమును నభినందింపకపోరు పంతులుగారి తరువాత కవుల చరిత్రమును, విశేషముగా పరిశ్రమించి, పరమ ప్రామాణికముగా నిన్న నేటివరకును బొడమిన సకల సాధన సంపత్తి నాధారముగా జేకొని, కవుల చరిత్ర విషయమై వెలువడిన వాదవివాదములన్నిటిని తుదముట్ట బరిశీలించి, భిన్నాభిప్రాయముల సమన్వయపరచి, సూక్ష్మ సూక్ష్మతరాంశ విషయ పరిశీలనా ప్రాగల్భ్యముతో, నిష్పక్షపాత బుద్ధితో, వెలువరించుటకుద్యమించి, ఫలితార్థమును సాధించిన వారు శ్రీ చాగంటి శేషయ్యగారు వీరి కవుల చరిత్రములు,

విషయ వైపుల్యమువలనను, ప్రామాణికములైన కాలాదిక నిర్ణయములకును సర్వుల చేస్తుత్యములైనవి. ఈ చాగంటి శేషయ్యగారును తమ 'కవితరంగిణి' యందనేక సందర్భముల పంతులుగారి సిద్ధాంతములను శిరసావహించినారు పంతులుగారి యభిప్రాయములతో వీరేకీభవింపకపోవుటయు ననేక సందర్భముల యందుగాంచ వచ్చును. కాని పంతులుగారి రచనా ప్రణాళికను వీరు గౌరవించినారు. నన్నయ భట్టారకుని చరిత్రమునందు, తిక్కన సోమయాజి చరిత్రమునందు, పోతనమాత్యుని చరిత్రమున శ్రీ శేషయ్యగారు పంతులుగారి సిద్ధాంతములను గౌరవించినారు కాని శేషయ్యగారి గ్రంధము వీరేశలింగంపంతులుగారి కవుల చరిత్రమున కన్న విషయ వైవిధ్యము కలది. శ్రీ శేషయ్యగారు, బహు పరిశ్రమచేసి పూర్వ కవుల చరిత్రములను పదమూడు వందలను గ్రంధస్థములుచేయుటకు పూనినవారు. పంతులుగారి చరిత్రమునందు రెండు వందల ముప్పది కవిచారిత్రములు మాత్రమేగలవు గురజాడ శ్రీ రామమూర్తి పంతులుగారు ముప్పదిమంది కవిజీవితములను మాత్రమే వెలయించినారు. శ్రీ బులుసు వేంకటరమణయ్యగారు 'ఆంధ్రకవిసప్తశతి'యను పేరిట ఏడు వందలమంది కవిజీవితములను వెలువరించినారు ఇవికాక ప్రత్యేకము కవుల చరిత్రములుగా వెలువడకపోయినను భాషా చరిత్రములుగా వాఙ్మయ చరిత్ర సంగ్రహములుగా, సారస్వత చరిత్రములుగా మరెన్నియో విధములుగా కవిజీవిత విషయ సంబందములైన గ్రంధములు తెలుగు సాహిత్యమునందు వెలసినవి. వీరేశలింగం పంతులుగారు ప్రతిపాదించిన సిద్ధాంతములెన్నియో నేడు అపసిద్ధాంతములైనవి వారు సరిచూచిన పాఠము లెన్నియో నేడు అపపాఠములైనవి. వారు పరిష్కరించిన వివాదములెన్నియో నేడు మరల వివాదమునే కోరుచున్నవి కాని పంతులుగారు చూపినదిత్రోవ పంతులుగారు పెట్టినదిభిక్ష.

కవుల చరిత్ర రచనావిషయమున తాము పడిన కష్టనష్టములను పంతులుగారు పలుతావుల తలపోసినారు తాముపడిన కష్టములనెల్ల వివరించినారు 'నేటి కాలమునందు వలెనాడు గ్రంధాలయములులేవు. నేడు ముద్రింపబడి సర్వజన సులభముగా లభించుచున్న గ్రంధములలో వందలకొలది కాకపోయినను పదుల కొలదియైనను నాడు తెలుగు గ్రంథములు లభింపకుండెను. లభించిన గ్రంథములు సైతమును పరిష్కృతములుకావు. తాళపత్రిక శరణ్యములై దుస్సాధ్యములైయుండెను. నేటి కాలమునకు ప్రకటింపబడియున్న శిలా, తామ్ర శాస

నాదులలో ననేకములు పంతులుగారు కవుల చరిత్రము రచించుటకు పూనుకొను నప్పటికి ప్రకటింపబడి యుండలేదు'. ఇట్టి పరిస్థితులలో పంతులుగారెట్టి యిడుములకు లోనై తాము పూనిన కార్యమును నిర్వహించిరోయనూహ్యము పంతులుగారిట్లు వ్రాసిరి "నేను వ్యయప్రయాసలకు వెనుకదీయక పుస్తక సంపాదనమునకై చెన్నపురి, తంజాపురి మొదలైన దూరదేశములకు సహితమరిగి, యిచ్చినవారి యొద్ద నుండి తాళపత్ర పుస్తకములను సంపాదించియు, గొన్నిటికి మాతృకలకు పత్రికలు వ్రాయించియు, నీయనివారికడ జీర్ణతాళపత్ర పుస్తకముల నెరవుగా గొని చదివి వాని నుండి కావలసిన చరిత్రాంశములను వ్రాసికొనియు......నాకప్పటికి లభించిన పరికర సాహాయ్యమున నాంధ్రకవులనుగూర్చి యేదో తోచినదానినివ్రాసి ప్రకటించి కవుల చరిత్రమనిపించితిని..." [27] అని పంతులుగారు వినయముగా చెప్పికొని యున్నారు. పంతులుగారిన్ని శ్రమలకోర్చి, కవిచారిత్రములను వెలయించుటవలననే కవిపండిత పరిశోధకులకు మన్ననలకు పాత్రమై వారిప్రయత్నము నుతికెక్కినది.[28] పంతులుగారికాలమునకు పరిశోధనా పద్ధతులు రూఢములుకాలేదు సాధన సంపత్తి సమగ్రముగా లభింపలేదు అందువలననే పంతులుగారు ద్వితీయభాగము నందును, తృతీయభాగమునందును తమకవులచరిత్రమున కవికాలాదికములు నిర్ణయించుట దుస్సాధ్యములైన పట్టుల వాని నిర్ణయించు భారమును భావిపరిశోధకులకే వదలి వేసినారు తమకాలమును, ధనమును, తమ యావజ్జీవితమును, సారస్వత పురోభివృద్ధికి, సంఘపురోభివృద్ధికి ధారవోసినారు. పంతులుగారు మరణసమయమునందు కూడ, తెలుగుకవులచరిత్రమును సంస్కరించు తలంపుతోనే యుండిరని శ్రీ గొబ్బూరి వేంకటానందరాఘవరావుగారు తమ వీరేశలింగ కవి నిర్యాణమునందు వ్రాసి యున్నారు.[29] పంతులుగారు చెన్నపట్టణమునకేగుట కవుల చరిత్రమును సంస్కరించి ప్రకటించుటకే. ఆ కార్యభారమునందు వారు నిమగ్నులై యుండగా వారిని మృత్యువు కబళించి వేసినది. అంతకు రెండు సంవత్సరముల పూర్వమే ఆంధ్రకవుల చరిత్రము ప్రథమభాగమును, పంతులుగారు సుపరిష్కృతము గావించి ప్రకటించిరి. 1886 వ సంవత్సరమున 72 పుటలు, 1887 వ సంవత్సరమున 84 పుటలు, 1890 వ సంవత్సరమున 96 పుటలు, 1895 వ సంవత్సరమున 150పుటలు, 1899 వ సంవత్సరమున 160 పుటలు, పరిమాణము కలిగియున్న యీ కవుల చరిత్రము ప్రథమ భాగము 1917 వ సంవత్సరమున 684 పుటల పరిమితిగల గ్రంథముగా

రూపొందినది వీరేశలింగంపంతులుగారి పరిశోధనా ప్రాగల్భ్యమిట్టిది వారి నిర్నిద్ర దీక్షయిట్టిది పంతులుగారి పరిష్కృత ముద్రణమును పిఠాపురి మహారాజుగారైన రావువేంకట కుమారసూర్యారావు మహీపతి వారికి అంకితము గావించిరి పంతులు గారి నామమును శాశ్వతమొనర్చినారు పిఠాపురము మహారాజుగారు పిఠాపుర మహా రాజుగారి పేరును శాశ్వతమొనర్చినారు పంతులుగారు పంతులుగారి కవులచరిత్రము నకును, తదుపరి వెలువడిన కవులచరిత్రమునకును, గల తారతమ్యమును పంతులు గారి మాటలలోనే గ్రహింపవచ్చును

"ప్రతి విషయమునందును చర్చించిన కొలందిని జ్ఞానాభివృద్ధి యగుచుండుట సహజము కావుననే యొకవిషయమునుగూర్చి మొదటవ్రాసిన గ్రంథములకంటె బరిశీలనమీద తరువాత వ్రాసిన గ్రంధములు శ్రేష్ఠతరములుగా నుండును"30

ఈ వాక్యములవలన పంతులుగారి కవులచరిత్రమునకు తరువాత వెలువడిన కవుల చరిత్రములన్నియు శ్రేష్ఠతరములైనవని సిద్ధాంతముకాదు. పంతులుగారి గ్రంథసాహాయ్యమీగ్రంథముల కవలమ్మునా గలదని.

— 0.—

# 11
# స్వీయ చరిత్రము

ఆంగ్లసాహిత్య ప్రభావమున తెలుగులో ప్రభవించిన సాహిత్యశాఖలలో స్వీయచరిత్రయొకటి అన్ని నవ్యశాఖలనువలెనే పంతులుగారు దీనినికూడ చేపట్టిరి తెలుగు సాహిత్యమునందలి అన్ని నవ్యశాఖలును పంతులుగారికి పూర్వమే పుట్టి యుండినను, వానికి సాహిత్యమునందొకస్థితిని, ప్రాచుర్యమును కల్పించివృద్ధిచేసిన వారు పంతులుగారు.

స్వీయచరిత్రమనగా ఆత్మకథనము. ఒకవ్యక్తి తననుగూర్చితానే స్వయముగా చెప్పికొనుట. జీవితచరిత్ర రచనమునకును, స్వీయచరిత్ర రచనమునకును రచన ప్రణాళికయొకటియేయయియున్నను, స్వీయచరిత్ర రచనావిధానమునందు, జీవితచరిత్రరచనమునందు వహించగల స్వేచ్ఛయుండదు స్వీయచరిత్రరచనమునందు కర్త తననుతాను దూషించుకొనుటకాని భూషించుకొనుటకాని యుండరాదు. జీవితచరిత్రమునందట్టి విమర్శనమునకు అవకాశముగలదు.

ఆత్మకథవ్రాయుట కష్టసాధ్యమైనను, నీ విషయమున తమకు మార్గదర్శకత్వమును వహించగలగ్రంథములెవ్వియును తెలుగునలేకపోయినను, పంతులుగారు తమ ప్రవృత్తికిదగినట్లుగ, న్యాయదృష్టితో స్వీయచరిత్రమును రచించియున్నారు

పంతులుగారికి స్వీయచరిత్రరచనమునందు, ఆంగ్లమునందలి, మహాపురుషుల స్వీయచరిత్రములు మార్గదర్శకత్వమును వహించియుండవచ్చును. పంతులుగారి రచనాప్రణాళిక, ఆయనకుగల ఆంగ్లసారస్వత పరిజ్ఞానమును వెల్లడిచేయుచున్నది. ఆంగ్లసాహిత్యమునందు స్వీయచరిత్ర లక్షణమిట్లు వివరింపబడినది

"Autobiography, as the suggestive nomenclature of Southey implies is the biography of a person written by himself Its motives are various among others self-scrutiny for self edification, self justification, as cardinal Newman's beautifully written Apologia Projuavita (1864), a nostalgic desire to linger over enchanting memories as selma Lagerlof's Marbacha (1922), belief that one's experiences

nay be helpful to others, as Hellenkeller's 'The story of my life' (1903), an earnest attempt to orient self amid a world of confusion, as The Education of Henry Adams 1906) the urge for artistic expression or the purely commercial desire to capitalize on fame or position [1]

ఆక్స్ఫర్డు ఆంగ్లభాషా నిఘంటువునందు స్వీయచరిత్రమునుగూర్చిన వివరము క్రింది విధముగానున్నది.

Autobiography (Auto + biography) The writing of one's own History; the story of one's life written by himself.

అన్ని రచనలకన్నను నీ స్వీయచరిత్రము రచించుటకష్టము. ఏలయనగా స్వీయచరిత్రము సజీవులైన వ్యక్తులకు సంబంధించినది. ఒక్కొక్క సందర్భమునందు రచనాకారుడు తనస్వీయచరిత్రమునందు, తనకు సమకాలికులైన కొందరు వ్యక్తులయొక్క లోపములను, ప్రకటింపవలసిరావచ్చును అందువలన వారికిని, వారి సంబంధీకులకును మనస్సునొవ్వజేసినట్లగును ఉన్నదియున్నట్లుగా చెప్పినను రచయితకు ఆత్మశ్లాఘాపరత్వము, పరనింద మొదలగు బలహీనతలాపాదింపబడును

పంతులుగారు తమ స్వచరిత్రమునకు 'స్వీయచరిత్రము' అని పేరిడుటను బ్రహ్మశ్రీ కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారు తీవ్రముగా అధిక్షేపించిరి. తాను వ్రాసికొనిన తన చరిత్రము అనునర్థము 'స్వీయచరిత్రము' అనునామముచే సాధింపబూనుట పాణ్డిత్యవిలసనమని బ్రహ్మయ్యశాస్త్రులవారు వాదించిరి. వారి మాటలలో 'స్వీయచరిత్రమిందపశబ్దము. అనాఘ్రాత పాణినీయగంధులగు పంతులువారిది మెఱుఁగకగ్రంథమున కీనామకరణముగావించిరి";[2] యనియాక్షేపించిరి. స్వీయచరిత్రమనగా తనకు హితమైనచరిత్రమని యర్థమువచ్చుననియు, లోకములో ఎవని చరిత్రమైనను వానికి హితముకాకుండనుండదనియు, కనుక స్వీయచరిత్రమను ప్రయోగమపప్రయోగమనియు శాస్త్రులవారు విమర్శించిరి. కనుక తన చరిత్రమును తాను వ్రాసికొనుటను, స్వకీయచరిత్ర అనికాని, సౌవచరిత్రయనికాని, స్వచరిత్రయని

కాని, యనవలయునని, స్వీయచరిత్రమనరాదని శాస్త్రులవారు నిష్కర్షించి యున్నారు[3] వీరేశలింగంపంతులుగారి స్వీయచరిత్రము, శ్రీబ్రహ్మయ్యశాస్త్రుల వారి నిశితవిమర్శనమునకు గురియైనట్లు మరియేకి విమర్శనమునకు[4] గురికాలేదు స్వీయచరిత్రమునందన్నియు అబద్ధపు వ్రాతలనియు, వీరేశలింగంపంతులుగారికి స్వోత్కర్షాప్రియత్వము, పరోత్కర్షాసహిష్ణుతతప్ప, వేరెట్టిసుగుణములు లేవనియు, శాస్త్రపరిజ్ఞానముశూన్యమనియు, పాండిత్యము సున్నయనియు, బ్రహ్మయ్యశాస్త్రుల వారు తమ యార్యమతబోధినియందు పంతులుగారిని తీవ్రముగా నాడు విమర్శించు చుండిరి. అట్టి విమర్శలయందు పంతులుగారికిని, శాస్త్రులవారికినిగల స్పర్ధలెట్టివో వెల్లడియగుచుండెనేకాని యవి సాహితీపరులకు ప్రయోజనమును కలిగించునట్టివి కాకుండెను

'స్వీయచరిత్రము' అను పదమును శ్రీ వీరేశలింగం పంతులుగారికిపూర్వమే బ్రహ్మశ్రీ గురుజాడ శ్రీరామమూర్తి పంతులుగారు ప్రయోగించియున్నారు "కవి జీవితములు" రెండవకూర్పునందు శ్రీరామమూర్తి పంతులుగారు పీఠికను వ్రాయుచు, ఈ భాగమునందు ఆధునికులైన కవులజీవితములను తాము చేర్పకుండుటకు కారణము నిట్లు వివరించిరి "ఆధునిక కవుల చారిత్రము లిప్పటికాలములో స్వీయచరిత్రములుగా వారి వారి చేతనే వ్రాయంబడవచ్చునుగావున వాటి విషయమయి కవి జీవితములలో నుదాహరించుటకు నిష్కర్షించలేదు" [5]

గురజాడ శ్రీరామమూర్తి పంతులుగా రాశించినట్లుగా, ఆ కాలపు కవులు స్వీయచారిత్రములను వెలువరించి యుండలేదుగాని, స్వీయచరిత్రాంశములను గ్రంథస్థములు గావించియున్నారు. అట్టివారిలో శ్రీ కొక్కొండ వేంకటరత్నము పంతులు గారును, బొబ్బిలి మహారాజు ఆస్థానకవీశ్వరులైన శ్రీ మండపాక పార్వతీశ్వర కవిగారును ముఖ్యులు. వేంకటరత్న కవిగారి బిల్వేశ్వరీయమునందు వారి స్వీయ చరిత్ర కొంతయున్నది బిల్వేశ్వరీయము 1893 వ సంవత్సరమునందు ప్రచురింపబడినది. దానియందు పంతులవారి స్వీయచరిత్రము సంగ్రహముగ దెలుపబడి యున్నది. అట్లే పంతులవారు 1900 సంవత్సరమునందు ప్రచురపరచిన బిల్వేశ్వర శతకమునందు, వారి స్వీయచరిత్రమున్నది ఇదే విధముగ మండపాక పార్వతీశ్వర కవిగారు, తమస్వీయచరిత్రమును "హరిహరేశ్వర శతకము" అనుపేర కూర్చి యున్నారు. ఇది సీసపద్యశతకము. ఈ శతకమునకు 'ఆత్మపర్యాయచర్య' యను

నామాంతరముగూడ కలదు. ఇందలి పద్యములు 'హరిహరేశ్వరదేవ మహానుభావ' యను మకుటముతో నుండును. ఈ శతకము కవిగారు 1894 ప్రాంతముల రచించి దానికి టీకవ్రాయుచుండినట్లు అముద్రిత గ్రంథచింతామణి 1894 జూలై సంచిక వలన తెలియుచున్నది. ఈ శతకమునకు అ ముద్రిత గ్రంథచింతామణ్యాధిపతులు పూండ్ల రామకృష్ణయ్యగారు పీఠికను కూర్చిరి [7]

పీఠికలో వారిట్లు వ్రాసియున్నారు.

" ఈ కవిగారు సంస్కృతాంధ్రముల యందసమాన పాండిత్యముగలిగి ఖ్యాతి బొందియున్నారు. వీరు వ్రాసిన గ్రంథములు, శతకములు, మాలికలు లోనగునవి పెక్కులున్నవి .....ఇట్టి కవిచరిత్రసును ప్రత్యేక గ్రంథముగ ప్రకటింప యత్నించి తత్కవిం బ్రార్థింపఁగ వారు తమ బాల్యప్రభృతి జరిగిన చర్యయంతయు "హరిహరేశ్వర శతకముగ" రచియించి దానికింటీక వ్రాయుచున్నారు ఇందు నీ కవికిం బం్రెండవ వత్సరము మొదలిప్పటివరకు జరిగిన విద్యావిషయిక ప్రసంగము లన్నియు గోచరించును......ఇపుడిక్కవికి నలుబది యొక్కటవ సంవత్సరము జరుగుచున్నది. ఇట్టి గ్రంథ మీ భాషకు నూతనముగాన దీనిం బ్రకటింప బ్రయత్నించినారము".[8]

కావున హరిహరేశ్వర శతకము పార్వతీశ్వరకవిగారి స్వీయచరిత్రమని చెప్పనొప్పును. ఈ గ్రంథము 1895 సంవత్సర ప్రాంతముల ప్రచురింపబడి యుండును.

ఈ విధముగా వీరేశలింగం పంతులుగారు స్వీయచరిత్రమును వెలువరించుటకు పూర్వమే, కొక్కొండ వేంకటరత్నము పంతులుగారి 'బిల్వేశ్వరీయము', బిల్వేశ్వర శతకము, మండపాక పార్వతీశ్వర కవిగారి 'హరిహరేశ్వర శతకము' మొదలగు స్వీయచరిత్రాత్మకములగు రచనలు వెలువడినను, స్వీయచరిత్ర మనునది ఆంగ్ల వాఙ్మయ ప్రోద్బలమున తెలుగు బాసయందొక నవ్యసాహిత్య ప్రక్రియగా రూపొందినదని తలంచువారు, వీరేశలింగం పంతులుగారి స్వీయచరిత్రమే తెలుగు భాషయందు మొట్టమొదటి స్వీయచరిత్ర రచనమని చెప్పుచున్నారు. స్వీయచరిత్ర మనునది ఆంగ్లేయ భాషయందు, వచన రచనగా నుండుట పరిపాటి. ఆంగ్ల సాహిత్య సంప్రదాయముననుసరించి, ఆంగ్లభాషయందలి స్వీయచరిత్రములు వచనముననే రచింప

బడినవి తెలుగుసాహిత్యము నందలి నవ్యశాఖలన్నటికిని, ఆంగ్ల సాహిత్య ప్రభావమే మూలకందమగుటనుబట్టి, వీరేశలింగం పంతులుగారి స్వీయచరిత్రమే తెలుగు సాహిత్యమునందు తోట్టతొలుతటి స్వీయచరిత్ర రచనయవి, స్వీయచరిత్రము వచనము నందుండవలయుననియు. అది ఆంగ్లసాహిత్య సంప్రదాయమనియు, తెలిసినవారు, భావించుటలో విప్రతిపత్తి యేమియుసులేదు దీనిని పురస్కరించుకొనియే కావచ్చును "తెలుగు భాషలో స్వీయచరిత్రమును వ్రాయబూనుకొనుటకిదియే ప్రథమ ప్రయత్నము".[9] అని పంతులుగారు వ్రాసికొనిరి.

తెలుగుభాషలో వీరేశలింగం పంతులుగారి స్వీయచరిత్రమునకు తరువాత వెలువడిన స్వీయచరిత్రములకు పంతులుగారి గ్రంథమే ఒరవడియయినది. కనుక తెలుగుభాషయందు స్వీయచరిత్రరచనమునకు పంతులుగారే మార్గదర్శకులని నిస్సంశయముగా చెప్పవలసియుండును. కాని యీ విషయమునందు సాహితీపరులలో కొన్ని యభిప్రాయ భేదములుకలవు "వీరేశలింగంపంతులు 'స్వీయచరిత్రం' రచించిన పిమ్మట తెలుగులో అట్టి చరిత్రలనేకంగా పుట్టినవి. ఆ చరిత్రలన్నీ వచనగ్రంధాలు. పంతులుగారి స్వీయచరిత్రకంటె ముందే మా గురుపాదులు, స్మరణీయులు శతావధాని వేంకటశాస్త్రిగారు తమచరిత్రను 'జాతకచర్య' అనే పేరుతో పూర్వభాగం రచించారు ఆ గ్రంథం 1935 లో అచ్చయింది. ఇప్పుడు ఉత్తరభాగంకూడా వెలువడింది. కాగా స్వీయచరిత్ర రచనకు వేంకటశాస్త్రిగారే ఆద్యులని చెప్పవలసి వుంటుంది".[10] అని శ్రీ కాటూరి వేంకటేశ్వరరావుగారు వ్రాసిరి.

ఇతఃపూర్వమే యుదాహృతములైన బిల్వేశ్వరీయము, బిల్వేశ్వర శతకము, హరిహరేశ్వరశతకములను గ్రంథములనుబట్టిపై యభిప్రాయము సరిగాదనుట స్పష్టము

"స్వీయచరిత్ర, వచనరచనమునను, వీరేశలింగము మార్గదర్శియే. అంతకు ముందున్న స్వీయచరిత్రలు పద్యాత్మకములు. వీరేశలింగం తన స్వీయ చరిత్రమును నిష్పక్షపాతముగ రచించి, రెండు సంపుటములుగా నాంధ్రలోకమున కొసగెను". అని శ్రీ నిడదవోలు వేంకటరావుగారు వ్రాసియున్నారు.[11]

హరికథా పితమహులు శ్రీ అజ్జాడఆదిభట్ల నారాయణదాసుగారు వీరేశలింగం పంతులుగారికన్నను పూర్వమే స్వీయచరిత్రమును రచించియుండిరని ఇటీవల వారి

జీవితచరిత్రమును ప్రకటించి యుండినవారు, వ్రాసియున్నారు. దీనికి తగినన్ని యుప పత్తులు వారు చూపియుండలేదు. తద్గ్రంథకర్తలైన శ్రీ మరువాడవేంకటచయనులు గారు, నారాయణదాసుగారికి భాగినేయులట కనుక నారాయణదాసుగారే ప్రసంగ వశమున నా విషయమునుచెప్పియైన నుండవచ్చును. నారాయణదాసుగారు వీరేశలింగం పంతులుగారికి పూర్వమే ఆత్మకథారచనమున కుపక్రమించినను, దానిని వారా సాంతము నిర్వహింపలేదు. ముప్పది సంవత్సరములవరకు మాత్రమే దాసుగారు తమ స్వీయచరిత్రమును రచించుకొని యుండిరట. తెలుగు భాషయందు స్వీయ చరిత్రము లేదనియు, అట్టిది తాము రచియించి తెలుగున కొసంగవలయుననియు నారాయణదాసుగారభిప్రాయపడి, స్వీయచరిత్ర రచనమునకు పూనిరట.

"తెలుగులో స్వీయచరిత్రలులేవనియు, అట్టిదానిని తాను వ్రాయవలయునని దాసుగారికి తోచెను. అంతట తనచరిత్ర వచనమున ముప్పదియేండ్లవరకు దాసుగారు వ్రాసిరి. ఇంతలో శ్రీవీరేశలింగంపంతులుగారి స్వీయచరిత్రప్రథమభాగము బయల్వ డెను. దాసుగారు తాము వ్రాయుచుండిన స్వీయచరిత్రము నాపవేసిరి కారణమడుగగా నొకసారి "యెవ్వనిచరిత్రయైనను ముప్పదియేండ్లవరకే లోకమెరుగవలెను. ఆపైని అనవసరము. ముప్పదియేండ్లవరకే సుగుణముండుచు. ఆ పైని పేరాసయున సంతుష్టియు పెచ్చురేగిపోవును. దైవత్వము నశించును. దేవతలనందుకే త్రిదశు లన్నారు. ముప్పదేండ్లుదాటినమీద నందరు రాక్షసులే" అని హాస్యముగా శ్రీదాసు గారు పల్కిరి."[12]

శ్రీ నారాయణదాసుగారి ఆత్మకథలోని కొంతభాగము ఆంధ్రపత్రికయందు ప్రచురింపబడినది. శ్రీదాసుగారి ఆత్మకథయందు శ్రీకొక్కొండ వేంకటరత్నం పంతుల వారి బిల్వేశ్వరీయముయొక్క ప్రసక్తియు వీరేశలింగంపంతులుగారు మద్రాసు యూనివర్శిటీ "పెలో" యయిన విషయమును కలవు. నారాయణదాసు గారు 1864వ సంవత్సరమున జన్మించియున్నారు. వారు ముప్పదిసంవత్సరములు గడచిన తమ స్వీయచరిత్రమును వ్రాసికొనిరనగా 1894 వ సంవత్సరమునకు తరువాతనే వారికి స్వీయచరిత్రము రచించవలయునను కోరిక కలిగియుండవల యును. వీరేశలింగంపంతులుగారు 1898 వ సంవత్సరమునందు సర్వకళాశాల సభ్యులుగా (Fellow of the Madras University) గా ఎన్నుకొనబడిరి.[13] ఈ విషయమై నారాయణదాసుగారి ఆత్మకథయందు ప్రసక్తియుండుటనుబట్టి వారికి

స్వీయచరిత్రము రచింపవలయుననెడి కోర్కె 1898వ సంవత్సరమునకు తరువాతనే కలిగియుండుట స్పష్టము. అదియునుకాక వీరేశలింగంపంతులుగారి స్వీయచరిత్రము వెలువడునప్పటికి నారాయణదాసుగారు స్వీయచరిత్రమును ముప్పదియేండ్ల వరకు గడచిన చరిత్రమును మాత్రమే వ్రాసియున్నారని దాసుగారి జీవితచరిత్రము నుండి పై యుదాహృతిభాగమువలన తెలియనగును. కనుక దాసుగారు తమ జీవిత చరిత్ర రచనమునకు (ఆత్మకథ) 1910 సంవత్సరప్రాంతమున నుపక్రమించి యుందురని యూహింపవచ్చును వీరేశలింగంపంతులుగారు తమ స్వీయచరిత్రమును 1903 వ సంవత్సరముననే రచించుటకు పూనుకొని తమ స్వకీయమగు చింతామణి ముద్రాక్షరశాలయందే 112 పుటలవరకు ఆ స్వీయచరిత్రమును ముద్రించినట్లు 1911 వ సంవత్సరమునందు విజ్ఞానచంద్రికా గ్రంధమండలివారు ముద్రించి ప్రచురపరచిన తమ స్వీయచరిత్రము మొదటిభాగమునందలి అవతారికయందు తెలియబరచియున్నారు. కనుక నారాయణదాసుగారి కన్నను పూర్వమే శ్రీ వీరేశలింగంపంతులుగారు స్వీయచరిత్రమురచనకు పూనియున్నట్లు విదితమగుచున్నది వీరేశలింగంపంతులుగారు తెలుగుభాషలో స్వీయచరిత్రరచనమునను ప్రథములైనను, స్వీయచరిత్రమును రచించుకొన్న తెలుగువారిలో ప్రథములుకారు

స్వీయచరిత్రమును రచించిన తెలుగువారిలో ప్రథములు శ్రీ వెన్నెలకంటి సుబ్బారావుపంతులుగారు. శ్రీ సుబ్బారావుపంతులుగారు కాశీయాత్రాచరిత్రను రచించి మహాప్రసిద్ధినిపొందియున్న ఏనుగులవీరాస్వామయ్యగారికి బంధువులు ఏనుగుల వీరాస్వామయ్యగారు నేటి హైకోర్టుకుపూర్వరూపమైన సుప్రీముకోర్టులో హెడ్ ఇంటర్ప్రిటర్ పదవినిపొంది, ఆంధ్రులకు, ఆంధ్రభాషకు సేవచేసిన మహాపురుషులు కుంపెనీవారి కొలువులోని సుప్రీముకోర్టులో వీరస్వామయ్యగారు ఇంటర్ప్రిటర్ పదవిని పొందుటకు కారకులు శ్రీవెన్నెలకంటి సుబ్బారావుపంతులుగారు ఈ సుబ్బారావుపంతులుగారు చెన్నపట్టణం సదర్ అదాలత్ కోర్టులో 1815సం॥ మొదలుకొని 1829 వ సం॥ వరకు ఇంటర్ ప్రిటరుగానున్నవారు. 1820 వ సంవత్సరమునందు కుంపిణీ ప్రభుత్వమేర్పరచిన మదరాసు వెర్నాక్యులర్ స్కూలుబుక్ సొసైటీయందు సుబ్బారావుపంతులుగారు సభ్యులు 1822-23 సంవత్సరముల మధ్య ఉత్తరదేశయాత్ర వెడలి పుణ్యక్షేత్రముల నన్నిటిని దర్శించి, వారు సందర్శించిన విశేషములన్నిటిని స్వీయచరిత్రమునందు వ్రాసియున్నారు. 1822

సెప్టెంబరు ప్రాంతములలో గుంటూరుచేరి అచట తూము పాపయ్యగారను వారొకరు చనిపోగా వారి చితిపై వారిభార్య (సతి) సహగమనము చేసినదనియు, ఆదృశ్యమును తాముచూచితిమనియు సుబ్బారావుపంతులుగారు తమ స్వీయచరిత్రమునందు వ్రాసి యున్నారు కాని శ్రీ సుబ్బారావుపంతులుగారి స్వీయచరిత్రము తెలుగున రచింపబడ లేదు. పంతులుగారు దానిని ఆంగ్లభాషయందే రచించిరి. మచ్చునకు సుబ్బారావు పంతులుగారి స్వీయచరిత్రమునుండి కొన్ని పంక్తులు దాహరించుచున్నాను.

"In March 1837 I remained at Amaravati to perform Sivaratri and partly at Masulipatam In April we went to Rajahmundry and visited our Kocherlacota family, at Vaapully and Auchanta and thence Vizagpatam We remained there at my scholar Balijepalli Parvateeswara-Sastry house and returned to Rajahmundry for pushkaram for 12 days and reached Nellore on 15-8-1837" సుబ్బారావు పంతులుగారు కలకత్తాలో కల్నల్ మెకంజీ ప్రతినిధియైన కావలిలక్ష్మయ్యగారి ఇంట విడిది చేసినట్లు స్వీయచరిత్రమునందు వ్రాసికొనిరి. కావలి లక్ష్మయ్యగారు వీరికి బంధువులట. సుబ్బారావుపంతులుగారి స్వీయచరిత్రమువలన పందొమ్మిదవ శతాబ్దపు ప్రథమభాగమున దక్షిణహిందూస్థానమున ప్రసిద్ధిపొందిన తెలుగువారి పేరులనేక ములు తెలియనగును సుబ్బారావుపంతులుగారు తమ స్వీయచరిత్రమును ఆంగ్లమున రచించుటచేత, వారి స్వీయచరిత్రము తెలుగుభాషయందలి మొట్టమొదటి స్వీయ చరిత్రముకాజాలదు. ఈ స్వీయచరిత్రమును శ్రీ సుబ్బారావుపంతులుగారి కుమారు లైన వేంకటగోపాలరావుపంతులుగారు 1873 వ సంవత్సరమున మద్రాసులో ఫాస్టర్ ప్రెస్సునందు అచ్చువేయించిరి.

వీరేశలింగంపంతులుగారి స్వీయ చరిత్రము ప్రథమ భాగము 1911వ సంవత్సరమున విజ్ఞాన చంద్రికా మండలి ప్రచురణముగా వెలువడినది. కాని పంతులు గారు మిత్రుల ప్రోద్బలముచే 1903వ సంవత్సరమునసనే స్వీయ చరిత్ర రచనము ప్రారంభించి కొంత భాగము వ్రాసి తమ చింతామణి ముద్రాయంత్రములోనే 112 పుటలు ముద్రించినామని అవతారిక యందు వ్రాసియున్నారు. కాని పంతులుగారు ఇంకను

పూర్వమే స్వీయ చరిత్ర రచనకు పూనినట్లు చెప్పుటకు ఆధారములుకలవు. 25 మే, 1902 తేదిన పంతులుగారు శ్రీరాయసం వేంకటశివుడుగారికి వ్రాసినలేఖలో "నేను 'నా స్వీయ చరిత్రమున' రెండు ప్రకరణములువ్రాసితిని. 40 పుటలు అయినవి అవిమీకు బంపనా ?" అని వ్రాసియున్నారు కనుక మిత్రుల ప్రోద్బలమున పంతులుగారు 1902వ సంవత్సరమునందే స్వీయ చరిత్రము రచనను ప్రారంభించిరని తెలియుచున్నది పంతులుగారిని స్వీయ చరిత్రము ప్రకటింపవలసినదని నిర్బంధపెట్టుచువచ్చిన సి. వై. చింతామణిశాస్త్రిగారు చెన్నపురిని విడిచిపెట్టుట తటస్థించినందున పంతులుగారు స్వీయ చరిత్రమును ముగింపక విడిచిపెట్టిరి కాని 1903వ సంవత్సరమునందు చింతామణి ముద్రాశాలలో ముద్రింపబడిన 112 పేజీల పంతులుగారి స్వీయ చరిత్రమును శ్రీకొమర్రాజు వేంకటలక్ష్మణరావుగారు చదివి, దానిని తమ విజ్ఞానచంద్రికా మండలి ప్రచురణగా ప్రకటించుకొనుట కనుజ్ఞ వేడిరి. పంతులుగారి అంగీకారమునుబడసి, పంతులుగారిచే తమ స్వీయ చరిత్రము ప్రథమభాగమును పూర్తిచేయించి 1911వ సంవత్సరమున, విజ్ఞాన చంద్రికా గ్రంథమాల 15వ ప్రచురణగా, ప్రచురించిరి. తదుపరి విజ్ఞానచంద్రికా మండలి వారే స్వీయ చరిత్రమునందలి ద్వితీయభాగమును 1915వ సంవత్సరమున తమ గ్రంథమాల 28వ ప్రచురణగా వెలువరించిరి. పంతులుగారికి తమ స్వీయ చరిత్ర రచనమునందు తోడుపడిన గ్రంథ సామగ్రియేమైనను కలదాయని విచారించినప్పుడు, పంతులుగారు దినచర్య పుస్తకములను తానుంచలేదని 22వ ఏప్రిల్ 1904తేదిన మద్రాసునుండి శ్రీరాయసం వేంకటశివుడుగారికి వ్రాసిన లేఖవలన స్పష్టపడుచున్నది. కాని ఇది సరికాదు. పంతులుగారు దినచర్య వ్రాసికొన్నారు. క్రమము తప్పక వ్రాసియుండకపోవచ్చును

1894వ సంవత్సరమునందు, రాజమహేంద్రవరమునందు పంతులుగారి వివేకవర్ధనీ ముద్రాశాలయందు కార్యనిర్వాహకుడుగా బనిచేయుచుండిన శ్రీతోలేటి వేంకటసుబ్బారావుగారను వారు, పంతులుగారు ఆ సంవత్సరము వేసవికాలపు సెలవులలో చెన్నపురికి బోయినప్పుడు, పంతులుగారి జీవితచరిత్రమును వ్రాసి వివేకవర్ధనీ ముద్రాశాలయందే ముద్రించి, ఆ సంవత్సరమునందే ప్రచురించిరి. తోలేటి వేంకటసుబ్బారావుగారి 'వీరేశలింగకవి చరిత్రము' 1910వ సంవత్సరమునందు విశేష విషయములుచేర్పబడి, రెండవసారి ప్రచురింపబడినది.

"This is the revised and enlarged edition of the first critical biography written and published by me so long ago in June 1894" అని దీని ద్వితీయ ముద్రణమునందు శ్రీతోలేటి వేంకట సుబ్బారావుగారు వ్రాసియున్నారు. అనగా ఈ 'వీరేశలింగకవి చరిత్రము' వీరేశ లింగంపంతులుగారి స్వీయ చరిత్రము వెలువడునప్పటికి రెండు ముద్రణములను పొందియుండెను ఈ వీరేశలింగకవి చరిత్రము పంతులుగారికి స్వీయ చరిత్రమునందు విశేషించి సహాయకారియయ్యెనని శ్రీపేకుమళ్ళ కామేశ్వరరావుగారు వ్రాసి యున్నారు[16].

వీరేశలింగంపంతులుగారు తమ స్వీయచరిత్రమును తమ గ్రంధసంపుటము లలో నొకదానినిగా బ్రకటించుటకు నిశ్చయించి విజ్ఞానచంద్రికా మండలివారికి ప్రథమ ముద్రణమునకు మాత్రమే అనుమతినొసగిరి. కాని పంతులుగారి జీవితకాలమున 'స్వీయచరిత్రము' రెండవసారి ముద్రింపబడలేదు. 1936 వ సంవత్సరమున హితకారిణీ సమాజమువారు శ్రీచిలకమర్తి లక్ష్మీనరసింహముగారి పీఠికతో దీనిని రెండవసారి ముద్రించియున్నారు మరల 1955 వ సంవత్సరమున శ్రీ భావరాజు వేంకటకృష్ణారావుగారి పీఠికతో హితకారిణీసమాజమువారి పక్షమున తృతీయ ముద్రణము వెలువడినది. మరల 1962 వ సంవత్సరమున హితకారిణీసమాజమువారే, పంతులుగారి స్వీయచరిత్రమునకు సంక్షిప్త ప్రతి (Abridged edition) నొక దానిని వెలువరించిరి. అనగా వీరేశలింగంపంతులుగారి స్వీయ చరిత్రము నేటికి నాలుగుసార్లు ముద్రింపబడినది. ప్రథమమున విజ్ఞాన చంద్రికామండలివారు వేర్వేరు భాగములుగా రెండు సంపుటములను ప్రచురించియున్నారు ద్వితీయ ముద్రణము నందు రెండు భాగములునుకలిపి ఒకే సంపుటముగా హితకారిణీ సమాజము వారు ప్రచురించిరి. తృతీయ ముద్రణమునందుకూడ స్వీయ చరిత్రము రెండు భాగములు- కలిపి ఒకే సంపుటముగా ముద్రింపబడినది మూడవ ముద్రణమునందు స్వీయ చరిత్రమునకు శ్రీమహీధర జగన్మోహనరావుగారు అకారాది క్రమమున విషయాను క్రమణికనుకూర్చిరి. స్వీయచరిత్రము (రెండవ భాగము)ను ప్రప్రథమమున ప్రచు రించిన విజ్ఞాన చంద్రికా మండలివారు హితకారిణీ సమాజమువారినియమనిబంధ నలను దానికి అనుబంధముగాచేర్చి ప్రచురించిరి రెండవ ముద్రణమునందు, మూడవ ముద్రణమునందుకూడహితకారిణీసమాజమువారినియమ నిబంధనములు అను

బంధముగాచేర్చబడియున్నవి. కాని 1962వ సంవత్సరమునందు హితకారిణీ సమాజమువారే ప్రచురించిన పంతులుగారి స్వీయ చరిత్రము సంక్షిప్త ప్రతియందీ యను బంధము ప్రచురింపబడలేదు. సుమారు 900పుటల పరిమితిగల పంతులు గారి స్వీయ చరిత్రము సంక్షిప్త ప్రతియందు 240 పుటలలో సంగ్రహింప బడినది[17].

వీరేశలింగంపంతులుగారు 1919వ సంవత్సరము మేనెల 27వ తేదిని మరణించిరి. వీరు మరణించునప్పటికి స్వీయ చరిత్రము మూడవ భాగమును రచించుచుండిరనియు, మూడవ భాగమునందు నలుబదియైదు పుటలు వ్రాసిరనియు, కడమ భాగమును పూర్తిచేయకయే మరణించి రనియు ఆచంట లక్ష్మీపతిగారు 'మాగురువుగారు'–అను వ్యాసమునందువ్రాసిరి. ఈ స్వీయ చరిత్రము మూడవ భాగమునందలి నలుబదియైదు పుటలునేడు పలభ్యములు కావు

ఇది పంతులుగారి స్వీయచరిత్రమునకు సంబంధించిన ముద్రణముల చరిత్ర

వీరేశలింగంపంతులుగారు తమ స్వీయచరిత్ర ప్రథమ భాగమును తమ ధర్మ పత్ని రాజ్యలక్ష్మిగారి కంకితముచేసిరి. 1911వ సంవత్సరమునందు విజ్ఞాన చంద్రికా మండలివారు ప్రచురించిన ప్రథమభాగమునందు నీ అంకితముకలదు తదు పరి స్వీయ చరిత్రము మూడు సార్లు ముద్రింపబడినది. ఈ మూడు ముద్రణముల యందును స్వీయచరిత్రమును పంతులుగారు తమ ధర్మపత్నికి అంకితముగాచేసిన విషయము ప్రసక్తము కాకుండట విచార్యము. ద్వితీయ ముద్రణమునందును, తదు పరి ప్రచురింపబడిన సంక్షిప్త ప్రతియందును, రెండు భాగములు కలిసియున్నను, విజ్ఞాన చంద్రికా మండలివారు ప్రచురించిన స్వీయచరిత్రము ప్రథమభాగమునందలి అంకితమునుగూర్చిన పుటను ముద్రించవలసియుండెను. కాని వారు ముద్రించలేదు. విజ్ఞాన చంద్రికామండలివారి ప్రచురణమునందు పంతులు గారిచేతివ్రాతయే, ముద్రింప బడినది ఈ అంకితము క్రింది విధముగానున్నది

ఓమ్

" నేనుచేసిన సమస్త ప్రయత్నములలోను
ఛాయవలెనా తోడ నుండినన్ను

ప్రోత్సాహపఱుచుచు,
ధర్మమార్గాను సరణమునందునాతోడఁగూడ
సకల కష్టములను సంతోష పూర్వకముగా
సహించుచు,
సత్యమైన సహధర్మ చారిణియయి,
తల్లి బిడ్డకువలె నవ్యాజానురాగముతోడ
సహస్ర హస్తములతో సదానాకు
సంరక్షణముచేయుచు,
ఏఁబది సంవత్సరముల కాలము
నా ప్రాణమునకు ప్రాణమయి యుండిన
నా యర్ధాంగ లక్ష్మియైన రాజ్యలక్ష్మికి
దీనినే నంకితముచేయుచున్నాఁడను."

పంతులుగారు తమ స్వీయచరిత్రమును తామే రెండవమారు, రెండుభాగములను కలిపి ఒకే సంపుటముగ ముద్రించుకొనియుండినచో, ఆ ముద్రణమునందును తప్పక యీ అంకితము విషయమయిన వాక్యములను చేర్చియుండెడివారు. పంతులుగారి జీవితకాలమున స్వీయచరిత్రము ద్వితీయ ముద్రణము నొందకుండుటచేతను, వారి మరణానంతరము స్వీయచరిత్రమును ముద్రించిన వారి అశ్రద్ధవల్లను తదుపరి వెలువడిన మూడు ముద్రణములయందును నీ అంకితము భాగము వదలివేయబడినది.

వీరేశలింగంపంతులుగారి స్వీయచరిత్రము తెలుగు భాషలో వెలువడిన స్వీయ చరిత్రము లన్నిటియందును విషయ విస్తృతియందు పెద్దది. పంతులుగారి జీవితాదర్శములు, ఆయన సాధించిన ఘనవిజయములు, పడినపాట్లు, యోచించినచో ఇట్టి విషయ విస్తృతి వారి స్వీయచరిత్రమునకు తప్పదనిపించును పంతులుగారి స్వీయ చరిత్రము రెండు భాగములందును 8 ప్రకరణములు గలవు. తమ చరిత్రము నిట్లు ప్రకరణములుగా విభాగించి, ఆ ప్రకరణములు కాలవిభాగము ననుసరించినవిగాచేసి, తమ చరిత్రను వ్రాయుటచేత, స్వీయచరిత్రమునకు కావ్యత్వమబ్బినది మొదటి భాగమునందు బాల్యదశ, విద్యార్థిదశ, ఉపాధ్యాయత్వ పత్రికావిలేఖకత్వ ప్రథమదశ,

స్త్రీ పునర్వివాహసంస్కార ప్రయాసదశ, అనుప్రకరణములు కలవు. రెండవ భాగము నందు పురమందిర నిర్మాణదశ, గ్రంధకర్తృత్వదశ, విశ్రాంతిదశ, అసహాయదశ, అనుప్రకరణములు కలవు. పంతులుగారి స్వీయచరిత్రమునందు వారు జన్మించినది మొదలు, అనగా 1848వ సంవత్సరము మొదలు 1913వ సంవత్సరమువరకు వారి జీవితచరిత్ర యున్నది. అనగా పంతులుగారి 65 సంవత్సరముల చరిత్ర కలదు. పంతులుగారు 71 సంవత్సరములు జీవించిరి. ఇంచుమించుగా పంతులుగారి స్వీయచరిత్రము, పంతులుగారి జీవిత చరిత్రము యొక్క సమగ్రమైన, సంపూర్ణమైన రూపమనియే చెప్పవలెను. ఈ ప్రకరణముల విషయమునకు తగిన పేర్లు పెట్టుట, కాలవిభాగముచేయుట, అపూర్వ కావ్య విరచనాదక్షులగు పంతులుగారికి ఏల స్ఫురింపక పోవును ? పంతులుగారి స్వీయచరిత్రము రచనాప్రణాళిక వారికిగల అపూర్వ ప్రజ్ఞను వెల్లడిసేయుచున్నది

పంతులుగారి స్వీయచరిత్రమునందు న్యాయస్థానముల యందలి తీర్పులు, అభియోగములు, పంతులుగారి గ్రంధరచనపై సమకాలీనములైన పత్రికల యభిప్రాయములు చోటుచేసుకొనుటచేత, స్వీయచరిత్రము సామాన్య పాఠకుని దృష్టికి అనగత్యములైన విషయములతో విస్తృతినిపొంది యున్నట్లు కన్పట్టును. పంతులు గారు కోర్టు తీర్పులయొక్క ఆంగ్లమూలములను, వాని అనువాదములను, సమకాలీనాంగ్లపత్రికాభిప్రాయములను, వాని అనువాదములను, అనేక సందర్భములందు స్వీయచరిత్రమునందు చేర్చి యుండుటవలన ఇట్టి విషయ విస్తృతికి అవకాశము కల్గినదని చెప్పవచ్చును. అందువలన పంతులుగారి కీర్తివలె స్వీయచరిత్రము కూడ సుమారు 900 పుటల పరిమితిగల బృహద్గ్రంధముగా రూపొందినది. తెలుగు భాషలోని స్వీయచరిత్రములకు మార్గదర్శకత్వమును వహించినదగుట, తెలుగు దేశము నందు పందొమ్మిదవ శతాబ్ది యుత్తరార్ధమునందలి మత సాంఘిక రాజకీయస్థితి గతులనుచాటి చెప్పునదగుట, సాహిత్య చరిత్రమును కనులముందు నిలిపినదగుట వలన, పంతులుగారి స్వీయచరిత్రము ఇట్టి బృహద్రూపము పొందుట తప్పనిసరి యయినది

చిలకమర్తివారు చెప్పినట్లుగా "ఈ స్వీయచరిత్రమునందు వీరేశలింగ మహాశయుని జీవిత కథయేగాక యా కాలమందలి యాచారములు కట్టుబాటులు, న్యాయ

స్థానముల వ్యవహారములు, దేశస్థితి మొదలయినవెన్నో తేటతెల్లముగ తెలియును. అందుచేత నిది యాంధ్రదేశముయొక్క సాంఘిక చరిత్రమని" చెప్పవచ్చును.

"పంతులుగారి స్వీయచరిత్రము ఆంగ్లములోని 'ఫలానా' స్వీయచరిత్రమును పోలినదని చెప్పలేముగాని, వారి గ్రంథములోని విషయ విభాగపద్ధతి, ఇతరులు వ్రాసిన లేఖలనుదహరించు పద్ధతి పరిశీలించి చూచినచో వారెన్నియో 'ఆంగ్లజీవిత చరిత్ర'లను 'స్వీయచరిత్ర'లను సూక్ష్మముగ పరిశీలించినారని తెల్లమగును" [19] అని పరిశోధకులు తలంచిరి.

ఆంగ్లభాషా సంస్కార ప్రభావము పంతులుగారిపై విశిష్టముగా నున్నదనుట స్పష్టము.[20]

'స్వీయచరిత్రము' తృతీయ ముద్రణముపీఠికలో శ్రీ భావరాజు కృష్ణారావుగారు వెలువరించిన "ఆంగ్లభాషా సంపర్కము పంతులుగారి రచనలందు తెలుగు నుడి కారముకంటెను ఎక్కువగా ముందుకు త్రోసికొని వచ్చుచుండును" అను అభి ప్రాయము విమర్శానసహమైనట్టిదేయని చెప్పవచ్చును. పంతులుగారి గ్రంథము లన్నిటి యందును ఇట్టిది మనము కాంచము. స్వీయచరిత్రమునందైనను పంతులు గారు ఆంగ్లమూలముల నుదాహరించి వానికి అనువాదముల నిచ్చు సందర్భముల యందుతప్ప, కడమ ఘట్టములయందు పంతులుగారి సహజసుందరమైన సులభ శైలియే మనము గాంచగలుగుదుము.అనువాద భాగములను మచ్చునకు చూపుచున్నాను.

"His only explanation is that he took money as the manager, that Perraz had no business to subsequently transfer the management without his consent after Putting him to the expense of going to Peddapur and that on this account he refused to recognize the school committee and repay them the Rs 80." (పుట 37. రెం. భా, మొ. ప్ర.) ఈ భాగమునకు పంతులుగారి అనువాదము

"ఆతని యేకసమాధానము కార్యనిర్వాహక ధర్మమున తాను సొమ్ము పుచ్చు కొంటిననియు, తనకు పెద్దాపురమునకు పోవుటకయి వ్యయములను తగిలించిన పిమ్మట తన యనుమతినిబడయక పేరాజు కార్యనిర్వాహకత్వమును మఱియొకరి కియ్యవలసిన పనిలేదనియు అందుచేత తాను పాఠశాల కార్యనిర్వాహక సంఘము

నంగీకరింపనిరాకరించి రు. 80-0-0లును తిరిగి యియ్యలేదనియు అయి యున్నది."

(పుట. 45 రెం భా. మొ ప్ర.)

ఇది ఏలూరి లక్ష్మీనరసింహముగారికిని పంతులుగారికిని జరిగిన వ్యవహార ములో కోర్టువారు ఇచ్చిన తీర్పులోని భాగము. కథా సందర్భమేదైనను అనువాదము సాఫీగా, సరళముగా సాగలేదని చెప్పవచ్చును. ఏలూరి లక్ష్మీనరసింహముగారికిని పంతులుగారికిని నడచిన వ్యవహారములు స్వీయచరిత్రము ద్వితీయభాగమునందు 20వ పుటనుండి 68వ పుటవరకు చోటుచేసుకొనినవి. తీర్పు యొక్క మూలము, భాషాంతరీకరణము కూడ యివ్వబడినవి ఇట్టివానిని అనుబంధములుగా చేర్చి యున్నచో బాగగానుండెడిది. ఇదే విధముగా స్వీయచరిత్రమునందు ఆంగ్లభాషా నుడికారము త్రోసికొని వచ్చు తెలుగు అనువాదము లెన్నియే నికలవు. చూడుడు.

"Myself and Mr Ramachander asked the Dommugudem sahukars to take from you the reasonble price for the logs, but your good reputation is such that the Sahukars refuse to take money from you and they say they contribute this timber towards the charitable purpose you have undertaken" (పుట 7 మొదటి ప్రకర ణము, రెండవ భాగము). తెలుగు అనువాదమిది.

"కట్టెలకు న్యాయమైన వెలలను మీ యొద్దనుండి పుచ్చుకోవలసినదని నేనును రామచందర్‌గారును దొమ్మగూడెపు సాహుకారుల నడిగితిమి. కాని మీ మంచిపేరు యెక్కువదైనందున సాహుకారులు మీ వద్దనుండి సొమ్ము పుచ్చుకొనుట కంగీకరింప లేదు. మీరు పూనిన ధర్మకార్యము నిమిత్తమయి తామాకలపనిచ్చెదమని వారు చెప్పుచున్నారు".

(పుట 8 మొ, ప్ర; రెం భా.)

అయినను పంతులుగారి స్వీయ చరిత్రము చిలకమర్తివారు చెప్పినట్లు ఆంధ్ర వాఙ్మయదేవికి సువర్ణమయాభరణము. అన్ని కాలములవారికిని ఉపాదేయమైనట్టిది.

"స్వీయ చరిత్ర కదనమాత్మోద్ధరణమునకువలె పరోద్ధరణమునకును విని యోగపడుచున్నది. సత్యార్థ ప్రకాశమునకును, దురభిమాన దురహంకార నిరసనము నకును ఆత్మచరిత్రలు కథకులకును, పాఠకులకును సాధనములుగనున్నవి" అను

శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి వాక్యములకు లక్ష్యభూతమై నిలిచినట్టిది వీరేశలింగంపంతులుగారి స్వీయ చరిత్రము. ఆంధ్రుల చరిత్రలో వీరేశలింగంపంతులు గారొక యుజ్జ్వలాధ్యాయమును ప్రారంభించిన వారగుట వారి స్వీయ చరిత్రము మన సాహిత్యమునందు శాశ్వతమైన స్థానమును పొందుచున్నది.

పంతులుగారు స్వీయ చరిత్రమును రచించి తెలుగువారికిచ్చుటలో ఇంకొక విశేషమున్నది బ్రాహ్మసమాజ మతమునందు మహాపురుషులని భావింపబడు మహర్షి దేవేంద్రనాథటాగూర్, కేశవచంద్రసేన్, పండిత శివనాథశాస్త్రిగారలు స్వీయ చరిత్ర ములను రచించియున్నారు[22] వీరేశలింగంపంతులుగారి బ్రాహ్మమతాభిమానము జగద్విఖ్యాతము 1906వ సంవత్సరమునందు పంతులుగారు యజ్ఞోపవీతమును సైతము విసర్జించి అనుష్ఠానిక బ్రాహ్మమతస్థులైరి. 1898వ సంవత్సరమున చెన్న పట్టణమున జరిగిన హైందవ దేశీయ సాంఘిక మహాసభకు పంతులుగారు అగ్రాస నాధి పత్యము వహించి, శ్రీమహాదేవ గోవింద రానడేగారిచే, 'దక్షిణ హిందూదేశ విద్యాసాగరుడని' కీర్తింపబడిరి. బ్రాహ్మ సమాజమునందు పంతులుగారికి గల అభిని వేశము, పండిత శివనాథశాస్త్రి మొదలగు వారిలోడి పంతులుగారికిగల మైత్రి వారిని స్వీయ చరిత్ర రచనమునకు ప్రేరేపించి యుండవచ్చును ప్రఖ్యాత వంగ చరిత్ర రచనాకారుడు, మహాపురుషుడు, విద్యావేత్తయగు ప్రతాప చంద్ర మజుమ్దార్‌గారి కిని, వీరేశలింగంపంతులుగారికిని అనేక విషయములందు మహత్వ సామ్యమున్న దనియు, పంతులుగారి స్వీయ చరిత్రమునకు మజుమ్దార్‌గారి స్వీయ చరిత్రమునకు పోలికలున్నవనియు, ఇరువురు మహాపురుషుల మహత్వమును సరిపోల్చవచ్చుననియు శ్రీ వేమూరి రామకృష్ణారావుగారు వ్రాసియుండుట కూడ యీ విషయమునకు సాక్ష్య మగుచున్నది. కావున దేశావృతమైన సంస్కార పరివర్తమునకు శ్రీయుత వీరేశ లింగంపంతులుగారి జీవిత చరిత్రము ప్రమాణముగానున్నది.[23] అని చెప్పుట సత్యము. కనుక "మహావీరుడు, కార్యశూరుడు, ఆస్తిక మతావలంబకుడు, సంఘ సంస్కర్త, వచన రచనా పితామహుడు, శతాధిక గ్రంథకర్త, మహాదాత, మహాకవి యైన వీరేశలింగ మహామహుని చరిత్రమును, నాంధ్రదేశమునందు జనించిన ప్రతి పురుషుడు, ప్రతి స్త్రీయు, జదివి యందుగల వందలకొలది నీతి పాఠముల నేర్చుకొని ధన్యులగుదురని[24] యాశించుట పంతులుగారి 'స్వీయ చరిత్రము' యొక్క గొప్ప తనమును వేయి నోళ్ళ చాటుచున్నదని చెప్పవలెను. కనుకనే పంతులుగారి స్వీయ

చరిత్రము, తరువాత తెలుగు భాషయందు వెలువడిన స్వీయచరిత్రములకు మార్గదర్శకత్వము వహించుటయేకాక, పంతులుగారి జీవనచరిత్రయే సంగ్రహముగా ఇతరుల స్వీయ చరిత్రములలో చోటుచేసుకొన్నది. పంతులుగారి స్వీయచరిత్రము వెలువడిన తరువాత వెలువడిన వల్లూరి సూర్యనారాయణరావుగారి స్వీయ చరిత్రము (1931) నందు వీరేశలింగంపంతులుగారినిగూర్చి (128-132 పుటలు) కలదు. 1933వ సంవత్సరమునందు వెలువడిన రాయసం వేంకటశివుడుగారి ఆత్మ చరిత్రమునందు పంతులుగారిని గురించి(378-384పుటలు)యొక ప్రకరణమే రచింపబడినది. ఆంధ్ర కేసరి టంగుటూరి ప్రకాశము పంతులుగారి స్వీయ చరిత్రమునందు వీరేశలింగం పంతులు గారినిగూర్చిన ప్రకరణము (పుటలు 209-212) కలదు. చిలకమర్తివారి స్వీయ చరిత్రమునందు పంతులుగారిని గూర్చిన ప్రశంసయుండునని చెప్పనవసరము లేదు. శ్రీ కె. యన్. కేసరి నాచిన్ననాటిముచ్చట్లు (పుటలు 171-72), దేశభక్తి కొండా వెంకటప్పయ్య పంతులుగారి స్వీయచరిత్రయందు (60-63 పుటలు) వీరేశలింగంపంతులుగారిని గూర్చి ప్రత్యేకముగా ప్రకరణములు రచింపబడినవి.

## స్వీయచరిత్రలోని ప్రధానాంశములు

మహాపురుషుల జీవితచరిత్రములు కాని స్వీయ చరిత్రములుకాని సంఘ చరిత్రమును, దేశ చరిత్రమును తెలిసికొనుటకు మిక్కిలి సహాయకారులగును. పంతులుగారు మహాపురుషులు, కావున ఆయన స్వీయచరిత్రము పందొమ్మిదవ శతాబ్దియుత్తరార్ధపు తెలుగుదేశపు చరిత్రమని చెప్పవలెను.

ఇరువదియవ శతాబ్ది ప్రథమ పాదమునందు పొడసూపిన భారతీయ స్వాతంత్రోద్యమ ప్రాథమిక ఫలితములను ఆయనచూచెను. కాని ఆనాడు వంగదేశమునుండి వెల్లువయైవచ్చుచున్న స్వాతంత్రోద్యమ ప్రవాహమున ఆయన స్నాతుడుకాలేదు దానికి కారణము పంతులుగారి వెనుక అరువది సంవత్సరముల ఆంధ్రదేశ సాంఘిక చరిత్రముండుటయే సంఘమును సంస్కరించిన తరువాత రాజకీయ సంస్కరణము పట్ల దృష్టి సారించవలెనని స్వీయచరిత్రమునందనేక సందర్భముల ఆయన హెచ్చరించిరి. పంతులుగారి స్వీయచరిత్ర భారతదేశ చరిత్రమున యొకానొక ఘట్టమును నిరూపించుచున్నది.

పంతులుగారు క్రీ శ. 1848వ సంవత్సరమున జన్మించిరి. పరపీడనము నుండి విముక్తమై భారతదేశము క్రీ శ 1947వ సంవత్సరమున స్వేచ్ఛా స్వాతంత్ర్యములను సాధించెను ఈ నూఱు సంవత్సరముల భారతదేశ చరిత్రను పరిశీలించినచో, భారతజాతీయ జీవితమున రెండుదశలు వ్యక్తములగును ఒకటి సంఘ సంస్కరణము. రెండవది సంపూర్ణ స్వాతంత్ర్యసిద్ధికై ప్రారంభించిన రాజకీయాందోళనము ఈ రెంటను కృతకృత్యులైనారు భారతీయులు సాంఘికముగా ఒకానొక జాతి పురోగమింపకయున్నచో ఆజాతినలుపు రాజకీయాందోళనలు విఫలమగును. ఏ జాతి జీవనమునందైనను సంఘ సంస్కరణమే, రాజకీయ సంస్కరణములకు పునాదియగును

భారతదేశ చరిత్రమునందలి ఆంధ్రదేశపు ఘట్టమునందు పంతులుగారి స్థానము విశిష్టమైనది ఆంధ్రదేశ సంఘ సంస్కార చరిత్రమునకు కథానాయకుడు పంతులుగారు ఆయన సలిపిన కృషిని, త్యాగజీవితమును పునాదిగాచేసికొని, ఆంధ్రులు రాజకీయాందోళనమునందుపాల్గొని, స్వాతంత్రోద్యమమున తమ పాత్రను కీర్తనీయముగా నిర్వహించిరి

పంతులుగారాంధ్రదేశమునకు చైతన్యమును ప్రసాదించిరి. నిద్రాణమైయున్న జాతిని మేల్కొలిపిరి మానవత్వమను మహిత ధర్మమును బోధించిరి ఈ బోధనల సమగ్ర స్వరూపమే స్వీయ చరిత్రము

పంతులుగారు స్వార్థరహితజీవనుడు. సంఘసంస్కారాభిలాషి. త్యాగి, మహాత్ముడు, అకలంకనీతివర్తనుడు, నైనను ఆయన చరమ జీవితాధ్యాయమున అపవాదులును, అభియోగములును తప్పలేదు. పంతులుగారు స్వీయ చరిత్రమును తమ నడవడిని సందేహించువారి నిమిత్తమై రచించినారను నభిప్రాయ మొకటి వెల్లడింపబడెను కాని, ఇది సత్యముగాదు. మిత్రుల ప్రోద్బలమువలననే స్వీయ చరిత్ర రచనమున కాయన పూనుకొనినట్లు అవతారికయందు తెలిపియున్నారు. 1911వ సంవత్సరమున పంతులుగారి స్వీయచరిత్ర ప్రథమభాగము వెలువడినది. రెండవ భాగము 1915వ సంవత్సరమున వెలువడినది. పంతులుగారి స్వీయచరిత్రమునందు, 'స్త్రీ పునర్వివాహ సంస్కార ప్రయాసదశ' యను ప్రకరణము తక్కిన ప్రకరణము లన్నిటికన్న పెద్దది. ఇది యుక్తమే. వారు సాధించిన ఘన విజయములలో ప్రముఖమైనదియు, తమ జీవిత సర్వస్వమును ధారపోసి సాధించినదియు, స్త్రీ పున

ర్వివాహ సంస్కారమే కదా. ఇంచుమించుగా 900 పుటల పరిమితిగల పంతులుగారి స్వీయచరిత్రమునందీ స్త్రీ పునర్వివాహ సంస్కార ప్రయాస దశయను ప్రకరణము 300 పుటల నాక్రమించినది తక్కిన ఏడు ప్రకరణములును సుమారు 600 పుటల పరిమితికలిగి యున్నవి పంతులుగారి ప్రకరణ విభజనము, సుష్ఠుగానున్నది. వారి రచనా వైదగ్ధ్యమును చాటిచెప్పుచున్నది స్వీయచరిత్రమున వారు 65 సంవత్సరముల జీవితమును వర్ణించిరి. మొదటి ప్రకరణమైన 'బాల్యదశ'యందు పంద్రెండేండ్ల చరిత్ర మును, ( 1848-60 ), రెండవ ప్రకరణమైన 'విద్యార్థిదశ'యందు మరి పదేండ్ల చరిత్రమును వారు వర్ణించిరి. 1870వ సంవత్సరమున పంతులుగారు ప్రవేశ పరీక్ష యందు ఉత్తీర్ణులైరి అంతటితో విద్యార్థిదశ ముగిసినది మూడవ ప్రకరణమైన 'ఉపాధ్యాయత్వ పత్రికావిలేఖకత్వ ప్రథమ దశ'యందు మరి పదేండ్ల చరిత్రమును, నాలుగవ ప్రకరణమైన 'స్త్రీ పునర్వివాహ సంస్కార ప్రయాసదశ'యందు మరి పదేండ్ల చరిత్రమును పంతులుగారు రచించినారు.

ద్వితీయ భాగము సందలి మొదటి ప్రకరణము 'పురమందిరాదిక నిర్మాణదశ'. ఇది పంతులుగారి 1890-1900 సంవత్సరముల మధ్యకాలపు జీవితమును వివరించునట్టి ప్రకరణము. ఇందు పంతులుగారు తమ కీర్తిని శాశ్వత మొనర్చునట్టి ప్రార్థనా మందిరములను, వితంతు శరణాలయములను, పతితయువతీ సంరక్షణ శాలలను, బాలికా పాఠశాలను, ఆస్తిక పాఠశాలను రాజమహేంద్రవరము, చెన్నపట్ట ణము, బెంగుళూరు, మొదలైనచోట్ల కట్టించి యిచ్చిన చరిత్రము కలదు. దీనితరువాత ప్రకరణము 'గ్రంథకర్తృత్వదశ'యను నట్టిది. పంతులుగారు 1870వ సంవత్సర ప్రాంతము నుండియే వివిధ పత్రికలకు రచనలు పంపుట మొదలుపెట్టిరి. 1874వ సంవత్సరమున వివేకవర్ధనిని ప్రారంభించిరి 1875వ సంవత్సరమున పంచ తంత్రము సందలి విగ్రహమును, నీతిదీపికను ప్రచురించిరి 1883వ సంవత్స రమున సతీహితబోధినియను మాసపత్రిక నొకదానిని ప్రారంభించిరి. 1897లో చెన్నపురి యందుండి, తమ రచనల నన్నిటిని సంపుటములుగా ముద్రించిరి. కనుక 1870వ సంవత్సరము నుండి 1900వ సంవత్సరమువరకు గల కాలమును పంతులుగారు గ్రంథ కర్తృత్వదశగా భావించుట యుచితమే తరువాత ప్రకరణము 'విశ్రాంతిదశ' పంతులుగారి వెనుకటి జీవితము సందలి కార్యవ్యగ్రతతో పోల్చి చూచినచో ఆయన జీవితమున. 1900వ సంవత్సరము తరువాత కాలము

విశ్రాంతిదశయేయని చెప్పవలెను దీని తరువాత ప్రకరణము అసహాయదశ. స్వీయ చరిత్రము నందితర ప్రకరణము లందద్భుతరసమున్నది కాని యీ అసహాయ దశయను ప్రకరణమున కరుణయున్నది. ఈ అసహాయదశ యనునది 1910వ సంవత్సరమునుండి 1913వ సంవత్సరమువరకు పంతులుగారు పడిన కష్టనష్ట ముల చరిత్రము, ఈ విధముగా పంతులుగారి స్వీయచరిత్రము, పంతులుగారు జన్మించిన దాదిగా, వారి కరువదియైదు సంవత్సరములు వచ్చువరకు, జీవితమున తారసిలిన సుఖదుఃఖములు, మానావమానములు, వారు చేసిన దానములు, సాధించిన విజయములు, చెప్పునట్టి మహోద్గ్రంథమై యున్నది

స్వీయచరిత్రమువలన పంతులుగారి సంపూర్ణవ్యక్తిత్వము స్పష్టపడుచున్నది. వారు ప్రసక్తానుప్రసక్తముగా స్వీయచరిత్రమునందు తమనుగూర్చి తాము చెప్పి కొనిన అభిప్రాయములనుబట్టి వారి వ్యక్తిత్వము స్పష్టముగా తెలిసికొనవచ్చును.

"ఒరులు చెడుపను చేసినప్పుడు నాకు కోపమాగదు నేనప్పుడు పరుషభాష ణములు సహితము పలుకుదును" (పుట 37, ప్రథమ భాగము, రెండవ ప్రకరణము).

"ఎక్కడ నే యక్రమము కనబడినను నాది సహించి యూరకుండెడి స్వభా వముకాదు ఆ యక్రమమునకు బ్రతిక్రియను జూచువఱకును నా మనస్సున కూఱట కలుగదు" (పుట 55, ప్ర. భా. రెం. ప్ర.).

"నాకొక యభిప్రాయము పుట్టుటకును దానిని నెఱవేర్పబూనుటకును నడుమ తడవు విశేషముగా నుండదు" (పుట 55

"నేను సాధారణముగా శాంత స్వభావము గలవాడనే యయినను, న్యాయ విషయమున నా గ్రహకారణము కలిగినప్పుడు నా యుద్రేకమునకును పట్టుదలకును పరిమితి యుండదు" (పుట 57).

"ఏ విషయమైనను నేనితరులు చూపిన దారినే పోవువాడనుగాక, మనసు తిరిగినప్పుడు నా దారినే నేను నడచువాడనగుటచేత సులభ వచనరచనా విషయ మయి యితరుల మాటలను పాటిచేయక నా నూతన మార్గానుసారముగా సంభాషణ రూపమున బ్రాహ్మవివాహమును వ్రాసి హాస్యసంజీవని మొదటి పత్రికలో కొంత భాగమును ప్రకటించితిని" (పుట 175, ద్వితీయ భాగము, రెండవ ప్రకరణము).

"సంఘ దురాచార సంస్కరణమును పరిశుద్ధ మతధర్మ ప్రకటీకరణమును నా మనస్సు నెప్పుడును బాయకుండును గాన..." (పుట 194. ద్వి భా, రెం. ప్ర.)

ఈ విధముగా స్వీయచరిత్రము ప్రథమ, ద్వితీయ భాగములలోని ఎనిమిది ప్రకరణము లందును పంతులుగారి వ్యక్తిత్వమును విలువకట్ట గలిగిన వాక్యములు చూడవచ్చును. పంతులుగారు తమ వంశమును గూర్చియు, పితృప్రపితామహులను గూర్చియు తమ స్వీయ చరిత్రమునందు పొగడుకొనలేదు. పంతులుగారిని గూర్చిన జీవిత చరిత్రమును వ్రాసిన తోలేటి వెంకట సుబ్బారావుగారు, పంతులుగారి పూర్వీకు లనుగూర్చి ఘనముగ బొగడియున్నారు కావున పంతులుగారు స్వోత్కర్షకు విముఖులని తెలియుచున్నది అర్వాచీన స్వీయచరిత్రములకు పంతులుగారి స్వచా రిత్రము మార్గదర్శకమైనది. కనుక స్వీయచరిత్ర రచనమునందు సత్యమునకు వినయమును జోడించవలెనను సూక్తికి పంతులుగారి చరిత్రము లక్ష్యముగానున్నది. తమ జీవితానుభవము నాధారముగా చేసికొని పంతులుగారెన్నియో విషయములను భావితరముల వారికి బోధించి యున్నారు. ఇట్టి బోధల నెన్నిటినో స్వీయచరిత్రము నందు మనము కాంచగలము 'స్వీయచరిత్రము' నందెక్కడ చూచినను పంతులు గారి అచంచలమైన ఈశ్వరభక్తి, ఎంతకష్టమునైనను భరించి, న్యాయపక్షమున నిలిచి పనిచేయగలిగిన గట్టిగుండె, ఎవరినీ లక్ష్యపెట్టని స్వతంత్రబుద్ధి, దీనులయెడ దయ, కరుణ, యెడనెడ ఆత్మవిమర్శ, సాక్షాత్కరించుచుండును

పంతులుగారి 'స్వీయచరిత్రము'నందు చిట్టచివరి ప్రకరణమైన అసహాయ దశయందు తమ ధర్మపత్ని రాజ్యలక్ష్మమ్మగారి 'సంగ్రహ జీవితచరిత్ర'మును చేర్చుటవలన, 'స్వీయచరిత్రమునకు' సంపూర్ణత్వము అబ్బినది. పంతులుగారి రచనా ప్రణాళికయందు నిశితమైన ఆలోచన కలదనుటకును, ఆయనగారు ప్రజ్ఞాచక్షువులని చెప్పుటకీ హేతువులు చాలియుండును. రాజ్యలక్ష్మమ్మగారి జీవితచరిత్రమును చెప్పుటకు ఏ జీవితచరిత్రకారుడు ప్రయత్నించినను న్యాయము చేకూర్చియుండెడివాడు కాడు. పంతులుగారే రచించి 'స్వీయ'చరిత్రమునందు చేర్చుటవలన, 'స్వీయచరిత్రము' ఆ పుణ్యదంపతుల చరితార్థమైన జీవితచరిత్రమును రాబోవు తరములవారికి ఆదర్శవంతముగా వెలయించుచున్నది.

పంతులుగారే 'స్వీయచరిత్రము'ను రచించుకొన్నందువలన, జీవిత చరిత్ర కారులు గ్రంథస్థము చేయలేని విషయము లెన్నియో మనకు తెలిసినవి. చిన్నతనము

నందు పంతులుగారు ధవళేశ్వరము నందును, రాజమహేంద్రవరమునందును రెండు మూడుమార్లు అష్టావధానము చేసినారన్న విషయము, భారతదేశ స్వాతంత్రోద్యమమునందు ప్రఖ్యాతిగాంచి, మధుర కవయిత్రి యని పేరుపొందిన సరోజినీదేవి వివాహము (సరోజినీనాయుడు) చెన్నపట్టణము ప్రార్థనా మందిరమునందు పంతులు గారే ఆధ్వర్యవము వహించి చేసిరన్న విషయము (ద్వి. భా, మూ ప్ర, పు. 402) స్త్రీ జనోద్ధారకుడై, భారతరత్న బిరుదు పొందిన కార్వేపండితుడు పంతులుగారికి మిత్రులన్న విషయము, కలకత్తా నగరమున ఆదిబ్రహ్మ సమాజమువారు, సాధరణ బ్రహ్మ సమాజికులూ, భారతవర్ష (నవవిధాన) సమాజమువారు, పంతులుగారిని సభలుచేసి గౌరవించిరన్న విషయము, ఈశ్వరచంద్ర విద్యాసాగరులు, న్యాయమూర్తి మహదేవ గోవిందరానడే, పంతులుగారికి, లేఖలు వ్రాయుచుండిరన్న విషయము, మనము స్వీయచరిత్ర సహాయమువలననే తెలుసుకొనగలము మిస్. మ్యానింగ్ అను సంఘ సేవాపరాయణ, లండను నగరమున మరణించుచు, మరణ శాసనమునందు, వీరేశలింగంపంతులుగారి ధర్మకార్యముల నిమిత్తమై తనసొత్తు నందు 50 పౌన్లు, పంతులుగారికి చందాగా నివ్వవలసినదని వ్రాయుట (ప్ర. భా, మూ. ప్ర, పు. 287) పంతులుగారి దొడ్డకీర్తిని అజరామరము చేయుచున్నది.

'స్వీయచరిత్రము'నందు పంతులుగారెవ్వరిని గూర్చియు నిందారోపణలు, నిష్ఠురోక్తులు, పలుకలేదు వ్యంగ్యముగా, హేళనగా, అపహాస్యముగా, కటువుగా, తమ కపకారము తలపెట్టినవారి విషయము నందైనను పంతులుగారు వాక్ప్రహరణములు ప్రయోగింపలేదు.

సందర్భానుసారముగా పంతులుగారు స్వీయచరిత్రమునందు దేశకాల పరిస్థితులను వర్ణించి యుండుటవలన (ప్ర భా, మూ. ప్ర, పుటలు 89, 96, 97, 142 నా. ప్ర, 209, 399, ద్వి. భా, మొ. ప్ర; పుటలు 87. 99, మూ. ప్ర, పు 309-320, నా ప్ర, పు. 455-463) స్వీయచరిత్రము', కొంతవఱకు దేశ చరిత్రమును, సాంఘిక చరిత్రమును కూడ యగుచున్నది. తెలుగు భాషలోని 'స్వీయ చరిత్రము' లన్నిట నీవిషయమున పంతులుగారి స్వీయచరిత్రమే విశిష్టస్థాన మలంకరించినది.

పంతులుగారి 'స్వీయచరిత్రము'నందలి,రెండవ భాగమున రెండవ ప్రకరణమైన 'గ్రంథకర్తృత్వదశ' (1870-1900) పది సంపుటముల సాహిత్య చరిత్రకు

'పీఠిక' యగుచున్నది. ఒక విధముగా పంతులుగారి పది సంపుటముల కిది (గ్రంథ కర్తృత్వదశ) 'విషయసూచిక' గూడ యగుచున్నది.

పంతులుగారు తమ గ్రంథముల గురించియును, తమ వ్యక్తిత్వమును గురించియును, సమకాలీన పత్రికాభిప్రాయములను 'స్వీయచరిత్రము'నం దుదాహరించుటచే, పంతులుగారి యెడల సమకాలికుల అభిప్రాయములు కూడ తెలియుచున్నవి. ఇంకను ఆ కాలమునందు వెలువడిన కొన్ని పత్రికలను గూర్చియు తెలియుచున్నది. పంతులుగారి "రాజశేఖర చరిత్రముయొక్క" ఆంగ్లానువాదమైన Fortunes wheel అను గ్రంథమును గూర్చి London-Times (1887-సెప్టెంబరు 30) ఇచ్చిన అభిప్రాయమును (పు 162, ద్వి. భా రెం ప్ర) పంతులుగారు 'స్వీయచరిత్రము'నం దుదాహరించుట వలన, 'రాజశేఖర చరిత్రము'నకు నాడెంత వ్యాప్తి యుండెనో తెలియుచున్నది

పంతులుగారి 'స్వీయచరిత్రము'నందు అహంకార మమకారములు, రాగద్వేషములు, కన్పడవు ఆత్మస్తుతి, పరనిందలును లేవు. ఉదాహరణమునకు పంతులుగారికి క్రీ శ. 1893వ సంవత్సరమునందు దొరతనమువారు, 'రావుబహదూరు' బిరుదమును ప్రసాదించినప్పుడు, చెన్నపురి క్రైస్తవ కళాశాలాంధ్ర భాషాభిరంజనీ సమాజమువారు, శ్రీ సమర్థి రంగయ్య 'సెట్టిగారి' యధ్యక్షతన పంతులుగారిని గౌరవించిరి ఈ విషయము 'చింతామణి' (సం. 2. సం 10, 1893, మే) యందు ప్రస్తావింపబడినది, ఈ సభయందు బ్రహ్మశ్రీవేదము వేంకటరాయ శాస్త్రిగారు పంతులుగారి నభినందించిరి. పంతులుగారి కీ సభయందు అభినందన పత్రిక సమర్పింపబడెను.

ఇదే విధముగ రాజమహేంద్రవరమునందును పంతులుగారికి సన్మానసభ జరిగెను. ఆ సభయందు శ్రీ వావిలాల వాసుదేవశాస్త్రిగారును, చిలకమర్తి లక్ష్మీనరసింహ కవిగారును పంతులుగారిపై పద్యములు జదివిరి ఈ విశేషములు స్వీయచరిత్రమునందు పంతులుగారు చేర్చి యుండలేదు. పంతులుగారు స్వోత్కర్షావిముఖులు. ఇట్టి విశేషములు 'స్వీయచరిత్రము'ను ఆదర్శమహితముగా నొనర్చుచున్నవి.

పంతులుగారు తమ మిత్రులు, తమకు చేదోడు, వాదోడునునై యుండిన చల్లపల్లి బాపయ్యగారిని, బసవరాజు గవర్రాజుగారిని, పైడా రామకృష్ణయ్యగారిని

స్వీయచరిత్రము'నందు మిక్కిలి కృతజ్ఞులై స్మరించుకొనియున్నారు. దీనివలన ంతులుగారి సౌజన్యము, వినయ సౌశీల్యములును వ్యక్తములగుచున్నవి.

"పుంసాముదార చిత్తానామ్ జగదేకకుటుంబకమ్" అను సూక్తికి పంతులు ాప లక్ష్యభూతులని 'వారి స్వీయచరిత్రము' చెప్పుచున్నది. వారి స్వీయచరిత్రము ందు, వారి కుటుంబ వృత్తాంతము, వారి సుఖదుఃఖములు, వారి బంధువుల చరి త్రలు, వారి ఉద్యోగము, సంపాదన, తమకు ఇతరులు జరిపిన సన్మానములు మొద ాగు విషయములుకాక, అభాగ్యులైన, అభాగినులైన తన దేశ ప్రజల చరిత్రము లదు "స్త్రీ పునర్వివాహ సంగ్రహములు, స్త్రీ పునర్వివాహ సంస్కార భూతవర్త ానస్థితులు, రాజమహేంద్రవర స్త్రీ పునర్వివాహ చరిత్రము, బాలికా పాఠశాలల రిత్రములు, రాజమహేంద్రవరమునందు లంచగొండులైన ఉద్యోగుల చరిత్రలు, ఱత్మూరి లక్ష్మీనరసింహ సోమయాజి, పైడా రామకృష్ణయ్య మొదలగువారి సంగ్రహ ీవిత చరిత్రములు కలవు మొదటి ప్రకరణమును, చివర ప్రకరణమును, పంతులు ారి స్వీయచరిత్రమై యున్నది. నడుమ ప్రకరణము లన్నియు పందొమ్మిదవ శతాబ్ది ము త్తరార్ధము నందలి ఆంధ్రదేశ చరిత్రమును మన కనులముందు నిలుపుచున్నవి

పంతులుగారి 'స్వీయచరిత్రము' వలన పంతులుగారి సమకాలికులు, వారికి ్రాసిన లేఖలు కొన్ని మనకు లభించుచున్నవి వానిలో శ్రీ కొక్కొండ వేంకట త్నము పంతులుగారు, సమర్ధి రంగయ్య సెట్టిగారు, వావిలాల వాసుదేవశాస్త్రిగారు, ర్మపరం రామకృష్ణమాచార్యులుగారు, మొదలగు కవిపండితుల లేఖలు కలవు.

'స్వీయచరిత్రము' వలన పంతులుగారి జీవితమున, బాల్యమునుండి (1860) ృద్ధులగు వరకు (1915), మత సాంఘిక రాజకీయాభిప్రాయములందు, భాషా ిషయమునందు, వారి యభిప్రాయమ లలో కలిగిన క్రమపరిణామ వికాసమును ప త్రింపవచ్చును

పంతులుగారొక వ్యక్తి మాత్రుడు కాడనియు, ఆయనగారొక సంస్థయనియు, ొక యుద్యమమనియు 'స్వీయచరిత్రము' వలన గ్రహింపవచ్చును.

ఇట్లు పంతులుగారి స్వీయచరిత్రము తెలుగు భాషయందలి 'స్వీయచరిత్రము'ల న్నిటికి తలమానికమై, ఆదర్శప్రాయమై వెలయుచున్నది

— 0 —

# 12
# పరిశిష్టము

(దేశచరిత్ర, జీవిత చరిత్ర, సాహిత్యవిమర్శ, లక్షణగ్రంధములు, శాస్త్రీయ గ్రంధములు, వాచక పుస్తకములు మొదలగునవి)

వీరేశలింగంపంతులుగారు తెలుగు సాహిత్యమునందు స్పృశింపని ప్రక్రియ లేదు సుసంపన్నము చేయని సాహిత్యశాఖ లేదు నాటకములు, వచన ప్రబంధములు, స్త్రీల కుపయోగించెడి పుస్తకములు, కవుల చరిత్రము, పద్యకావ్యములు, వ్యాసములు, మున్నగు సాహిత్యశాఖ లన్నిటను పంతులుగారు లబ్ధప్రతిష్టులు. వారి గ్రంధములు పండిత పామరుల నెల్లరను రంజింపజేసినవి. జనసామాన్యమునకు మిక్కిలి యుపకరించినవి.

"దేశమును మంచిదశకు తీసికొనివచ్చి లోకములో ప్రఖ్యాతి కెక్కెడు దేశములలో నొకదానిని చేయవలెనన్నచో మొట్టమొదట సామాన్య జనుల యొక్క స్థితిని బాగుచేయుటకుఁ బ్రయత్నపడవలయు" ననుట పంతులుగారి గాఢవిశ్వాసము.[1] కనుక వారు సాధించిన సమస్త సత్కార్యములందును, జనసామాన్యము యొక్క మేలును వాడు ప్రధానముగా దృష్టియందుంచుకొనిరి "మూఢత్వము వదులుటకు విద్యతప్ప వేఱుసాధనము లేదు గనుక సమస్త జాతులవారిలోను విద్య వృద్ధిపొందునట్లు చేయుట" దేశాభిమానుల కర్తవ్యమని పంతులుగారు హెచ్చరించియున్నారు. అట్లు జనసామాన్యమునందు విద్యాభిరుచిని కల్పించి, వారి యున్నతికై పాటుపడుటకు దేశ భాషయందు, వివిధ విషయములనుగూర్చి, యుత్తమ గ్రంధములు రచించుట ప్రశస్తమైన మార్గమని పంతులుగారు పలుతావుల, ప్రస్తావించియున్నారు. "జనసామాన్యము యొక్క స్థితిని బాగుపఱచవలెనన్నచో, తప్పక దేశ భాషలలో నుపయుక్తములయిన గ్రంధములను సులభశైలిని వ్రాసి యవి యెల్లవారికిని సుబోధము లగునట్లును, సులభక్రయ సాధ్యము లగునట్లును చేయవలయును. ఇట్టి పనిని నిర్వహించుటకు హూణ భాషయందు మంచి పాండిత్యమును సంపాదించి బహుగ్రంధ ద్రష్టలయి దేశ భాషలయందు గూడ తగినంత కృషిచేసినవారే సమర్థు లగుదురు. ఏమి కాలకర్మ దోషముననో గాని మన దేశమునందు హూణ భాషయందు విశేష

పాండిత్యము గలిగి బహుపరీక్షలిచ్చి మెప్పువడసిన వారెవ్వరును దేశ భాషయందు మంచి పుస్తకములను వ్రాసి జనసామాన్యమును మంచిదశకు తీసుకొనివచ్చుట కింతకయు ప్రయత్నింపకున్నారు......"[2] అని పంతులుగారు దేశ భాషలను వ్యాసమునందు దేశస్థితిని గూర్చి విమర్శించియున్నారు.

"కాబట్టి జనసామాన్యము యొక్క సుఖసంపదను పెంపుచెందింప నపేక్షించువారు గ్రహణాదుల కారణములను దెలుపు జ్యోతిష గ్రంథములను, దేహ ధర్మములను దెలుపు శారీర శాస్త్రములను, దేహమును మంచిస్థితి యందుంచుకొనుట కనుకూలపడు భోజన పాన నిద్రాదులను గూర్చి చెప్పు నారోగ్య శాస్త్రములను, రోగాదికము వచ్చినప్పుడు నివారించుకొనుట కక్కఱపడు వైద్య శాస్త్రములను, మనోధర్మములను గూర్చియు భగవత్స్వరూప గుణాదులను గూర్చియు చెప్పు తత్త్వ శాస్త్రములను, జలవాయ్వాదులను గుణించి చెప్పు జలశాస్త్రాదులను, యంత్ర శాస్త్రములను, తర్కశాస్త్రమును, నీతిశాస్త్రమును, అర్థశాస్త్రమును, భూగోళశాస్త్రమును, దేశ చరిత్రలను, తేటగా నుండు తెనుగు శైలిని వచన రూపమున వ్రాయవలయును[3]" అని పంతులుగారు ఆంధ్ర భాషాభివృద్ధి యను వ్యాసమునందు హెచ్చరించియున్నారు దేశ భాషలను గూర్చియు, దేశీయుల విద్యావిజ్ఞానాభివృద్ధులను గూర్చియు హెచ్చరించియున్నారు.

ఇట్టి మహోన్నతాదర్శములు కలవారు కావుననే పంతులుగారు జన సామాన్యమునకు సుగ్రాహ్యమగు సులభ సుందరమగు వచన శైలియందు, దేశ చరిత్రములు, మహాపురుషుల జీవిత చరిత్రములు, స్త్రీలకు మార్గదర్శకములుగా నుండునట్టి యుత్తమ స్త్రీ చరిత్రములు, స్త్రీల విజ్ఞానాభివృద్ధికై శాస్త్రీయగ్రంథములు, జనులలో ప్రకృతి శాస్త్రజ్ఞానమును వ్యాపింప చేయుటకై, శారీరశాస్త్ర సంగ్రహము, దేహారోగ్య ధర్మబోధిని, జ్యోతిశ్శాస్త్ర సంగ్రహము, జంతు స్వభావ చరిత్రము మొదలగు గ్రంథములు రచించి యున్నారు. బాలురకు వాచకపుస్తకములు, సంగ్రహ వ్యాకరణములను కూర్చి యున్నారు

పంతులుగారు ప్రౌఢమగు శైలియందు పంచతంత్రములోని సంధి, విగ్రహములను రచించియు, అట్టిశైలి విషయమై తమ యభిప్రాయమును మార్చుకొనుటకు కారణము, జనసామాన్యము యొక్క యున్నతిని దృష్టియందుంచుకొనియే

యని చెప్పవలెను. తెలుగు వచన కావ్యాభివృద్ధికై పంతులుగారు త్రొక్కని త్రోవ లేదు తెలుగు భాషయందు పద్యకావ్యములు బహుళముగా నుండుటవలన, వచన కావ్యములు లేని లోపమును పూరింపవలెనని దానికి తలపోసినామని పంతులుగారు స్వీయచరిత్రమునందు తెలిపియున్నారు. భాషవలని ప్రయోజనము జను లొండొరులు తమ యభిప్రాయములను లెస్సగా గుర్తెరుగుట యనియు, భాషలోని గ్రంధముల వలని ప్రయోజనము తమ భావములను దూరమున నున్న వారికిని, రాబోవు తరముల వారికిని సులభముగా తెలుపుట యనియు, నట్టి సౌలభ్యము విగ్రహముల వంటి గ్రంధముల వలన కలుగదనియు, అందరకుఁ దెలియునట్లు గ్రంధములు సులభ శైలిలో రచించుటకు తాము నిశ్చయించుకొంటిమనియు పంతులుగారు స్వీయ చరిత్రము నందు విశదపరచియున్నారు పంతులుగారి నిశ్చయము వలన తెలుగు భాష కెనలేని మహోపకారము జరిగినది. ఆంగ్లేయులు మన దేశమును వశము చేసికొనునాటికి మన దేశమంతయు స్వదేశ సంస్థానాధిపతుల యధీనమున నుండెను. అట్టి స్వదేశ సంస్థానములలో కొన్నిటిని గూర్చి పంతులుగారు సంగ్రహముగ, తమ చింతామణి పత్రికయందు వ్రాసియున్నారు. ఈ స్వదేశ సంస్థాన చరిత్రములు బ్రిటీషు ప్రభుత్వమువారు మన దేశము నందవలంబించిన రాజకీయ విధానములను, వారి రాజనీతిని తెలియచేయగలవు పంతులుగారు వీనిని మిక్కిలి యాసక్తిదాయ కములుగా కూర్చినారు నాటికి ప్రసిద్ధములై, ప్రముఖములుగా నెన్నబడుచున్న స్వదేశ సంస్థానములలో పండ్రెండింటిని గూర్చి పంతులుగారు వ్రాసిరి. అవి

1 హైదరాబాదు రాష్ట్రము 2. మైసూరు రాజ్యము 3. కాశ్మీర రాజ్యము 4 తిరువాన్కూరు రాజ్యము 5 బరోడా రాజ్యము 6 గ్వాలియరు సంస్థానము 7. దర్భంగ రాజ్యము 8 ఇందూరు 9 కూచి బేహారు రాజ్యము 10 జయపుర రాజ్యము 11. ఉదయపుర రాజ్యము 12. యోధపుర రాజ్యముఅనునవి. స్వాతంత్ర్యానంతరమిూ సంస్థానములన్నియు తమ ప్రత్యేక ప్రతిపత్తిని గోల్పోయి నూతన రాజ్యాంగచట్టము ప్రకారము వేర్వేరు రాష్ట్రములలో విలీనములైపోయినవి. కాశ్మీరు, మైసూరు, తిరువాన్కూరు, హైదరాబాదు రాష్ట్రములు మాత్రము ప్రత్యేక రాష్ట్రములుగా కొంత కాలము పరిగణింపబడినను స్వాతంత్ర్యానంతరము సంస్థాన విలీనీకరణోద్యమమున నవియు తమ స్వతంత్ర ప్రతిపత్తిని గోల్పోయి భారత రాజ్యాంగము నందంతర్భాగములైపోయినవి.

నేడు తిరువాన్కూరు, కొచ్చిను, గ్వాలియరు, ఇందూరు, జయపుర, యోధపుర, దర్భాంగ సంస్థానములు తమ ప్రత్యేక ప్రతిపత్తినికోల్పోయి, వివిధ రాష్ట్రములలో అంతర్భాగములై పోయినవి కాని బ్రిటీషు వారీ రాజ్యమును వశపరచుకొనుటలో నిట్టి స్వదేశ సంస్థానములను లెక్కకు మిక్కిలియేర్పరచి, వానిని క్రమముగా తమ యధీనముచేసికొనుచువచ్చిరి. ప్రస్తుత మీ స్వదేశ సంస్థాన చారిత్రములను బరిశీలించిన పై విషయము స్పష్టముకాగలదు. పంతులుగారీ స్వదేశ సంస్థాన చారిత్రములందు, ఆంగ్లేయ ప్రభుత్వము వారివలన నీ సంస్థానములన్నియు వృద్ధిపొందెననియు, సంస్థాన ప్రజలకు మేలుజరిగెననియు నభిప్రాయపడిరి. పంతులుగారితరమువారి కింగ్లీషు ప్రభుత్వముపై భక్తిశ్రద్ధలు మెండు. ఈ కారణమున వారు ఇంగ్లీషు ప్రభుత్వమువారిని ప్రశంసించుట వింతకాదు పంతులుగారు ప్రప్రథమమున నీ సంస్థాన చరిత్రలను 1894-95 సంవత్సరముల మధ్య కాలమున తమ 'చింతామణి' పత్రికలో వెలువరించిరి మరల వీని నన్నిటి నేక సంపుటమునందుకూర్చి 1895వ సంవత్సరమునందు ప్రకటించిరి. ఈ సంస్థాన చరిత్రములందు పంతులుగారు 1891వ సంవత్సరమునందు భారతదేశమున జరిగిన జనపరిగణన ప్రకారము, సంస్థానమునందలి జనుల సంఖ్య, వారి వారివృత్తులు, అక్షరాస్యత, జీవన విధానము, వ్యవసాయపు పంటలు మొదలైన విషయములనన్నిటిని కూర్చియున్నారు

ఈ చరిత్రములం దచ్చటచ్చట బ్రిటిషు ప్రభుత్వము వారి కాలమున ఆంగ్ల భాషోచ్చారమునుబట్టి తిరువాన్కూరును ట్రావెన్కూరనియు, యోధపురమును జొడ్పురమనియు, దర్భంగను దూర్భంగయనియు, రాజకీయ వ్యవహారములందు, వారు పిలుచుచుండుటనుబట్టి, ఆ నామములతో నే అవి వ్యవహరింపబడినవి. పంతులుగారు కాలమునందలి జనపరిగణన ప్రకార మీ చారిత్రములను రచించినారు కావున, ఆ లెక్కలయందున్న పేర్లు గైకొనబడియుండును హైదరాబాదు రాష్ట్రమునుగూర్చి వ్రాయునప్పుడు, సలార్ జంగుగారి ప్రభుభక్తిని, శక్తి సామర్థ్యములను పంతులుగారు ప్రశంసించిరి. కూచిబేహారు రాజ్యమునుగూర్చి వ్రాయునప్పుడు బ్రహ్మసమాజ చరిత్రము సంగ్రహముగా ప్రస్తావింపబడినది. భారతవర్ష బ్రహ్మసమాజమునుండి కొందరు విడిపోయి, సాధారణ బ్రహ్మసమాజముగా రూపొందుట, ప్రస్తావింపబడినది. జయపుర రాజ్యమునుగూర్చివ్రాయుచు స్త్రీ విద్యాభివృద్ధినిమిత్తము సంవత్సరమున కాలువేల రూపాయలకంటెనధికముగా నా సంస్థానమున వ్యయపరుపబడుననని

పంతులుగారు వ్రాయుట వారి విలక్షణమైన వ్యక్తిత్వమున కుదాహరణముగ చెప్ప వచ్చును. ఔరంగజేబు కాలమునందు జరిగిన యుద్ధము నొకదానినిగూర్చి కథగా నీ చరిత్రమునందు పంతులుగారువ్రాసిరి జస్వంతసింగు యొక్క పట్టమహిషి అభిజాత్య మునుగూర్చి యీ కథ వెల్లడించుచున్నది. ప్రాస్తావికముగా రణతిక్కన కథకూడ నీ సంస్థానచరిత్రమునందు సంక్షేపముగా చెప్పబడినది. ఉదయపుర సంస్థాన చరిత్రము నందు అల్లాఉద్దీను ఢిల్లీ చక్రవర్తిగానున్న కాలమునందు మీవార్ సంస్థానమును పాలించుచుండిన భీమసింగునుగూర్చిన కథ వ్రాయబడినది అల్లాఉద్దీను చిత్తూరుకోటను ముట్టడించుట, పద్మినీదేవి వృత్తాంతము, రాజపుత్రుల యద్భుత పరాక్రమము, నీ ఉదయపుర సంస్థాన చరిత్రమునందు వర్ణింపబడినవి.

జాద్పూర సంస్థాన చరిత్రమునందు, రాజపుత్రులలోని దురాచారములు, వానిని మాన్పుటకయి ఇంగ్లీషు ప్రభుత్వమువారు చేసిన కృషియు వర్ణింపబడినవి

ట్రావెన్కూరు (తిరువాన్కూరు) సంస్థాన చరిత్రమునందు మళయాళ దేశీ యుల యాచార వ్యవహారములన్నియు వర్ణింపబడినవి. కొన్ని దురాచారములను పంతులుగారు తీవ్రముగా విమర్శించిరి.

మైసూరు సంస్థానము యొక్క చరిత్ర సంక్షేపముగా తెలుపబడినది.

బరోడా రాజ్యమును గురించి, 1891వ సంవత్సరమునందు నిర్ణయించిన జన పరిగణన లెక్కల ప్రకారము, పంతులుగారు వర్ణించియున్నారు. ఈ సంస్థాన చరిత్రమునందు 'వల్లభాచార్యమతము' పంతులుగారిచే తీవ్రముగా విమర్శింపబడినది.

గ్వాలియరు సంస్థాన చరిత్రమునందు, విశేషముగా గ్వాలియరు సంస్థానము పూర్వ చరిత్రము వివరింపబడినది. సిపాయిల కలహమని ఆంగ్లేయ చరిత్రకారులచే పేర్కొనబడుచున్న ప్రథమ స్వాతంత్ర్య సమరమువరకు నీ సంస్థాన చరిత్రము వివరింపబడినది. కాశ్మీరు రాజ్యమునందు 1891వ సంవత్సరము జనాభా లెక్కల ననుసరించి, ఆ సంస్థానపు స్థితిగతులు వర్ణింపబడినవి. ఇందూరు సంస్థాన చరిత్రము నందు 'అహల్యాబాయి'యనురాణి యొక్క చరిత్రముకూడ వర్ణింపబడినది, ఈ 'అహల్యాబాయి'యను నుత్తమ స్త్రీ చరిత్రమునందు ప్రసంగవశమున వచ్చిన సతీ సహగమనమును పంతులుగారు విమర్శించిరి

దూర్భంగ రాజ్యమునుగూర్చి మిక్కిలి సంక్షేపముగా వివరింపబడినది.

ఈ స్వదేశ సంస్థాన చరిత్రములతో పండిత రామాబాయి సరస్వతియొక్క జీవిత చరిత్రమును, పండిత ఈశ్వర చంద్ర విద్యాసాగరుల జీవితచరిత్రమును, కలిపి, జైమినీ భారతమునందలి చంద్రహాసచరిత్రమునుచేర్చి, బాలుర కుపయుక్తము లగు మరి పది నీతి కథలను, బదరికాశ్రమయోగి, సంజ్ఞల పండితుడను, కథాత్మకము లగు విచిత్ర వృత్తాంతములతోడను, చేర్చి స్వదేశ సంస్థాన చరిత్రాదు లనుపేరున పంతులుగారు 1895వ సంవత్సరమునందు ప్రత్యేక మొక గ్రంథమును ప్రచురించిరి

1897-99వ సంవత్సరముల మధ్య పంతులుగారు తమ గ్రంథముల నన్నిటిని కలిపి పది సంపుటములుగా ప్రకటించునప్పుడీ స్వదేశ సంస్థాన చరిత్రాదులను, ఎనిమిదవ సంపుటమునందు చేర్చిరి

పంతులుగారు రచించిన జీవిత చరిత్రములలో పేర్కొనదగినవి విక్టోరియా మహారాజ్ఞి చరిత్రము, జీసస్ చరిత్రము, రాజారామ మోహనరాయలవారి చరిత్ర మనునవి. ఇవికాక పంతులుగారు తమ సత్యవాదిని పత్రిక యందుత్తమ స్త్రీ చరిత్రములను గూడ ప్రకటించిరి.

1884వ సంవత్సరముననే పంతులుగారు 'సతీహిత బోధిని' యందు విక్టోరియా మహారాజ్ఞిని గూర్చి యొక వ్యాసమును బ్రకటించి యున్నారు 1887వ సంవత్సరమునందు విక్టోరియా మహారాజ్ఞి పంచాశద్వత్సర పరిపాలన మహోత్సవ సమయమును పురస్కరించుకొని 'శ్రీ విక్టోరియా జ్యూబిలీ నవరత్నముల' పేరిట పద్యములను ప్రకటించియున్నారు. 1897వ సంవత్సరమున విక్టోరియా మహారాజ్ఞిచరిత్రమును, మూడు ప్రకరణములుగా పంతులుగారు ప్రకటించిరి. బాల్యావస్థ, సంసారదశ, ప్రభుత్వదశ యను మూడు ప్రకరణములందు రాణీగారి చరిత్రము సవిస్తరముగా దెలుపబడినది.

పంతులుగారికి పూర్వమాంధ్ర భాషయందు జీవిత చరిత్రములు సున్నగా నుండెను. గీర్వాణ భాషయందు సైతము జీవిత చరిత్రములు లేవనియే చెప్పవలెను. బిల్హణుని విక్రమాంకదేవ చరిత్రము, బాణుని హర్ష చరిత్రము మొదలగు జీవిత చరిత్రములున్నను, అవి ప్రధానముగా కావ్య శైలియందు వ్రాయబడి, లోకాతీతము లైన మహామహిమలచే నొప్పారుచుండును. 1894వ సంవత్సరమునందు వీరేశ

లింగంపంతులుగారి జీవితచరిత్రమును, తోలేటి వేంకట సుబ్బారావుగారను వారు ప్రకటించియున్నారు. 1866వ సంవత్సరముననే వింజమూరు కృష్ణమాచార్యుల వారు మహమ్మదు చరిత్ర మింగ్లీషునుండి తెనుగు చేసిరని 'సుజనరంజని' పేర్కొని యున్నది.[4] ఈ "సుజనరంజని" బహుజనపల్లి సీతారామాచార్యులు, ప్రభృతుల సంపాదకత్వమున చెన్నపట్టణమునుండి వెలువడుచుండెడిది 1838వ సంవత్సరముననే ఏనుగుల వీరాస్వామయ్యగారి కాశీయాత్రా చరిత్రమును వెలువరించిన శ్రీ కోమలేశ్వరపురం శ్రీనివాసపిళ్ళగారు, వీరాస్వామయ్యగారి సంగ్రహ జీవిత చరిత్రమును రచించి, ఆ గ్రంథమునందు చేర్చినారు [5] కాని పంతులుగారి కివి మార్గదర్శకములని చెప్పుటకు వీలులేదు. వీరేశలింగంపంతులుగారు ఆంగ్లేయ భాషా నిష్ణాతులు కావున, ఆంగ్లేయ సారస్వతము నందలి జీవిత చరిత్రములను బరిశీలించి యీ గ్రంథమును కూర్చి యుండవచ్చును. ఈ గ్రంథము, ఆంగ్ల భాష యందున్న రాణిగారి జీవిత చరిత్రమున కనువాదముకాదు. రాణిగారిని గూర్చిన యనేక గ్రంథములను బరిశీలించి పంతులుగారీ జీవిత చరిత్రమును వెలువరించి యుందురు. పంతులుగారి వ్యక్తిత్వమును దెలుపుకొన్ని వాక్యము లీ మహారాజ్ఞి చరిత్రము నందు గలవు

"మన మెవ్వరిని మాతృభావముతో గౌరవించుచు నత్యంత ప్రభుభక్తితో సేవించుచున్నామో ఎవ్వరికి భరతఖండమునందలి రాజాధిరాజులును బరమ విధేయులయి యరి యర్పణములు చేయుచున్నారో యా విక్టోరియా మహారాజ్ఞి హిందూధర్మ శాస్త్రములనుబట్టి పునర్భూపుత్రి. వితంతు వివాహము లాచరణీయము లని వాదించెడి సాంఘిక సంస్కార తత్పరులకీయంశము కొంత ప్రోత్సాహకరముగా నుండకపోదు.[6] పంతులుగారే గ్రంథములు రచించుచున్నను,నేసంఘసంస్కార కార్యముల నిర్వహించుచున్నను, వారిని వితంతూద్వాహ సంబంధములైన యూహలో చనలు మట్టుముట్టుచునే యుండును.

పంతులుగారీ విక్టోరియా మహారాజ్ఞి చరిత్రము 'స్త్రీల కుపయుక్తముగానుండు నటుల స్త్రీలకొరకై ప్రకటించితిమని తమ స్వీయచరిత్రమునందు వ్రాసియున్నారు. కావున నీ ప్రఖ్యాత చరిత్రమును పంతులుగారు సులభ శైలియందు విరచించిరి. ప్రథమ ముద్రణమునందీ చరిత్రమును చిత్రపట శోభితముగా నొనర్చి యుండలేదు కాని పంతులుగారు తరువాత ముద్రణములందు రాణిగారి బాల్య, కౌమార, యౌవన

దశలకు సంబంధించినవియు, రాణీగారు నివసించిన రాజప్రాసాదముల యొక్కయు చిత్రములను తమ గ్రంథమునందు చేర్చిరి. రాణీగారి కుటుంబములోని వారి చిత్ర పటములు కూడ నీ గ్రంథమునందు చేర్చబడినవి ఈ గ్రంథము వలన వీరేశలింగం పంతులుగారి తరమువారి కాంగ్లేయ ప్రభుత్వమునెడలయెట్టి భక్తి విశ్వాసము లుండెనో మనకు తెలియగలదు. 'అముద్రిత గ్రంథ చింతామణి' పత్రిక యీ విక్టోరియా మహారాజ్ఞి చరిత్రమును ప్రశంసించినది.[7]

పంతులుగారు రచించిన జీవితచరిత్రములలో నీ విక్టోరియా మహారాజ్ఞి చరిత్రము తరువాత పేర్కొనదగినది శ్రీరాజారామమోహనరాయలవారి చరిత్రము. వీరేశ లింగంపంతులుగారికి రాజారామమోహనరాయలవారియెడ భక్తిశ్రద్ధలుమెండు పంతులు గారు రాజమోహనరాయలవారినే తమ సర్వప్రయత్నములందును నాదర్శముగా నిడికొనిరి అట్టి మహామహుని చారిత్రమును రచించునప్పుడు సైతము పంతులుగా రతిశయోక్తుల పొంతబోలేదు పంతులుగారు రామమోహనరాయలవారి చరిత్రమును, ప్రారంభించి కొన్ని ప్రకరణములు రచించిరేకాని, ముగింపలేదు. రామమోహన రాయలవారి చరిత్రము 'సత్యసంవర్ధని'యందు 1896వ సంవత్సరమునందు ప్రారం భించిరి. ఐదు సంచికలందు మాత్రమే యీ చరిత్రము ప్రకటింపబడినది [8]

ఈ రాజారామమోహనరాయలవారి చరిత్రముకూడ ఆంగ్లగ్రంథమున కను వాదముకాదు. పంతులుగారాంగ్లమునమున్న రామమోహనరాయలవారి గ్రంథము నేదైననాధారముచేసికొని రచించియుండవచ్చును. రామమోహనరాయలవారు జన్మించు నాటికి హిందూదేశమున ప్రబలముగానున్న సాంఘిక దురాచారములు వివరింపబడి, రాజారామమోహనరాయలవారి కృషి బాగుగా వర్ణింపబడినది. పంతులుగారి వ్యక్తిత్వ మునుబట్టియిచ్చు నభిప్రాయములు కొన్ని యీ చరిత్రమునందును గాంచగలము. రామమోహనరాయలవారి తల్లియగు తారిణీదేవి విద్యావతియగుటవలననే రాయలవారు, మహాపురుషులగుటకు కారణమైనదని పంతులుగారి భావన కావున స్త్రీ విద్యను ప్రోత్సహింపవలెనని పంతులుగారి సిద్ధాంతము.[9] అవకాశమంత సందర్భమువచ్చిన పంతులుగారు తమయభిప్రాయములను ప్రచారము చేయుచుండెడివారు జీవిత చరిత్ర ములను రచించుచున్నను పంతులుగారి మౌలికత ప్రస్ఫుటమగుచునే యుండును. పంతులుగారి విశిష్టతయిట్టిది రాజారామమోహనరాయలవారి చరిత్రమును ముగింప

వలెనని పంతులుగారు కాంక్షించిరి. కాని యీ చరిత్రము పంతులుగారిచే ముగింపబడ లేదు.

పంతులుగారు రచించిన మహాపురుషుల జీవితచరిత్రములలో 'జీసను చరిత్రము' పేర్కొనదగినది. జీసనుచరిత్రమునందు పంతులుగారు, ప్రసక్తానుప్రసక్తముగా, సంఘములోని మూఢ విశ్వాసములను ఖండించిరి జీసను చరిత్రముకూడ, అనువాద మని చెప్పుటకు వలనుపడదు. అనేకాంగ్ల గ్రంథముల నవలోడనముచేసి పంతులు గారు 'జీసనుచరిత్రము'నుకూర్చియుందురు. 'జీసను చరిత్రము' పంతులుగారి స్వతంత్రరచనమేయైనను, ఆంగ్ల గ్రంథముల ప్రభావమున్నదని యీ గ్రంథశైలి వలన తెలియనగును.

జీసను చరిత్రమును 1894వ సంవత్సరమున హిందూజన సంస్కారిణి యందు ప్రారంభించి, నాలుగు ప్రకరణములను ప్రకటించిరి. తదుపరి 'హిందూజన సంస్కారిణి' యందు జీసస్ చరిత్ర మాగిపోయినది.[10] పంతులుగారు 1894వ సంవత్సరమునం దాఱుప్రకరణములు వ్రాసియున్నామనియు, అప్పటినుండియు 1913వ సంవత్సరమువఱకు, జీసస్ చరిత్రము ముగింపబడలేదనియు, 1913వ సంవత్సరము ఏప్రిల్ నెలలో చల్లదనమునకై బెంగుళూరుపోయి విశ్రాంతి ననుభవించు చుండగా, కడమ రెండు ప్రకరణములను పూర్తిచేసి, జీసస్ చరిత్రమును ముగించినా మనియు, తమ స్వీయ చరిత్రమునందు వ్రాసియున్నారు. జీసస్ చరిత్రమును 1913వ సంవత్సరమున తొట్టతొలుత పుస్తకముగా ముద్రించునపుడు, పంతులుగారీ చరిత్రము నందు కొన్ని చిత్రపటములనుకూడ చేర్చియున్నారు కనుకవారు 1894వ సంవత్స రమునసే జీసస్ చరిత్రమును ప్రారంభించినను, 1913వ సంవత్సరము దనుక దానిని ముగింపలేదని తెలియుచున్నది. అంగా పంతులుగారు జీసస్ చరిత్రమును ప్రారంభించిన యిరువది సంవత్సరములకు దానిని ముగించిరి. కనుకనే మొదటియారు ప్రకరణములశైలికిని, కడమ రెండు ప్రకరణములశైలికిని వ్యత్యాసము కానవచ్చునని వారు వ్రాసియున్నారు. 1899వ సంవత్సరమున పంతులుగారి గ్రంథములన్నియు పది సంపుటములుగా ముద్రింపబడినప్పుడు, జీసస చరిత్రము 8వ సంపుటమునందు ముద్రింపబడినది. తరువాతి పంతులుగారి గ్రంథములను హితకారిణీ సమాజమువారు సంపుటములుగా ప్రకటించునప్పుడు, జీసస్చరిత్రము 9వ సంపుటమునందు చేర్చబడినది.

జీసస్ చరిత్రమునందు ఎనిమిది ప్రకరణములుగలవు. అవి

1. జీసస్‌యొక్క జననమును, బాల్యదశయును, 2 తత్కాల దేశస్థితి 3. జీసస్‌యొక్క బోధనారంభదశ 4. జీసస్ మొదట స్వస్థలమున ధర్మ ప్రవచనము చేయుట 5. పాపులయెడఁ జూపిన యాదరము, సరస్తీర ప్రవచనము 6 శిష్య సంగ్రహమును, పర్వతముమీదిఁ ధర్మోపన్యాసమును 7. (స్నాతకుఁడైన) జాను యొక్క సందేశము, జెరూసలేముయాత్ర 8. జీసస్సు యొక్క విచారణ, మరణము

ప్రపంచ మహాప్రవక్తలలో నొకడైన జీసస్ క్రైస్టుయొక్క దివ్య చారిత్రమును పంతులుగారు విశేషభక్తిశ్రద్ధలతో గ్రంధస్థముచేసిరి. కాని ఆ కాలమునందలి సాంఘిక పరిస్థితులను వివరించుచు ప్రసక్తానుప్రసక్తముగా, జనులలోని దురాచారములను, మూఢ విశ్వాసములను, మహాపురుషుల మహిమలనుగూర్చి జనులల్లి ప్రచారము చేసెడి కట్టుకథలను పంతులుగారు విమర్శించియేయున్నారు పంతులుగారించుకంత సందర్భమువచ్చినచో. జనులలోని మూఢ విశ్వాసములను, దురాచారములసు విమర్శింపకయుండరు ఇది పంతులుగారి వ్యక్తిత్వములోని ప్రధాన విషయము జీసస్ చరిత్రము నొక జీవిత చరిత్రముగానే పంతులుగారు సంభావించినను, సమయమును, సందర్భమును, తామే కల్పించుకొని, తమ స్వీయాభిప్రాయములను, పంతులుగారీ చరిత్రమునందు జొప్పించియున్నారు. వేదము లీశ్వర దత్తములు కావని పంతులుగారు సిద్ధాంతీకరించినట్లే, బైబిలునందు జీససునుగూర్చి చెప్పబడిన దివ్యమహిమలన్నిటిని పంతులుగారు హేతువాదము నాధారముచేసికొని, విమర్శించియున్నారు.

ఏసుక్రీస్తు దివ్యుడైనను, నాతని యందు సహజము మానుషాతీతములైన దివ్యమహిమ లారోపింపబడుట పంతులుగారికి సమ్మతము కాదు. సనాతనములైన సంప్రదాయములైనను, పంతులుగారు హృదయపూర్వకముగ విశ్వసింపని వానిపై తిరుగబాటుచేసిరి. వారికి ప్రత్యక్షము ప్రమాణము. హేతువాదము శిరసావహము.

పంతులుగారి సర్వరచనల యందును, హేతువాదమునకు నిలువని, యశాస్త్రీయములైన విషయములు నిరసింపబడినవి జ్యోతిషము, గ్రహణములు, ఘాతావేశము, ప్రవక్తల కారోపింపబడు మానుషాతీతములైన దివ్యశక్తులు పంతులుగారి రచనల యందు విమర్శింపబడినవి. శంకరాచార్యులవారి జీవిత చరిత్రమునందు సైతము పంతులుగారిట్టి మహిమలను వర్ణించు నెడల తూష్ణీం భావమునే వహించిరి.

ఇక జీసస్ చరిత్రము నందలి శైలి విషయము. పంతులుగారి తక్కిన వచన రచనము లందువలెనే జీసస్ చరిత్రము నందును శైలి సులభముగా నున్నది. సౌలభ్యమాయన వచనరచనమునందు సామాన్యగుణమేకదా ! ఇందలి విశేషమే మనగా, ఒకానొక మహాపురుషుని జీవిత చారిత్రమును వ్యాఖ్యాన ప్రాయముగా వెల యించుట యనునది. భక్తి శ్రద్ధలు కలవారలు మహాపురుషుల జీవిత చరిత్రములను, యధా తధముగా గ్రహించి, గ్రంధస్థము చేయుదురేకాని, విమర్శించి, వ్యాఖ్యాన సహితములుగా వెలయించుటకు పూనుకొనరు. పంతులుగారు మాత్రము జీసస్ చరిత్రమును, సవిమర్శకముగ, సవ్యాఖ్యానముగ, తమ వ్యక్తిత్వమునకు తగిన రీతిని గ్రంధస్థము చేసిరి.

కాని అచ్చటచ్చట జీసస్ చరిత్రమునందు ఇంగ్లీషు నుడికారము త్రోసికొని వచ్చుచుండును. ఆంగ్లాను వాదములను కూర్చునప్పుడు పంతులుగారి రచనలయం దిది సర్వసామాన్యముగాఁ బొడకట్టుచునే యుండును జీసస్ చరిత్రము నుండి యొక్క యుదాహరణము చూపబడుచున్నది.

"మానసికములైన పాపరోగములనే రూపుమాపగల యద్భుత సామర్థ్యము గల మహాపురుషునకు శరీర రుజలను బోగొట్టఁగల శక్తి యున్నదన్న హేతువుచేత నూతన మహిమరాదుగాని యొక్క యాతని విషయమున దేవుఁడేర్పఱిచిన స్థిరము లైన వస్తుధర్మములు మాఱినవనుట మాత్రము విశ్వాసపాత్రముకాదు......"11.

ఈ వాక్య నిర్మాణమునందు తెలుగు నుడికారము కానరాదు. వాక్యనిర్మాణము నందు ఆంగ్లేయ భాషా సంప్రదాయము కానవచ్చుచున్నది. లౌలిదశలోని బైబిలు అనువాదము లందలి వాక్య నిర్మాణము కూడ, ఆంగ్లభాషా సంప్రదాయము ననుస రించియేయుండెడిది ఈ జీసస్ చరిత్రమునందిట్టి భాగములు విరళముగానే యున్నను, గ్రంధశైలి సాకల్యమునకు, ప్రతిబంధమును కలుగఁజేయుచున్నవనుట సత్యదూరము కాదు పంతులుగారే గ్రంథమునైనను, తుదిప్రతి, దిద్దుబాట్లును లేక, ఒకేసారిగా వ్రాయుచుండెడువారు కావున, నిట్టి వాక్య నిర్మాణమును వారు సవరించుట పొసఁగియుండదు. బహుశః ఇట్టి భాగములను వారే యాంగ్ల గ్రంథము ననుసరించియో వ్రాసి యుండవచ్చును. వారి మౌలిక రచనలందు సామాన్యముగా నిట్టి వాక్య నిర్మాణముగాని, నుడికారము కాని కానరాదు.

ఇవికాక పంతులుగారు రచించిన జీవిత చరిత్రములందు. శంకరాచార్యులు, బసవరాజు గవర్రాజుగారు, మాకర్ల సుబ్బారావునాయుడుగారు, మొదలగు వారల చరిత్రములు కూడ చేర్పబడవలసినవే యైనను, వారు గవర్రాజుగారి జీవిత చరిత్ర మును, సుబ్బారావు నాయుడుగారిని గూర్చియు, పురమందిరమున జరిగిన సంతాప సభలందుపన్యాసములుగా, వెలువరించిరికాన, వాని నుపన్యాసములను విషయ విభాగమునందు చేర్చుట యుక్తము. ఇట్లే శంకరాచార్యుల వారిని గూర్చియు ప్రార్థనా సమాజ సమావేశమునందుపన్యసించిరి. ఈ యుపన్యాసమునందు ఆది శంకరభగవత్పాదుల దివ్యచరిత్రము, సంగ్రహముగా తెలుపబడినది. దీనిని ప్రత్యే కము జీవిత చరిత్రమని చెప్పుటకు వలనుపడదు. మహాపురుషుల దివ్యచరిత్రము నకు సంబంధించిన యుపన్యాసమని చెప్పవలెను కనుక శంకరాచార్యులవారి చరిత్రము కూడ నుపన్యాసములను విషయ విభాగమునందే ప్రసక్తమైనది. ఇట్లే దేశిరాజు పెదబాపయ్యగారిని గూర్చియు, పండిత ఈశ్వరచంద్ర విద్యాసాగరుల వారిని గూర్చియు పంతులుగారు. చిన్నచిన్న వ్యాసములు రచించిరి, కాని యవి జీవిత చరిత్రములని చెప్పుటకు వలనుపడదు.

జీవిత చరిత్రమను శీర్షిక క్రింద చేర్చబడుటకు, పంతులుగారు కొందరుత్తమ స్త్రీ చరిత్రములను రచించిరి. స్త్రీ విద్యయందు పంతులుగారత్యంతాభినివేశము కలవారు కావున స్త్రీలకు మార్గదర్శకములుగా నుండుటకు, ఉత్తమ స్త్రీ చరిత్రము లను రచించిరి విద్యావంతురాండ్రైన స్త్రీలకు భారతీయాంగనల చరితములు పరిచిత పూర్వము లగుటవలనను, అప్పటికే 'అబలా సచ్చరిత్ర రత్నమాలవంటి' యుత్తమ స్త్రీ చరిత్రములు రచింపబడుట వలనను పంతులుగారు, పాశ్చాత్య దేశములలో మిగుల ప్రసిద్ధినిగన్న యుత్తమ స్త్రీల చరిత్రములను, ఆంధ్ర భాషయందు వెలువ రించిరి. వీనిని పంతులుగారు తాము నడుపుచుండిన తెలుగు జనానా యను పత్రిక యందు ప్రకటించిరి. ఈ యుత్తమ స్త్రీ చరిత్రములు ఉత్తమ మాతయను నుపన్యా సములతో కలిపి ప్రకటింపబడినవి. ఇందు చేర్చబడిన 1 గ్రేసు డార్లింగుకన్య - తెలుగు జనానా, 1904 అక్టోబరు నెల, 2 జీన్ ఆఫ్ ఆర్క్ - తెలుగు జనానా, 1904 నవంబరు, 3 ఎలిజబెత్ ఫ్రైదొరసాని - తెలుగుజనానా 1905 జనవరి, 4. లేడీజాన్ గ్రే - తెలుగు జనానా 1905 ఫిబ్రవరి మార్చి నెలలు 5. మేరీ కార్పెం టరు - తెలుగు జనానా 1905 ఏప్రిల్, మే నెలలు

ఈచరిత్రములు ప్రప్రథమమున 'తెలుగు జనానా' పత్రికయందు ప్రకటింపబడి, తదుపరి పుస్తకరూపమును దాల్చినవి. ఇవికాక 'హిందూ సుందరియను' పత్రికయందు 1901వ సంవత్సరము సెప్టెంబరునెలలో అలెగ్జాండ్రా మహారాజ్ఞి చరిత్రమును పంతులుగారు ప్రకటించిరి. ఉత్తమ స్త్రీ చరిత్రములందు గ్రేస్ డార్లింగ్ కన్య (1815-1842) యొక్క సాహసకృత్యములును, పరోపకార శీలమును, జోన్ ఆఫ్ ఆర్కు (1412-1431) యొక్క ధైర్యసాహసములును, ఎలిజబెత్ ప్రైదొర సాని (1780-1845) పరోపకార పారీణత, లేడీజాన్‌గ్రే (1537-1554) యొక్క సుగుణములు, మేరీ కార్పెంటరు (1807-1877) దొరసాని సేవాను రక్తి, మొదలగు మహా విషయములు వర్ణింపబడినవి.

ఇవిగాక ఆనిబిసెంటు దొరసానినిగూర్చియు, హోల్కారు రాజ్యమును పరిపాలించిన యహల్యాబాయినిగూర్చియు, స్త్రీ విద్యాభివృద్ధి నిమిత్తము పాటుపడిన పండిత రామాబాయిసరస్వతినిగూర్చియు, చరిత్రాత్మకములైనవ్యాసములు రచించి యున్నారు. కాని యీ వ్యాసములు జీవితచరిత్రములందుచేరవు. అబలాసచ్చరిత్ర రత్నమాలను రచించి విదుషీమణియని పేరొందిన భండారు అచ్చమాంబగారు మరణించినప్పుడు వీరేశలింగంపంతులుగారామెనుగూర్చి జనానా పత్రికయందొక వ్యాసము ప్రకటించిరి పంతులుగారు 1904వ సంవత్సరమునుండి శ్రీరాయసం వేంకటశివుడుగారితో కలిసి జనానా పత్రికకు సంపాదకత్వమును వహించి, స్త్రీల కుపయుక్తములైన శాస్త్రీయ విషయములను, ఉత్తమ స్త్రీ చరిత్రములను జనానా పత్రిక యందు వెలువరించిరి. 1905వ సంవత్సరమునందు వారు 'సత్యవాదిని'ని ప్రారంభించిన తరువాత, వారికి 'జనానా'తో సంబంధములేకపోయెను

పంతులుగారి గ్రంథములందు ప్రత్యేకించి సాహిత్య విమర్శయని చెప్పదగినవైన గ్రంథములు తక్కువ. పంతులుగారి కవుల చరిత్రమునందు సాహిత్య విమర్శకూడనున్నది. కాక పంతులుగారు గ్రంథ సమీక్షలందు కొంత సాహిత్య విమర్శచేసియున్నారు. కవుల చరిత్రమునందే బమ్మెరపోతరాజు చరిత్రమునందు, రేఫద్వైవిధ్య విచారము, నన్నెచోడుట్టాకవని చారిత్రమునందు, ఆంధ్రశబ్ద చింతామణి కర్తృత్వవిషయము, గణపవరపు వేంకటకవి చరిత్రమునను, గుదారు వేంకటదాసకవి చరిత్రమునను, గర్భ, బంధ, చిత్రకవిత్వాదుల పరిశీలనమును, గూర్చి వ్రాసిన విషయములు సాహిత్య విమర్శయని చెప్పనొప్పును. ఇవికాక ప్రధానముగా పంతులు

గారు 'కొక్కొండ వేంకటరత్నకవి కృత విగ్రహతంత్ర విమర్శనము'ను పేర కొంత విమర్శ గ్రంధమును తమ వివేకవర్ధనియందు వెలువరించుటయేకాక దానిని పుస్తక రూపమునకూడ నచ్చొత్తించిరి పంతులుగారు కొక్కొండ వేంకటరత్నము పంతుల వారి విగ్రహ తంత్రమును విమర్శించుటకు కొక్కొండవారే కారకులు. కొక్కొండ వేంకటరత్నము పంతులవారు 1866వ సంవత్సరమునకే నీతిచంద్రికలోని విగ్రహ తంత్రమును, సంధిని రచించిరి కాని కొక్కొండవారు తమ 'సంధిని' ప్రకటింపలేదు. 1872వ సంవత్సరమున విగ్రహతంత్రమును మాత్రము ముద్రించి ప్రకటించిరి. చిన్నయసూరి 1862వ సంవత్సరముననే మరణించుటవలన వారేర్పరచుకొన్న ప్రణాళిక, యనగా నీతి చంద్రికయను పేరిట మిత్రలాభము, మిత్రభేదము, సంధి, విగ్రహములను ప్రకటించుట కొనసాగక, మిత్రలాభ, మిత్రభేద, ప్రకటనములతో నాగిపోయెను. 1862వ సంవత్సరమునకు మిత్రలాభ, మిత్రభేదములు ప్రకటింప బడినవి ఆ తరువాత కొక్కొండ వేంకటరత్నము పంతులవారు, మిగిలిన సంధి, విగ్రహములను, పూర్తిచేసిరి. వేంకటరత్నము పంతులుగారి విగ్రహతంత్రమును నాటి పత్రికలు ప్రశంసించినవి [12]

వీరేశలింగంపంతులుగారు తామును తెలుగులో వచన కావ్యములులేకపోవుటను గుర్తించి నీతి చంద్రికలోని యుత్తరార్ధమును పూరించిరి. ఇందు విగ్రహతంత్రమును 1874వ సంవత్సరమునందు ముద్రించి ప్రకటించిరి. ఈ విగ్రహతంత్రము ప్రక టింపబడగానే చెన్నపురి క్రైస్తవ కళాశాలలో పాఠ్య గ్రంధముగా నిర్ణయింపబడెను. బ్రహ్మశ్రీ వావిలాల వాసుదేవశాస్త్రులవారివంటి పండితులు పంతులుగారి విగ్రహ తంత్రమును కొనియాడిరి. చెన్నపట్టణమునుండి వెలువడుచుండిన స్వదేశీయ మహా జనాభిప్రాయము (The Native public opinion), బందరు పురమునుండి వెలువడుచుండిన పురుషార్ధప్రదాయిని మొదలగు పత్రికలు, వీరేశలింగంపంతులుగారి విగ్రహతంత్రమును ప్రశంసించినవి సర్వకళాశాలా ప్రవేశపరీక్షకు పంతులుగారి విగ్రహతంత్రము పఠనీయముగా నిర్ణయింపబడినది ఈ విధముగా వీరేశలింగం పంతులుగారి విగ్రహతంత్రము ప్రశంసింపబడినను, 1875వ సంవత్సరమునందు, కొక్కొండ వేంకటరత్నము పంతులుగారి విగ్రహ తంత్రమునకు టిప్పణి వెలువడి నప్పుడు, ఆ గ్రంథమున కాంగ్లభాషలో పీఠికను వెలయించిన శివశంకర పాండ్యా గారనువారలు వీరేశలింగంపంతులుగారి విగ్రహతంత్రము, కొక్కొండ వేంకట

రత్నము పంతులుగారి విగ్రహతంత్రము ననుసరించి యెడమచేతి వ్రాతగా వ్రాయ బడినట్లు తమ యభిప్రాయమును వ్యక్తముచేసిరి. ఈ వ్రాత వీరేశలింగంపంతులుగారికి కోపకారణముకాగా 'కొక్కొండ వేంకటరత్నకవి కృత విగ్రహతంత్ర విమర్శనము' వివేకవర్ధనియందు వెలువడెను

కొక్కొండ వేంకటరత్నము పంతులుగారే తమ విగ్రహ తంత్రమునకు టిప్పణమును వ్రాసి, దానిని శివశంకర పాండ్యాగారి పేరట ప్రకటించిరనియు, తమ విగ్రహతంత్రమును గూర్చి వేంకటరత్నము పంతులవారి కట్టి భావ ముండి యుండుననియు వీరేశలింగంపంతులుగా రభిప్రాయపడి, వేంకటరత్నము పంతులు గారి గ్రంథమును విమర్శించుటకు పూనుకొనిరి

పంతులుగారు విగ్రహ తంత్రవిమర్శనమును పెద్ద పుస్తకముగాఁజేసి ప్రక టింప నిశ్చయించియు, వేంకటరత్నము పంతులవారు, శివశంకర పాండ్యావారు తమ యెఱుకలేకయే పీఠిక యందట్టి యభిప్రాయమును వ్యక్తము చేసిరనియు, నామాట లను పాటిగాబట్టక విమర్శనము మానవలసినదనియు, వీరేశలింగంపంతులుగారి పేర సుహృద్భావముతో వ్రాయుటవలన పంతులుగారు విగ్రహ తంత్రవిమర్శనమును సంక్షేపించి వెలువరించితిమని తమ స్వీయచరిత్రమునందు వ్రాసియున్నారు. పంతులు గారి విగ్రహతంత్ర విమర్శనమును నాటి విద్యావంతులందరును ప్రశంసించిరనియు, మనకు పంతులుగారి స్వీయచరిత్రము వలన తెలియును. క్రైస్తవ కళాశాలలో గణిత శాస్త్రోపన్యాసకులుగా నున్న సమర్థి రంగయ్య శ్రేష్ఠిగారు వీరేశలింగంపంతులుగారి విగ్రహతంత్ర విమర్శనమును జదివి తమ యభిప్రాయముల నిట్లు వెల్లడించిరట

"The article about the 'pandya's Notes' in your Journal has given me immense pleasure I read and re-read it with great interest It is an excellent criticism excellently expressed "[18]

వీరేశలింగంపంతులుగారు వేంకటరత్నము పంతులుగారి విగ్రహతంత్రమును తీవ్రముగా విమర్శించియున్నారు, పంతులుగారి విమర్శనము వలననే వేంకటరత్నము పంతులవారి విగ్రహ తంత్రము ప్రశస్తికి రాలేదని తలంచుట సత్యదూరముకాదు

కొక్కొండ వేంకటరత్న కవికృత విగ్రహతంత్ర విమర్శనము నందలి ధోరణి తెలియుట కొక భాగము క్రింద నుదాహరింపబడుచున్నది.

"చిన్నయసూరిగారి పూర్వార్ధమునకును పంతులవారి యుత్తరార్ధమునకును హస్తిమశకాంతరము కలదని యీ ప్రాంతముల పండిత పామరసామాన్యముగా నందఱి యభిప్రాయము నయియున్నది. ఏనుంగుకన్న దోమయే పెద్దదనుకొను వారికి మాత్రమొక వేళ నీ యుత్తరార్ధమే మేలైనదిగాఁ గాఁపింపవచ్చును. వారికట్లే కనిపించనిండు. పూర్వార్ధముయొక్క రచనా చమత్కృతియు, పదలాలిత్యమును, వాక్యమార్దవమును, శైలి మాధుర్యమును, నీతి గౌరవమును, కని యానందించు వారెవ్వరుగాని పంతులువారి యుత్తరార్ధముం జూచినచో దీనదానిలో సహస్రాంశ మయిన గుణములఁ గానమని ఘోషింప వెనుకదీయరు. వేయేల ? పూర్వార్ధముం జూచిన కన్నుల దీనిఁ జూచినచో నెవ్వరేని యీ యుత్తరార్ధమును నొక వచన కావ్యమని నోరు తెఱచి చెప్పుటకు సిగ్గుపడుదురనుట స్వభావోక్తియే కాని యతిశయోక్తి కాదు......".[14]

పంతులుగారు తమ విగ్రహ తంత్ర విమర్శనమందు, శివశంకర పాండ్యాగారు వేంకటరత్నము పంతులుగారి టిప్పణ గ్రంథమునకు కూర్చిన పీఠికలోని విషయము లను, వేంకటరత్నము పంతులుగారి నీతిచంద్రిక యుత్తరార్ధమగు విగ్రహమును, తీవ్రముగా విమర్శించియున్నారు. వీరేశలింగంపంతులుగారి నిశితమగు విమర్శనా జ్ఞానమీ విగ్రహతంత్రవిమర్శనమునందు గాంచనగును ఈ విగ్రహ తంత్ర విమర్శనము తరువాత 'ఆంధ్ర శబ్ద చింతామణి నన్నయకృతమా ?'యను వ్యాసము నందును పంతులుగారి తార్కిక ప్రతిభ, విమర్శనా వైభవము, బుద్ధి తైక్ష్ణ్యము మనము గాంచవచ్చును [15]

ఇట్లే వీరేశలింగంపంతులుగారు బమ్మెరపోతరాజు నివసించిన ఓరుగల్లును గూర్చి పండితులయందు వాదవివాదములు సంభవింపగా, ఓరుగల్లు, కడపమండ లమునందున్న యొంటిమిట్ట కాదనియు, తెలంగాణము నందున్న వరంగల్లే, యోరుగల్లనియు సిద్ధాంతీకరించుచు నొక వ్యాసమువ్రాసిరి [16] ఈ వ్యాసమునందు పంతులుగారి విమర్శా పాటవము తేటతెల్లమగుచున్నది. కవికాల నిర్ణయాదికము లందును, చరిత్ర పరిశోధనమునందును పంతులుగారికిగల యనుపమానమైన ప్రజ్ఞా వైభవమీ వ్యాసమునందు స్పష్టమగుచున్నది. పంతులుగారు తమ వాదము నసిధారా వ్రతముగా నిర్వహించుకొనగలిగిన నేర్పరులు. అట్లని సత్యశోధనము నందాసక్తి లేని వారుకారు కవుల చరిత్రమును ప్రప్రథమమున వెలువరించినప్పుడు వారు

వ్యక్తముచేసిన యనేకాభిప్రాయములు, సిద్ధాంతములు, తరువాత పరిశోధనముల వలన పరాస్తములుకాగా, పంతులుగారు తమ కవుల చరిత్రమును పునస్సంశోధనము చేసి ప్రకటించినప్పుడు తమ యభిప్రాయము లనేకములను మార్చుకొనిరి తమ గ్రంథములను విమర్శించిన వారియెడలను పంతులుగారు మిక్కిలి సుహృద్భావమును కలిగియుండిరి. దీని కుదాహరణముగా పంతులుగారు తమ శాకుంతలానువాదముపై నెవ్వరో సూర్యాలోకమను పత్రికయందు వెలువరించిన యభిప్రాయములకు సమాధాన రూపముగా అముద్రిత గ్రంథ చింతామణియందు ప్రకటించిన లేఖలను చూప వచ్చును పంతులుగారి సత్యహరిచంద్ర నాటకమును విమర్శించి యొకానొక వ్యాసమును ప్రకటించిన తోలేటి వేంకట సుబ్బారావుగారి వాదసరళికి పంతులుగారు మెచ్చుకొని వారిని తమ వివేకవర్ధనీ ముద్రాక్షరశాల కధిపతినిగా నియమించుటనుబట్టి సద్విమర్శ యెడల వారికెట్టి సదభిప్రాయమును, గుణపక్షపాతమును, నుండియుండెనో తెలిసకొనసగును [17]

పంతులుగారు తమ విగ్రహతంత్ర విమర్శనమును ముగించుచు నిట్లు వ్రాసిరి.

"పండిన వృక్షమునకే రాతిదెబ్బలన్నట్లు, పుస్తకముల వ్రాయువారికే విమర్శనములను రాఙ్పుతాయును. అయినసవి మొదలంగొంత నొప్పిగలించియు గ్రంథ కర్తను గాలక్రమమున గట్టివానింగావించుటయేకాక యాతని మహోన్నతుఁజేసి విమర్శనముల గుఱికందని వాని గాఁజేయును..." అని విమర్శనుగూర్చి తమ యభిప్రాయములను వెల్లడించుటయేకాక "లోకములో నెవ్వరును సర్వజ్ఞులు కాజాలరు. ఎంతటి విద్వాంసులుచేసిన పుస్తకములలోను తప్పులుండవచ్చును వెదకి విమర్శించు వారున్నచో నా పుస్తకములలోను తెలిసియు తెలియకయుజేసిన తప్పులు కుప్పలుగా నుండవచ్చును......" అని తమ గ్రంథములను గూర్చియు నమ్రభావమున విమర్శ చేసికొనియేయున్నారు.

ఇక పంతులుగారు లక్షణ గ్రంథములుగా చేసినవానినిగూర్చి పరిశీలింతము పంతులుగారు సంగ్రహ వ్యాకరణము, కావ్య సంగ్రహము, అలంకార సంగ్రహము లను లక్షణ గ్రంథములను రచించియున్నారు ఇందు వ్యాకరణ సంగ్రహము 1902వ సంవత్సరమునకు పదునొకండు సార్లు ముద్రితమైనదని యముద్రిత గ్రంథ చింతామణి పేర్కొనియున్నది [18] సంగ్రహ వ్యాకరణమును పంతులుగారు

ప్రప్రథమమున 1872వ సంవత్సరమున వెలువరించిరి. అప్పుడు కోరంగియం దాంగ్లో వర్నాక్యులర్ స్కూలు సందాంధ్రోపాధ్యాయులుగాఁ బనిసేయుచు, క్రింది తరగతులలోఁ జదువుకొను బాలుర నిమిత్తము పంతులుగారీ సంగ్రహాంధ్రవ్యాకరణ మును రచించిరి. ఈ సంగ్రహ వ్యాకరణము ప్రప్రథమమున 1875వ సంవత్సరమున ముద్రింపబడినది నాటి పండితులందరిచే ప్రశంసింపబడినది. వీరేశలింగంపంతులు గారికి పూర్వమే ఆంధ్ర వ్యాకరణము లనేకములు వెలసినని కాని వాని యన్నిటి యందును చిన్నయసూరి కృతమైన బాల వ్యాకరణము నాయకమణియై యొప్పారు చున్నది. వీరేశలింగంపంతులుగారికి పూర్వము వెలసిన యాంధ్ర వ్యాకరణములలో కొన్ని యీ క్రింద పేర్కొనబడుచున్నవి. ప్రథమదశయందు తెలుగుభాషనునేర్చు కొని, పాశ్చాత్యులు దేశీయభాషలను నేర్చుకొనుట కుపకరించు గ్రంథములనువ్రాసిన వారు పాశ్చాత్య పండితులు.

ఇట్టివారిలో. డా॥ విలియమ్ కెరీ (Dr William Carey) 1814 వ సంవత్సరముననే తెలుగుభాషకొక వ్యాకరణమును రచించెను తరువాత కాంబెల్ యను నాతడు కూడ తెలుగు వ్యాకరణము నొకదానిని 1816 వ సంవత్సరము నందు ప్రకటించెను ఈ వ్యాకరణమును చెన్నపట్టణములోని సెంటుజార్జి కోటలో నున్న దొరల కాలేజీ బోర్డువారు ప్రకటించిరి. ఈ కాంబెల్‌దొర తెలుగు- ఇంగ్లీషు, నిఘంటువు నొకదానిని కూడ 1821 వ సంవత్సరమునందు ప్రకటించెను తరువాత విలియంబ్రౌన్ యను నొక పండితుడు 1817 వ సంవత్సరమున జెంటుభాషా వ్యాకరణ మనుపేరున, తెలుగు భాషకొక వ్యాకరణమును రచించెను. 1819 వ సంవత్సరమునకే వేదం పట్టాభిరామశాస్త్రిగారను వారొక యాంధ్ర వ్యాకరణమును రచించినట్లు తెలియుచున్నది. తెనుగునకు వ్యాకరణమును కూర్చిన తెనుగు పండితు లలో, నీయాధునిక యుగమందు వీరే ప్రథములు కావచ్చును.

"క్రొత్తగా యీ దేశానికి వచ్చిన ఆంగ్లేయోద్యోగులకు దేశభాషలు నేర్పడానికీ దేశాచారవ్యవహారాలను గురించి బోధించడానికీ చెన్నపట్టణంలో ఫోర్టు సెంటు జార్జి కోటలో 1812 లో ఒక కాలేజీని స్థాపించారు. ఈ కాలేజీలో ఉదయగిరి వెంకట నారాయణగారు హెడ్ ఇంగ్లీషు మాష్టరుగాను, పట్టాభిరామశాస్త్రిగారు ప్రధాన సంస్కృ తాంధ్ర పండితులుగాను ఉండేవారు 1819 లో రావిపాటి గురుమూర్తి శాస్త్రిగారు ప్రధానాంధ్ర పండితులైనారు..." అని శ్రీ దిగవల్లి వెంకట శివరావుగారు వ్రాసి

యున్నారు[19] ఈ పట్టాభిరామ శాస్త్రిగారు 1816 వ సంవత్సరమునందు ధాతుమాల యను గ్రంథమును కూర్చియున్నారట. తరువాత 1834 వ సంవత్సరమునందు పుదూరి సీతారామశాస్త్రిగారను వారలు తమ ప్రశ్నోత్తరాంధ్ర వ్యాకరణమును వెలయించి యున్నారు.

రావిపాటి గురుమూర్తి శాస్త్రిగారు 1836 వ సంవత్సరమున ఏ. డి. కేమిలీ దొరవారి కంకితముగా తెలుగు వ్యాకరణమును కూర్చియున్నారట. పీఠికయందు గురుమూర్తిశాస్త్రిగారు "...-మహారాజశ్రీ-యే డి కేములీ దొరగారి పేర నంకితముగా వారి యుత్తరువుమీద చెన్నపట్టణ వారశాలలో నాంధ్రభాషకు మొదటి యుపాధ్యాయుడైన రావిపాటి గురుమూర్తి శాస్త్రిచేత-నన్నయభట్టీయంబును, బాలసరస్వతీయంబును, అహోబల పండితీయంబును, పట్టాభిరామీయంబును, అప్పకవీయంబును, వీరభూపాలీయంబును మొదలైన యాంధ్ర వ్యాకరణములను జూచి- బాలురకు సులభముగా దెలియునట్టి వచన రూపముగా చేయబడ్డది..." యని వ్రాసిరి[20]

1835-39 సంవత్సరముల మధ్యకాలమున జె. సి మారిసుదొర తెలుగు వ్యాకరణము నొకదానిని రచించెను. బ్రౌను దొరవారు 1840 వ సంవత్సరము నందు తెలుగు వ్యాకరణమును ప్రకటించిరి. 1857 వ సంవత్సరమున శేషయ్య వ్యాకరణముపేర నొక వ్యాకరణము ప్రకటింపబడినదని శ్రీ గిడుగు వెంకట రామమూర్తి పంతులుగారు తమ గద్య చింతామణి యందుదాహరించి యున్నారు.[21] తాండ్రక వెంకయ్యగారు 1872 వ సంవత్సరమున [illegible] తెలుగు వ్యాకరణము నొకదానిని ప్రకటించియున్నారు [illegible] బుద్ధివ్యాకరణము నొక వ్యాకరణము [illegible]. 1859 [illegible] శ్రీ [illegible] గ్రంథమును ప్రకటించియున్నారు 1866వ సంవత్సరమున [illegible] సుబ్బరాయలు నాయునివారు విభక్తి చంద్రికయను వ్యాకరణమును ప్రకటించియున్నారు శ్రీకాకుళము [illegible] యాంగ్లో వర్నాక్యులర్ పాఠశాలాంధ్రోపాధ్యాయులగు [illegible] వరాహ నృసింహపట్నాయకులుగారు తెలుగు వ్యాకరణము పేరున నొక వ్యాకరణము ప్రకటించి యున్నారు వేదము వేంకటరమణశాస్త్రిగారి లఘువ్యాకరణము 1856వ సంవత్సరమునకే వెలువడినది[22]

నరహరి గోపాల కృష్ణమ్మ సెట్టిగారును బాలవ్యాకరణము పేరుతో నొక వ్యాకరణమును ప్రకటించియున్నారు

1871వ సంవత్సరమున శ్రీ పరవస్తు వేంకటరంగాచార్లయ్యవారలుగారు లఘు వ్యాకరణమను పేరున నొక వ్యాకరణమును ప్రకటించియున్నారు విశాఖ పట్టణమునకు చెందిన రెవరెండు ఎ రిక్కాజ్ (Rev. Riccaz) యను వారలు సంగ్రహ వ్యాకరణ మొకదానిని రచించి 1869వ సంవత్సరమున ప్రకటించిరి. ఆర్డెన్ యను నతడు A progressive Grammar of the Telugu Language అను పేరున తెలుగు వ్యాకరణము నొకదానిని రచించి 1873వ సంవత్సరమున ప్రకటించెను.

ఈ విధముగా వీరేశలింగంపంతులుగారు 1875వ సంవత్సరమున తమ సంగ్రహాంధ్ర వ్యాకరణమును రచించునాటికి తెలుగు భాషనుగూర్చి, తెలుగు పండితుల చేతను, పాశ్చాత్య విద్వాంసులచేతను అనేక వ్యాకరణములు రచింపబడినవి. కాని పంతులుగారి నాటికి పాఠశాలలో చిన్నయసూరిగారి బాల వ్యాకరణమే పఠింపబడు చుండెను చిన్నయ్యసూరిగారి బాల వ్యాకరణము ప్రప్రథమమున 1858వ సంవత్సరమున ముద్రింపబడెను చిన్నయసూరి మహాపండితుడు కనుకను, బాల వ్యాకరణము ఉన్నతమైన ప్రమాణికతతో రచింపబడినది కావునను, యెల్లరకును పఠనార్హ మయ్యెను

వీరేశలింగంపంతులుగారు తాము సంగ్రహ వ్యాకరణమును రచించుటలోని యుద్దేశములను తమ స్వీయ చరిత్రమునందు తెలిపియున్నారు. ఆ వఱకు పాఠ శాలలో బాలురకు సులభముగా తెలిపెడు తెలుగు వ్యాకరణ మేదియులేకపోవుటయు, ఉన్నవి సంజ్ఞాపరిచ్ఛేదము, సంధిపరిచ్ఛేదము, అజంత పరిచ్ఛేదము, హలంత పరి చ్ఛేదము, క్రియాపరిచ్ఛేదము, అని యైదు భాగములుగలిగి, బాలురకు సులభ గ్రాహ్య ముగా నుండకపోవుటనుబట్టియు, పంతులుగారు సంగ్రహ వ్యాకరణ మొకదానిని సులభ పద్ధతిని రచింపవలయునని సంకల్పించిరి సంజ్ఞాపరిచ్ఛేదములో ప్రథమేతర విభక్తులు శత్రర్థక చువర్ణకము మొదలైనవి ద్రుత ప్రకృతికములని చెప్పబడినప్పుడు, అజంతపరిచ్ఛేదము చదివినగాని విభక్తులేవో, క్రియాపరిచ్ఛేదమును జదివినగాని శత్ర ర్థకమేదో బాలురకు బోధపడని కష్టమును పంతులుగారు గ్రహించిరి అట్లయినచో

ముందుగానే యజంతపరిచ్ఛేదమునో, క్రియాపరిచ్ఛేదమునో బోధింపవచ్చునుగదా యనిన, కువర్ణకము పరమగునప్పుడుకారబుకారాంతములకు నగాగమంబగునని యజంతపరిచ్ఛేద మారంభించినచో సంధి పరిచ్ఛేదము ముందుగా చదివినఁగాని యాగమమనగానేమోతెలియదు సంధి పరిచ్ఛేదమే ముందుగా ప్రారంభించి చెప్ప వచ్చునన్న, క్త్వార్థక ఇకారమునకు సంధిలేదనుచో క్రియాపరిచ్ఛేదము చదివినఁగాని క్త్వార్థకమననేమో తెలియదు. కావున ఇట్టి చిక్కులను సడలించి, బాలురకు సుబోధక మగునట్లుగా వర్ణ పరిచ్ఛేదము, పదపరిచ్ఛేదము, వాక్యపరిచ్ఛేదము, కావ్యపరి చ్ఛేదము, అని యింగ్లీషుపద్ధతి ననుసరించి వీరేశలింగంపంతులుగారు సంగ్రహ వ్యాకరణమును రచించిరి ఈ సంగ్రహ వ్యాకరణము నాడు పాఠశాలలందలి చిన్న తరగతుల బాలురకు మిక్కిలి యుపకరించెనని చెప్పవచ్చును.

"ఒక వాక్యమునందలి పదముల సంబంధ నిరూపణముచేయు విధము శబ్దాతిదేశమనబడును" అని పంతులుగారు వాక్యపరిచ్ఛేదమునందు శబ్దాతిదేశమను శీర్షిక క్రిందవ్రాసియున్నారు ఈశబ్దాతిదేశమనునది ఆంగ్లమున పార్సింగ్ (Parsing) అను పదమునకు సమానార్థకముగా పంతులుగారుపయోగించిరి. ఒక వాక్యమునందలి పదముల సంబంధమును నిరూపణముచేయుచు పంతులుగారు శబ్దాతిదేశమనగానేమో, శబ్దాతిదేశమునెట్లుచేయవలయునో యుదాహరించిచూపిరి.[28] ఈ సంగ్రహ వ్యాకరణము నందు కావ్యదోషములు, అలంకారములు, ఛందస్సునుగూర్చికూడ సంగ్రహముగ తెలుపబడినది ఈ సంగ్రహ వ్యాకరణమునందు, పంతులుగారు తాముపయోగించిన పారిభాషిక పదములకు సమానార్థకరములైన యాంగ్ల పదములను అనుబంధముగా కూర్చియున్నారు. 'విరతులు' అను శీర్షిక క్రింద, వాక్యాంశ బిందువు (Comma), అర్ధ బిందువు (Semicolon), న్యూనబిందువు (colon), బిందువు (Full stop), ప్రశ్నార్థకచిహ్నము (Mark of interrogation), రాగ చిహ్నము (Mark of Exclamation), అనువాద చిహ్నము (Mark of Quotation), వృత్తార్థము (Paranthesis), వలయితము (Brackets) తారకము (star), శూలము (oblisk). మొదలైన సంజ్ఞలనుగూర్చి పంతులుగారు తెలిపియున్నారు ఇట్టి సంజ్ఞలనుగూర్చిచెప్పుట, శబ్దాతిదేశమను శీర్షికనుకూర్చుట వలన పంతులుగారు తమ సంగ్రహ వ్యాకరణమును,ఆంగ్లేయ వ్యాకరణానుసారముగా కూర్చియున్నారన్న విషయము స్పష్టమగును, కనుకనే నాడు వీరేశలింగంపంతులుగారి సంగ్రహ వ్యాకర

ణము, విద్యార్థుల కత్యంతోపకారియై పండితులచే ప్రశంసింపబడి, బహు ముద్రణములనందినది. బహుజనపల్లి సీతారామాచార్యులవారు, వింజమూరుకృష్ణమాచార్యులవారు, కార్మంచి సుబ్బరాయలునాయనివారు, సంయుక్తముగ నిర్వహించుచుండిన సుజనరంజని పత్రికయందు వ్యాకరణ విషయములు, భాషా విషయకములైన సందేహములు విద్యార్థుల కత్యంతోపయుక్తములగునట్లుగాఁ బ్రకటింపబడుచుండెడివి.

1867 వ సంవత్సరపు ఫిబ్రవరినెల 'సుజనరంజని' యందు "A Glossary of Grammatical Terms" అను శీర్షిక క్రింద ఆంగ్లపదములకు సరియైన తెలుగు పదములు కూర్పబడెనవి. ఈ పారిభాషిక పదములను పంతులుగారు తమ సంగ్రహ వ్యాకరణమునందుపయోగింపకొనిరి.[23] కొన్ని పారిభాషిక పదములను పంతులుగారు కల్పించిరి.

ఈ సంగ్రహ వ్యాకరణము ద్వితీయముద్రణము ప్రకటింపబడినప్పుడు బ్రహ్మశ్రీ వావిలాల వాసుదేవశాస్త్రిగారు దీనినిట్లు ప్రశంసించిరి.[24]

"తెనుఁగును జదివెడు బాలుర
కనయము మేల్సేయ సంగ్రహవ్యాకరణం
బనఁబడు నీ పొత్తంబును
ఘను రచియించి ప్రకటించె మొదలితడపకున్

"దేశభాషలలో నెల్ల దెలుఁగులెస్స
యనెడు పెద్దనపలుకు యాథార్థ్యముగనఁ
జేయ నన్నయ చిన్నయ్య చేసినారు
యత్నమును వ్రాయ సంపూర్ణ వ్యాకరణము

కాని యవిచిన్న వాంధ్రకుఁ గష్టసాధ్య
ములని తలపోసి, యీయనమొనకు జొచ్చి
తొంటి మార్గంబు వట్టక తొడఁగి క్రొత్త
పద్ధతిని దేటమాటల వ్రాసినారు

పేలవంబుగ వ్రాయుట పోలదంచుఁ
గొందఱనవచ్చునంటి, యుక్తివా కొనరు గాదె
తెలియజాలక బహుజనుల్ దొలఁగు కతన
మూలఁబడ్డది గాదె కౌముదియుఁగూడ

ఆంగిలో పక్కి మన కేల యందురేమొ
యాంగిలో పక్కియేమిటి ? యందఱకును
సులభముగ నీవిధంబునఁ దెలియవచ్చు
తెలుఁగు బడ లేదె మనబాలురింగిలీషు
వ్యాకరణవేత్తలనఁ ? దెలుఁగట్లు రాదె ?

ఆంధ్రభాషావధూటికాభరణము
చందముననున్న దీనిఁ బ్రశంస చేసి
తృప్తిపొందక జీర్ణాంధ్ర దేశభాష
నుద్ధరింపుఁడి యని కోరుచున్నవాఁడ.[25]

యని వాసుదేవశాస్త్రిగారు సంగ్రహ వ్యాకరణమును కొనియాడిరి. ఛందోలంకారములు, గద్యపద్య కావ్యవిషయములు, పారిభాషిక పదములతో కూడిన యనుబంధము, వాచక సాధకములైన సంజ్ఞలను, సంగ్రహ వ్యాకరణము కలిగి బాలురకు పరమోపకారిగా నున్నదని వాసుదేవశాస్త్రిగారు సంగ్రహ వ్యాకరణమును పొగడిరి.

సంగ్రహ వ్యాకరణమునకు తరువాత పంతులుగారు రచించిన లక్షణ గ్రంథములలో కావ్య సంగ్రహము, అలంకార సంగ్రహము, పేర్కొనదగినవి. సంగ్రహ వ్యాకరణమునందు కావ్య పరిచ్ఛేదమను విభాగమున అలంకారములను గూర్చి పంతులుగారు సంగ్రహముగా తెలిపినను, కావ్యసంగ్రహమునందు విపులముగా నలంకారములను గూర్చి వ్రాసియున్నారు. కావ్యలక్షణములనుగూడ నీ కావ్య సంగ్రహమునందు పంతులుగారు సంగ్రహముగ తెలిపియున్నారు. ఈ కావ్య సంగ్రహమునందు కావ్యదోషములు, కావ్యగుణములు, భావములు, వృత్తులు, రీతులు, పాకములు, శయ్య, అలంకారములు, మొదలగు సర్వలక్షణములను గూర్చి వివరించి యున్నారు.

నొక నూతన వ్యాకరణమును వ్రాసి దానికి లక్ష్యముగానొక వచన కావ్యమును జేయ వలెనని పలుమారుదలపోసితిని..."[28] అని వ్రాసియున్నారు. పంతులుగారు వ్యాకరణము నొక దానిని ప్రారంభించిరికాని, యదికడముట్ట నిర్వహింపలేదు 'నవ్యాంధ్ర వ్యాకరణము'ను పేరున వచనకావ్య లక్షణముల వివరించు నొక వ్యాకరణ గ్రంథమును పంతులుగారు ప్రారంభించిరి వారు తమ యవసానదశయందు గిడుగురామమూర్తి పంతులుగారి వ్యావహారిక భాషోద్యమమునామోదించినట 1919వ సంవత్సరములో నేర్పడబడిన వర్తమానాంధ్ర భాషా ప్రవర్తక సమాజమునకు పంతులుగారే యధ్యక్షులుగా నెన్నుకొనబడిరి పంతులుగారు నవ్యాంధ్ర వ్యాకరణమున నాలుగైదు పుటలను మాత్రమె వ్రాసియున్నారు [29] నవ్యాంధ్ర వ్యాకరణము పంతులుగారిచే సమగ్రముగా రచియింపబడియుండినచో, వచన కావ్య లక్షణములను లక్ష్యీకరించు సమగ్రమగు వ్యాకరణము, తెలుగుభాషను సుసంపన్నముచేసియుండెడిది కాని దైవకృతము దానికి విరుద్ధముగానున్నది

పంతులుగారి నవ్యాంధ్ర వ్యాకరణమునందలి కొన్ని పంక్తులిట నుదాహరింపబడుచున్నవి

"నవ కవిత్వము

సశృంఖలము, విశృంఖలము అని పద్య కవిత్వము ద్వివిధము పూర్వరీతిగనే గణయతిప్రాసబద్ధమయినది సశృంఖలము, గణనియమము మాత్రమేకలదయి యతి ప్రాసబద్ధము కానిది విశృంఖలము. ఈ కడపటి దానిని నవకవిత్వమని చెప్పవచ్చును. దీని యందిక ... విశదీకరించుట యనావశ్యకము. వివరింపనగా ... స్థానమున నక్షర మైత్రికి మారుగా నూతన పద ...

నవ్యాంధ్ర వ్యాకరణము

ఆంధ్రభాష.

ఆంధ్రదేశమున మాటలాడబడుచున్న భాష ఆంధ్రభాష యనబడును. 'భాష' అనగా మనుష్యులొకరికొకరు తమ మనస్సులందలి భావములను తెలుపుకొనుటకు సాధనముగా నుండెడుమాటల కూడిక.

ఆంధ్రదేశమునకే తెలుగుదేశమని పేరు.

తెలుగుభాష మాటాడుటకును, వ్రాయుటకును తగియున్న భాషలలో టి80.........."

ఈ విధముగా వీరేశలింగంపంతులుగారు తమ నవ్యాంధ్ర వ్యాకరణమును ారంభించిరి. పంతులుగారు నవ్యాంధ్ర వ్యాకరణమును బూర్తిచేసి, దానికి లక్ష్య ాయముగానొక తెలుగు వచనకావ్యమును రచించియుండినచో, తెలుగు వచన ానమునకు సాధికారమైన లక్షణగ్రంథ మొకటి లభించియుండెడిది. పంతులుగారు ాయించిన లక్షణ గ్రంథములనుగూర్చి చెప్పుటయైనది. ఇకవారి శాస్త్రీయ గ్రంథ లు పరిశీలింపబడును పంతులుగారు తర్క సంగ్రహమును తెనిగించిరి. ఋగ్వే ుననకు తాత్పర్యమును వ్రాసిరి ఇంకను ప్రకృతిశాస్త్ర విషయకములగు ననేక చనములను రచించిరి. స్త్రీలకును, బాలురకును ప్రకృతిశాస్త్రజ్ఞానము కలుగుటకు, స్త్ర విషయములను సుబోధకముగా నొనర్చిరి.

స్త్రీ పునర్వివాహవిషయకముగా పంతులుగారు శ్రుతి, స్మృతులను, ఉపనిషత్తు ు, పురాణములను అవలోకనముచేసిరి. తమకు వలసిన భాగముల నాయాస్థలముల ెనిగించిరి. 188 వ సంవత్సర ప్రారంభముననే వావిలాలవాసుదేవశాస్త్రిగారి సంపాద కమున వివేకవర్ధనీ ముద్రాక్షరశాలయందు ముద్రింపబడుచు వెలువడుచుండిన ంతాపణి' పత్రికయందు 'పరాశరస్మృతి' తెనిగింపబడినది.

హిందూజన సంస్కారిణి పత్రికయందు పంతులుగారు ఋగ్వేదము ుచి యనువాదము యిట్లు ప్రస్తావింపబడినది. "ము-రా-శ్రీ కందుకూరి వీరేశలింగం ంతులుగారు ఋగ్వేదమునకు తెలుగువ్రాయ ప్రారంభించినారు వీరు తెలుగున హాపండితులు గనుక వీరి తెలుగు ఋగ్వేదము నిక్కముగ బాగుగనుండును. వీరి వేకవర్ధనియందిది ముందు ప్రచురింపబడి, పిమ్మట ప్రత్యేకమయిన సంచికలుగ ప్రసిద్ధముచేయబడునని నమ్ముచున్నాము తెలుగు తెలిసిన వారందరు వివేకవర్ధ నిగాని, ప్రత్యేకమయిన తెలుగు ఋగ్వేద సంచికలనుగాని, కొని చదువుగాని, ాచీన హిందూమతమును తెలిసికొని, వర్ధిష్ణులు కావలెనని కోరుచున్నాము"[81]...

ఈ విషయమే వీరేశలింగంపంతులుగారును హిందూజన సంస్కారిణియందొక ్యాపార ప్రకటనమును ప్రకటించుచు తెలియజేసియున్నారు పంతులుగారిట్లు ప్రక ించిరి.

"ఋగ్వేదము హిందూమతమునకు మూలాధారమయినది దీనికంటె ప్రాచీన గ్రంథము లోకమున లేదు. దీనివలన మన పూర్వుల యాదిమ చరిత్రము తేటపడును. మహోత్కృష్టమైన యీ గ్రంథమును దెనుగున సులభశైలిని వచన రూపమున భాషాంతరీకరింపవలసినదని నన్ను గొందఱు మిత్రులు ప్రేరేపగానే నా పనికి మానివాడను ..."[32] పంతులుగారు ఋగ్వేదమును స్వరసహితముగాను, ప్రతి పదార్థముతోను ప్రచురించుటకు పూనుకొనిరి బ్రహ్మశ్రీ దూర్వాసుల యజ్ఞనారాయణ సోమయాజులుగారిచేత శాయణాచార్య భాష్యాను సారముగా ప్రతి పదార్థము వ్రాయించి, దాని తాత్పర్యముతో వెలువరించుటకు నిశ్చయించినట్లు పై ప్రకటనమువలననే తెలియుచున్నది.

పంతులుగారు అన్నంభట్టకృతమగు తర్కసంగ్రహమునుకూడ సులభశైలిని తెనిగించియున్నారు. తర్కసంగ్రహమును ప్రప్రథమముగా వింజమూరి కృష్ణమాచార్యులవారు తెనిగించినట్లు కానవచ్చుచున్నది. సుజనరంజని పత్రిక, శ్రీ కృష్ణమాచార్యులవారు తర్కసంగ్రహమును దెనిగించిరని పేర్కొన్నది.[33] పాఠశాలయందు విద్యాభ్యాసము చేయుచున్న బాలుర యుపయోగము నిమిత్తము వీరేశలింగం పంతులుగారు తర్కసంగ్రహమును తెనిగించినట్లు వ్రాసికొనిరి.

"అన్నంభట్ట కృతంబయి
సన్నుతి గన్నట్టి తర్కసంగ్రహమును దీ
నిన్నెఱి బాలుర కొఱకున్
గ్రన్నన వీరేశలింగకవి తెనిఁగించెన్"

అని పంతులుగారు తర్కసంగ్రహమును పూర్తిచేసిన తరువాత వ్రాసిరి. తర్కసంగ్రహము పంతులుగారు తన గ్రంథములను పదిసంపుటములుగా ప్రకటించినప్పుడు తొమ్మిదవ సంపుటమునందు చేర్చిరి. ఈ సంపుటమునకు పంతులుగారు 'సాహిత్య-ప్రకృతిశాస్త్ర గ్రంథములు' అని పేరిడిరి.

తర్కసంగ్రహము ప్రప్రథమమున వ్యయ సంవత్సరపు శ్రావణ మాసమున వివేకవర్ధనియందు వెలువడినది. తర్కసంగ్రహమును పంతులుగారనువదించిన పద్ధతి తెలియుటకై యొక భాగమిక్రింద నుదాహరింపబడు చున్నది

"శరీరాంతస్సంచారీ వాయుః ప్రాణశ్చ।
సచైకోఽప్యుపాధి భేదాత్ప్రాణాపానాది సంజ్ఞాం లభతే॥"

"శరీరములోపల సంచరించు వాయువు ప్రాణము, అది యొక్కటియే యయినను ఉపాధిభేదము వలన ప్రాణాపానాది సంజ్ఞలను బొందుచున్నది [ప్రాణము, అపానము, వ్యానము, ఉదానము, సమానము, అను పంచవాయువులను పంచప్రాణములనబడును]34..."

పంతులుగారు రచించిన శాస్త్రగ్రంథములలో కావ్యసంగ్రహము, అలంకార సంగ్రహము సంస్కృత వ్యాకరణము మొదలగునవి సాహిత్యగ్రంథములు. ఇవికాక, శారీరశాస్త్ర సంగ్రహము జ్యోతిశ్శాస్త్ర సంగ్రహము, జంతుస్వభావ చరిత్రము, మొదలగు ప్రకృతిశాస్త్ర గ్రంథములను పంతులుగారు రచించియున్నారు. ఇవియే కాక స్త్రీల యుపయోగమునకై సత్పతిహితసూచని దేహారోగ్య ధర్మబోధిని యను గ్రంథములను, స్త్రీలు వాటింప వలసిన ఆరోగ్యవిధులను, సామాన్యముగా, సులభశైలియందు కూర్చి, రచించిరి.

శారీరశాస్త్ర సంగ్రహము ప్రప్రథమమున 1886 వ సంవత్సరమున వివేకవర్ధనిలో ప్రారంభింపబడినది మొటమొదట పుస్తకరూపముగా నిది 1888 వ సంవత్సరమున వెలువడెను. 1895 వ సంవత్సరమున నీశారీరశాస్త్ర సంగ్రహము యొక్క రెండవకూర్పు వెలువడినది. 1899 వ సంవత్సరమున మూడవకూర్పు వెలువడినది. పంతులుగారు శరీరశాస్త్ర సంగ్రహమున కాంగ్లేయమున నొకయుపోద్ఘాతమును, తెనుగున నొక యుపోద్ఘాతమును కూర్చి యున్నారు. ప్రథమ ముద్రణమునందు పది రెండు చిత్రపటములను పంతులుగారు శారీరశాస్త్రమునకు సంబంధించిన వానిని కలకత్తానగరమున కర్రతో జేయించి, తెప్పించి, తమ గ్రంథమునందు పొందుపరచిరి. రెండవముద్రణమునందు మరి పదునైదు చిత్రరూపములను, మూడవకూర్పునందు మరి పదునారును, చిత్రరూపముల దిమ్మెలను ఇంగ్లండునుండి దెప్పించి శరీరశాస్త్రమునందు కూర్చిరి. కనుక పంతులుగారు ప్రకటించిన శారీరశాస్త్ర సంగ్రహమునందు మొత్తము ఏబదిమూడు చిత్రరూపములు గలవని చెప్పనొప్పును. ఈ చిత్రరూపము లన్నియు, మానవశరీరమునందలి, వివిధభాగములను, వానివాని పనులను గూర్చి విశదీకరించును

ఈ శరీరశాస్త్ర సంగ్రహమును రచించుటయందు పంతులుగారింగ్లీషు భాషలోని శారీరశాస్త్రములను బెక్కింటిని పరిశీలించిరి. ప్రాచీన హిందూ శారీర శాస్త్రములను గూడ వ్యయప్రయాసల కోర్చి పెక్కింటి నవలోడనము చేసిరి. శుశ్రుతము, అష్టాంగ హృదయము మొదలగు హిందూ శారీరశాస్త్రములను, ప్రొఫెసర్ హక్స్లీ మొదలగు పాశ్చాత్య విద్వాంసుల శారీర శాస్త్రములను బరిశీలించిరి. తమ ఆంగ్లోపోద్ఘాతమునందు వారిట్లు తెలిపియున్నారు.

"I now venture to publish the present Telugu work on the subject of physiology which is not a mere translation as originally contemplated in the hope of supplying to some extent the want of scientific books greatly felt in the Telugu country As this book is intented for students as well as the reading public at large, I have made my best endeavours to set forth the most important and general doctrines of the human physiology, avoiding technical terms as far as practicable, in such simple and comprehensive style as to make the book pleasing and attractive to the reader".[85]...

పంతులుగారు తాము శారీరక శాస్త్రమును తెనిగించుటకు పూనినప్పుడు మనుష్య శరీరము నందలి హృదయశ్వాస కోశాదులను పరీక్షించుటకు, సంపూర్ణ మయిన మనుష్యుని కంకాళమును సంపాదించి, వైద్యశాలాధికారులతో సంప్రదించి, ఆ శవము కోయబడునప్పుడు తాము చూచుట కేర్పాటు చేసుకొనిరట కాని, శవము కోయుటకు వైద్యశాలాధికారులు పూనుకొనగనే, కన్నులుదిరిగి మూర్ఛనొందిరట. పంతులుగారా దృశ్యమును చూడలేకపోయిరి.[86] పంతులుగారే విషయమునైన గ్రహింపదలచినచో, వారి పరిశోధనావ్యగ్రత యిట్లు లుండెడిది. పంతులుగారు తమ స్వీయచరిత్రము నందిట్లు వ్రాసియున్నారు.

"......నిదర్శన పూర్వకముగాఁ బరీక్షించినంగాని కొన్ని యంశములను బూర్ణముగాఁ దెలిసికొనుట యసాధ్యముగాఁ గానబడినందున, నామిత్రుడైన యొక వైద్యశాలాసహాయుని సాహాయ్యమున మేక యొక్క హృదయము, శ్వాసాశయము

ందలయిన యవయవములను వాని యందలి భాగములను నతడు ఛేదించి చూపగా
వఱకు దురవగాహములుగా నుండిన యంశము లనేకములు గ్రహించితిని..."

ఈ శారీర శాస్త్ర సంగ్రహమునందు, అస్థివివరణము, కండర వివరణము,
డీ వివరణము, రక్తవివరణము, శ్వాసాశయ వివరణము, జీర్ణసాధన వివరణము,
ష్కార బహిష్కార్యవయవ వివరణము, జ్ఞానేంద్రియ వివరణములను ఎనిమిది
కరణములు గలవు గ్రంథాంతమందు పారిభాషిక పదానుక్రమణిక యొకటి
ేర్పబడి యున్నది సుమారుగా పంతులుగారు తాము వాడిన పారిభాషిక పదము
ు సమానార్థకములైన మూడువందల యాంగ్లపదముల ననుబంధమునందు కూర్చి
ున్నారు.

ఈ పారిభాషిక పదములను కూర్చుటయందు హిందూ శారీర శాస్త్రములు
మకు తోడ్పడినవని పంతులుగారు తమ యుపోద్ఘాతమునందు వ్రాసి యున్నారు.

కాని పంతులు గారికి పూర్వమే శారీర శాస్త్రమునకు సంబంధించిన పారిభాషిక
దములను పురుషార్థ ప్రదాయిని పత్రికాధిపతులగు ఉమారంగనాయకులు నాయుడు
రు కూర్చియున్నారు. వీరు పురుషార్థప్రదాయినియందు 1872వ సంవత్సరమున
రీర శాస్త్రమునకు సంబంధించిన యనేక వ్యాసములను ప్రచురించిరి. వీరేశలింగం
ంతులుగారి శుద్ధాంధ్రోత్తర రామాయణము, రసికజన మనోరంజనము, ఆ
లమున పురుషార్థప్రదాయిని యందుఁ బ్రకటింపబడుచుండెడివి. పంతులుగారు
రుషార్థప్రదాయినికి చందాదారులుగాను నుండిరి. కనుక పంతులుగారు పురుషార్థ
్రదాయినిలో ప్రకటింపబడిన యనేక పారిభాషిక పదములను తాము స్వీకరించి
ుండుటలో విప్రతిపత్తి యుండఁబోదు. ఇదేవిధముగా 1875వ సంవత్సరము
ుండి విశాఖపట్టణము నుండి వెలువడుచుండిన సకల విద్యాభివర్ధనియందు ప్రకృతి
స్త్రములు తెనిగింపబడి ప్రచురింపబడినవి. పంతులుగారికి పూర్వము ప్రకృతి శాస్త్ర
షయమై జరిగిన యీ ప్రయత్నము లన్నియు, వారికి సాయపడి యుండవచ్చును 37
ట్లు చెప్పుటవలన పంతులుగారిమహత్వమున కొకలోపమురాదు తెలుగు
ాహిత్యమున నన్ని ప్రక్రియలను చేపట్టి, వానికొక స్థితిని, ప్రాచుర్యమును గల్పించి
లుగు భాషను సుసంపన్నము చేసనవారు పంతులుగారే యనుటలో సందేహముండ
ేదు. శ్రీమాన్ పరవస్తు వేంకటరంగాచార్లయ్య వారలను గూర్చి వ్రాయుచు,
ుహ్మశ్రీ కాశీభట్టబ్రహ్మయ్య శాస్త్రిగారిట్లు వ్రాసియున్నారు.

" ఇంగ్లీషులోని ప్రకృతిశాస్త్రముల దెనిగింప మొదలిడినవారును వీరే ! వస్తు తత్త్వశాస్త్రమును (Physics) తెనిగించి పత్రికలలో ప్రకటించి యాంధ్రలోకమునకు మహోపకారంబొనర్చిరి వీరెంగని వీరేశలింగంగారు ప్రకృతిశాస్త్రముల దాముకూడ దెనిగింప బ్రయత్నించిరి..."[38]

ఏదియేమైనను వీరేశలింగంపంతులుగారు, స్త్రీలకును, నాటి విద్యావంతులకును ప్రకృతిశాస్త్రజ్ఞానమును గలిగించుటకై విశేషించి కృషి యొనర్చిరనుట సత్యము. పంతులుగారి ప్రకృతిశాస్త్ర గ్రంథములన్నియు సులభశైలిని యలరారుచుండును. బాలురకైనను సుగ్రాహ్యములగునట్లుదాహరణములతో పంతులుగారు ప్రకృతి శాస్త్రములనుకూర్చిరి

" ఒక సంతయందు వణిజులు తమ సరకుల నితరులకు విక్రయించి యితరుల సరకులను దముకొనుచుండునట్లుగా, పుప్పుసవిపణియందు వాయువణిజుండును రక్తవణిజుండును సదా తమతమ సరకులను మార్చుకొనిపోవుచుండురు "[39]

ఇట్టి యుదాహరణములతో పంతులుగారు శారీరశాస్త్రమును, ఆసక్తిదాయకముగాచేసిరి. శాస్త్రీయ విషయములనుగూడ సులభగ్రాహ్యములగునట్లుచేయుటలోనే పంతులుగారి ప్రజ్ఞ నుతిపాత్రమగుచున్నది.

పంతులుగారి శారీరశాస్త్ర సంగ్రహము సమకాలపు పత్రికలచే ప్రశంసింపబడినది. ఆ కాలమునందు బందరునుండి వెలువడుచుండిన 'హిందూదేశాభిమాని'యను పత్రిక శారీరశాస్త్ర సంగ్రహమునిట్లు ప్రశంసించినది.

" Mr Kandukuri Veeresalingam Pantulu the senior pandit of the Government College, Rajahmundry, has Published a free Translation of Professer Huxley's Physiology, a copy of which we have received ...From the preface of the book we learn that the pandit has taken great pains in going through all the books relating to the subject both English and Telugu such as Anatomy, susruta, Astanga Hrithaya and many others, some of which have not as yet seen the light of publication..."[40]

పంతులుగారు రచించిన ప్రకృతిశాస్త్ర గ్రంథములలో రెండవది జ్యోతిశ్శాస్త్ర సంగ్రహము.

పంతులుగారు 1895వ సంవత్సరమునందు జ్యోతిశ్శాస్త్ర సంగ్రహమును బటములతోఁ బ్రకటించిరి. జ్యోతిశ్శాస్త్రము ప్రకృతిశాస్త్రములలోకెల్ల నుత్తమమయిన శాస్త్రము ఈ శాస్త్రమును జదివి గ్రహణములు మొదలైనవి కలుగుటకుగల నిజమైన కారణములను దెలిసికొన్న పక్షమున, ఏతద్విషయమున జనులలోగల మూఢ విశ్వాసములను, మూఢాచారములను నశించి, వారియందు ప్రకృతిశాస్త్రజ్ఞానముకలుగునని తామీ జ్యోతిశ్శాస్త్ర సంగ్రహమును రచించుటకుపూనితిమని పంతులుగారు స్వీయ చరిత్రమునందు తెలిపియున్నారు. జ్యోతిశ్శాస్త్ర విషయమునందుకూడ పంతులుగారికి పూర్వమే యీ దేశమున కొందరు కృషిచేసియున్నారు. 1872వ సంవత్సరమునందే బందరునుండి వెలువడుచుండిన పురుషార్థ ప్రదాయినియందు జ్యోతిశ్శాస్త్ర విషయమై యొందు రెండు వ్యాసములు ప్రకటింపబడినవి.

విజయనగర సంస్థానమునకు సంబంధించిన గోడే వెంకటజగ్గారావు జమీందారుగారును, వారి యల్లుడైన అంకితం వేంకట నరసింగరావుగారును, జ్యోతిశ్శాస్త్ర విషయమై మిక్కిలి కృషిచేసిరి అంకితం వేంకట నరసింగరావుగారు జ్యోతిశ్శాస్త్రమునందు గొప్ప విద్వాంసులు 1887వ సంవత్సరమున వేంకట నరసింగరావుగారు జ్యోతిశ్శాస్త్ర సంబంధములుగా తాము కనుగొన్న వింతలనెల్లను నొక పుస్తకముగ ప్రచురించిరి [41]

వీరి మామగారు గోడే వేంకటజగ్గారావుగారు గణితశాస్త్రమునందును. జ్యోతిశాస్త్రమునందును అఖండ ప్రజ్ఞను సంపాదించిరి. గోడే వెంకట జగ్గారావుగారు గోడే నారాయణ గజపతి అన్నగారు. నారాయణగజపతిరాయణింగారు సర్వప్రజా హిత కార్యములకు భూరిధనమును వెచ్చించుటయేకాక, గొప్ప సారస్వతేయులుగా కూడ ప్రసిద్ధిని బొందినవారు. 'చార్‌దర్విష లేక నలుగురు ఫకీరులకథల'ను గ్రంథమును ఎఱ్ఱమిల్లి మల్లికార్జునపంతులు నారాయణగజపతిరాయణింగారికే అంకితమిచ్చిరి. బాలికా విద్యాభ్యాసమునకును, స్త్రీ పునర్వివాహములకును నారాయణగజపతి రాయణింగారు, విశేషధనమును వెచ్చించిరి వేంకట జగ్గారావుగారు 1841 వ సంవత్సరమునందు విశాఖపట్టణమున తమడాబాగార్డనులో నక్షత్రాదులను బరిశీలించుట కొక

నక్షత్రవేధశాలను (Observatory) నిర్మించిరి. తమ కాలమునందు వేంకట జగ్గారావుగారు జ్యోతిశాస్త్రమునందు విశేషప్రజ్ఞను సంపాదించి, జ్యోతిశాస్త్ర సిద్ధాంతులలో ముఖ్యులైరట. వారు తమ మరణశాసనమందు తమ నక్షత్రవేధశాలను, అభివృద్ధిపరచి బాగుచేయవలయుననియు, తమ సంతతివారు దానిని భరించుచుండవలయుననియు వ్రాయుటనుబట్టి చూడగా వారికి జ్యోతిశాస్త్రమునందెట్టి యభిమానము కలదో తెలియుచున్నది. వేంకట జగ్గారావుగారి తదనంతరము వారి యల్లుడైన వేంకట నరసింగరావుగారు నక్షత్రశాలను నానావిధముల వృద్ధినొందించి, గవర్నమెంటువారితోడను, ఇతర దేశపు జ్యోతిశాస్త్ర విద్వాంసులతోడను, ఉత్తర ప్రత్యుత్తరములు జరుపుచు, జ్యోతిశాస్త్ర విషయములందఖండ పాండితీమండితులని పేరుగాంచి, 'రాయల్ ఏష్యాటిక్ సొసైటీకిని, రాయల్ జియోగ్రాఫికల్ సొసైటీకిని పెల్లో అయినారట. ఈ విధముగా వీరేశలింగంపంతులుగారికి పూర్వమే తెలుగుదేశమునందు జ్యోతిశాస్త్ర సంబంధమైన కృషి కొంత కొనసాగినది.

పంతులుగారు జ్యోతిశాస్త్ర సంగ్రహమును ప్రప్రథమమున 1894వ సంవత్సరమున చింతామణి పత్రికయందు వెలయించిరి తదుపరి 1895 వ సంవత్సరమున పుస్తకరూపమున వెలువరించిరి

పంతులుగారీజోతిశాస్త్ర సంగ్రహమును రచించుటకు తత్సంబంధములైన ప్రాచ్యపాశ్చాత్య విద్వాంసులు రచించిన యనేక గ్రంథముల నవలోడనము చేసిరి. భాస్కరా చార్య లవారి సిద్ధాంత శిరోమణి, వరాహమిహిరాచార్యులవారి బృహజ్జాతకము, ఇంకనుసంస్కృత భాషలోనే ప్రాచీన గ్రంధములుగా పరిగణింప బడుచున్న సూర్యసిద్ధాంతము, పంచసిద్ధాంతిక మొదలైన గ్రంధము లనేకములు పరిశీలించి, వారు తమ 'జ్యోతిశాస్త్ర సంగ్రహము'ను కూర్చిరి. ఇంగ్లీషుభాషలోనున్న జ్యోతిష గ్రంధములనేకములు చదివిరి. తెలిసినవారి సాయమువలన రాత్రుల గ్రహములు, నక్షత్రములు మొదలయిన వానిని జూచి వానిస్థానములను రూపములను గ్రహించిరి చెన్నపట్టణమునకు బోయినప్పుడచ్చట నక్షత్రశాలాధికారుల సాహాయ్యమువలన పగలు శనిగ్రహాదులను, శనిగ్రహముయొక్క యుంగరములను దూరదర్శక యంత్రముల వలన జూచిరి. ఇట్లీగ్రంథమును రచించుటలో పంతులుగారు విశేషశ్రద్ధ వహించి, తమనేర్పుఁ జూపిరి.

"ఈ పుస్తకమునందు నేను సాధ్యమైనంతవఱకు పారిభాషిక పదములను రానీయక సుగమముగా నుండునట్లు సులభశైలినే యుపయోగించినను శారీర శాస్త్రము నందువలెనే దీనియందును ఇంగ్లీషు పర్యాయపదములలో పారిభాషిక పదముల పట్టి కను తుదను జేర్చితిని. పటములులేని యెడల విషయము సుబోధముగా నుండదు గనుక విశేషవ్యయముచేసి యాయా గ్రహనక్షత్ర ధూమకేతు సూర్యచంద్రోప రాగాదులను జూపెడు పటముల నేబదికంటె నెక్కువగా నింగ్లండునుండి చేయించి తెప్పించి యిందు యుక్తస్థలముల యందు వేయించితిని" అని పంతులుగారు తమ స్వీయచరిత్రమునందు వ్రాసియున్నారు.

ఈ జ్యోతిశ్శాస్త్ర సంగ్రహమునందు ప్రసక్తాను ప్రసక్తముగ జనుల మూఢ విశ్వాసములు, మూఢాచారములు విమర్శింపబడినవి

ఈ గ్రంధమునందు భూగ్రహము, సూర్యగ్రహమండలి, సూర్యుడు, చంద్రుడు, గ్రహణములు, లఘుగ్రహములు, గురుగ్రహములు, దూమకేతువులు, ఉల్కలు, నక్షత్రములు, అను తొమ్మిది ప్రకరణము లున్నవి గ్రంధము చివర సుమారు రెండువందల అరువది పారిభాషిక పదములును, వాని సమానార్ధకములైన ఆంగ్లపదములును కూర్పబడినవి గ్రంధమున కాంగ్లము నందొక యుపోద్ఘాతమును, తెలుగున విపులమగు నొక యుపోద్ఘాతమును కూర్పబడినవి. గ్రంధము సులభశైలి యందు, ఆసక్తిదాయకములైన ఖగోళ శాస్త్రవిషయములతో నొప్పుచున్నది. సూర్య చంద్రాదులను గూర్చియు, నక్షత్రములను గూర్చియు, మన పురాణప్రసిద్ధములైన కధలు ప్రసక్తాను ప్రసక్తముగాఁ జర్చింపబడినవి, శాస్త్రీయములైన విషయములు సిద్ధాంతీకరింపబడినవి. ఈ గ్రంథము ప్రప్రథమమున 1895వ సంవత్సరమునను, రెండవసారి 1899వ సంవత్సరమునను ముద్రింపబడినది. 1897-99 సంవత్స రముల మధ్యకాలమున, పంతులుగారు తమ గ్రంథముల నన్నిటిని పదిసంపు టములుగాఁ బ్రకటించునప్పుడీ జ్యోతిశ్శాస్త్ర సంగ్రహమును తొమ్మిదవ సంపుటము నందు చేర్చియున్నారు.

మన భాషయందు ప్రకృతి శాస్త్రములులేని లోపమును తీర్పవలెనని పంతులు గారు పూనుకొని యుండుటచే నిట్టి గ్రంథములు రచింపబడి, దేశభాషలలో తెలుగు భాష ఘనగౌరవమును సంపాదింపగలిగెను.

పంతులుగారి జ్యోతిశాస్త్ర సంగ్రహమును, నాటి సమకాలీనపు పత్రికలైన యముద్రిత గ్రంధ చింతామణి, వైజయంతి పత్రికలు కొనియాడినవి

" .... శ్రీ పంతులుగా రుభయ భాషలలోని విషయమును సంపూర్ణముగఁ జదివి 122 పుటలుగల గ్రంథమును వచనరచనతోను దమ యభిప్రాయముతోను బ్రకటించియున్నారు. ఇట్టి గ్రంధములు మన భాషయందరుదు పంతులవారి కెంత యోపికయోగాని వారు నానా శాస్త్రములందుఁ దమబుద్ధిం బ్రసరింపజేయుచుఁ బ్రకృతి శాస్త్రములనెల్ల నివ్విధముగాఁ బ్రకటింప సమకట్టుట కెంతయు నబ్బురపడుచున్నారము. మఱి యొకరికింత యోపికయు నింత పట్టుదలయు నుండదని రూఢిగా నమ్ముచున్నారము..."42 అని అముద్రిత గ్రంధ చింతామణియు,

"జ్యోతిశాస్త్ర విషయములు జనుల కెల్లరకు దెలియఁదగిన వగుటచేతను, ఇంటిలవారు నత్యనుపమ శాస్త్రార్థ విచారపారంగతులగు నాంగ్లేయ పండితులచే రచితములైన గ్రంధంబుల నప్రమత్తతఁ జదివి యందలి యంశంబులఁ దమ సర్వజని సుబోధకంబగు శైలిని గూర్చి యిప్పొత్తంబునఁజేర్చి యుండుటచేతను, మృదుపదలలితంబును, శాస్త్రజ్ఞాన సుబోధకంబును, బండితపామర జనహృద్యంబునగు నిట్టి గ్రంధము మఱి యొండులేమిచేతను . నిప్పుస్తక మనుగ్రహాణీయమై నెగడనోపు...48, అని వైజయంతి పత్రికయుఁ నీ జ్యోతిశ్శాస్త్ర సంగ్రహమును బ్రశంసించినవి

వీరేశలింగంపంతులుగారు రచించిన ప్రకృతిశాస్త్రములలో మూడవది జంతు స్వభావ చరిత్రము. దీనిని పంతులుగారు ప్రధమమున చింతామణిలో భాగభాగములుగ 1892-1896 సంవత్సరములమధ్య కాలమునఁ బ్రచురించియున్నారు. వారు స్త్రీలకొరకై నిర్వహించిన సతీహితబోధినియందుకూడ వినోదాత్మకముగను, విజ్ఞానాత్మకముగను నుండునట్లు కొన్ని జంతువులనుగూర్చి వ్రాసియున్నారు. ఈ జంతు స్వభావ చరిత్రము ప్రప్రధమమున 1896వ సంవత్సరమునందు గ్రంథరూపమున వెలువడెను ఈ గ్రంధమునందు పంతులుగారు దాదాపుగా నలువది జంతుపటములను కూడకూర్చిరి. జరాయుజములైన జంతువులనుగూర్చి మాత్రమే యీ ప్రథమభాగము 'నందు తెలుపబడినది జంతువుల స్వభావాది వర్ణముచేయుటయేకాక యక్కడక్కడ వానినిగూర్చిన కథలను మనుష్యులకు వానిని గూర్చి గల యభిప్రాయములుఁగూడ

పంతులుగారి గ్రంథమునందు చేర్చియున్నారు. మన దేశమునందు వసించు వానరములనుగూర్చియు, కుక్కల స్వభావలక్షణాదులనుగూర్చియు పంతులుగారు చిన్న చిన్న కథలుగానీ జంతు స్వభావ చరిత్రమునందు మనోహరములైన విషయములను వ్రాసినారు జంతు స్వభావ చరిత్రము నేటికిరెండుమార్లు మాత్రమే ముద్రింపబడినది 1896వ సంవత్సరమున తొట్టతొలుతటిసారిగా ముద్రింపబడి, పంతులుగారి గ్రంథములన్నియు సంపుటములుగా వెలువడునప్పుడు ద్వితీయ ముద్రణము నొందినది. 1899వ సంవత్సరమున పంతులుగారి గ్రంథములు సంపుటములుగా ముద్రింపబడినప్పుడీ జంతు స్వభావ చరిత్రము తొమ్మిదవ సంపుటమునందు చేర్పబడినది. రెండవ భాగమునందు జరాయుజములుకాని తక్కిన జంతువులనుగూర్చి వ్రాయదలచినట్లు పంతులుగారు తమ ఉపోద్ఘాతమునందు వ్రాసియున్నారు కాని, వారుద్దేశించిన రెండవభాగము వెలువడలేదు. తెలుగుభాషయందు జంతువుల స్వభావములను తెలుపు గ్రంథములు వీరేశలింగంపంతులుగారికి పూర్వము లేవనియే చెప్పనొప్పును. జరాయుజములైన సమస్త జంతువులను గూర్చియు నందు చెప్పబడకపోయినప్పటికిని, హిందూదేశమునందుగల ముఖ్యములైన జంతువులను గూర్చియు, దేశాంతరములందు గల కొన్నిటినిగూర్చియు నిందు ముఖ్యాంశములను దెల్పియున్నానని పంతులుగారుపోద్ఘాతమునందు వ్రాసిరి 44

మొదటి ముద్రణమునందు చేర్చిన యొక చిత్రపటము గాక, రెండవ ముద్రణమునందు మరి తొమ్మిదింటినిగూర్చి పంతులుగారు జంతు స్వభావ చరిత్రమునందు చిత్రపటములను జేర్చియున్నారు. అనగా జంతు స్వభావచరిత్రమునందించుమించుగా డెబ్బది చిత్రపటములను పంతులుగారుకూర్చిరి.

స్తన్యమిచ్చు జంతువులనుగూర్చి వివరింపబడిన నీ ప్రథమభాగమునందు పంతులుగారు చతుర్హస్త జంతువులు, పక్షహస్త జంతువులు, మాంసభక్షక జంతువులు, ధాన్యాది భక్షక జంతువులు, అను ప్రకరణముల క్రింద విభజించి, వానివాని స్వరూప స్వభావాదులనువారు వర్ణించియున్నారు. జల జంతువులనుగురించి వేరొక యధ్యాయమును వ్రాసినారు జల జంతువులతో కలిపి పంతులుగారి జంతు స్వభావ చరిత్రమునందు నూటినిమించియే జంతు స్వభావ చరిత్రములనుకూర్చినారు. ధాన్యాది భక్షక జంతువులయందు, కొఱికితినునవనియు, నెమరువేయునవియు, నెమరువేయని మృగములనియు నంచులుగల జంతువులనియు, మరల ప్రత్యేక విభాగముల క్రింద

వాని స్వభావములను వర్ణించిరి కేవలము వానివాని స్వరూప స్వభావాదులను వర్ణించు టచే తృప్తినొందక, సృష్టివైచిత్ర్యము, మానవునకును, సృష్టిలోని యితర ప్రాణు లకునుగల సంబంధమును పంతులుగారు తమ జంతు స్వభావ చరిత్రమునందు మనో హరముగ వర్ణించిరి. ఖండఖండాంతరములలోని క్రూర జంతువులనుగూర్చియు, సాధు జంతువులనుగూర్చియు, ఆశ్చర్యకరములైన, ఆసక్తికరములైన విషయముల నీ గ్రంధమునందు వారుకూర్చిరి.

ప్రకృతిశాస్త్ర విషయకములైన నీగ్రంథములేకాక పంతులుగారు స్త్రీల కత్యా వశ్యకములైన శరీరారోగ్య ధర్మములను బోధించెడు 'దేహారోగ్య ధర్మబోధిని' యను గ్రంధమును, 'పత్నీహిత సూచనియను గ్రంధమును రచించిరి. 1883వ సంవత్సరమున స్త్రీలకొరకు 'సతీహితబోధిని' యను మాసపత్రికను ప్రారంభించి, యందు స్త్రీలకు వినోదాత్మకములు, విజ్ఞానాత్మకములునగు కథలు, వచన ప్రబంధ ములు, నీతులు, దేహారోగ్యమును బోధించెడువైద్యవిషయములు, దేహగేహపరి శుభ్రతలను బోధించు విషయములను ప్రచురించుచు వచ్చిరి 'సతీహితబోధిని' ప్రధమ సంచిక 1883 ఏప్రిల్ నెలయందు వెలువడెను. 1883 మేసంచికయందు గర్భిణి స్త్రీలు పాటింపవలసిన విధులనుగూర్చి పంతులుగారు వ్రాయుట ప్రారంభించిరి. 1883 డిసెంబరు నెలయందు ప్రసవావస్థను గూర్చి వ్రాసిరి. ఈ శాస్త్రమునందు పాకశాస్త్రవిషయములుకూడ వ్రాయబడినవి. 1884 ఏప్రిల్ నెలయందు 'బాలింత తనము'ను గూర్చి వివరింపబడినది 1888వ సంవత్సరము సెప్టెంబరు నెలయందు శిశుసంరక్షణముసుగూర్చి వ్రాయబడినది పంతులుగారీ ప్రకరణముల నన్నిటి నొక్కచోచేర్చి గ్రంధరూపమున 1896వ సంవత్సరమున 'పత్నీహిత సూచని' పేరుతో ప్రకటించిరి.

పత్నీహిత సూచనియందు ఆర్తవకాలము, గర్భిణీస్త్రీలు, ప్రసవావస్థ, బాలింత తనము, శిశుసంరక్షణము, బాలపోషణమునను ఆరు ప్రకరణములున్నవి. వీనిని పంతులుగారు వేర్వేరుగా 1883-88 సంవత్సరముల మధ్యకాలమున 'సతీహిత బోధిని' యను మాసపత్రికయందు ప్రకటించి యున్నారని పైన వివరింపబడినది. పంతులుగారనేక వైద్యశాస్త్ర గ్రంధములను బరిశీలించి, స్త్రీల యుపయోగము నిమి త్తమై యీ పత్నీహిత సూచనిని ప్రకటించిరి. సంఘమున్నతిని బొందవలెనన్నచో స్త్రీలు విద్యావంతురాండ్రు కావలెననుట పంతులుగారి గాఢమగు విశ్వాసము కావున,

వారి స్థితిని బాగుపరుపవలెనని, పంతులుగారు శ్రమించిరి వారిని ఉత్తమ యిల్లాండ్రు గను, సంస్కార వంతురాండ్రుగను, జేయ పంతులుగారహర్నిశమును బాటుపడిరి అందువలననే పంతులుగారిని స్త్రీజన బాంధవుడని, మహిళాలోకము కీర్తించినది. స్త్రీల యారోగ్య విధులను దెలిపెడు నీ పత్నీహిత సూచనియందు స్త్రీలయొక్క యార్తవ కాలమునందును, గర్భధారణ స్థితియందును, శిశుపోషణ సమయమునందును, నడవ వలసిన మార్గములును, జేయవలసిన ధర్మములును, రాదగిన రోగములును, తన్ని వారణార్థ మాచరింపవలసిన చికిత్సలును సామాన్యముగా వివరింపబడినవని పంతులు గారు తమ స్వీయచరిత్రమునందు తెలిపియున్నారు ఈ పత్నీహిత సూచని స్త్రీల కుపయోగించు పుస్తకములను ఆఱవసంపుటము నందు చేరియున్నది.

'దేహారోగ్య ధర్మబోధిని'కూడ సతీహిత బోధినియందే వెలువడినది 1883-88వ సంవత్సరముల మధ్యకాలమున నిందలి ప్రకరణములు భాగ భాగ ములుగా సతీహిత బోధినియందు ప్రచురింపబడినవి. ప్రప్రథమమున పుస్తకరూపము గానీ 'దేహారోగ్య ధర్మబోధిని' 1889వ సంవత్సరమున వెలువడినది.

ఇందు వాయువు, జలము, భోజనము, దేహగేహ పరిశుద్ధతలు, దేహపరిశ్రమ విశ్రాంతులునను అయిదు ప్రకరణములున్నవి 'దేహారోగ్య ధర్మములను బోధించెడు గ్రంథములు తెలుగుభాషలో నంతగాలేవు. ఉన్నవానిలో సహితము కొన్ని మిక్కిలి పెద్దవిగాను, కొన్ని మిక్కిలి చిన్నవిగాను, ఉండి బాలురకును బాలికలకును సుబోధ ములు కాకున్నవి కాఁబట్టి యెల్లవారికి నుపయోగపడునట్లుగా మిక్కిలి సులభశైలితోనే నీగ్రంథమును రచించితిని.' అని పంతులుగారు దీని పీఠికయందు వ్రాసియున్నారు [45] ఈ పుస్తకమునకు, పుస్తకములోని ప్రకరణములను వివరించు విపులమగు నొక యుపోద్ఘాతమునుగూడ పంతులుగారు రచించి యున్నారు. దేహారోగ్యమును బోధించు సర్వవిషయములును నీ గ్రంథమునందు సులభశైలియందు కూర్పబడినవి

ఈ 'దేహారోగ్య ధర్మబోధిని'కూడ స్త్రీలకుపయోగించు పుస్తకములను ఆఱవ సంపుటమునందే చేర్పబడినది.

ఇవికాక పంతులుగారు పదార్థవివేచక శాస్త్రమును గూడ ప్రశ్నోత్తర రూప మున తెనిగించి ప్రకటించుటకు ప్రారంభించిరికాని, ఆకాలమునందు రాజమహేంద్ర వరమందుండిన కలాచార సంస్కార సమాజమువారు (The Social Reform Association), ఈ పదార్థవివేచక శాస్త్రమును తెనిగించుటకు వేరొకరిని నియ

మించి, పంతులుగారిని శారీర శాస్త్ర సంగ్రహమును తెనిగించుమని కోరిరట పంతులు గారందులకు సమ్మతించి 1878వ సంవత్సరమునకు పూర్వమే తాము తెనిగించుట ప్రారంభించిన పదార్ధ వివేచక శాస్త్రమును మానివేసిరి.

పంతులుగారు 'భూగోళస్వభావదీపిక'ను 1884వ సంవత్సరము జూన్‌నెల సతీహితబోధినియందు ప్రారంభించిరి. కాని, అటుతరువాత ఆ పత్రిక కొంత కాలము నిలిపివేయబడుట వలన, ముగింపక విడిచిపెట్టిరి. 1888వ సంవత్సరమునందు 'సతీహితబోధిని' పునరుద్ధరింపబడినను, భూగోళ స్వభావదీపికను పంతులుగారా పత్రిక యందు వెలువరింపలేదు

మరల 1904వ సంవత్సరము అక్టోబరు నెలయందు భౌతిక భూగోళశాస్త్ర సంగ్రహమును పంతులుగారు 'తెలుగు జనానా పత్రిక'యందు ప్రారంభించిరి. 1905 మార్చి నెలవరకు, భౌతిక భూగోళమును పంతులుగారు తెలుగు జనానా పత్రిక యందైదు సంచికల యందు ప్రకటించిరి కాని, యేలనో అసమగ్రముగానే విడిచిపెట్టిరి. ఈ విషయమునే పంతులుగారు తమ స్వీయచరిత్రమునందు తెలిపి యున్నారు. కనుక పంతులుగారు ప్రకృతిశాస్త్ర విషయకములైన గ్రంధములలో శారీరశాస్త్ర సంగ్రహము, జ్యోతిశ్శాస్త్ర సంగ్రహము, జంతుస్వభావ చరిత్రములను గ్రంథములను సంపూర్ణముగను, పదార్ధవివేచక శాస్త్రము, భౌతిక, భూగోళ శాస్త్రములను గ్రంథముల నసంపూర్ణముగను రచించినట్లు స్పష్టమగుచున్నది.

పంతులుగారు స్త్రీల కత్యంతోపయుక్తములుగ 'పత్నీహితసూచని', 'దేహారోగ్యధర్మబోధిని'యను గ్రంథములను రచించుట, జనసామాన్యమున కుపయుక్తముగా ప్రకృతిశాస్త్ర గ్రంధములను దెనిగించుట, పాఠశాలా విద్యార్ధుల కుపకారకములుగా సంగ్రహ వ్యాకరణము, తర్క సంగ్రహము, కావ్యసంగ్రహము, అలంకార సంగ్రహములను గూర్చుటయేకాక, చిన్నతరగతి బాలురకు వాచక పుస్తకములను గూడ రచించిరి.

వీరేశలింగంపంతులుగారు బాలుర కొరకు రచించిన వాచక పుస్తకములు మిక్కిలి వ్యాప్తినొంది విద్యాధికారులచే ప్రశంసలను బొందినవి. పంతులుగారు రెండవ తరగతి వాచకమును, నాలవ తరగతి, ఐదవ తరగతి, ఆఱవ తరగతి వాచక పుస్తకములను రచించిరి. పంతులుగారి వాచక పుస్తకముల రచనా ప్రణాళిక

బహుపండితులచేఁ గొనియాడఁబడెను. మాక్మిలన్ కంపెనీవారీ వాచక పుస్తకములను బ్రచురించిరి. పంతులుగారి తదనంతర మీ పుస్తకములు, జనమంచి శేషాద్రిశర్మ గారి సంపాదకత్వమున మాక్మిలన్ కంపెనీవారే పునర్ముద్రణములు గావించియున్నారు.

బ్రౌన్ దొరవారు కూడ తెలుగు నేర్చుకొనగోరు పాశ్చాత్యులకును, చిన్న తరగతుల బాలురకును మిక్కిలి యుపయుక్తములుగా నుండునటుల కొన్ని వాచక పుస్తకములను రచించిరట బ్రౌను దొరవారి వాచక పుస్తకములలో వాచకము మొదటి భాగములో కథలు, ఉత్తరములు, నేరముల విచారణలు, సులభశైలియందు కూర్పబడి యుండెను. రెండవ భాగములో ఆంగ్లానువాదము, మూడవ భాగములో వ్యాకరణాంశములు. చిన్న నిఘంటువు ప్రకటింపబడెనట.[46] బ్రౌన్ దొరవారి వాచక పుస్తకములు ప్రప్రథమమున 1852వ సంవత్సరమున ముద్రింపబడెనట. బ్రౌను దొరవారికి పూర్వము కూడ పాశ్చాత్య విద్వాంసులు తెలుగు భాషను నేర్చుకొనుటకు సహాయపడునట్లు చిన్నచిన్న వాచకములను, అభ్యాసములను, నిఘంటువులను కూర్చియున్నారు

1853వ సంవత్సరమున నరసాపురమునందు సబ్‌కలెక్టరుగానున్న టెయిలర్‌దొర, పల్లెటూళ్ళ పాఠశాలల నిమిత్తము సర్కారు ముద్రణాలయమునుండి 'The Peoples Magazine', 'The daily lesson Books' మొదలగు కరపత్రముల నప్పుడప్పుడు ప్రచురించుచుండిరట [47]

వీరుకాక శ్రీవెన్నెలకంటి సుబ్బారావు పంతులుగారు (1784-1839) బాలుర కుపయోగించు చిన్నచిన్న వాచకములఁ గొన్నిటిని తెనిగించిరట. కొన్ని స్వయముగరచించిరట.[48] వెన్నెలకంటి సుబ్బారావు పంతులుగారు 1820వ సంవత్సరమునందు, ప్రభుత్వమువారిచే 'Madras Vernacular School Book Society' స్థాపింపబడినప్పుడు, ఆ కార్యనిర్వాహకవర్గమునందొక సభ్యులుగా నియమింపబడిరి 1820వ సంవత్సరము, నవంబరు 22వ తేదిన, విద్యావిషయకమైన నొక దీర్ఘమగురిపోర్టును, సుబ్బారావు పంతులుగారు స్కూలుబుక్ సొసయిటీ వారికి పంపియుండిరి. ఈ రిపోర్టు సుబ్బారావు పంతులుగారి ప్రతిభను చాటిచెప్పుచున్నది. కాని సుబ్బారావు పంతులుగారి వాచక పుస్తకములు నేడనుపలభ్యములు.

వీరేశలింగంపంతులుగారి వాచక పుస్తకములు వాని రచనా ప్రణాళికకు, విషయ సంపన్నతకు, బాలుర మనస్తత్వమునకు, అనుగుణముగా రచింపబడిన

మహాగుణమునకు, నేటికిని పండితులచే ప్రశంసలనందుచునేయున్నవి. పంతులుగారు వాచకములను వెలువరించిన తదుపరి యెందరో వాచకములను రచించిరి. ఎన్నియో వాచకములు వెలిసినవి. కాని వీరేశలింగంపంతులుగారి వాచక పుస్తకములకు వచ్చినంత ప్రశస్తి వానికిరాలేదు. పంతులుగారి వాచక పుస్తకములు బాలుర చిత్తవృత్తికి అనుగుణమైన విషయ సంగ్రహణమును, భాషా వివేచనయుకలిగి యొప్పారుచుండునని పండితులు ప్రశంసించుచున్నారు [49]

పంతులుగారిట్లు గ్రంథములను రచించుటయేకాక, యనేక ప్రాచీనాంధ్ర పద్య కావ్యములను పరిష్కరించి ప్రకటించినారు. మహాభారతమును వేమూరి వెంకట కృష్ణమ్మసెట్టి అండ్ సన్స్ వారు ప్రకటించినప్పుడు వీరేశలింగంపంతులుగారు మహాభారత పరిష్కరణమును, శ్రీరాయదుర్గంనరసయ్య గారితోకలిసి వహించిరి. బ్రౌన్ దొరవారి యాంధ్రాంగ్ల నిఘంటువును పరిష్కరించి ముద్రించిరి. పంతులుగారు బహు గ్రంధకర్త. మహాపరిశోధకులు మహావ్యక్తి. యుగపురుషుడు. ఆంధ్రసాహిత్యమును సుసంపన్నముచేసిన సరస్వతీమూర్తి

"ఒకయెడ స్త్రీ పునరుద్వాహమునుగూర్చి
  వాదించుఁ బండిత వయులతోడ
నరగ నింకొకదెస సంఘ సంస్కరణచే
  జెలగు సభనుపన్యసించుచుండు
బలగవేఱొకదెస బత్రికా ప్రకటన
  భారంబు వహించు ప్రజ్ఞమీర
రహినొక్క తఱి గ్రంధ రచనా విశేషంబు
  నను దెల్పు జనుల దుర్నయములెల్ల

నొక నిమిషమైన విశ్రాంతి నొందకుండ
బరహితార్థంబు కొరకునై పాటుపడుచుఁ
గాలమెంతయో విలువఁగా గడుపునహహ
మనుడు వీరేశలింగాఖ్య కవివరుండు......[50]

అను పొగడ్త వీరేశలింగంపంతులుగారి యెడల సార్థకము.

---

# 13

# పంతులుగారి సాహిత్యసృష్టి పర్యావలోకనము

పంతులుగారు స్పృశింపని సాహిత్య ప్రక్రియలేదు. ఆంధ్రసాహిత్యమును సంపన్నముచేసి, ప్రక్రియావైవిధ్యమును కూర్చి, బహుముఖముల సాహితీ వంతిని ప్రవహింపచేసి, తెలుగు మాగాణములను పండించినది పంతులుగారే.

అధునిక యుగప్రభాతమునకు వేగుజుక్క పంతులుగారు. వారు నవీన వచన ంగావతరణమునకు భగీరథులు. ప్రాచీనధోరణికి భరతవాక్యమును, నవీనధోరణికి ందీవాక్యమును పల్కిన క్రాంతదర్శి పంతులుగారు. సుమారు తొమ్మిదివందల ంవత్సరములనుండి, యనూచానముగా ననుసరింపబడుచుండిన సంప్రదాయ మార్గ ంను, సాహిత్య దృష్టిని, నవీన దృక్పథముతో ప్రజల చేరువకు మరలించినవారు ంతులుగారు. తెలుగు సాహిత్యమునందు ఇట్టి వైలక్షణ్యమును చూపినట్టి వ్యక్తి ఎయొకరు లేరు "విశ్వశ్రేయః కావ్య"మను కావ్యాదర్శమును పంతులుగారివలె క్ష్యీకరించిన వారను ఆటదేయని చెప్పవలెను. పంతులుగారు ప్రబోధవాఙ్మయ ర్మాత ఇట్టి వాఙ్మయ సృష్టియందు, వారు ఆద్యులగుటయే కాక, అగ్రగణ్యులును ాడ నైయున్నారు. పంతులుగారు సాహిత్యసృష్టికి గడంగుటతోడనే కళకళ కోసమే ంసు నాదర్శము ప్రాచుర్యమును పోగొట్టుకొనినది కళలోకారాధనమునకై యుప ాగింపబడవలెనని, కావ్యపరమార్థము విశ్వశ్రేయ మనియు పంతులుగారు నిర్వ ంచి నిరూపించినారు. పంతులుగారు సాహిత్యసృష్టికి గడంగునప్పటికి తెలుగుదేశ ంన నలుమూలల నావరించి యుండిన అంధతామిస్రములు తొలగినవి తెలుగు రికి విజ్ఞాన జ్యోతిని, శాస్త్రదీపమును, పంతులుగారు ప్రసాదించిరి.

పంతులుగారు వినిర్మించిన సాహిత్యమువలన సామాన్యుడు మాన్యుడాయెను ాహిత్యమునకు నూత్న ప్రయోజనము సిద్ధించెను. ఐరోపాదేశపు నాగరికత, విజ్ఞా ము, శాస్త్రపరిజ్ఞానము, సాహిత్యము మొదలగు వానిచే ప్రభావితులై పంతులుగారు, లుగు సాహిత్యమునందును, సంఘమునందును, క్రొత్తమార్పుల ననేకములను ్పెట్టిరి. ఈ కారణములవలననే పంతులుగారు తెలుగువారి సాంఘికాభ్యుదయ

మునకు మూలపురుషుడనియు, సాహిత్యమున యుగకర్తయనియు కీర్తింపబడు చున్నారు.

చిన్నయసూరి వచనరచనము వియద్గంగా సమానమై విహరించుచుండగా, పంతులుగారావచన రచనమును, 'జగతికి మిన్నేరుడిగిన యట్లు' ఆకర్షింపజేసి, సరళము, సర్వజన సులభ గ్రాహ్యముగా నొనర్చినారు.

వెనుకటి ప్రకరణములందు పంతులుగారుచేపట్టి, రసస్థితిని కల్పించిన సాహిత్య ప్రక్రియలన్నియు సవిమర్శముగా, విపులముగా పరామర్శింపబడినవి. పౌర్వాపౌర్వ దృష్టితోడను, సమకాలీన సాహిత్యరీతుల సమన్వయ దృష్టితోడను, కావ్య సౌందర్య దృష్టితోడను, పంతులుగారి సాహిత్య ప్రయోజనమును ప్రధానముగా దృష్టియందుంచు కొని, పంతులుగారి సర్వసాహిత్య సృష్టిసమీక్షింపబడినది. ఆయా ప్రకరణములందు పంతులుగారిపై ఆంగ్లేయ సాహిత్య ప్రభావము, పంతులుగారు స్వీకరించిన ఇతి వృత్తములను, మూలముతో పోల్చిచూచి, పంతులుగారి కావ్యకరణ దక్షత, స్వతంత్రేతి వృత్తములందు వారుచూపిన నేర్పు, నిరూపింపబడినది. పంతులుగారి విశిష్టత సందర్భానుసారముగా నిరూపణము సేయబడినది.

పంతులుగారి సర్వసాహిత్య సృష్టిని పర్యావలోకముచేయుటయే యీ ప్రకరణపు ముఖ్యోద్దేశము.

పంతులుగారు శతాధిక గ్రంథకర్తలు.

పంతులుగారి పద్యకావ్యములందు, ప్రాచీన సంప్రదాయమే యధికముగా కన్పట్టుచుండును. దీనికి కారణము పంతులుగారు, చిన్ననాడే వీనిని రచించుట. పంతులుగారి ప్రగతిశీలమైన వ్యక్తిత్వము నాటికింకను రూపురేఖలు దిద్దుకొనకుండుట. 'శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధమునందు'ను, 'రసికజన మనోరంజనము' నందును ప్రాచీన ప్రబంధధోరణి ప్రకృష్టముగా పొడకట్టుచునే యుండును. పుర వర్ణము, చంద్ర మన్మథోపాలంభనములు, నాయికానాయకుల ప్రత్యంగ సౌందర్య వర్ణనము, శబ్దార్థాలంకార బాహుళ్యము, ఆశ్వాసాదిని, ఆశ్వాసాంతముల, సుగంధి, మాలిని, పంచచామరము, మణిగణనికరము, మొదలగు వివిధ వృత్తములను కూర్చుట, ఆశ్వాసాంతమున గద్యలుకూర్పబడుట, ఫలశ్రుతి చెప్పబడుట మొదలగు సంప్రదాయ మార్గములన్నియు, పంతులుగారి పద్యకావ్యములలో పాటింపబడినవి.

శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధమునందును, రసికజన మనోరంజనమునందును, నన్నయ, తిక్కనాదుల ప్రసిద్ధమార్గములనుసరింపబడినవి శుద్ధాంధ్రోత్తరరామాయణము, శుద్ధాంధ్ర భారతసంగ్రహము, మొదలగు కావ్యములవలన 'అచ్చ తెలుగు కావ్యముల నలవరించుట'యందు పంతులుగారికిగలనేర్పు విశదమగుచున్నది సరళ సుందరముగా అచ్చ తెలుగు కావ్యములను నిబంధింపగలనేర్పు పంతులుగారికి వెన్నతోబెట్టిన విద్యయని యీ కావ్యములు నిరూపించుచున్నవి. అచ్చ తెలుగు కావ్యములుకూర్చిన వారిలో పంతులుగారికిగల స్థానము విశిష్టమైనది పంతులుగారి ఆంగ్లానువాద కావ్యములందు, ఆంధ్రాంగ్లములందు వారికిగల పాండిత్యము తెలియగలదు. విలియంకౌపర్, ఆలివర్ గోల్డ్‌స్మిత్, కవీశ్వరుల కావ్యములకు పంతులుగారు వెలయింపజేసిన యనువాదములు సాధికారములు ఆంగ్ల కావ్యముల ననువదించుట యందును, వారి కావ్యాదర్శములను, తత్త్వ చింతను, తెలుగులోనికితెచ్చుటకును అర్వాచీనులగు కవులనేకులకు పంతులుగారే మార్గదర్శి పంతులుగారు బాలురకును, బాలికలకును, నీతి పద్యశతకములను రచించిరి స్త్రీలయుపయోగార్థమై యనేకములగు పాటలను, పద్దెములను రచించిరి.

ఇవికాక పంతులుగారు రచించిన 'అభాగ్యోపాఖ్యానము' తెలుగు సాహిత్యము నందలి వికట కావ్యములలో విశిష్టమైనది చంద్రరేఖా విలాసాదులుత్పన్నమగుట, రావణ దమ్మీయాదులు, కావ్యసౌందర్యదృష్టియందీ యభాగోపాఖ్యానమునకు సరి తూగకుండుట పంతులుగారి ప్రజ్ఞాప్రాభవముల కీ కావ్యము నికషోపలమై యొప్పు చున్నది. అభాగ్యోపాఖ్యానమునందు ప్రబంధ ప్రణేతృ మార్గము లెస్సగా పరిహసింప బడినది అనౌచిత్యము పొంతబోక, విరసముకాకుండునట్లు, పంతులుగారీ ఏకాశ్వాస ప్రబంధమును వికటకావ్యముగా (Parody) రచించియున్నారు.

పంతులుగారి నాటకములందు, సంస్కృతానువాదములు, ఆంగ్లానువాదములు, స్వతంత్ర రూపకములున్నవి. తెలుగుసాహిత్యమునందు ప్రహసన రచనమునకు పంతులుగారే శ్రీకారము చుట్టిరి. ప్రహసన ప్రక్రియయందు వారు సాధించిన విజయము అపూర్వమైనది. పంతులుగారి ప్రహసనములందు వారు చూపిన శిల్పము, రసరామణీయకత, నాన్యతోదర్శనీయము. ఒక్క చిలకమర్తి లక్ష్మీనరసింహకవిగారు తప్ప ప్రహసన రచనమునందు పంతులుగారితో సములగువారెవ్వరును తెలుగుసాహిత్యము నందే లేరనుట యతిశయోక్తికాదు అయినను చిలకమర్తివారి ప్రహసనములుకూడ,

పంతులుగారి ప్రహసనము లంత విషయ వైవిధ్యము కలవికావు పంతులుగారి ప్రహసనములందు, విషయభూతులైన వ్యక్తులందరును, సమకాలీనులే యగుట, వానియందు ప్రయోజనము, శిల్పము, పరిమితమై పోయెననియు, కావ్యసౌందర్యము దృష్టియందిది లోపమనియు, కొందరు విమర్శకులు తలంచుచున్నారు. కాని పంతులు గారి సాహిత్య ప్రయోజనము, పరమార్ధము, సంఘసంస్కరణమే యగుట, పంతులు గారి విషయమున విది విమర్శా సహముకాదు. 'దంభాచార్య విలసనము,' 'తిర్య గ్విద్వన్మహాసభ,' 'మహారణ్యపురాధిపత్యము' 'హిందూమతసభ', 'జమీందారి ధర్మఖర్చు' మొదలగు ప్రహసనములందు, పంతులుగారి పరమ రమణీయమైన ప్రహసన రచనా చాతుర్యము విశదము కాగలదు. పంతులుగారి ప్రహసనములు ప్రధానముగా అధిక్షేపణము, కటువ్యంగ్యము, కలవిగానుండును ప్రాయికముగా మృదుహాస్యము పొడకట్టుచుండును పంతులుగారి ప్రహసములు విషయవినోద సాఫల్యములేయని శ్రీ గురజాడ అప్పారావుగారు తమ వ్యాసచంద్రికయందు సంభా వించి యుండుట యిప్పట్టుల గమనార్హము. పంతులుగారి గ్రంథ సంపుటము లన్నిట, తమ నీ ప్రహసనముల సంపుటమే యాకర్షించి యున్నట్లు శ్రీ గురజాడ అప్పారావు గారు పూర్వోక్త సందర్భముననే ప్రస్తావించియున్నారు

పంతులుగారి ప్రహసనములన్నియు సంఘ సంస్కారోద్బోధకములు. తల్ల క్ష్యము నాశ్రయించుకొనియే వెలువడినవి

పంతులుగారి ఆంగ్ల నాటకానువాదములందు, కూడ విషయ వినోదము కన్నను సంఘసంస్కరణ దృష్టియే ప్రాధాన్యము వహించినది. కనుకనే పంతులు గారు షెరిడన్ కవీశ్వరుని నాటకముల ననువదించుటకు పూనుకొనిరి దేశకాల పాత్రములను, మార్చుట, గద్యపద్యాత్మకములగు వానిని కేవలము గద్యనాటకము లుగా రచించుట, ముఖ్యముగా పేర్కొనదగినవి ఈ నాటకములందు అంగ్ల నుడి కారము, ప్రాయికముగా కన్పట్టుచుండును.

పంతులుగారి సంస్కృత రూపకానువాదములందు. భావానుసరణము ప్రధా నము సరళసుందరమైన సాధికారాంధ్రానువాదములను పంతులుగారు వెలయించిరి. పంతులుగారి శాకుంతలానువాదము తెలుగునాట మిక్కిలి ప్రసిద్ధినందినది. మాళవి కాగ్ని మిత్రము, రత్నావళి, ప్రబోధ చంద్రోదయము, పంతులుగా రనువదించిరి.

పంతులుగారి స్వతంత్ర రూపకములలో వారి వ్యక్తిత్వము ప్రస్ఫుటముగా ప్రతిఫలించుచుండును

సత్యహరిశ్చంద్ర, ప్రహ్లాద, దక్షిణ గోగ్రహణములు రచించుటలో పంతులుగారి నీతి, మత, సాంఘిక దృక్పథములు, వెల్లడి కాగలవు హరిశ్చంద్రుడు జ్యోతిశ్శాస్త్రమును విమర్శించుట, చంద్రమతి స్త్రీ విద్యావశ్యకతను ప్రస్తావించుట, మొదలగు విషయములవలన పంతులుగారి వ్యక్తిత్వ మీ నాటకమునందు ప్రతిబింబించుచున్నది

ప్రహ్లాద నాటకమునందు, పరిశుద్ధాస్తిక మత స్వరూపమును, తదావశ్యకతను పంతులుగారు ప్రతిపాదించిరి. నృసింహమూర్తి, యీ నాటకమునందు పరిశుద్ధాస్తిక మతమును గూర్చి ప్రసంగించుట పంతులుగారి సాహిత్య పరమార్థమును వెల్లడి సేయును. ప్రహ్లాద నాటకమునందు, పంతులుగారు భక్తికి, రసస్థితిని కల్పింపలేదు. ఈ నాటకమును వారు రచించుటయందు, ప్రహ్లాదుని భక్తి తాత్పర్యములు ప్రధానముగా పంతులుగారి దృష్టినాకర్షించి యుండకపోవుట విచిత్రము. కాని పంతులుగారి ప్రపత్తిలోని వైలక్షణ్యమిదియే

దక్షిణ గోగ్రహణమునందు, విరాటుడు, సుదేష్ణతో పరవనితలపొందు పాపమూలకమని, సర్వానర్థదాయకమని ప్రసంగించుట, ధనగుప్తుడు సుశర్మతో దయ, ధర్మము, సత్యము, నీతి. మొదలగు సద్గుణములను గూర్చి ప్రసంగించుట, పంతులుగారి కావ్యపరమార్థమును వెల్లడి సేయగలవు

ఈ మూడింటి యందును ప్రహ్లాద నాటకమున పద్యములు తక్కువ సన్నివేశ ప్రాబల్యమునుబట్టి ఐదారు పద్యములున్నను దీనిని వచన నాటకమనియే చెప్పనొప్పును దక్షిణ గోగ్రహణమునందును, సత్యహరిశ్చంద్ర నాటకము నందును, పద్యము లెక్కుడుగా నున్నవి తెలుగునాటి నాటక సాహిత్య వికాసము నందలి ప్రారంభదశయందీ నాటకములు రచింపబడెనని యూహింపనగును. తెలుగు నాటకముల యుద్భవవికాస పరిణామదశయందు పద్యనాటకావిర్భావము తొలిదశయని పరిశోధకులు నిరూపించిరి. పంతులుగారు స్వతంత్రరూపక నిర్మితియందు, స్వాతంత్ర్యమునే చూపిరి కాని, ప్రతములైన ఆంగ్లరూపక మర్యాదలనుగాని సంస్కృత రూపక సంప్రదాయములను కాని యనుసరింపలేదు. అనగా స్వతంత్ర రూపక

నిర్మాణమునందు, మార్గనాటక లక్షణములు యథాతథముగా పంతులుగారి నాటకము లందు పాటింపబడలేదు. నాంది, ప్రస్తావనలుకూడ పంతులు గారు స్వతంత్ర రూప కము లన్నిటి పాటించి యుండలేదు ఒక్క సత్యహరిశ్చంద్ర నాటకమునందు మాత్రము నాంది, ప్రస్తావనలు కూర్పబడినవి. నాంది యందు, 18 పద్యములు కూర్పబడుట పంతులుగారి సంప్రదాయాభిజ్ఞతను చాటి చెప్పుచున్నది. పంతులుగా రంకములను రంగములుగా విభజించి, ఆంగ్ల నాటక సంప్రదాయములను కూడ తమ స్వతంత్ర రూపకములందనుసరించిరి

ప్రథమాంకమున ఇంద్రసభయందు, వసిష్ఠ, విశ్వామిత్రుల సంవాదమున, విశ్వామిత్రుడు పది పద్యముల నొకేసందర్భమున చదువుట, పాత్ర సంభాషణము లందు పద్యములు ప్రచురములుగా కూర్పబడుట, నాటియభిరుచులకు తార్కాణమని చెప్ప నొప్పును.

వ్యవహార ధర్మబోధిని, బ్రాహ్మవివాహము, నాటి సాంఘిక పరిస్థితులకు దర్పణ ప్రాయములు

పంతులుగారి స్వతంత్రరూపకములందును, ప్రహసనములందును, దురాచార ములు, మూఢ విశ్వాసములు, సాంఘికపతన హేతువులైన సర్వవిషయములు, అవహేళనాత్మకముగా విమర్శింపబడినవి

పంతులుగారి నవలలందు, వారి సాంఘిక విమర్శ, సంఘసంస్కరణ ప్రబోధము పరాకాష్ఠ నందుకొనినవి పంతులుగారి రాజశేఖర చరిత్రము, సత్యరాజాపూర్వ దేశయాత్రలు, సాంఘిక విమర్శాదృష్టితో పరిశీలించినప్పుడు, పరాంకోటికి చెందిన రచనలని చెప్పవచ్చును. సంఘములో నాడు ప్రబలియున్న దురాచారములన్నిటిని తూర్పారబట్టుటయే పంతులుగారి ప్రధానాశయమను విషయము, రాజశేఖర చరిత్రము, సత్యరాజాపూర్వదేశ యాత్రలవలన తెలియనగును

స్త్రీ విద్యావిహీనత, యాచనను సుగుణముగాచేసి ముఖస్తుతులతో పొట్టపోసి కొనెడి కుక్షింభరులదాంభికవర్తనము, మంత్రతంత్రవేత్తలను అధిక్షేపింపుట, మొదలగు విషయములు రాజశేఖర చరిత్రమునందు వర్ణింపబడినవి.

ఆడమలయాళము నందలి పరిస్థితుల నాధారముగా వ్యాజరూపమున, సమకా లీన సంఘమునందలి. దురాచారములను తీవ్రముగా అధిక్షేపించుట, సమకాలీన

సంఘము నందలి స్త్రీల దుస్థితిని, ఆడమలయాళము నందలి పురుషులకు వర్తింపజేసి వ్యంగ్యముగా, కటువుగా, హేళనాత్మకముగా, సంఘమును విమర్శించుట సత్యరాజా పూర్వదేశ యాత్రలందు కానవగును.

స్త్రీల మౌఢ్యము, సంఘమునందలి దుష్టశక్తుల స్వైరవిహారము పంతులుగారు సత్యరాజా పూర్వ దేశయాత్రలందు తీవ్రముగా విమర్శించిరి ఈ యాత్రలందే, రెండవ భాగమైన లంకా యాత్రయందు, జ్యోతిషశాస్త్ర విశ్వాసము, తర్క వితర్కములతో ఖండింపబడినది సతీసహగమనము, స్త్రీలదురవస్థలు, పురాణములలోని ప్రక్షిప్తములు, లంకాయాత్రయందు పరామర్శింపబడి, విమర్శింపబడినవి

సత్యవతీ చరిత్రమునందు, దంపతులు, స్త్రీవిద్యావంతురాలై పురుషుడు సంస్కారహీనుడై, స్త్రీవిద్యాహీనురాలై పురుషుడు సంస్కారవంతుడై, స్త్రీ పురుషులిరువురును విద్యావిహీనులై కుటుంబముల చక్కదిద్దుకొను పరిస్థితులు తులనాత్మకముగ పరిశీలింపబడినవి

ఈ నవలయందు పంతులుగారు తమ సిద్ధాంతములను, పాత్రలనాలంబనముచేసి కొంత ప్రతిపాదించినను, శిల్పానికొరవడినదనియే చెప్పవలెను, పంతులుగారీ నవలయందు తమ యభిప్రాయములను వాచ్యము చేసిరి. కథాప్రణాళికయందు పంతులుగారి ప్రతిభద్యోతకముగు నున్నను, వస్తు సంవిధానమునందు బిగిలేదు ధ్వని నాశ్రయించవలసిన ఘట్టములందుకూడ వాచ్యము నాశ్రయించుట [illegible] యందు కొరవడినది. సంఘటనలు ఒకటి వెనుకనొకటి పేర్చినట్లుండుసుకాని, సన్నివేశములందుకాని, పాత్ర చిత్రణమునందుకాని, క్రమోన్మీలనముకానరాదు. పంతులుగారే ప్రతిపాద్య విషయమును పాత్రలలో లీనమై పలుకుచున్నారనిపించును పాత్రల ప్రత్యేక వ్యక్తిత్వ మీ నవలయందు కానరాదు. కథా సూత్రము, పాత్రల యధీనము నందుకాక, ఆద్యంతము పంతులుగారి ముద్రసాక్షత్కరించుచుండును.

పంతులుగారి నవలలన్నింటను వారి సంఘ సంస్కరణ తత్పరత్వము గోచరించుచునే యుండును. స్వతంత్ర సాంఘికేతివృత్తములుగల తెలుగు నవలలలోనీ సత్యవతీ చరిత్రము మొదటిది. కథయందు బిగి, పటుత్వము, కల్పన, తక్కువైనను, పాత్రలసౌకుమార్యము, ముగ్ధభావములు, అమాయకత్వము, మౌఢ్యము (Follies) ఈ నవలయందు పాఠకుల సానుభూతినిలోగొనును ఆ కాలము

నందలి మధ్య తరగతి కుటుంబ జీవితము కనులకుకట్టునట్లు పంతులుగారీ నవల యందు చిత్రించినారు పంతులుగారి లోక వృత్తాను శీలనము, ప్రతిభ, మౌలికతలు యీ నవలయందు వ్యక్తములు కాగలవు. కనుకనే శ్రీపాదసుబ్రహ్మణ్యశాస్త్రిగారి వంటి సుప్రసిద్ధ నవలా రచయితలను సైతం మీ నవల యాకర్షించినది.

చంద్రమతీ చరిత్ర మాధారముగా బాలికలు నేర్వదగు సంగతులను పంతులు గారు కథా సూత్రమునందు సంబంధించినారు. పంతులుగారు దీనిని వచన ప్రబంధ మన్నను, మత, నీతి, సాంఘిక విషయములు ప్రతి ప్రకరణమునందును, ప్రాధా న్యము వహించినవేకాని, నవల లక్షణములులేవు. సత్య సంజీవనియను నవలయందు బాలబాలికల నీతివర్తనము, సత్యపథానురక్తి, వృద్ధిచేయు ప్రయత్నము ప్రాధా న్యము వహించినది. కథా కల్పనమునందు విశేషములేకున్నను, శైలిసుప్రసన్నము.

పంతులుగారి వ్యాసములన్నింటియందును, మత, సాంఘిక, రాజకీయ పరిస్థితులు ప్రాధాన్యము వహించినవి పంతులుగారి తార్కిక ప్రతిభ, లోకజ్ఞత, విమర్శా పాటవము, బహుళవిషయ సంగ్రహణము, ఈ వ్యాసములందు గాంచనగును. పంతులుగారు సారస్వత విమర్శనుగూడ వెలయించినారు. 'కొక్కొండ వేంకటరత్న కవి కృత విగ్రహతంత్ర విమర్శనము', అలంకార సంగ్రహము, కావ్య సంగ్రహము, వ్యాకరణ సంగ్రహము, పంతులుగారి ప్రతిభకు, పాండిత్యమునకు నిదర్శనములు

పంతులుగారు స్త్రీలకొఱకు, షేక్స్పియర్ మహాకవి నాటకకథలను సరళ సుందరముగా ననువదించిరి. ఈ కథలందును, దేశకాల పాత్రముల విషయముగా పంతులుగారు కొన్ని మార్పులనుచేసియున్నారు స్త్రీలకొఱకే, పత్నీహితసూచని, దేహారోగ్యధర్మబోధిని మొదలగు గ్రంథములను, సరళమగు శైలియందుకూర్చినారు.

దేశీయుల మౌఢ్యమును పోకార్చి, శాస్త్ర విజ్ఞానమును వృద్ధిచేయుటకై పంతులుగారు శరీర శాస్త్ర సంగ్రహమును, జ్యోతిశ్శాస్త్ర సంగ్రహమును. జంతు స్వభావ చరిత్రమును రచించినారు ఈ గ్రంథములవలన పంతులుగారి శాస్త్ర పాండి త్యము, మేధాశక్తి, యెంత సునిశితములో వ్యక్తములు కాగలవు.

పంతులుగారు స్త్రీలకై ఈసఫ్ నీతి కథలను, బాలురకై వాచక పుస్తకము లను కూర్చిరి. దేశచరిత్రములను, జీవిత చరిత్రములను, సులభశైలి యందు రచించిరి. ఇట్టి వానిలో విక్టోరియా మహారాజ్ఞిచరిత్రము, జీసను చరిత్రము, శంకరా

చార్యులవారి చరిత్రము, రాజారామమోహనరాయల వారిచారిత్రము ముఖ్యమైనవి స్వదేశ సంస్థాన చరిత్రములను, పంతులుగారు రచించి, చింతామణి పత్రిక యందు వెలువరించిరి సంధి, విగ్రహములను, చిన్నయసూరి శైలిని యనుకరించుచు, రచించి, పండితుల మెప్పుగొనిరి పంతులుగారి కవుల చరిత్రము, వారికీర్తిని ఆచంద్రార్కముగా నిలుపగలదు. పంతులుగారు, ఇరువదింటికిపైగా ప్రాచీన గ్రంథము లను పరిష్కరించి, ఆకాలమునందు ప్రాచీన గ్రంథ పరిష్కరణమునందు పండితు లకు మార్గదర్శకులైరి. పంతులుగారు వివిధములగు పత్రిక లనేకములు నిర్వ హించిరి ఆ పత్రికలలో మత, సాంఘిక, రాజకీయార్థిక విషయములపై వ్యాసములు, నవలలు, నాటకములు, కావ్యవిమర్శ, ప్రాచీన కావ్యములు, కవుల చరిత్రము, శాస్త్రీయ గ్రంథములు వెలువరించుచుండిరి.

స్వీయచరిత్రమను అమూల్యాలంకారమును తెలుగు సరస్వతికి సమర్పించి, అర్వాచీనులకు మార్గదర్శకులైన వారు పంతులుగారు. పంతులుగారి స్వీయచరిత్రము, వారికీర్తికి పతాకయై ఆచంద్రార్కము విలసిల్లగలదు. పంతులుగారి సర్వసాహిత్యము నందును, వారి సంఘ సంస్కరణాభిలాష సువాసించుచుండును. పంతులుగారి గ్రంథము లన్నిటి యందును ప్రధానముగా, సరళసుందరమగు శైలి, సంఘ సంస్కరణ తత్పరత్వము, త్యాగశీలత, ప్రతిభ, వాసించుచుండును. తెలుగు సాహి త్యమునందు పంతులుగారి పేరిట నొక యుగమే వెలసినది. సాహిత్యము నుపకరణ ముగా చేసికొని, తన సంఘము నుద్ధరించిన ప్రపంచ సాహితీ వేత్తలలో వీరేశలింగం పంతులు గారగ్రేసరులు. అట్టి మహాకవులందు పంతులుగారి స్థానము విశిష్టమైనది.

## పంతులుగారి కావ్యదృష్టి

"సంఘదురాచారమును, పరిశుద్ధ మత ధర్మ ప్రకటీకరణమును, నామనస్సు నెప్పుడును బాయకుండునుగాన, నేనే పుస్తకముజేసినను, దానిలో నవకాశమున్న యెడల,నే సందర్భమున నైనను, వాని నించుక చొప్పించుచుందును " అని పంతులు గారు తమ స్వీయ చరిత్రమునందు వ్రాసియున్నారు. పంతులుగారి కావ్యములన్నిటనీ లక్షణము ప్రాయికముగా గోచరించుచుండును. ఈ ఆదర్శమును పురస్కరించు

కానియే, పంతులుగారి రచనలలో సత్యహరిశ్చంద్ర నాటకమునందు, హరిశ్చంద్రుడు జ్యోతిశ్శాస్త్రమును విమర్శించును, ప్రహ్లాద నాటకమునందు నృసింహస్వామి, పరిశుద్ధ మత ధర్మములను తన భక్తులనుగూర్చి ప్రసంగించును, దక్షిణ గోగ్రహణ నాటకము నందు, విరటుడు, సుధేష్ణతో, నీతి విషయముల చర్చసేయును, రాజశేఖర చరిత్రము నందు రాజశేఖరుడు గ్రహణములనుగూర్చి, మనవారు విశ్వసించు, అసంభావ్యము లైన కథలను విమర్శించును. ప్రహసనములలో, కథలలో, స్వతంత్ర నాటకములలో, వ్యాసములలో. ఉపన్యాసములలో, స్త్రీ విద్య, స్త్రీ పునర్వివాహము, కర్తవ్యములని పాత్రలు, ప్రసంగించుచుండును.

పంతులుగారికి, స్త్రీవిద్యయందును, స్త్రీల యభివృద్ధియందును, విశేషాభి మానము స్త్రీలస్థితి బాగుపడనిచో, దేశమజ్ఞానాంధకారమున మునిగియుండునని పంతులుగారి దృఢ విశ్వాసము స్త్రీలలో, విజ్ఞాన వికాసములు, వృద్ధిపొందుటకై వాసు 'సతీహితబోధిని'యను, పత్రికను నడిపి, యందు చిన్నకథలు, శాస్త్రీయ విషయ ములు, వచన ప్రబంధములు ప్రచురించిరి. పంతులుగారి కావ్యదృష్టి సంఘ సంస్క రణము. పంతులుగారి పరమార్థమునదియే కనుకనే పంతులుగారు తమ గ్రంథ పరిశ్ర మమునందు, కావ్య సౌందర్యమునెడల నాదరముచూపలేదు అనగా వారి కావ్యము లందు శిల్ప సౌందర్యము కొఱవడెననికాదు. పంతులుగారి దృష్టియందు, శిల్పము, రసము, శైలి, రామణీయకత, మొదలగునవన్నియు గౌణములు. ఉపదేశముమాత్రమే ప్రధానమైనట్టిది. పంతులుగారు సంఘ సంస్కరణదృష్టితోకాక, కేవలము సాహిత్య దృష్టితో రచించిన గ్రంథములుకూడ కొన్నికలవు వానియందు కవుల చరిత్రము ప్రధానమైనది. సాహిత్యమును సుసంపన్నముచేసి, ప్రక్రియా వైవిధ్యము చూకూర్చి, సామాన్యులకుగూడ సాహిత్య జ్ఞానముసంపాదించుటకుగూడ సంఘ సంస్క రణమేయగునుకాని, అలంకార సంగ్రహము, కావ్య సంగ్రహము, కవుల చరిత్రము, వంటి గ్రంథములు కేవల సాహిత్య ప్రయోజనముకలవి పంతులుగారే తమ స్వీయ చరిత్రమునందిట్లువ్రాసిరి. "తెలుగుభాషనువృద్ధిచేయవలెనన్న యభిలాషము నాకు మొదటినుండియు విశేషముగా నుండెను. నేను నా కాలమునంతను భాషాభివృద్ధి నిమి త్తమే యుపయోగించి పాటుపడిన పక్షమున, గొంతువఱకు నాయభిలాషము నెఱ వేఱి యుండునేమో !"యను నీ వాక్యములవలన పంతులుగారి వినయము, కావ్యదృష్టి, మనము పరిశీలింపవచ్చును. పంతులుగారు సాహిత్యరంగమున ప్రవేశించునప్పటికి,

తెలుగు సాహిత్యమునందలి బీదతనము వారికి విశదమాయెను వచన కావ్యములులేని లోపమును, శాస్త్రీయవిజ్ఞానమును బోధించు గ్రంథములులేనిలోటును, తెలుగు సాహిత్యమున పూరింపవలెనన్న సంకల్పము పంతులుగారికి కలిగెను. పంతులుగారికి సమకాలమునందుగాని, అర్వాచీనకాలమునందుగాని, పూర్వమునగాని, యిన్నిరంగములలో కృషిచేసి, యిన్ని ప్రక్రియలనుచేపట్టి, యింత వైవిధ్యమును, వైశిష్ట్యమును గడించిన వారింకొకరులేరు.

పంతులుగారి జీవిత కార్యకలాపములను, బరిశీలించి చూచినచో ప్రధానముగా వారు కొనసాగించిన రెండు ఉద్యమముల ఫలితము లాంధ్రులు నేడనుభవించుట కాననగును పేరుకొని కరడుగట్టిన సాంఘికదురాచార మనెడి కశ్మలము నంతను కరగించి, క్షాలనముచేసి, నిర్మల జీవితప్రసారమును ప్రసాదించుట వారి మొదటి యుద్యమము. సారస్వత ప్రపంచమున సాగించిన ఉద్యమము రెండవది. ఈ రెండును పరస్పరాశ్రయములుగానే పంతులుగారు సాధించిరి పంతులుగారు రచనలన్నిటికి, ప్రత్యక్షగోచర మగుచున్న తల్కాల సంఘ ప్రవృత్తియే, విషయ భూతముగా స్వీకరించిరి. ఆ రచనల కన్నిటికి వాఙ్మయమున నుత్తమస్థానము లభించుననిగాని, వాని యునికి శాశ్వతమగుననిగాని పంతులుగారాశించి యుండరు సమకాలీన సంఘ ప్రయోజనార్థమై వెలువడిన వాఙ్మయమున కేదేశమందైనను, ఇట్టి స్థితియే కలుగునని వారెరుగకపోరు. కనుక పంతులుగారి వాఙ్మయము సార్వకాలికముగా నిలబడునని చెప్పజాలము. కాని శైలీ రామణీయకత, విషయ పావిత్ర్యములను, బట్టి పంతులుగారి స్వీయచరిత్ర, రాజశేఖర చరిత్ర, కవులచరిత్ర, మొదలగు గ్రంథములు, ఆంధ్ర వాఙ్మయమున శాశ్వతమగు స్థానమునే సంపాదింపగలవు. పంతులుగారి సమగ్ర గ్రంధసంపుటములు, పదింటిలో, మూడువంతులుపైగా, వచనరచనలే, చోటుచేసి కొనినవి. వచనకావ్య బాహుళ్యమే వారికిగల 'గద్యతిక్కన' బిరుదమును సార్థక పరచగలదు. ఇంతటి వచన వాఙ్మయమును, వినిర్మించిన సాహితీపరుడు, ఆంధ్ర వాఙ్మయమున నింకొకరులేరు. తెలుగు సాహిత్యమును స్థూలముగా రెండు యుగములుగా విభజించినచో, పద్యకావ్యయుగమునకు నన్నయ్య యెట్లాచార్యుడో, ఆద్యుడో, ఆధునిక వచనవాఙ్మయ యుగమునకు వీరేశలింగము పంతులుగారట్టి యాచార్యులు, ఆద్యులు. తెలుగున గద్యవాఙ్మయ నిర్మాత, మహాపండితుడైన, చిన్నయసూరియే యైనను, నేడు ప్రాచుర్యమును బొందుచున్న సరళ సుందరమగు వచనశైలిని,

తెలుగు సారస్వతమున తెచ్చినవారు, వీరేశలింగం పంతులుగారే యగుటవలన వచన వాఙ్మయ యుగము పంతులుగారితో ప్రారంభమైనదని చెప్పుట యసంగతముకాదు.

వీరేశలింగం పంతులుగారు ప్రప్రథమమున, చిన్నయసూరినే యనుకరించుచు, సంధి, విగ్రహములను, రచించినారు కాని, కావ్యప్రయోజనము, పండితపామర జనరంజకముగా నుండవలెనుకాని, కేవలము పండితులకు మాత్రమే పరిమితము, కారాదని పంతులుగారు, భావించినందున, సరళాతిసరళమును, నిసర్గలలితమును, నగు శైలిని సాధించుటకై పూనికొనిరి ఎక్కువభాగము పంతులుగారి రచనలందు, ముఖ్యముగా వారి యుపన్యాసములలోను, వ్యాసములలోను, ఇట్టి శైలినిగాంచ వచ్చును. పంతులుగారు వ్రాసిన వాచక పుస్తకములందు, పంతులుగారి శైలీ స్వాదుత్వము, అనుభవయోగ్యము అని పింగళివారభిప్రాయపడిరి.

"గద్యతిక్కన, అయిదు, ఆరు, ఏడు తరగతులకు వాచకములు వ్రాయ బూనుట మహాభాష్య ప్రవచనము చేయుపండితుడు శబ్దమంజరిని గూడ పారము చెప్పుట వంటిదని..." శ్రీ పింగళి లక్ష్మీకాంతముగారు వెలువరించిన యభిప్రాయము శ్లాఘనీయము. జాతికి వెన్నెముకవంటి వారు బాలురు కనుక, పంతులుగారు వారి వయోబుద్ధులకు అనుగుణమైనభాషను, విషయమును, వాచక పుస్తకములలోకూర్చిరి. పంతులుగారు వాచక పుస్తకములువ్రాసినను, నాటకములు వెలయించినను, వ్యాస సంగ్రహములు వెలువరించినను, వారి నిశితమైన లోకవృత్తాను శీలనము, సంఘ సంస్కరణ సముపార్జనాకాంక్ష, ద్యోతకములగుచుండును. ఆయన కలముకత్తి వాదరతో సమానమైనది. వారిరచనలు దుర్మత భంజకములు వారిదృష్టిలోక కళ్యాణము.

## భాషాశైలి

వీరేశలింగంపంతులుగారి భాషాశైలి సులభసుందరము. పంతులుగారే భాషా విషయకముగా తమ యభిప్రాయముల నిట్లు గ్రంథస్థము గావించియున్నారు.

"భాషవలని ప్రయోజనమేమి ? జనులు తమ యభిప్రాయముల నొండొరులకు దెలుపుకొనుట. భాషలోని గ్రంథములవలని ప్రయోజనమేమి ? తమ భావములను దూరముననున్న వారికిని, రాబోవుతరముల వారికిని, సులభముగా తెలుపుట..."

ఇట్టి ఆదర్శములుగల పంతులుగారు, తమ గ్రంథములను విగ్రహమునందలి శైలియందు కొనసాగించుట యసంభవము. కనుకనే పంతులుగారు, సంధి, విగ్రహములను చిన్నయసూరి శైలి ననుకరించుచు, పూరించిన, తదుపరి, మరల నే గ్రంథము నందుగావి యట్టిశైలి నాశ్రయింపలేదు. పంతులుగారు 1875 వసంవత్స రమున, సంధి, విగ్రహములను, ప్రకటించిరి 1874వ సంవత్సరముననే 'వివేక వర్దనిని' ప్రారంభించిరి. పంతులుగారినాటి శైలికిని, 1919వ సంవత్సరమునందు, వారు, రచించిన, 'నవ్యాంధ్రవ్యాకరణము' నందలి శైలికిని యంతరము, బరిశీలించి చూచినచో, పంతులుగారి శైలియందలి క్రమపరిణామ వికాసము గోచరము కాగలదు. ఈ నడుమ కాలమున, పంతులుగారు 'వివేకవర్ధని' యందనేకములగు వ్యాసములను వెలయింపజేసిరి. 'కవుల చరిత్రము'ను రచించిరి. అనేక ప్రహసనములను కూర్చిరి.

ఈ సర్వరచనలందును "అందరికి దెలియునట్లు సులభముగా నుండవలె నను" పంతులుగారి లక్ష్యము, నెరవేర్పబడినది. ఇట్టి ఆదర్శమును పాల్కురికి సోమనాధాదులు తమ గ్రంధములందు కొంతవఱకు సాధించినను, ఉద్యమముగా దీనిని నిర్వహించి, నిర్భయముగా, నిట్టి సిద్ధాంతమును, ప్రపంచించిన వారు, పంతులు గారే. అనేక కారణములను పురస్కరించుకొని, తెలుగు సారస్వత రంగమున వీరేశలింగ మొక ప్రత్యేకతను సంపాదించెనని చెప్పవలెను. సారస్వతాదర్శములను, సాహిత్యసంప్రదాయములను. మూలమట్టముగాకదల్చి, క్రొత్తమార్గములను, క్రొత్త సంప్రదాయములను, క్రొత్త యాదర్శములను లక్ష్యీకరించిన ఘనమగు కీర్తి పంతులు గారికే లభింపగలదు.

"గ్రంధములను సాధారణముగా సలక్షణమైన సులభశైలివి రచింపవలె ననియే నా యభిప్రాయమైనను, విషయానుగుణముగా తత్తదుచిత రీతిని గ్రామ్య భాషయందు సహితము గ్రంథములను వ్రాయవచ్చునని కూడ నా యభిప్రాయము." అని పంతులుగారు వ్రాసిరి. పంతులుగారీ వాక్యములను వ్రాయునాటికి గిడుగు, గురజాడల, వ్యావహారిక భాషోద్యమము కాని, వేదము వేంకటరాయశాస్త్రిగారి పాత్రోచిత భాషాసిద్ధాంతము కాని, వ్యాప్తిలోనికి రాలేదు. పంతులుగారు 1880వ సంవత్సరము నాటికే, వెలువరించిన బ్రాహ్మవివాహము, వ్యవహార ధర్మబోధినుల యందు, వ్యావహారిక భాషాప్రయోగము లనేకము లున్నవి. కనుక పంతులుగారి యభిప్రాయములు నాటికే పరిణామశీలము లగుచుండెనని గ్రహింపవలెను. పంతులు

గారి ప్రహసనము లన్నింటి యందును, శైలి వ్యావహారికమునకు దగ్గరగానున్నది. నవలలందు, ఇతర వచన కావ్యములందును, శైలి సరళ గ్రాంథికము. వివేకవర్ధనిని ప్రారంభించుచు, పంతులుగారు తామీపత్రికను, దేశాభివృద్ధి, భాషాభివృద్ధి, యను రెండు ముఖ్యప్రయోజనములను కాంక్షించి, నిర్వహించుటకు పూనుకొంటిమని తెలిపి యున్నారు భాషాభివృద్ధికై తామేర్పరచుకొన్న మార్గము, మృదువైన సులభ శైలిని సలక్షణమైన వచన రచన చేయుటయని పంతులుగారు తెలిపి యున్నారు. కనుక వారి లక్ష్యము శైలీసౌకుమార్యమునందే ప్రధానముగా పర్యవసించి యుండెనని చెప్పవచ్చును. తెలుగున వచన కావ్యములు లేనిలోటును వారుగుర్తించి, వచన కావ్యాభివృద్ధికై తమ కాలమునంతను వినియోగించిరి.

పంతులుగారి వచన రచనయందలి శైలీ భేదమీవిధముగా బరిశీలింప వచ్చును.

"వివేకిలోక సమాదరణ పాత్రమగు పత్రికనొక్కటినెక్కువడినైన, నిక్కడ, లోకోపకారముగాఁ బ్రకటించుట శ్రేయోదాయకంబను, బుద్ధి బీజంబు, దైవ ప్రేర ణానుకూలంబుగ మాలోపలనింతకుం గొంత ముందుత్పత్తియయి, కొండొకవడి యంద, యడగియుండి, పదపడిదినదిన ప్రవర్ధమానంబయి కడకువెలికుఱికి......"

"ఆరీతిని దారుణంబగు, ప్రవిదారణంబున, వీరవారం, బెల్ల, మారణంబు నొందిన, జింతాక్రాంత స్వాంతుండై, వరటాకాంతుండు మంత్రింజూచి......"

"ఆంధ్రదేశమున వాడబడుచున్న భాష ఆంధ్రభాషయనబడును. 'భాష' అనగా మనుష్య లొకరికొకరు తమ మనస్సులయందలి భావములను తెలుపుకొనుటకు సాధనముగా ఉండు మాటలకూడిక......"

ఈ విధముగా 1874వ సంవత్సరమున వివేకవర్ధని ప్రారంభ సంచిక యందలి సంపాదకీయమునందలి శైలికిని 1919వ సంవత్సరమున, రచించుటకు పూని యసంపూర్ణముగా వదలివేయబడిన, నవ్యాంధ్ర వ్యాకరణమునందలి శైలికిని, విశేషభేదము స్పష్టపడుచున్నది. విగ్రహమును, సంధిని, 1875వ సంవత్సరమున పంతులుగారు వెలయించిరి. విగ్రహమునందలి శైలికిని, సంధియందలి శైలికిని, వివేకవర్ధని సంపాదకీయమునందలి శైలికిని విశేషభేదములేదు. ఈ విధముగా పంతులుగారి వచనశైలి, యీ కాలమునసిట్టి దశావిపర్యయమును బొందినది.

పంతులుగారు, తమ స్వతంత్ర రూపకములందును, ప్రహసనములందును, అన్యభాషాపదములను యథాతథముగా, ఉచ్చారణా క్రమముతో పాటించిరి. కొన్ని మాటలను, తెలుగు భాషోచ్చారణమునకు సరిపడునట్లుగా గ్రహించిరి. కొన్ని పదముల సమానార్థకములనువాడిరి. అన్యదేశ్యములైన హిందీ, ఉరుదు, ఫార్శీ, మొదలగు పదములనుగూడ పంతులుగారు తమ రచనలందు విరివిగా గ్రహించిరి. 'వినాయక చతుర్థి', 'దురాచారదూషణము' 'నవనాగరికులు' మొదలగు ప్రహసనములందు, 'శూపరి స్టిషన్' 'మ్యారియేజి' 'బైండింగు' 'హెల్తు', 'ప్లెజరు' 'బ్రీఫు' 'రిఫైన్డు' 'జెంటిల్‌మెన్' 'రీజన్' 'ఎక్సుప్లయన్' మొదలగు ఆంగ్లపదములను పంతులుగారు తెలుగు వర్ణక్రమముతో యథాతథముగా నుపయోగించి యున్నారు. 'వ్యవహారధర్మ బోధిని'యందు, అనేకరకములైన గ్రామ్య భేదములను పంతులుగారుకూర్చిరి. మహమ్మదీయులు, రైతులు, ఇంకను విద్యాగంధ మెరుగనివారల ప్రసంగములందు పంతులుగారు, తత్తదుచిత శైలీభేదముమ పాటించినారు. శాస్త్రీయ గ్రంథములందు పంతులుగారు పారిభాషిక పదములనుకూర్చి, సామాన్యులకుకూడ సుగమమగునట్లు, ఆంగ్ల గ్రంథముల ననువదించిరి. పంతులుగారి పద్యకావ్యములందు ప్రత్యేకశైలిని మనమేర్పరింపలేము వారి శైలీ సౌందర్యమంతయు ప్రధానముగా, ప్రహసనము లందును, వచన ప్రబంధములందును, ఉపన్యాసములందును, వ్యాసములందును మనము గాంచగలము.

పంతులుగారాంగ్ల గ్రంథముల ననువదించుచున్నప్పుడు మాత్రము వారిశైలి, మౌలికమైన శైలివలె ప్రసన్న మధురముగానుండదు. కారకము సంశ్లిష్టమై, అన్వ యము కఠినమై, వాక్యరచనము సుదీర్ఘమై, సరళముగా, సుబోధకముగానుండదు. ఆయాపట్టుల పంతులుగారి శైలికృతకమై, కన్పట్టును. ఆంగ్లమూలము ననువదించుట యందు పంతులుగారుచూపినశైలి, ఆయాప్రకరణములందు సమీక్షింపబడినది.

నీతిచంద్రికలోని, విగ్రహము, సంధులందు, పంతులుగారు, చిన్నయసూరి శైలి ననుకరించియు, కృతకృత్యులుకాలేకపోయిరనియు, చిన్నయసూరి వాక్య నిర్మాణము ననుసరించుటయందు, నేర్పుచూపిరేకాని, రసబంధురమగు శైలి ననుక రించుటయందు, పంతులుగారు కృతకృత్యులుకాకపోయిరనియు విమర్శకులు తలంచు చున్నారు. చిన్నయసూరి వచన రచనయందలి శైలీ మార్దవము, ప్రసన్నత, సుభ

గత్వము, ధార, మౌలికత, పంతులుగారి రచనయందులేవని విమర్శకులు, పంతులు గారిని విమర్శించిరి. పంతులుగారి శైలికృతక గ్రాంధిక శైలియని శ్రీగురజాడ అప్పారావు గారు ఆక్షేపించియున్నారు. వ్యావహారిక శైలికూడ సలక్షణమైనదకాదని, వైశద్యము, సారళ్యము, పంతులుగారి శైలియందు మృగ్యమని, శ్రీఅప్పారావుగారు, పంతులుగారిని విమర్శించియున్నారు.

పంతులుగారి, ఆంగ్లానువాదములందు, ఆంగ్లనుడికారము త్రోసికొనివచ్చు చుండుట సత్యమే. అయినను పంతులుగారు స్త్రీలకొఱకై వెలయించిన, వ్యాసము లందును, చిన్న కథలందును, సత్యవతీ చరిత్రము, చంద్రమతీ చరిత్రము, మొదలగు ప్రబంధములందును, పంతులుగారి, రమణీయమైన వచన శైలి సాక్షాత్కరించు చుండును.

## పంతులుగారి లోకజ్ఞత

లోకవృత్తమును వర్ణించుటలో పంతులుగారికున్న ప్రతిభ యనన్య సామాన్యము, వారి సర్వరచనములకును, వారి లోకవృత్తాను శీలనమే జీవగఱ్ఱ. సూక్ష్మ సూక్ష్మములైన రహస్యములనుగూడ పాత్రగత చిత్తవృత్తులును, చిత్రించుట యందు లోకము నెఱిగి పంతులుగారు వర్ణించుచుందురు. రాజశేఖర చరిత్రమునందు రాజశేఖరుడుగారు, పెద్దాపురమునందలి సంపన్న గృహస్థుల ఇండ్లుచూచుటకుపోయి, వారి యనాదరమునకుపాత్రుడై, లోకమును విశ్లేషించుట, పెద్దాపురము సత్రమున రాజశేఖరుడు గారికిని, పాచకునకును జరిగిన సంభాషణము, గోదావరి తీరమందు, అమ్మలక్కల ఉబుసుపోనిముచ్చట్లు, సాధుసన్యాసుల, మంత్రతంత్ర వేత్తలకపట వర్తనముల వర్ణనము, పంతులుగారి లోకజ్ఞతకు నిదర్శనము. సత్యవతీ చరిత్రమునందు పంతులు గారు సృష్టించిన వివిధ పాత్రల స్వభావగతశీలములను పరిశీలించిచూచినచో పంతులుగారి ప్రజ్ఞయెంత సునిశితమో తెలియగలదు సత్యరాజా పూర్వదేశ యాత్ర లందు, సత్యరాజాచార్యుల విదేశగమన వ్యాజమున, లోకమునందలి చిత్ర విచిత్రము లైన యాచారములను, స్వభావములను, పంతులుగారు, లెస్సగా వివరించినారు. పంతులుగారి ప్రహసనములన్నింటియందును, వారికి లోకవృత్తాను శీలనమే ప్రత్యక్ష ప్రమాణము. వారి నిత్య జీవితమునందు వారికి తారసిల్లు "జనవంచకాచార్యులు,

ద్రరావులు, వినయభూషణులు, సత్యప్రియాచార్యులు .. " మొదలగు వ్యక్తులే ప్రహసనములందు సాక్షాత్కరింతురు. ఈ విధముగా పంతులుగారు, వేయికన్ను లోకమును బరిశీలించినారు. సహస్ర బాహువులతో దుర్మతభంజనమునకై ండినారు లోకమునందలి చిత్రవిచిత్రములైన యే స్వభావములుకాని వారిదృష్టి తప్పుకొనిపోలేదు మౌలికమైన ప్రతిభ, దానికితోడు పాండిత్యము, అను , సునిశితమైన మేధాసంపత్తి పంతులుగారి సర్వ రచనలయందును సాక్షాత్క పండును స్త్రీలకొఱకై వారు 'సతీహితబోధిని'యందు ప్రచురించిన వ్యాసము వారు వాడిన సామెతలు, చెప్పిన చిన్న కధలు, ఆశ్చర్యాపాదకములుగా ను. రాజశేఖర చరిత్రమున ప్రసక్తాన ప్రసక్తముగ,

" పిండిబొమ్మనుజేసి పీటమీదబెట్టిన
ఆడుబిడ్డతనమున కదిరిపడ్డది..."

" అత్తమంచియు వేముతీపునులేదు..."

" అత్తలేని కోడలుత్తమురాలు
కోడలులేని అత్తగుణవంతురాలు "

ంగు సామెతలు, స్త్రీల ప్రసంగములందు, కూర్చుట పంతులుగారి లోకజ్ఞతకు నము

"తార్కికుడును వైయాకరణుడునగుట సులభముకాని యోగ్యుడగుట, సులభముకాదు..."

" అదియేమి మాయయోకాని లోకములోనెల్లవారును, తాము సుఖపడుటకయి పదానికంటె, దాము సుఖము ననుభవించుచున్నట్లితరులకుదోచుటకయియే, శ్రద్ధను వహింతురు..."

"కప్పకఱవవలెనని ప్రయత్నముచేసిన నెంత ప్రయోజనకారియగునో బీద గొప్ప వానిని పగ సాధింపదలపుగొన్న, నంతప్రయోజనకారిగానే పను..." మొదలగు పరిశీలనములవలన పంతులుగారి లోకజ్ఞత తేటతెల్లము ను.

వారి వ్యాసములందును, నాటకములందును, ప్రహసనములందును, నీ మే ప్రాధాన్యము వహించినది.

## హాస్యవాఙ్మయ నిర్మాతగా పంతులుగారు

వీరేశలింగంపంతులుగారికి పూర్వము, ఆంధ్రసాహిత్యమున హాస్యమునకు రసస్థితిని కల్పించినకవులులేరు. హాస్యప్రధానములైన కృతులు వెలయింపజేసిన వారు లేరు. హాస్యమునందు అవాంతర భేదములను చూపినవారునులేరు నన్నెచోడుడు, తిక్కన, ఎఱ్ఱన, నాచనసోమన, శ్రీనాథ, పోతనలు తమతమ కావ్యమునందు, సన్ని వేశ ప్రాబల్యమునుబట్టి కొంత హాస్యరసమును పోషించినను, హాస్యాలంబన పాత్ర లను వారు సృష్టించినవారుకారు ప్రబంధయుగమునందు తెనాలి రామకృష్ణకవివంటి వారు కొందరు, లలితమైన హాస్యమును సృష్టించియున్నారు.

ఆధునికయుగమున చంద్రరేఖా విలాపాదులు బూతులబుంగలై, వికటకావ్యము లనుటకుగూడ వీలులేనిస్థితికి దిగజారిపోయినవి. రావణదమ్మీయాది కావ్యములు వ్యక్తిదూషణ ప్రాధాన్యములైన శ్లేషకావ్యములగుటవలన, చమత్కార సంయుతము లైనవేకాని, హాస్యరసస్ఫోరకములు కాజాలకపోయినవి కాసుల పురుషోత్తమకవి ఆంధ్రనాయక శతకము, గోగులపాటి కూర్మనాధుని సింహాద్రి నారసింహశతకము, మొదలగు శతకములందు వ్యాజనింద, వ్యాజస్తుతులతోకూడిన హాస్యచ్ఛాయలున్నను, హాస్యవాఙ్మయమునందుచేరవు.

ఈ దృష్టితో పరిశీలించిచూచినప్పుడు ఆంధ్రవాఙ్మయమునందు ప్రప్రధమ ముగా హాస్యవాఙ్మయమును నిర్మించినకీర్తి వీరేశలింగంపంతులుగారికే దక్కును. పంతులుగారు తమ కృతులందు హాస్యభేదముల ననేకములుచూపిరి ప్రహసనములు, వికట కావ్యములు, నాటకములలో హాస్యపాత్రలు, పంతులుగారు సృష్టించిరి సభ్య మును, నిశితమును సంఘ సంస్కరణైకదృష్టి ప్రధానముగాకలదియునగు హాస్యమును పంతులుగారే తొట్టతొలుత సృజించిరి. శ్రీకొక్కొండ వేంకటరత్నము పంతులుగారి సిద్ధాంతములను, వ్రాతలను, పరిహసింపవలెనన్న యుద్దేశముతో పంతులుగారు 'హాస్యసంజీవని'యను నొక పత్రికను వివేకవర్ధని కనుబంధముగా నడిపిరి పంతులు గారీ పత్రికను నిర్వహించుటవలననే, వారన్ని ప్రహసనములను, అధిక్షేపణ కావ్యములను, హాస్య సంభాషణములను వెలయించిరి. బ్రాహ్మవివాహము తొట్ట తొలుత హాస్యసంజీవనియందు వెలువడినప్పుడు, పురుషులును, స్త్రీలును పండితులును పామరులును, బాలురును, వృద్ధులును, అత్యాసక్తితో దానిని జదువజొచ్చిరి. పుస్తకము

వెలువడిన కొన్ని దినములవఱకును జనులు గుంపులుగుంపులుగాగూడి వీధి యరుగుల మీద గూర్చుండి దానిని చదివి పకపకనవ్వుచుండిరని పంతులుగారు తమ స్వీయ చరిత్రమునందు వ్రాసియున్నారు ఈ ప్రహసన ప్రాయమైన రచనలను పంతులుగారు వినోదముకొఱకు మాత్రమే యుద్దేశింపక యతి బాల్యవివాహము, వృద్ధ వివాహము, కన్యాశుల్కము, మొదలైన దురాచారముల వలని యనర్థకములనుజూపి జనులను వాని నుండి విముఖులనుజేయు తలంపుగూడ తమకుండినట్లు స్వీయ చరిత్రమునందు వ్రాసి యుండుట వారివ్యక్తిత్వమునకు తార్కాణము. ఇట్టి ప్రహసనములు పంతులుగా రాశించిన విశేష ప్రయోజనమును సమకూర్చినవి. పంతులుగారి మిత్రులు కొందరీ ప్రహసనములందలి విషయమునుగూర్చి కాకపోయినను, విరచనాదగ్ధతను గూర్చి యైనను మెచ్చుకొనిరట.

ఈ విధముగా పంతులుగారు హాస్య వాఙ్మయమునుగూడ సంఘ సంస్కరణ ప్రయోజనా కాంక్షతోడనే సృష్టించిరి పంతులుగారికా ప్రయోజనము సిద్ధించినది. స్వీయ చరిత్రమునందు "ఎందుచేతనో కాని నాకు హాస్యవచనరచనా నైపుణ్యమును ఈశ్వరుడధికముగా ప్రసాదించెను. స్వాభావికమైన యా శక్తిని నేనంతగా నుపయోగింపక కొంతవఱకడచు చుందును" అని తెలిపియున్నారు

పంతులుగారు తమ కాలమునంతను సాహిత్యసృష్టికే వినియోగించియుండి నచో, రససుందరములగు కావ్యముల ననేకములను రచించియుందురు

పంతులుగారి హాస్యవచన రచనచాతుర్యము, వారి చరమదశయందుకూడ వారిని విడిచిపెట్టపోలేదు. 1905వ సంవత్సరమునందు వీరేశలింగంపంతులుగారు కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారికి ఆర్యమతబోధిని ప్రతి స్పర్ధిగా సత్యవాదినియను పత్రికను నిర్వహించిరి. ఈ సత్యవాదినినిగూర్చి చిలకమర్తి లక్ష్మీనరసింహకవిగారిట్లు వ్రాసిరి. "ఇందు వీరేశలింగంగారు కొన్ని మనోహరములైన హాస్యసంజీవనులు గూడ వ్రాయుచుండిరి. వీరేశలింగంగారి హాస్యరసము మిక్కిలి రసవంతముగ నుండెడిదని వేరేచెప్పనక్కరలేదు..."

ఈ విధముగా వీరేశలింగంపంతులుగారు హాస్యవాఙ్మయ నిర్మితియందు ప్రధములగుటయేకాక, ప్రధమ గణ్యులుకూడనని చెప్పవలెను.

హాస్యమును సంఘ సంస్కరణ కృషికి ప్రధానాయుధముగా గ్రహించుట కూడ, ఆంగ్లేయ సాహిత్య పరిజ్ఞానమువలన తెలుగు సాహిత్యమునందు సంక్ర

మించిన నూత్నదృక్పథమని చెప్పవలెను. పందొమ్మిదవ శతాబ్ది యుత్తరార్థమున ఆంగ్లసాహిత్యమునందలి నవ్యరీతులన్నియు, తెలుగు సాహితీపరుల నాకర్షించినవి. తత్ఫలితమే, వచన ప్రబంధ విరచనము, రూపక నిర్మాణము, కవుల చరిత్రమును కూర్చుట, వ్యాసములు, ఉపన్యాసములు వెలయించుట, పత్రికా నిర్వాహణము, ప్రాచీన గ్రంథ పరిష్కరణము, దేశచరిత్రము, జీవితచరిత్రలు, శాస్త్రీయవిజ్ఞానము, తెలుగు సాహిత్యమునందు వెలసినవి. అచ్చుయంత్రములు వచ్చుటతో, ఒక్కసారిగా తెలుగు సాహిత్యపుస్థితిమారినదని చెప్పవలెను, ఆంగ్ల సాహిత్యమునందలి వినూత్నములైన పోకడలు, వీరేశలింగంపంతులుగారి వంటి, మేధావుల నాకర్షించి యుండుట యబ్బురముకాదు. పంతులుగారు ఆంధ్రాంగ్లభాషా శేముషీ విభవులగుట, ఆంగ్ల సాహిత్యపు తీరు తెన్నులను పారముముట్ట పరిశీలించి, తెలుగు సరస్వతి నర్చించిరి. ఈ ప్రయత్నముననే పంతులుగారు 'జాన్‌గిల్పిన్' అను హాస్యకృతినదే పేరున తెలుగునకుతెచ్చిరి.

ఆంగ్ల సారస్వత ప్రపంచమున, నశేషఖ్యాతి నార్జించిన మహనీయుల సాహితీ ప్రాగల్భ్యమును పంతులుగారు క్షుణ్ణముగా నవలోడనముచేసి, ఆయా మార్గములను, బహుళాంధ్రోక్తిమయ ప్రపంచమున నెలకొల్పుటకు కృషిచేసిరి.

ఆంగ్ల సాహిత్య ప్రభావమువలననే హాస్యరసపోషణమునకు సంబంధించిన నూతనదృష్టి తెలుగు సాహిత్యమున కాలూనెననిచెప్పుట నిర్వివాదము ఆంగ్ల సారస్వతమున ఎడిసన్, స్టీల్, డికెన్స్, స్విఫ్ట్, షేక్స్పియర్ మొదలగు సాహితీ పరుల మార్గములు సుప్రసిద్ధమైనవి. హాస్యవాఙ్మయ సృష్టియందు వీరు ప్రత్యేకమైన స్థానమును సంపాదించుకొన్నవారు ప్రాయికముగా వీరి దృష్టియును సంఘ సంస్కరణ పర్యవసాయియే. తన్నిమిత్తమే వీరును హాస్యకృతులను, వ్యంగ్య, హేళన, అధిక్షేపణాత్మకములగు కృతులను విరచించిరి వీరిలో ఎడిసన్, మొదలగు వారు, మృదు హాస్యధోరణియందు సంఘ సంస్కరణమునకు పూనుకొనిరి. అలవాటువలన అపహాస్యములుగా గోచరించు అల్పాంశములలోని హాస్య భాజనతను వీరు తమ కృతులందు ప్రదర్శించిరి, దీనికి సహాయముగా ఉక్తిచాతుర్యమునుచూపి, హాస్యరస సృష్టియందు, ప్రత్యేక స్థానమును సంపాదింపగలిగిరి. చార్లస్‌డికెన్స్, షేక్స్పియర్ మహాకవి, మొదలగువారు తమ కృతులందు ఆదర్శప్రాయమైన హాస్యమును సృష్టిం

చిరి. ఈ యిరువురు మహాకవులును, మానవత్వము నమితముగా నారాధించి, తమ కృతులయందు మానవులయెడ సానుభూతిచూపినవారు. వీరి అపహాస్య సన్నివేశముల సారభూతముగా మానవత్వమునెడల వీరికిగల విశాల దృష్టియు, సానుభూతియు ప్రత్యక్షమై పాఠకులకు వికాసముతోకూడిన హాస్యానందము (mirth) అనుభవము నకు వచ్చును. జీవితమునందు కరుణాస్పదమైన హాస్యసృష్టి వీరి రచన లందు గోచరించును. జోనాథన్ స్విఫ్ట్ (Jonathan Swift) వీరి మార్గమునకు భిన్నుడు మానవ సృష్టియందలి లోపముల నీతడసహ్యించు కొనెను. మానవీయములైన బల హీనతలను, వ్యక్తులలోని డాబు, దర్పములను, అహంకార మమకారములను, స్వార్థమును స్విఫ్ట్ అసహ్యాదృష్టితో విరసించెను.

ఆ గుణములకు తావలమైన మానవులను అపహాస్యమునకు గురిచేసి, కసి తీర్చుకొన్నట్లుగా, పాఠకులకు హాస్యానుభవమును పంచియిచ్చెను. స్విఫ్ట్, తన కావ్యములందు అధిక్షేపణ హాస్యమునకు రసస్థితిని కల్పించెను. స్విఫ్ట్ హాస్యసృష్టి యందు, శక్తియెక్కువ. వ్యంగ్యధోరణి నాశ్రయించి, మానవులను నిశితముగా తన కృతులందు విమర్శించెను హేళనకు, అధిక్షేపణకు, ఆంగ్ల సాహిత్యమునందు కళాగౌరవము కల్పించిన కీర్తి 'స్విఫ్ట్' కవీశ్వరునికే దక్కును

వీరేశలింగంపంతులుగారు సైతము, ఇట్టి వ్యక్తిత్వమే కలవారు కావున, 'స్విఫ్ట్' రచనలే పంతులుగారి కెక్కువ యుపాదేయము లయ్యెను. సంఘములోని దుర్మార్గము, దురాచారములు, మౌఢ్యము, పంతులుగారి నెక్కువగా బాధించినవి. పంతులుగారావేశపరులు కావున, స్విఫ్ట్ మార్గము నవలంబించి, అధిక్షేపకకావ్యము లను రచించిరి తెలుగు సాహిత్యమున, సంధియుగమున (1850-1900) కృషి చేసిన వారందరును, ఎడిసన్, స్విఫ్ట్, స్టీల్, మొదలగు సాహితీపరుల ప్రభావమునకు లోగినవారే. ఇట్టి వారిలో పంతులుగారు స్విఫ్ట్ మార్గము ననుసరించి, యుద్దిష్టార్థమును సాధించిరి. పంతులుగారు గొప్ప మౌలికమైన ప్రతిభ, వ్యుత్పన్నతలు కలవారగు టయేకాక, ఉత్తమకళా స్రష్టకు కావలసిన, లోకవృత్తానుశీలనము, తార్కికప్రతిభ, మొదలగు మహాకవి లక్షణములు కలవారు. సున్నితమగు హృదయస్పందనముకూడ, పంతులుగారి లోకవృత్తానుశీలనమునను వన్నె తెచ్చినది. లోకమునందలి దుర్మార్గ మును ఖాళితము చేయుటకుగా పంతులుగారు సాహిత్యసృష్టికి గడంగినారు. అపూర్వ మైన ఇట్టి మార్గము, తెలుగు సంఘమునకు, సాహితీపరులకును, తొలినాళ్ళలో నుపా

దేయము కాకపోయినది. అందువలన ప్రధానముగా, వీరేశలింగంపంతులుగారికి ప్రాచీన సంప్రదాయమార్గానువర్తులతో సంఘర్షణము కలిగినది వారందరును పంతులుగారిపై ధ్వజమెత్తిరి. పంతులుగారు, సాహిత్యము నాయుధముగా, హాస్య రససృష్టిని కవచముగా ధరించి, వారితో తలపడిరి వారి మేలును వాంఛించియే తాను పాటుపడుచున్నను వారందరును, తమ చర్యలకు విపరీతార్థములు కల్పించుట, విమర్శించుట పంతులుగారు సహింప లేకపోయిరి. సమకాలీన సంఘముపై పంతులు గారి కవిశ్వాసము, అసహనము, చిరాకు, కోపము, బాధ, కలిగినవి. వీని ప్రతి స్పందనలను పంతులుగారి హాస్యరచనల యందు గాంచవచ్చును వారి హాస్యరచన లందు, ఎక్కువ భాగపు హాస్యమునకు పంతులుగారి మనసులోని యీ అసంతృప్తి, క్రోధము ప్రాతిపదికమైనవి. అవి వారి రచనలందు కటువ్యంగ్యము, పరుష హాస్య ములుగా పరిణమించినవి.

వీరేశలింగంపంతులుగారి జీవిత రహస్య మొక ఉద్యమ నిర్వహణము. ఈ ఉద్యమము యొక్క విజయమే పంతులుగారి జీవిత లక్ష్యము. వారి ఉచ్ఛ్వాసనిశ్వా సము లీ యుద్యమ నిర్వహణము నందంతర్భాగములు. కనుక నీ లక్ష్యసిద్ధికై తాము చేయు ప్రయత్నములందు, ప్రతిసంఘటనలను, సంఘర్షణములను, పంతులుగారు సహింపలేకపోయిరి. అదియే వారి వాక్కులోని తీక్ష్ణతకు అవధిభూతమైన పరుష రహస్యము. ఈ ఉద్యమ విజయమునకై, నీ లక్ష్యసిద్ధికై, పంతులుగారు దంభా చార్యులను, గణికా ప్రాణనాధరావును, గార్ధభేంద్ర శాస్త్రులవారిని, నయవంచకా చార్యులను, సృష్టించిరి. కనుక పంతులుగారిలోనున్న యీ తీవ్రప్రకృతి వారిని అధిక్షేపణ హాస్యసృష్టియందే నిమగ్నులను కావించినది. మనసు చల్లనగు హాస్యము సృష్టించుటకు వారికి విశ్రాంతియే లభించలేదు. తన కాలము నంతను, దుర్మతభంజ నమునకే వినియోగించిన మహనీయులు కావున, త్రికరణశుద్ధిగా, దైవముఖమును జూచి తాము సత్యమని నమ్మిన, లక్ష్యసిద్ధికై పాటుపడుచున్న ప్రయత్నమునందు, నిష్కారణముగా, తమ మనస్సును నొవ్వజేయుటకై వ్యవహరించిన వారిని పంతులు గారు వెక్కిరించిరి. వేళాకోళము జేసిరి. అపహసించిరి. అధిక్షేపణము గావించిరి కనుకనే వారి హాస్యరచనలందు, ఒక చురక, ఒక జ్వాల, యనుభవమునకు వచ్చు చుండును. కాని పంతులుగారు మృదుహాస్యమునుగూడ తమ కృతులందు కూర్చి యుండకపోలేదు. ఇట్టి హాస్యమునే పంతులుగారు విస్తరించియున్నచో, హాస్య

వాఙ్మయ నిర్మాతలుగా పంతులుగారికి మరింత గొప్పపేరు వచ్చి యుండెడిది. కాని పంతులుగారి హాస్యరచనలందు, పూర్వోక్తకారణములను పురస్కరించుకొని చూచి నచో, నచ్చటచ్చట నుత్తమశ్రేణి హాస్యము కొఱవడినదనియే చెప్పవచ్చును.

పంతులుగారి హాస్యసృష్టియందు శబ్దాశ్రయహాస్యము, సన్నివేశగతహాస్యము, పాత్రల స్వభావగతమగు హాస్యము, వ్యంగ్యము, అధిక్షేపణ, కటువ్యంగ్యము, వికృతీకరణము (caricature), వ్యాజస్తుతి, వ్యాజనింద, హేళన, సుకుమార హాస్యము, అశ్లీల హాస్యము మొదలైన హాస్యరసము నందలి యవాంతర భేదము లన్నియు కలవు.

పంతులుగారు ఆంగ్లసాహిత్యమునుండి తెనుగుచేసిన ప్రహసనములన్నిట, సన్నివేశగతమైన హాస్యము ప్రధానస్థానము నాక్రమించుచుండును. అనుకొనని సంఘటనల వలన హాస్యముప్పతిల్లి, కథాగమనమునకు సహాయకారియగుచున్న యెడల, దానిని సన్నివేశగతమగు హాస్యమనవచ్చును. 'బలత్కార గానవినోద ప్రహసనము' 'పునర్మరణప్రహసనము' 'మహాశూర ప్రహసనము' మొదలగు ప్రహ సనము లన్నియు నిట్టివే. పాత్రల స్వభావముపై నాధారపడి వారి చేష్టలు నవ్వు పుట్టించుట 'మహామహోపాధ్యాయ ప్రహసనము'నందు గాంచనగును. కలిపురుష శనైశ్చరవిలాసము, దంభాచార్య విలసనము, హిందూమత సభ. జమాబంది, మ్యునిసిపల్ నాటకము, అపూర్వ బ్రహ్మచర్య ప్రహసనము, మొదలగు ప్రహసనము లందు పంతులుగారు పాత్రల స్వభావముల నాధారము చేసికొని చిక్కని హాస్యమును సృష్టించిరి బహుభార్యాత్వము, యజ్ఞప్రయత్నము మొదలగు ప్రహసనములందు అశ్లీలమగు హాస్యముకూడ కలదు బహుభార్యాత్వమను ప్రహసనమునాటి కాలమున, జమీందారుల మూర్ఖత్వమును అపహసించుచున్న రచనము. చిన్నచిన్న సంస్థానము లకు పాలకులగు వారు, తాము మహారాజుల మనుకొనుచు, విఱ్ఱవీగుట, వారి మూర్ఖ త్వము, ఈ ప్రహసనమునందు వర్ణింపబడినది. ఈ ప్రహసనమునందు, రాజాగారి యుంపుడు కత్తెతమ్ముని 'శకారుని' తత్త్వము కలవానినిగా పంతులుగారు చిత్రించిరి. 'బలాత్కార గానవినోద ప్రహసనము'నందు విస్సప్ప పాత్రుని ప్రవర్తన, విచిత్ర మైన సన్నివేశములందు మిక్కిలి నవ్వు పుట్టించును. చాదస్తపుటాచారములు, మూర్ఖములైన సంప్రదాయములు, దయ్యములు, భూతములందలి నమ్మకము, ఆంగ్ల విద్యాభ్యాసమును పూర్వాచార పరాయణులు విమర్శించుట, నవనాగరికుల మనుకొను

వారి దంభము, పూర్వాచార పరాయణుల అమాయకత్వము, మౌఢ్యము, పంతులు గారి ప్రహసనములందు విషయములైనవి పంతులుగారి ప్రహసనములందేకాక, నాటకములందును, నవల లందునుగూడ, వ్యంగ్యధోరణి నాశ్రయించి, హాస్యరస మును సృష్టించిరి పంతులుగారి వ్యాసములందును, ఉపన్యాసములందును, కూడ ప్రాయికముగ, నీ ధోరణి కన్పట్టుచుండును. వ్యవహార ధర్మబోధిని, బ్రాహ్మవివా హములందలి హాస్యము; కటుహాస్యమనియే చెప్పవలెను. వర్ణింపబడిన పాత్రల అజ్ఞానము, మౌఢ్యము, దురాచారములవలన పాఠకుని మనస్సునకు నొప్పి కలుగునే గాని, మనస్సు నందలి గ్లాని నశించి హాయికలుగదు. 'తిర్యగ్విద్వన్మహాసభ'యందు విరుద్ధరసములగు కరుణ, హాస్యముల సమ్మేళనము జరిగినది. అట్లని, రసాభాసము కాలేదుకాని, కరుణాత్మకమైన సన్నివేశమున, పురోహితుల, పాచకుల, యాచకుల, ప్రవర్తనము, జుగుప్సతో కూడిన హాసమునకు కారణమగును. మహారణ్యాధిపత్యము నందు, నక్కపోతు గాంభీర్యము. మాయోపాయములు, దాని ననుసరించి తిరుగు మృగముల, యార్భాటములు, మిక్కిలి నవ్వు పుట్టించును.

పంతులుగారి నాటకములలో సత్యహరిశ్చంద్రనాటకమున, హరిశ్చంద్రుని వేడుక చెలికాడైన గాలవుడొక హాస్యాలంబన పాత్రము. గాలవుడు విశ్వామిత్రునితో సంభాషించుట, మాలెతలు వచ్చి హరిశ్చంద్రుని, యనుచితమగు కోర్కెకోరుట, మొదలగు సందర్భములందు, పంతులుగారు హాస్యమును సృష్టించిరి. నక్షత్రకుని పాత్ర చిత్రణమునందును, కాశికానగరము, కలహకంఠకి, కాలకౌశికుల దాంపత్య చిత్రణమునందును హాస్యరసచ్ఛాయలు కొన్ని గోచరించును ఇంద్రసభయందు, వసిష్ఠ విశ్వామిత్రుల వివాద సందర్భమున, మునుల వర్తనము, దక్షిణ గోగ్రహణ నాటకమున పంచమాంకమున, సత్యసేన, సుశర్మాదులను, ధనగుప్తుడు, విరాటుడు, ఎత్తిపొడుచుట మొదలగు సన్నివేశములు, హాస్యరసస్ఫోరకములుగా వర్ణింపబడినవి. వీరేశలింగంపంతులుగారి మృదుహాస్యధోరణికి ఘట్టముల నుదాహరణములుగా చూపవచ్చును ఇట్లే ప్రహ్లాదనాటకమున, రాక్షసులు స్వర్గమును జయించినప్పుడు వారల ప్రవర్తనము, దక్షిణగోగ్రహణమున ప్రధమాంకమున, కీచకవధను ధన గుప్తుడు సుశర్మతో ప్రసగించుట మొదలగు పట్టుల, పంతులుగారు, మృదుహాస్యమునే ప్రయోగించిరి.

ఇదేవిధముగా రాజశేఖరచరిత్రమునందు, బడిపంతుళ్ళ దుస్థితిని వర్ణించు నప్పుడును ఆచారపరుల కపట వర్తనమును విమర్శించునప్పుడును పంతులుగారు హాస్యము నాశ్రయించిరి సత్యరాజా పూర్వదేశ యాత్రలందు, చక్కని హాస్య సన్నివేశములు కలవు సత్యరాజాచార్యుని యమాయకత్వము, పూర్వాచారనిరతి, ఆడమలయాళమునందును, లంకాద్వీపమునందును, ఆతడనుభవించిన కష్టములు హాస్యరసస్ఫోరకములు వ్యాజరీతిని, సంఘమునందలి దురాచారములనెల్లను, పంతులుగారు సత్యరాజాచార్యుని యనుభవముల నాధారముగా చేసికొని యధిక్షే పించిరి ఆదేశమునందలి వ్యక్తుల పేర్లు, నగరముల పేర్లు. పంతులుగారు నవ్వుపుట్టించునట్లు కూర్చిరి చండీదేశము, బాడీఘోడీ, మిధ్యా, (వేదము) మొదలగు పేర్లవలన పంతులుగారి హాస్యదృష్టి వెల్లడి యగును. అచ్చటి పురుషులు, సంవత్స రము పొడుగునను, కందపిలకను, రుబ్బురోటిని, సన్నెకల్లును, ఏదో ఒక దానిని పూజించుచుండుట, వ్రతము లాచరించుచుండుట, పత్నీవ్రతులై యుండుట, పత్నుల కాళ్ళుకడిగిన నీళ్ళు శిరసున జల్లుకొని, పారణము సేయుట, మొదలగు వింతలన్నియు కడుపుబ్బ నవ్వించును ఇచ్చట ముక్కుపచ్చలారని పసిపిల్లల కేశఖండనములు, అచ్చట పత్నీరహితులగు పురుషుల నాసికాకృంతన మహోత్సవములతో పోల్చబడి నవి. పంతులుగారి కసి యీవర్ణనమువలన వ్యక్తమగుచున్నది. భర్తృహీనలగు మగువల శిరోజములను తీసివేయుట, పురుషులకు భార్యలు పోయినప్పుడు, ముక్కులు కోసినదానికి ప్రత్యామ్నాయమని పంతులుగారిభావన. మఠాధిపతులకుటుంబరత్వము కూడ వ్యాజరూపమున, నీ సత్యరాజా పూర్వ దేశయాత్రలందు పరిహసింపబడినది. ఆడ మలయాళమునందు "పంఢీ పేఢీ భూఢీ" యను ధర్మశాస్త్ర గ్రంథమునందలి వని, సత్యరాజాచార్యుల వారాంధ్రీకరించిన, "పత్నీవ్రత ధర్మబోధిని" యందలి పద్యములు పంతులుగారి హాస్యరచనా వైదగ్ధ్యమునకు తార్కాణములు.

పంతులుగారి యభాగ్యోపాఖ్యానమును గూర్చి పద్యకావ్యములు పరిశీలింప బడిన ప్రకరణమునందు ప్రస్తావించుట యైనది. ప్రథితములైన మార్గములను వికటము చేయుట యీ ఏకాశ్వాస ప్రబంధమునందలి ప్రధానగుణము చర్విత చర్వ ణముగా ప్రబంధములందు చోటుచేసికొనుచున్న వర్ణనములన్నియు, నీ యభాగ్యో పాఖ్యానమునందు అధిక్షేపింపబడినవి.

పంతులుగారి హాస్య వాఙ్మయ సృష్టినిగూర్చి, వారి మిత్రులును, శిష్యులును, నగు శ్రీరాయసము వేంకటశివుడుగారు వెలువరించిన యభిప్రాయము సమంజసము.

"హాస్యరస కల్పనావిషయమున పంతులుగారు అడిసనుని కంటె స్విఫ్టునే యెక్కువగా బోలియుండెనని నేననుకొంటిని. అడిసనుని మృదుహాస్య ప్రయోగము తెలుగున జొప్పింప పంతుల యాశయము."

కాని పంతులుగారి వ్యక్తిత్వమున కనువైన హాస్యరస కల్పనము 'స్విఫ్ట్' ధోరణినే పోలియుండుట యనివార్యము.

## తార్కిక ప్రతిభ

పంతులుగారి తర్కము ప్రధానముగా వారి 'స్త్రీ పునర్వివాహ విషయక వ్యాసము' లందు గాంచనగును. 'స్త్రీ పునర్వివాహము'ను గూర్చి పంతులుగారు, ఎనిమిది వ్యాసములను రచించిరి. ఇందు స్త్రీ పునర్వివాహము, శాస్త్రీయమని, సప్రమాణముగా ప్రతిష్ఠాపించు శాస్త్రచర్చలు కొన్నియు, స్త్రీ పునర్వివాహోద్యమమునందు తామనుభవించిన కష్టనష్టములను తెలియజేయు, నివేదికలు, కొన్నియు కలవు. స్త్రీ పునర్వివాహము, శాస్త్రసమ్మతమని పంతులుగారు జూపిన హేతువులు, సునిశితమైన వారి తార్కిక ప్రతిభను వెల్లడింపగలవు. ప్రతిపక్షుల యుక్తులను ఖండించుట, సిద్ధాంత, పూర్వపక్ష, సాధనములతో తమ వాదమును నిరూపించుట, యీ వ్యాసములందు పంతులుగారి ప్రతిభను చాటి చెప్పుచున్నవి.

పంతులుగారు, వివేకవర్ధనియందు, రాజకీయార్థిక, మత సాంఘిక సమస్యలపై వ్యాసముల, పెక్కింటిని, వెలువరించిరి. ఈ వ్యాసములందు, పంతులుగారి బహువిషయ పరిజ్ఞానము, విమర్శనాశక్తి, సూక్ష్మాంశ విచారము, వస్తుసంవిధానము, తర్కనైపుణి, ప్రశంసావహములుగా నుండును. పంతులుగారు విప్లవవాది కావున, తర్క సహములగు, విషయములను మాత్రమే వారు విశ్వసింతురు. తర్కమునకు నిలువని మూఢ విశ్వాసములపైనను, దుర్మతములపైనను, దురాచారములపైనను వారు ధ్వజమెత్తిరి. పంతులుగారు తర్కసంగ్రహమును సులభశైలియందు తెనిగించిరి. "యధార్థజ్ఞానము," అను పంతులుగారి వ్యాసమునందు, వారి తార్కిక ప్రతిభ

వ్యక్తము కాగలదు. 'ఈశ్వరదత్త పుస్తకము'లు, 'ప్రమాణ విచారము,' 'పరిశుద్ధాస్తిక మతము' 'భగవద్విషయక జ్ఞానము' మొదలగు మతవిషయకములగు వ్యాసము లందు, పంతులుగారి తార్కిక ప్రతిభ, పరాకాష్ఠ నందినది 'ఈశ్వరదత్త పుస్తకము' లందు, పంతులుగారు, వేదములీశ్వరదత్తములు (అపౌరుషేయములు) కావని, చూపినవాదనైపుణి, వారి ప్రతిభకు నికషోపలము. ఇట్లే పంతులుగారు శంకరాచార్య జీవితము, జీసను చరిత్రము మొదలగు జీవిత చరిత్రములందు సైతము ఆ మహనీయులు చూపిన అతిమానుషములైన ప్రభావములను అవి తర్కసహములు కావన్న కారణము చూపి, విశ్వసనీయములు కావని వ్రాసివైచిరి. పంతులుగారికే విషయమున నైనను ప్రత్యక్ష ప్రమాణమే శిరోధార్యము వారి మేధనిశితమైనది వైద్యులు (1881 ఫిబ్రవరి, వివేకవర్ధని) కృష్యాది వ్యాపారము 1881 మార్చి, సుజ్ఞానము, 1881 ఏప్రియల్, వృద్ధవివాహము 1882 ఆగస్టు, రాజ్యాంగ సంస్కరణము, కులాచారసంస్కరణము, 1882 సెప్టెంబరు మాసముల వివేకవర్ధనియందు ప్రచురితమైన వ్యాసములు పంతులుగారి తర్కనైపుణి, వివిధ విషయ పరిజ్ఞానము వెల్లడించుచున్నవి.

ఇంగ్లీషుప్రభుత్వమువారివలని లాభములను వ్యాసమునం దాంగ్లేయులను ప్రశంసించుచునే, త్రాగుబోతుతనమను వ్యాసమునందు పంతులుగారాంగ్లేయులను ఆంగ్లేయ ప్రభుత్వమును తీవ్రముగా నిరసించి యున్నారు. త్రికరణ శుద్ధిగా దేనిని విశ్వసించిరో, దానినాచరించి చూపుటయందును, దానిని ప్రపంచించుట యందును వెనుకంజ లేనివారు పంతులుగారు. వారి వ్యక్తిత్వములోని మేలిగుణమిదియేయని చెప్పవలెను వారి వ్యక్తిత్వమునకు తగినట్లుగనే వారి సర్వరచనలయందు నిర్భీకత గోచరించు చుండును. గాఢముగా విశ్వసించిన విషయమునే వ్రాయుట, హత్తుకొని పోవునట్లు చెప్పుట, తార్కిక ప్రతిభకు నిదర్శనములు పంతులుగారి యందిట్టి ప్రతిభయమేయము.

— 0 —

# 14

## పంతులుగారి వ్యక్తిత్వము

వీరేశలింగంపంతులుగారు మహాపురుషులు. ఆధునిక యుగమున ఆంధ్ర దేశమునకు పంతులుగా రొనర్చినంత మేలు మరొకరు కూర్చి యుండలేదు. పంతులు గారు బ్రతికినంత కాలమును ఆంధ్రుల సర్వతోముఖాభివృద్ధికై తమ జీవితమును, ధారవోసిరి "వీరేశలింగంవంటి సంఘ సంస్కర్త, యటువంటి ధైర్యశాలి, యటువంటి కార్యశూరుడు, నటువంటి స్వార్థత్యాగి, యటువంటి లోకోపకారపరాయణుడు, కొన్ని వందల సంవత్సరములకు గాని మన దేశమున జన్మింపడని నాదృఢమైన విశ్వాస"మని శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు వ్రాయుట (స్వీయచరిత్రము, పుట351) వీరేశలింగంపంతులుగారి యౌత్కృష్ట్యమును, చాటి చెప్పుచున్నది. సమకాలీనులందరిని పంతులుగారు ప్రభావితులను చేసిరి వారి యందును మానవీయములైన బలహీనతలు కొన్ని లేకపోలేదు. అహంకార మమకారములు. ప్రథమ కోపము, ఆత్మప్రశంస, మున్నగు బలహీనతలు వారియందుండినట్లు, సమకాలీనుల వ్రాతలవలన తెలియుచున్నది 'ఏకోహిదోషోగుణసన్నిపాతే'...యనునట్లు పంతులు గారి మహత్త్వమున కీబలహీనతలు న్యూనతాపాదకములు కాజాలవు. వారి స్వీయ చరిత్రమును, సమీక్షించిచూచినచో, వారి సత్యతత్పరత, వినయము, త్యాగబుద్ధి, సుబోధకములుకాగలవు పంతులుగారు, ఆంధ్రదేశము నుద్ధరించుటకై జన్మించిన దేవతామూర్తి యని చెప్ప నొప్పును.

పంతులుగారి దొడ్డకీర్తికి విషయ భూతమైనది వారి త్రికరణశుద్ధి పంతులు గారి జీవిత రహస్యము ఆర్జవము (sincerity). మానావమానములందు, సమచిత్తముతో, తమ జీవిత పరమార్థమును పంతులుగారు సాధించిరి

---

"Sri Viresalingampantulu was one of the earliest Pioneers in South India to demand and work for radical changes in our society. Like all Pioneers who are ahead of their time, he suffered misunderstanding and Persecution. we owe it to his memory to work for social regeneration even as he did, braving all ridicule and danger"

—*Dr Sarvepalli Radhakrishnan*

From Swatantra weekly, Madras, 17-4-1948
centenary Tributes

పంతులుగారివంటి పరోపకారబుద్ధి ఇంకొకరు పుట్టబోరు. పంతులుగారు పుణ్యపురుషులు. ప్రవక్త. మతాచార్యుడు, బోద్ధ ఆయన జీవనమంతయు, దళితుల, దుఃఖితుల, సముద్ధరణము కొఱకు సార్ధకమైనది. తెలుగు సాహిత్యమునందు పంతులుగారివంటి ఉపదేశకు లింకొకరు కన్పింపరు 'శివేత రక్షతయే...' యను ఆదర్శమును, తమ సర్వసాహిత్య సృష్టియందును, పంతులుగారు సాధించిరి. ప్రజలలోని అజ్ఞానము, దారిద్ర్యము, తొలగింపవలెనని పంతులుగారు దూరపు వెలుగును, దేవదూతవలె తీసికొనివచ్చిరి నిద్రాణమైయున్న సంఘమును మేలు కొలిపిరి తెలుగు దేశమునందు ప్రబలిన సాంఘిక చైతన్యమునకు, సాంఘిక ప్రగతికి పంతులుగారు మూలపురుషులు ఆయన మానవతావాది, అకలంక నీతివర్తనులు; మేరుగంభీరులు, ధర్మయోద్ధ, దాత, త్యాగి, దీనులసేగి పోనడచిన మహనీయుడు పరమభక్తుడు. పరోపకారి, సంఘోద్ధరణమునకై తనువెత్తిన పుణ్యమూర్తి, బ్రతుకు సుకముకు రాజమార్గమును నిర్మించినవాడు. ప్రాతక్రొత్తల మేలుకలయికను, విన్నాణముగా దిద్దితీర్చిన మహానుభావుడు. ఎల్లలోకములొక్క ఇల్లైన ఏకేశ్వర విశ్వాసి పంతులుగారు కుల, వర్గ, పర్ణ. మత, వివక్షతల కతీతులు.

ప్రాచీన సంప్రదాయానభిజ్ఞుడని, వీరి సంఘసంస్కరణము, కాలాద్యవచ్ఛిన్నముగా నిలుచునదికాదని, పంతులుగారిని కొందరు విమర్శింతురు. అందువలన వీరి సాహిత్యము ప్రచారసాహిత్య కోటియందు జేరునని, యుద్దిష్టప్రయోజనము, సిద్ధించిన తదుపరి, సాహిత్యపు విలువ నశించి, కాలగర్భమునందు కలసిపోవునని

---

"Andhradesh and Andhra people could not be what they are if Veeresalingam had not arrived to vitalise them He was one of the great men of India, of keen insight, great courage and dynamic energy. He fought against untruth and championed the cause of Progress with Herculean vigour. Andhra is legitimately Proud of him, so should all People in South India who know his work very well His greatness rests on its own strength and not on any memorials we can raise or maintain—

*C. Rajagopala chari.*
17–4–1948
Swatantra.

వారి వాదము. కాని పంతులుగారి సర్వసాహిత్య సృష్టి యట్టిదికాదు. ప్రహసనములు, వ్యాసములు, ఉపన్యాసము లందిట్టి లక్షణము నారోపింపవచ్చును. కాని పంతులుగారి రాజశేఖర చరిత్రము, కవుల చరిత్రము, మొదలగు గ్రంధములు తెలుగు సాహిత్యమునందు శాశ్వతముగా నిలిచిపోవునట్టివి. రాజశేఖర చరిత్రము 'వికారాఫ్ వేక్ఫీల్డు' అను ఆలివర్ గొల్డుస్మిత్ కవీశ్వరుని నవల కనుసరణమైనను, పంతులు గారీనవలయందు ప్రశంసావహమైన నేర్పును చూపిరి. ఇట్లే పంతులుగారి 'సత్యవతీ చరిత్ర' కూడ తెలుగు సాహిత్యమున కొకమణి పూసవంటిది. ప్రధానముగా సంఘ సంస్కరణమునకుపకరణముగా పంతులుగారు సాహిత్యమును స్వీకరించిరి కావున, సమకాలీన ప్రయోజనములను దృష్టియందుంచుకొనక వారికి గత్యంతరములేదు.

వంగదేశమున శ్రీ రాజారామమోహనరాయలు, పండిత ఈశ్వర చంద్ర విద్యాసాగరులు, బంకించంద్ర ఛటర్జీ మొదలగు మహనీయులవలన జరిగిన కృషి, సాధింపబడిన ఫలితములు, ఆంధ్రదేశమునందు వీరేశలింగం పంతులుగారి వలన సాధింపబడినవి. బొంబాయి రాష్ట్రమున మహదేవగోవిందరానడె, మహారాష్ట్రమున కార్వేపండితుడు సాధించిన ఫలితములు ఆంధ్రదేశమున వీరేశలింగం పంతులుగారి వలన సాధింపబడినవి. పంతులుగారు రాజారామమోహన రాయలవారివలె వచన రచనా పితామహులు. మహనీయుడగు సంఘసంస్కర్త. తెలుగుదేశమున సాంస్కృతిక పునరుజ్జీవనము పంతులుగారితోడనే ప్రారంభమాయెననుట నిర్వివాదము

---

"Veeresalingam stormed our Social citadels with the fusilades of western ideals and thoughts and he was one of the harbingers of Indian renaissance."

"Veeresalingam lived essentially for the promotion of the social and literary causes and he consecrated to them his services, in writing, speaking and other aspects of Public work, as well as his funds. His was such an extraordinary career of incessant service to every group of sufferers from Social taboos, bad customs and Superstitions"

*Prof N. G. Ranga*
from commemoration Volume
—(1963)

పంతులుగారి వ్యక్తిత్వము నందు నిర్భీకత, త్రికరణశుద్ధి, దైవ విశ్వాసము ప్రధానగుణములని చెప్పవలెను. పంతులుగారి యందున్నంత పట్టుదల మరి యేరి యందును కనపడదు. విధవావివాహోద్యమమునందు పంతులుగారుచూపిన సాహస మాశ్చర్య జనకముగా నుండును. వారి జీవితమంతయు అద్భుతరస ప్రధానమైనట్టిది. తాను సత్యమేనని నమ్మినట్టి దాని నాచరించుటయందు, పంతులుగారెట్టి క్లిష్ట పరిస్థితు లందును వెనుకంజ వేయలేదు

తన దేహము తన గేహము
తన కాలము తన ధనమ్ము తన విద్య జగ
జ్జనులకు వినియోగించిన
ఘనుడీ వీరేశలింగకవి జనులారా !

యను చిలకమర్తివారి వాక్యములు వీరేశలింగం పంతులుగారి యెడ సార్థకములు.

అనేకులగు మహనీయులు తమ జీవిత కాలమున, అజ్ఞానులగు తన జాతి జనులవలన పలుబాములు గుడిచినట్లే పంతులుగారును, సమకాలికుల అజ్ఞానాహంకార ముల వలన కష్టములుపడిరి దీనదయాపరుడగు నీ మహనీయుని పూర్వాచార పరాయణులు నిర్దాక్షిణ్యముగా బాధించిరి. తన పైకి రాళ్ళురువ్వినను, తన ప్రాణము లకే యెగ్గు తలపెట్టినను పంతులుగారు చలించలేదు. పంతులుగారి యందున్న విశిష్టమగు వ్యక్తిత్వమిదియే..."సింహమునకు సహజమైన గాంభీర్యమును, తటిల్ల తకు సహజమైన సాహసమును, బలవంతులకు సహజమైన నిర్లక్ష్యమును వారి కాశ్రయములై యుండె"ననియు, "ఆంధ్రులు తామొకజాతివారమని ప్రకృతము చెప్పుకొనుటకు ఆత్మగౌరవము మనలో నుద్భవింపజేసినది పంతులుగారే ననియు,

---

"Sri Veeresalingam was a slave to his resolve, but died as a hero bequeathing a rich legacy of many facets to many a future generation. The greatness and grandeur of his life and work and death may be expressed in one word, namely that he lived every inch a hero and died in full harness"

*Andhrakesari T. Prakasam*
from Viresalingam commemoration Volume
—(1963)

వారితో ప్రత్యక్షపరిచయము గలిగిన శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు వ్రాయుట ఆ మహనీయుని తేజోరూపమును చక్కగా గ్రహించుట. (ఆంధ్రపత్రిక, 1919 వ సం॥ జూన్ 21వ తేది, దినపత్రిక)

పంతులుగారిని గూర్చి సాహిత్య విమర్శకులలో రెండభిప్రాయములు లేవు. ఆంధ్రవాఙ్మయమున ప్రఖ్యాత గ్రంథకర్తలలో పంతులుగారొకరని ముక్తకంఠముతో వారు చెప్పుదురు. కాని పంతులుగారి యీదొడ్డ కీర్తికి హేతుభూతమైనది వారి సంఘసంస్కరణ తత్పరత్వము, దానియందు వారు సాధించిన ఘన విజయములు, కాని, వారి సాహితీవేత్తృత్వము ప్రధానమైనది కాదను నభిప్రాయముకూడ కొంత వ్యాప్తియందున్నది. పంతులుగారు గొప్ప సంస్కర్తయా ? సాహితీవేత్తయా ? యను ప్రశ్నకు, వారు సాహిత్యవేత్తగా కాక, సంఘసంస్కర్తగానే తెలుగునాట శాశ్వతకీర్తిని పొందుదురనుట కొందరి వాదనలోని సారాంశము కాని పంతులుగారి జీవితమును సమగ్రముగా బరిశీలించి చూచినప్పుడు, ఇట్టి శుష్కవాదములకు తావుం డదు పంతులుగారి జీవితమునందు, సాహిత్యమునకు, సంఘసంస్కరణమునకు నవినాభావ సంబంధమే యున్నదికాని, ఒకదానిని విడిచి, మరియొకదానికి సత్వము లేదు. స్థితిలేదు సాహిత్య ప్రయోజనము, సంఘ సంస్కరణ తత్పరత్వము, సమ

---

" As we enumerate the chief contents of our Pantulu garu's works and recall the leading incidents of his life we feel deeply impressed with this comprehensive Programme of human uplift and advancement "

from Messages and Ministrations—(1932)
Sir Raghupati Venkata Ratnam Naidu

"He is one of the greatest writers in Telugu and the only man who ever made a living from the sale of his books His works embrace a bewildering variety of literary forms and themes He comes nearest to the universality of Voltaire with whom he also shared the Provoking gift of Sardonic humour without any trace of his cynicism

—*Dr C. R Reddy*
from Swatantra weekly, 17-4-1948
centenary Tributes.

పాళ్ళలో సమ్మేళనము పొందిన విశిష్ట వ్యక్తిత్వము పంతులుగారిది. దేహప్రాణముల కెట్టి పరస్పరాలంబనము కలదో, పంతులుగారి వ్యక్తిత్వమున, పంతులుగారి కీర్తి ప్రతిష్ఠలందు, సాహిత్యవేత్తగా, మహనీయుడైన సంఘసంస్కర్తగా, ఆ మహాగుణముల కట్టి పరస్పరాశ్రయము కలదు. పంతులుగారి జీవితమునందు, సాహితీవేత్తృత్వము, సంఘసంస్కరణ తత్పరత్వము, పడుగు పేకలవలె నల్లుకొని పోయిన, నొకానొక క్రమపరిణామ వికాసదశను మనము గమనింపవచ్చును. సంఘసంస్కరణ మాయన ప్రాణశక్తి. సాహిత్యమాయన ఉపాస్యదేవత కనుకనే శుద్ధాంధ్ర నిరోష్ఠ్య గ్రంథములను రచించుచున్న పంతులుగారు, ఆకాలమున కవ్యవహిత పరముగనే వివేకవర్ధనిని స్థాపించుట, వ్యవహార ధర్మబోధిని, బ్రాహ్మ వివాహములను రచించుట, వానిని ప్రదర్శింప జేయుట జరిగినది. కవుల చరిత్రమును రచించిన పంతులుగారే శరీరశాస్త్ర సంగ్రహమును రచించుట సంభవించినది. శాకుంతలము ననువదించిన పంతులుగారే సత్య హరిశ్చంద్ర నాటకమును వెలయించుట సంభవించినది.

ఈ విధముగా పంతులుగారికి సాహిత్యము, సంఘసంస్కరణము నయన యుగళమువంటిది.

---

"Swimming against Times current Veeresalingam changed the current of life in Andhra, with no predecessor in his line and no Successor of equal stature

His versatality was hardly surpassed while as a writer of Prose he was unequalled Later-day trends, developments in Telugu literature have failed to dislodge him from the peaks on which he stood, as a class apart . "

—*K Iswaradutt*
Swatantra-17-4-1948

The author, Pandit K. Viresalingam, is described by the translator as an ardent reformer who having had some degree of English education, has adopted the form of a fictitious story to convey to his readers a knowledge of the innerlife and thought of the Hindu race "

from the Review of the English translation of Rajasekhara-charitram (Fortune's wheel-by J R Hutchison, Published in London)
—The London Times, 30 th September 1887

పంతులుగారి వ్యక్తిత్వము నందలి గొప్ప లక్షణమింకొకటి వారి యాచరణ శీలత, తాము నమ్మిన దానిని ప్రప్రథమముగా వారే యాచరించి చూపిరి. పంతులు గారిది శుష్క-వేదాంతముకాదు. విశుద్ధమగు వర్తనము, విశ్వసించిన దాని నాచరించుట పంతులుగారి వ్యక్తిత్వమున కౌజ్జ్వల్యము నాపాదించు మహాగుణము 1908వ సంవత్సరమునందు పంతులుగారు తమ యజ్ఞోపవీతమును విసర్జించి, అనుష్ఠానిక బ్రాహ్మమతస్థులైరి. ఏరి బెదరింపులకుగాని, సంక్షోభములకుగాని, సాధింపులకుగాని పంతులుగారు తలకలేదు అట్లే 1919వ సంవత్సరమునందు, వర్తమానాంధ్ర భాషా ప్రవర్తక సమాజమునకు పంతులుగారధ్యక్షులైరి. నవ్యాంధ్ర వ్యాకరణమును రచించుటకు పూనుకొనిరి. ఆయన నిశ్చయము మేరువువలెనచంచలమైనది. ఆయన సాధనము వజ్రాయుధమువలె యకుంఠితమైనది. కనుకనే పంతులుగారు తన జాతికి చిరస్మరణీయులగుచున్నారు.

---

"We may well say that Rajasekhara marks an era in the annals of Telugu Literature "

(from the Review of the 'Rajasekharacharitramu')
The Hindu, 1878

పంతులుగారి మరణమునకు సంతాపమును వెలిబుచ్చుచు Madras Mail పత్రిక యిట్లువ్రాసినది.

"We regret to record the death of Rao Bahadur K Viresalingam pantulu which occured yesterday at Vedvilas Egmore. He was a well known religious and social reformer and was the author of several works in Telugu both in verse and Prose. He was busily engaged in completing the lives of Telugu Poets and the Andhradesa has lost by his death both a Poet and Patron "

The Madras Mail, 28-5-1919.

పంతులుగారిని ప్రస్తుతించుచు, 'Modern Review-' ఇట్లు వ్రాసినది.

It is a great pity and shame that the most courageous and human thing which he did in life the re-introductiron and legislation of the remarriage of child widows continued to be looked upon with disfavour in all the province of his birth—

The Modern Review, August 1919.

పంతులుగారియందు సైతము కొన్ని లోపము లుండినమాట యిదివరలో ప్రస్తావింపబడినది. స్వీయచరిత్రమునందే కొన్ని సందర్భముల పంతులుగారు తమ లోపములను ప్రస్తావించియున్నారు సమకాలికుల వ్రాతలవలన కూడ పంతులుగారు కొందరి యెడల తామసము, అసహనము, కఠిన విమర్శనము, కనబరచిరని తెలియు చున్నది. అయినను వీరు ప్రదర్శించిన స్వార్ధత్యాగము, దైవభక్తి, పరోపకార, చింత, ధైర్యస్థైర్యములు, పరమ దయాళుత్వము, సత్యము, మొదలగు గుణముల వలన వారారాధ్యులే యగుచున్నారు సమకాలికులలో పంతులుగారి వలన ప్రభావితులుకాని సాహితీవేత్తలుకాని, సంఘసంస్కరణ తత్పరులు కాని యెవరునులేరు. ప్రత్యక్షముగనో, పరోక్షముగనో, పంతులుగారు, తమ ప్రభావమును నాటి సాహితీ వేత్తల పైనను, దేశ నాయకులపైనను బరపి, వారిని విశుద్ధనీతివర్తనులుగను, మహనీయులుగను నొనర్చిరి. శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహకవి, శ్రీ కూచి నరసింహ కవివంటి వారు పంతులుగారి శిష్యరికము నెరపిరి. శ్రీ రఘుపతి వేంకట

---

"శ్రీ వీరేశలింగము పంతులుగారు నిశ్చయముగా మహాపురుషులు. సాహిత్యములో వొక శాఖను ప్రారంభించి, సంఘములో పురోభివృద్ధి పంధాలేవదీసినరు ఇది యెంతో కష్టతరమైనపని తెలుగుదేశపు సేనాధిపతులైన వంశపురుషుల రక్తము తమలో ప్రవహించుచున్నది కనుకనే వారిలో సాహసము, నిశ్చలత్వము కనబడతవి —"

*శ్రీగురజాడ అప్పారావుగారు*

(తమ డైరీలో జనవరి 12, 1911 వ సంవత్సరమున
శ్రీ అప్పారావుగారిగాట్లు పంతులుగారిని గూర్చి వ్రాసికొనిరి)

"దేశావృతమైన సంస్కార పరివర్తనమునకు శ్రీయుత వీరేశలింగము పంతులుగారి జీవిత చరిత్రము ప్రమాణముగ నున్నది—"

*శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు*

(శ్రీ రాయసం వేంకట శివుడుగారి ఆత్మచరిత్రమునకు పీఠిక–1933)

"సత్యాన్వేషణమే పరమోద్దేశముగాగల ఈ మహనీయుడు సంఘ, మతసంస్కరణములకును, ఆత్మత్యాగమునకును ఆంధ్రదేశము లోనివారికి మార్గదర్శియనుటకు సందేహములేదు—"

— ఆంధ్రపత్రిక ఉగాది సంచిక, 1909

రత్నమునాయుడు, శ్రీ దేశిరాజు పెదబాపయ్యవంటి వారలు పంతులుగారిని సమ్మా నించిరి శ్రీ వల్లూరి సూర్యనారాయణరావు, శ్రీరాయసం వేంకటశివుడు, శ్రీ, కె. యన్ కేసరి ఆంధ్రకేసరి టంగుటూరు ప్రకాశముపంతులు, దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులు మొదలగు మహనీయులు తమ స్వీయచరిత్రము లందు పంతులుగారిని గూర్చి ప్రత్యేక ప్రకరణములనే రచించియున్నారు ప్రఖ్యాత తమిళ కవి, దేశభక్తుడునగు, సుబ్రహ్మణ్య భారతి, తమ 'చంద్రిక' యను నవలయందు పంతులుగారి కుటుంబమును, పంతులుగారి మహనీయతను నొక ప్రకరణమునందు వర్ణించియున్నారు

పంతులుగారి కాలమున ప్రచురముగా నుండిన పరిస్థితులను పంతులుగారి మహత్వమును శ్రీ ఉమాకాంత విద్యాశేఖరు లీవిధముగా పరిశీలించినారు.

"నీతి బలములేని పురోహితులు సర్వాధికారులు ఈ సర్వాధికారులకు సమ్మతులైన అప్పటి తెలుగు ప్రజకు అసత్యము ప్రయోజకుని పని, వ్యభిచారము పురుషలక్షణము. పంతులుగారికి వయసు వచ్చునప్పటికి ఉన్న తెలుగు దేశపు పస్థితి యిది .....

"ఈ దురాచారములను మాన్పుటకు తెలుగు దేశమునకు ఈ స్థితిని తొలగించుటకు పంతులుగారు నడుము కట్టుకొనిరి. లోకమునందెన్నో యుద్ధములు జరిగినవి. ఎందరో శూరులు పోరాడిరి దురాచారములతో సంభవించిన పెద్ద యుద్ధములో పోరాడిన ఈ శూరుడు ఏ యుద్ధము నందలి ఏ శూరునికి తీసిపోడు.... ."

పంతులుగారికి సంబంధించిన యీ పరిశీలనము మిక్కిలి యుచితముగా నున్నది

పంతులుగారి వలన సంఘము జాగృత మగుటయేకాక, వాఙ్మయము వివిధ శాఖల యందును అభివృద్ధి చెందినది అనేక కారణములచే తెలుగు దేశ చరిత్రలో పంతులుగారి పేర ఒక కాలమేర్పడెననియు, పుస్తకములలో నిద్రపోవుచుండిన నీతి మనుష్యుల నడవడులలో నిలుచుండ మొదలుపెట్టె ననియు, శ్రీ ఉమాకాంత విద్యాశేఖరులు వెలువరించిన యభిప్రాయము ప్రశంసావహము.

ఈ విధముగా వీరేశలింగంపంతులుగారు సమకాలీన మేధావులపై తమ ప్రభావమును బరపిరి. గొప్ప దేశభక్తునిగ, మహత్తరమైన కార్యశూరునిగా

మహనీయుడగు ప్రబోధ వాఙ్మయ నిర్మాతగా, భారతదేశ మంతటను కీర్తిగాంచిరి. పంతులుగారి వలన తెలుగు దేశము పొందిన మేళ్ళలో సాహిత్యాభివృద్ధి, సంఘ సంస్కరణమేగాక, పానుగంటి, చిలకమర్తివంటి, సాహితీపరులపైనను, టంగుటూరి ప్రకాశము పంతులు కొండా వేంకటప్పయ్య పంతులు, మొదలగు దేశ నాయకుల పైనను వారు బరపిన ప్రభావము ప్రదానమైనది. వీరేశలింగంపంతులుగారిని తామారాధించుచుండినట్లును, తమ పైవారి ప్రభావ మనన్యసామాన్యముగా నుండి నట్లును శ్రీ ప్రకాశము పంతులుగారు తమ స్వీయచరిత్రమునందు వ్రాసిరి. శ్రీ దరిశి చెంచయ్యగారు, శ్రీ కొండా వేంకటప్పయ్య పంతులుగారు, శ్రీ కె యన్ కేసరి గార్ల, స్వీయచరిత్రల వలన పంతులుగారాంధ్రదేశము నెంత ప్రభావితమొనర్చిరో తెలియనగును.

ఇట్లే పానుగంటి లక్ష్మీనరసింహారావుగారును, చిలకమర్తి లక్ష్మీనరసింహకవి గారును, పంతులుగారు ప్రారంభించిన సంఘసంస్కరణ కృషికి, సాహిత్యోద్యమమునకు రసస్థితిని కల్పించిరి వీరేశలింగం పంతులుగారి దృష్టి సంఘపరము కాగా, పానుగంటి వారిదృష్టి వ్యక్తిపరమై, పంతులుగారి సంఘసంస్కారమును మరింత పటిష్ఠము చేసినది. పంతులుగారి యందేకముఖముఖముగా ప్రవహించిన సంస్కరణము, సాహిత్యవేత్తృత్వము అను రెండు ప్రవాహములు, చిలకమర్తి, పానుగంటి, కవులయందు, కావ్యసౌందర్యమును, శిల్ప రామణీయకతను సంతరించుకొనినవి. గిడుగు రామమూర్తి పంతులుగారు, కూడ వీరేశలింగంపంతులుగారి వలన ప్రభావితులైనవారే.

పంతులుగారికి సమకాలికులని చెప్పుటకు వీలులేకపోయినను, పంతులుగారి గ్రంధముల నవలోడనముచేసి వారి ప్రభావమునకు లోనైనవారు తెలుగు సాహితీ వేత్తలలో నెందరోకలరు

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు తమ స్వీయచరిత్రమునందు వీరేశలింగం పంతులుగారి గ్రంథముల వలననే తమకు సంస్కరణ దృష్టి యలవడెనని వ్రాసిరి.

శ్రీ కె యన్. కేసరిగారు తమ 'చిన్ననాటి ముచ్చట్లు' అను గ్రంథమునందు పంతులుగారిని గూర్చి యొకప్రకరణమే వ్రాసిరి

కందుకూరి వీరేశలింగంపంతులుగారి పుస్తకములు నన్ను సంస్కరణ ప్రియుణ్ణిగా చేసినవని శ్రీదరిశి చెంచయ్యగారు తమ స్వీయచరిత్రమునందు వ్రాసిరి.

ఈ విధముగా పంతులుగారు సకలాంధ్ర దేశమును ప్రభావితము నొనర్చిరి మహదేవ గోవిందరానెడే, కార్వేపండితులు, పంతులుగారి మిత్రకోటిలోనివారు. వీరు పంతులుగారిని ఘనముగ గౌరవించుచుండిరి పూనానగరమునందు కొండా వేంకటప్పయ్య పంతులుగారు మొదలదగువారు, స్త్రీల విద్యాభివృద్ధికై మహదేవ గోవింద రానడె మొదలగు మహనీయుల కృషి ఫలితముగా వెలసిన పాఠశాలలను దర్శించి, వారి దేశహిత తత్పరత్వమును శ్లాఘించగా, రానడేగారి ధర్మపత్ని "కందుకూరి వీరేశలింగము పంతులుగారుండిన తెలుగుదేశమువారు మమ్ము శ్లాఘించుట ఎంతమాట" యని పంతులుగారిని ప్రశంసించిరని వేంకటప్పయ్య పంతులుగారు తమ స్వీయ చరిత్రమునందు వ్రాసిరి

వీరేశలింగము పంతులుగారి వ్యక్తిత్వమునుగూర్చి ప్రసంగించునప్పుడు, వారి ధర్మపత్నియగు శ్రీ రాజ్యలక్ష్మమ్మగారిని గూర్చి, ప్రముఖముగా ప్రసంగింప వలసి యుండును. శ్రీ రాజ్యలక్ష్మమ్మగారు పంతులుగారి పుణ్యమువలన జతకూడిన ఇల్లాలు. పరమసాధ్వి. షట్కర్మయుక్త యయిన ధర్మపత్నియను మాట యీామె యందు సార్ధకమగును. పంతులుగారు సాధించిన సర్వఘన కార్యములందీమె, వారికి చేదోడు వాదోడుగ నుండెడిది. ఈ మహాసాధ్విని గూర్చి పంతులుగారు తమ స్వీయ చరిత్రమునందొక ప్రకరణమునే రచించి యుండుటవలన, వీరి యన్యోన్యానుబంధము వ్యక్తము కాగలదు. పంతులుగారును, రాజ్యలక్ష్మమ్మగారును, తెలుగు దేశము నుద్ధరించుటకు తనువెత్తినవారు.

---

# 15

# ఉపసంహారము

వీరేశలింగంపంతులుగారు బహుయోజన శాఖాసంయుతమైన వటవృక్షము వంటివారు ఆంధ్రదేశమున, ఆధునిక చరిత్రమునందు వారి స్థానము విశిష్టమైనది. నేడీ దేశీయులయొక్క సాంఘిక చైతన్యమునకు, సారస్వత వైవిధ్యమునకు పంతులు గారు తమకాలమునందు గావించిన గొప్ప కృషియే మూలాధారము. వారితో ఆధునిక యుగము ప్రారంభమయ్యెనని చెప్పవచ్చును వారికి పూర్వమే ఆయా సాహిత్య ప్రక్రియలు తెలుగున వెలయుటకు శ్రీకారముచుట్టిన మహనీయులు కొందరున్నను, తెలుగువారి సాంఘికాభ్యుదయమునకై పాటుపడిన పుణ్యపురుషులు కొందరున్నను, ఉద్యమమువలె, ఆయా రంగములందు కృషిచేసిన మేధావి వీరేశలింగంపంతులు గారే నవ్యసాహిత్య ప్రక్రియల కన్నిటికిని, స్థితిని, ప్రాచుర్యమును, కల్పించినవారు పంతులుగారు.

వారి విశ్వరూపము, ఈ వ్యాసమునందు యథాశక్తి ప్రదర్శితమైనది. ఆయా ఘట్టములందు వారి సంపూర్ణ వ్యక్తిత్వము సంయోజనము చేయబడినది. వారి వ్యక్తిత్వమునందలి వైలక్షణ్యము విశ్లేషింపబడినది. వారికి పూర్వము, దేశకాల పరిస్థితులు సమీక్షింపబడినవి. పంతులుగారి జీవితమునందు, వారు మహోత్తమ సంఘ సంస్కర్తగా, సాహితీవేత్తగా రూపొందుటకు, కారణభూతములైన సంఘటనలు పరిశీలింపబడినవి వారి జీవితమునందు సంఘసంస్కార విషయకముగా, సారస్వత విషయకముగా, సంధికాల మేర్పరుపబడి, నిరూపింపబడి సమీక్షింపబడినది పంతులుగారి జీవితమునందు, వారేర్పరించికొనిన సంపూర్ణ వ్యక్తిత్వము నందలి క్రమపరిణామ వికాసము నిరూపింపబడినది

పంతులుగారికి పూర్వమే ఆయారంగములందు లబ్ధప్రతిష్ఠులైన వారికృషి పంతులుగారి కృషితో పోల్చబడినది సమకాలీనులపై వారి ప్రభావము దేశవ్యాప్తముగా, నిరూపింపబడినది తెలుగు సాహితీపరులపై వారి ప్రభావము గుర్తింపబడినది.

పంతులుగారిచే మిక్కిలి ప్రభావితులైన శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహ కవిగారి వంటి వారి గ్రంథ పరిశ్రమము సందర్భానుసారముగా ప్రసంగింపబడినది.

పంతులుగారికి పూర్వమే 'నవలా' రచనమున కుపక్రమించిన శ్రీ కొక్కొండ వేంకట రత్నము పంతులు, తొట్టతొలుతటి నవలను రచించిన శ్రీ నరహరి గోపాలకృష్ణమ సెట్టిగార్ల ప్రయత్నములు, వారు సాధించిన ఫలితములు వివరింపబడి పంతులుగారి స్థానము నిరూపింప బడినది. పంతులుగారికి పూర్వమే నాటకరచనమునకు బూనుకొన్న శ్రీ కొక్కొండ వేంకటరత్నముపంతులు, శ్రీ పరవస్తు వేంకట రంగాచార్యుల్యవారలు, శ్రీ వావిలాల వాసుదేవశాస్త్రిగారల మార్గములు పరిశీలింపబడినవి పంతులుగారనువ దించిన సంస్కృత రూపకములనే యనువదించిన, యితరుల యనువాదములుకూడ పరిశీలింపబడినవి ఇందు ముఖ్యముగా శాకుంతలానువాదములు, ప్రబోధ చంద్రో దయానువాదములు పేర్కొనదగినవి. పంతులుగారి గ్రంథముల సామాన్య లక్షణ ములు ఆయా సందర్భముల క్రోడీకరింపబడినవి

వీరేశలింగంపంతులుగారి వ్యక్తిగత జీవితమునకు సంబంధించిన వివర ములుకూడ, స్వీయచరిత్ర సహాయమున ఏర్పరింపరానివి, ఆయా సందర్భములందు గ్రంథస్థము కావించబడినవి. పంతులుగారి ప్రభావమునకు లోనైన యాంధ్రమహా పురుషులు, వారిని స్మరించిన పట్టములు, సాధించిన ఫలితములు ప్రసంగవశమున నుగ్గడింపబడినవి.

పంతులుగారి స్థానము, సంఘ సంస్కర్తగానా లేక గొప్ప సాహితీవేత్తగానా, శాశ్వతముగా నిలిచియుండునన్న మీమాంస పరిష్కరింపబడినది

ఆ కాలమునందు వెలువడిన తెలుగు పత్రికలన్నియు, పరిశీలింపబడి, సమ కాలిక సంఘమునందు పంతులుగారి స్థానము విశదీకరింపబడినది ప్రాచీనములగు 'సుజనరంజని' 'పురుషార్థ ప్రదాయిని' 'సకల విద్యాభివర్ధని' మొదలగు పత్రికలు కూడ పరిశీలింపబడి నాటి సాంఘిక పరిస్థితులు, సారస్వత రీతులు పరామర్శింప బడినవి.

పంతులుగారి జీవితమునందలి వెలుగు నీడలు వ్యాఖ్యానింపబడినవి. పంతులు గారు మేధావి, వశ్యవాక్తములు ఆంధ్రదేశమున కాయన యొసర్చిన సేవబహు ముఖమును, అపారమును నైనది మహోన్నత మానవతావాది పంతులుగారు. విశ్వమానవ కళ్యాణము పంతులుగారి ధ్యేయము. విశ్వమానవ మతమే వారిమతము. వారి లక్ష్యశుద్ధి వారి రచన లన్నిట వెల్లివిరియుచునే యుండును.

పంతులుగారు సంఘ సంస్కరణమును, తమ రచనాదర్పణమునందు ప్రతిఫలింప జేసినారు కనుక, సాహితీవేత్తగా వారి స్థానము, సమకాలీన సంఘప్రయోజనములకు మాత్రమే పరిమితము కాగలదని కొందరు తలంతురు. పంతులుగారి గ్రంథములలో విశేషము, సమకాలీన సాంఘికాభ్యుదయమును ప్రధాన దృష్టియందుంచుకొనబడి, రచింపబడినవేయైనను, వారి 'కవుల చరిత్రము', 'రాజశేఖర చరిత్రము' 'శాకుంతలానువాదము' మొదలగు గ్రంథములు, ఆంధ్ర సారస్వతమున పంతులుగారి స్థానమును శాశ్వత మొనర్చుచునేయున్నవి ఆధునికులలో ఆధునికుడు పంతులుగారు వారెంత యాచార్యపురుషులో, అంత సారస్వతవేత్త. ఎంతటి మత బోధకులో అంత మహాకవి. సంఘమును సంస్కరించి, లోకకళ్యాణమును ప్రతిపాదింపవలెనన్న మహత్తరమైన యాదర్శము, పంతులుగారియందు పుంభావము దాల్చినది. అర్వాచీనులైన వారందరును, పంతులుగారి ప్రభావమునకేదోవిధముగా లోగినవారే! శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారివంటివారు, పంతులుగారి సంఘ సంస్కరణ దృష్టిని, ప్రధానముగా, వ్యక్తి సంస్కరణ దృష్టిగా రూపొందించి, పంతులుగారి యాశయసిద్ధికై, బహుముఖముగను, తీవ్రతరముగను కృషిచేసియున్నారు శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహ కవిగారివంటివారు, పంతులుగారు చేపట్టిన సాహిత్యప్రక్రియల నన్నిటిని చేపట్టి వారి యడుగుజాడలలోనే పరిశ్రమించి, ఆయా ప్రక్రియలందు, పంతులుగారి కన్నను కావ్యగౌరవమును సాధించి వానిని పరిపుష్టము లొనర్చినారు. పంతులుగారు తమ జీవిత కాలమునందు తాము సత్యములని నమ్మిన విషయముల నాచరణలో చూపుటయందు, వెనుకంజ వేయలేదు వారి యాత్మవిశ్వాసమునకును, ఆక్యశుద్ధికి నిది యొక గొప్ప దృష్టాంతము. ఆంధ్రదేశపు సాంఘిక చరిత్రను రచించుటలోకాని, సాహిత్య చరిత్రను రచించుటయందు కాని, వీరేశలింగంపంతులుగారి బహుముఖ ప్రజ్ఞాశాలిత్వము, వారి పేరుమీద నొక ప్రత్యేకాధ్యాయము, ఒక యుగము, నిర్మింపజేయునన్న, ఆంధ్రుల జీవితమున వీరేశలింగం పంతులుగారి ప్రభావము స్పష్టపడగలదు శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారొకానొక సందర్భమున వచించినట్లు, ఆధునికాంధ్ర దేశ మఖండ గోదావరియైన వీరేశలింగం పంతులు గారిని అదిపుట్టిన నాసికాత్ర్యంబకముతో నుపమింపదగును.

పంతులుగారి విశ్వరూపము దిక్ప్రదర్శనముగ నీ గ్రంథమునందుచూప యత్నము జరిగినది ఈ ప్రయత్నమునందు చిత్తశుద్ధి ప్రధాన స్థానము నాక్రమించగా పరిశ్రమ ద్వితీయ స్థానము నాక్రమించినదని విన్నవించుచున్నాను.

ప్రధానముగా, ఆర్థిక, సాంఘిక, రాజకీయ, పరిస్థితులయందు, దేశకాల పాత్రములలో గొప్ప మార్పు సంభవించుచున్న సంధికాలమునందు, పంతులుగారి ప్రతిభ, సమున్మిషితమైనది కావున, ప్రాత క్రొత్తల మేలు కలయికకు వారు, మార్గోపదేష్ట యగుచున్నారు. వారు ధన్యులు

వారి జీవిత పరమార్థ మీ పరిశోధక వ్యాసమునందు నిరూపింపబడుట నా యదృష్టము.

# సూచికలు

## 1

1. కొండ వేంకటప్పయ్య పంతులుగారి స్వీయచరిత్రము పుట. 5-1952

2. చెన్నపట్టణమునందలి ఆంధ్రభాషాభివృద్ధి - శ్రీదిగవల్లి వెంకటశివరావు ఆంధ్రపత్రిక.

3. ఇంగ్లీషు చదువుల చరిత్ర - శ్రీ దిగవల్లి వెంకటశివరావు 1-5-1941 నుండి 10-5-1941 వరకు ఆంధ్రపత్రిక (దినపత్రిక)

4 మహాపురుషుల జీవితములు - రాజారామమోహనరాయలు - శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహం పుట. 4-1955

5. వెన్నెలకంటి సుబ్బారావుగారి స్వీయచరిత్ర — (ఇంగ్లీషులో ఉన్నది)-1872

6. ఆంధ్రదేశమందు మిషనరీలపని — ఆంధ్రపత్రిక ఉగాది సంచిక, పుటలు 181-182-1910

7. 1857 పూర్వరంగములు - శ్రీ దిగవల్లి వెంకటశివరావు - పుట- 114-1957

8. The Journal of Education - 1869

9. చరిత్ర పరిశోధకులు - కావలి బొర్రయ్యగారు - శ్రీ కోన వెంకటరాయ శర్మగారు.

10. ఆంగ్లవాఙ్మయ ప్రభావము — తెలుగువాఙ్మయము పుట 641-1959 శ్రీగంటి జోగిసోమయాజి (తెలుగు చరిత్ర - సంస్కృతి) విజ్ఞానసర్వస్వము - సం. 3.

11. పండితరాయ మామిడి వేంకటార్య జీవితము - శ్రీ గ్రంథి సుబ్బ రాయగుప్త.

12. కవుల చరిత్రము- 3 వ భాగము (ఆధునిక కవులు) పుట604—1899

## 2

1. The Journal of Education - 1869

2. 1857 పూర్వరంగములు-శ్రీదిగవల్లి వెంకటశివరావు పుట 155-1957

3. The Diary of late Digavalli Venkata Ratnam Pantulu-Retired Sub Magistrate

4. వివేకవర్ధని - 1875 అక్టోబరు సం .2 సం 1

5. శ్రీమదజ్జాడ ఆదిభట్ల నారాయణదాసుగారి ఆత్మకథ 1-7-1955 ఆంధ్రపత్రిక దినపత్రిక.

6 వీరేశలింగకవి చరిత్రము - శ్రీ తోలేటి వెంకటసుబ్బారావు పుట 295-1910

## 4

1. స్వీయచరిత్రము - ద్వితీయభాగము - పుట 138 - 1915 (విజ్ఞాన చంద్రికా మండలి ప్రచురణము)

2. గోమూత్రికా బంధలక్షణము :

తే. మొనసి యెద్దుచ్చు రేఖల మూలలందు
వలయు బద్యంబు నాలుగంఘ్రులను వ్రాసి
చదివిరేనియు సుకవుల్ సమ్మదమున
ధాత్రి గోమూత్రికాఖ్య బంధంబు దనరు

— అప్పకవీయము - చతుర్థాశ్వాసము పుట-282-1951

3. పావన పాఫా బాభా,

మావాయను నాలుబిపులు మరి పద్యములో
భావింప దొరలకుండిన,
భూవలయము నన్నిరోష్ఠ్యము పిసాళించున్.

— అప్పకవీయము, చ. ఆ. పుట 280 - 1951

4. స్వీయచరిత్రము రెం. భా. రెం. ప్ర. 1936

5. వీరేశలింగకవి చరిత్ర, పుట 91-1910

6. వివేకవర్ధని 1874 అక్టోబరు (భావ సం. ఆశ్వయుజము)

7. తెలుగులో వెలుగు నీడలు - శ్రీవీరేశలింగం స్మృతిసంచిక-1953

8. స్వీయచరిత్రము రెం. భా, రెం. ప్ర, పుట 142-1936

9. స్వీయచరిత్రము రెం. భా, రెం. ప్ర. పు. 168 - 1936

10. వీరేశలింగకవి చరిత్రము, పుటలు 98, 99-1910

11. ఆంధ్రసారస్వతమున హాస్యరసము – 1924 ఉగాది సంచిక

12. నవయుగ నిర్మాత - శ్రీ వీరేశలింగ స్మృతి - 1953

13. పురుషార్థ ప్రదాయిని - 1872 మే

14. భావనామ సంవత్సరము 1874 వ సంవత్సరమైనది.

15. శ్రీ కందుకూరి వీరేశలింగకృత సంగ్రహవ్యాకరణ నీతిదీపికాప్రశంస- 1875 అక్టోబరు వివేకవర్ధని

16. స్వీయచరిత్రము. ౨౦ భా. ౨౦ ప్ర పుట 168-1936

17. వివేకవర్ధని 1875 జూలై, ఆగష్టు సంచికలందు, జాన్‌గిల్పిన్ ప్రచురింపబడినది. (సం. 1, సం.లు 10, 11)

18. కౌపరనియెడి యింగ్లీషు కవివరుండు, హాస్యకృతిగాగ మును జేసినట్టి దీని, దేటగీతలతోడను దెనుగునందు, గందుకూరి వీరేశలింగము రచించె. (చివరి పద్యము)

19. తెలుగుసాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము పుటలు 421-426-1960

20 పధిక విలాసము - 117 వ పద్యము

21. స్వీయచరిత్రము, ౨౦. భా, ౨౦. ప్ర పుట 250-1936

22. తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము పుటలు 429-433-1960

## 5

1. సీజరు చరిత్రము - వివేకవర్ధని సమీక్ష, సం. 2, సం 6, 1875 మార్చి

2. ,,

3. స్వీయచరిత్రము, ప్రథమభాగము. పుట 175-1936

4. స్వీయచరిత్రము - చిలకమర్తి లక్ష్మీనరసింహకవి. పుట 66-1957 స్వీయచరిత్ర - కొండ వేంకటప్పయ్య పంతులు పుట 22-1952, స్వీయచరిత్రము- వీరేశలింగం పంతులు, ప్రథమ భాగము: పుట 176-1936

5. తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము - డా. కొత్తపల్లి వీరభద్రరావు

6 ఆత్మచరిత్రము - రాయసం వేంకట శివుడు—1933

7. ,,

8. డైరీలు - లేఖలు - విశాలాంధ్ర ప్రచురణాలయము.

9. పంతులుగారు మూలగ్రంథములను తెలుపలేదు. శ్రీ యానంరెడ్డి వేంకటరావుగారివద్ద పంతులుగారి గ్రంథసంచయంనుంచి కొన్ని మూలగ్రంథములు నాకు లభించినవి.

10. పునర్మరణ ప్రహసనమునకు మూలము Twice killed అనునది. A Farce in one Act by John Oxenford అని ఇంగ్లీషు పుస్తకం ముఖపత్రంపై ఉన్నది. ఈఘట్టం పునర్మరణ ప్రహసనంలోంచి తీసుకోబడింది.

11. బలాత్కార గానవినోద ప్రహసనమునకు మూలము "Caught by the Ears" అను ఇంగ్లీషు ప్రహసనము "A farcial extravaganza in one act by Charles Selby, Comedian" అని ఇంగ్లీషు గ్రంథం ముఖపత్రం పైన ఉన్నది.

12. ఆంధ్రనాటకములు - రంగస్థలములు, పుట 15-1926

13. తెలుగునాటకము - ఉద్భవ వికాసములు - శ్రీపోణంగి శ్రీరామ అప్పారావు

14. వివేకవర్ధని సం 2 సం. 6-1875 మార్చి -

ఇందులో సీజరు చరిత్రమును సమీక్షించుచు పంతులుగారిట్లు వ్రాసిరి. "ఈసారి వ్రాయునపుడైనఁ బుస్తకము కడవరకు నొకే పద్యమువలె వ్రాయక నాటకమున కనుకూలముగా వేఱువేఱు పద్యముల నుపయోగింతురని గ్రంధకర్తగారిని కోరుచున్నాము".

15. వివేకవర్ధని, సం. 1, సం 8-1875 మే.

16. కామిడి ఆఫ్ ఎర్రర్స్ - ప్రథమాంకము - 1875 మే వివేకవర్ధని, పంతులుగారీ గ్రంథనామము నింగ్లీషులోనే ఉంచినారు. పుట 63.

17 స్వీయచరిత్రము రెం. భా. పుట. 188-1936

18. జయంతి - 1959 ఆగస్టు పుట 25 - శ్రీసుప్రసన్న

19. అముద్రిత గ్రంథచింతామణి - 1901, జనవరి, ఫిబ్రవరి, మార్చి.

20. శ్రీ జటావల్లభుల పురుషోత్తము, పుట 6-1936

21. వీరేశలింగకవి చరిత్రము, పుట 200-201-1910 (ద్వితీయ ముద్రణము)

22. స్వీయచరిత్రము - చిలమర్తి లక్ష్మీనరసింహము - 1957

23. అముద్రిత గ్రంధచింతామణి జాబులు - 1898.

24 హరిశ్చంద్ర నలోపాఖ్యాన పీఠిక - శ్రీ వఝ్ఝల చినసీతారామస్వామిశాస్త్రి

25. వైజయంతి - 1895 జనవరి -

26. హిందూజన సంస్కారిణి - 1891 జనవరి

## 6

1. స్వీయచరిత్రము, రెండవభాగము - రెం. ప్ర. - పుట 141-1915

2. స్వీయచరిత్రము పుటలు 143-151

3. పురుషార్థప్రదాయిని సం. 1 సం. 7, 1872 జూలై

4. Fort St George Gazette 1872 July, August, September (Supplement) - 3 rd quarter

5. చింతామణి సం 2 సం. 9, 10 - 1893 మార్చి, ఏప్రిల్

6 స్వీయచరిత్ర - చిలకమర్తి, పుట 112 - 1957

7. "నవల యనగా కుత్రిమమైన స్వాభావికమగు నితివృత్తము కలిగి తఱచు ఉత్తమ నాయకోపేతమయి, శృంగార వీరరసములలో నేదేని యొకటి ప్రధానముగా గల వచనప్రబంధ విశేషము - వివేకచంద్రికా విమర్శనము - పీఠిక - 1897

8. „

9 „

10 వేదం వేంకటరాయ శాస్త్రిగారి జీవితచరిత్రము - V V Sastry పుట 55 - 1949

11. కొక్కొండ వేంకట రత్నంపంతులుగారు. భారతి సం 28. సం. 4

12. "వేంకటరత్నము పంతులుగారు దీనిని రచించడములో విశేషమున్నది మరాఠీ, గుజరాతీ, కన్నడభాషలలో కాదంబరి అంటే నవల అనే వాడుకగానిలచినది. కాదంబరి కథనవలవలె నడచునది కనుక అది నవలకు పర్యాయపదమైనది. ఇంగ్లీషు లోని నావెల్ (Novel) అనుపదము నవలయైనదని చెప్పుదురు నవల సాంస్కృతి కముగా సాధింపవచ్చును" — ఆంధ్ర వచన రచనా పరిణామము - శ్రీనిడుదవోలు వేంకటరావు.

13 చింతామణి సం, 2 సం. 10 - 1893 ఏప్రియల్

వచనప్రబంధములను గూర్చిన లాక్షణిక నిర్వచన మెద్దియును లేకపోయినను, చింతామణి పోటీ నిబంధనముల వలన నాటి సాహితీపరుల యభిప్రాయములను, వచనప్రబంధ లక్షణములను మనము గ్రహింపవచ్చును.

14. కాదంబరి - వావిళ్ళ ప్రచురణ - 1916 (తెలుగులిపి)

మహాశ్వేత - కొక్కొండ వేంకటరత్నం పంతులు. వైజయంతి యను సారస్వత మాసపత్రికయందు 'మహాశ్వేత' 1895 జూన్‌నెల నుండి అక్టోబరు వరకు ప్రచురింపబడినది. చూ కాదంబరి పుటలు 149, 151 - మహాశ్వేత వైజయంతి - 1895 ఆగస్టు.

15. శ్రీరంగరాజుచరిత్ర - శ్రీ టేకుమళ్ళ కామేశ్వరరావు - ప్రబుద్ధాంధ్ర సం. 5 సం 1 జనవరి 1934. ఈ సారస్వత మాసపత్రిక రాజమహేంద్ర వరమునుండి శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి సంపాదకత్వమున వెలువడెను.

16. శతకవాఙ్మయ సమీక్ష — శ్రీ నిడుదవోలు వేంకటరావు - 1962 (శ్రీదాశరధి కృష్ణమాచార్య దాశరధీశతక పీఠిక)

17 శ్రీరంగరాజచరిత్రము - శ్రీ టేకుమళ్ళ కామేశ్వరరావు - ప్రబుద్ధాంధ్ర సం. 5 సం. 1-1934 జనవరి. డా. కొత్తపల్లి వీరభద్రరావుగారి తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము. పుటలు 318-320 (1960). శ్రీరంగరాజు చరిత్ర - పుటలు 22, 23 (1872) రాజశేఖర చరిత్ర, పుటలు 125-127 (1949) పరిశీలించిన యీ విషయము స్పష్టమగును

18. చింతామణి సం. 2 సం. 10-1893 ఏప్రియల్ చూ. చిలకమర్తి స్వీయచరిత్ర.

19. ఈ బహుమాన ప్రకటనము బెంగాల్ గెజట్‌నందు వెలువడినది(1872)

20. వీరేశలింగం పంతులుగారు గోల్డుస్మిత్ రచితమైన "దివికరాఫ్ వేక్ ఫీల్డ్" గ్రంధమును తు చ తప్పక అనువదించియు, నీ విధముగా వ్రాయుట సరి కాదని కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారు మూలగ్రంధమును రాజశేఖర చరిత్రముతో పోల్చి పంతులవారిని తీవ్రముగా విమర్శించిరి. చూ. వివేకచంద్రికా విమర్శనము - 1896. ఈ వివేకచంద్రికా విమర్శనము మొదట గురజాడ శ్రీరామమూర్తి గారు నడుపుచుండిన 'రాజయోగి' యను పత్రికయందు వెలువడినది.

21 స్వీయచరిత్రము రెం. భా. రెం. ప్ర. పుట 143-1915. డా. కొత్త పల్లి వీరభద్రరావుగారు తమ తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషుప్రభావమన్న గ్రంధము నందు, రాజశేఖర చరిత్రమునకును The Vicar of wakefield అను గోల్డ్‌స్మిత్ గ్రంధమునకును వైషమ్యములకన్న సామ్యములే యెక్కువని విపులముగా పరిశీలించి యున్నారు. పుటలు 323-345-1960 కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారు తమ విమర్శనమున ఆంగ్లగ్రంధమును పూర్తిగా అనువదించిరేకాని- పంతులుగారి స్వోపజ్ఞత యేమియు లేదని విమర్శించిరి - 1896

22. స్వీయచరిత్ర - ప్రధమభాగము, మొదటి ప్రకరణము - పుట 2-1911. (విజ్ఞానచంద్రికా గ్రంధమండలి ప్రచురణము)

23. ,, రెం. ప్ర. పుట 23-24.

చూ. రాజశేఖర చరిత్రము పుటలు 234-36-1949.

24. వివేకవర్ధని సం 1 సం. 1-1874 అక్టోబరు (పుటలు 3, 4)

25. రాజశేఖర చరిత్రము - 1949 పుటలు 29, 45, 49, 121, 151, 253.

26. "రావుబహదూర్ శ్రీ కందుకూరి వీరేశలింగంగారు వ్రాసిన రాజశేఖర చరిత్ర - ఇది గోల్డుస్మిత్తు వికారఫ్ వేక్‌ఫీల్డు అనే నవలకు అనుసరణ. ఇది బహుళ ప్రచారం పొందిన నవల"—గురజాడ అప్పారావుగారి డైరీలు—పుట 238. విశాలాంధ్ర ప్రచురణాలయం.

"నవలలు వ్రాయుటకు మాకప్పుడు వీరేశలింగముగారు వ్రాసిన రాజశేఖర చరిత్రమను నవలయే యాదర్శకము. ఆ నవలను నేనామూలాగ్రముగ జదివి నవలలు రచియించు పద్ధతి తెలిసికొని రామచంద్ర విజయమును వ్రాసితిని"- చిలకమర్తి స్వీయచరిత్ర - పుట 113 – 1957.

27. శ్రీకాశీభట్ట బ్రహ్మయ్య శాస్త్రిగారి జీవిత చరిత్రము - జటావల్లభుల పురుషోత్తము పుట 16 - 1936

28. ఆర్యమతబోధిని సం. 10 సం. 1 జనవరి 1914; వివేకచంద్రికా విమర్శనము - 1896

29. Vicar of wakefield - Edited with Introduction and Notes - By Michael Macmillan, B A (oxon) D Litt, Introduction PP xii–xiv-1954.

30. వివేకచంద్రికా విమర్శనము - 1896.

రాజశేఖర చరిత్రమునందు పాత్రచిత్రణము బాగుగా లేదనియు, ఇతివృత్తమును పంతులుగారు సరిగా నిర్వహింపలేక పోయిరనియు, సన్నివేశములు మేల్తరముగకూర్పబడలేదనియు గ్రంధమునీరసముగానున్నదనియు విమర్శించిరి. సుబ్బమ్మగారు మరణించినప్పుడు రాజశేఖరుడుగారి ఉదాసీనత, శంకరయ్య తన వృత్తాంతమును మామగారికి వినిపించుటలోని అప్రస్తుత విషయవివరణము (6 పుటలు), రుక్మిణిమరణ సందర్భము, నృసింహస్వామి మరణవృత్తాంతము, పెద్దాపురమున ఇండ్లు కాలిపోయిన సందర్భమున సుబ్రహ్మణ్యము ప్రవర్తన, ఇంకను పంతులుగారు వర్ణించిన ఆచారవ్యవహారములు, సంప్రదాయములు, పంతులుగారి ఉపజ్ఞారాహిత్యమును ప్రదర్శించుచున్నవని శాస్త్రులవారు విమర్శించిరి

31. Gulliver's Travells నందు కథానాయకుడు తన కధను ఉత్తమపురుషయందు విన్పించును. ఆంగ్లమూలమునందు కధాప్రారంభమిది - -"My father had a small estate in Northinghamshire, I was the third of five sons. He sent

me to Emanuel college in Cambridge at fourteen years old, where I resided three years, and applied myself close to the studies "

Gulliver's Travells, Published by GeorgeBell & Sons - 1896

ఇదేవిధముగా ఆడమళయాళమునందు కూడ కథానాయకుడు తన కథను తానే విన్పించును. "నేను పరీధావి సంవత్సర చైత్రశుద్ధ నవమి మంగళవారము నాడు పుష్యమీనక్షత్రమందు విజయనగరములో పూర్వము శ్రీరాములవారు పుట్టిన దినముననే జన్మించితిని. మా యింటిపేరు పత్రివారు. నేను వ్యాసరాయాచార్యుల వారి పుత్రుడను. నాతల్లి లక్ష్మీబాయమ్మ"—సత్యరాజా పూర్వదేశయాత్రలు, ప్రథమ భాగము, ఆడుమళయాళము - 1949.

32. సత్యరాజా పూర్వదేశయాత్రలు, ప్రథమభాగము - ఆఱవప్రకరణము - పుట 338-1949.

33 స్వీయచరిత్రము, ప్ర. భా. నాల్గవప్రకరణము. పుటలు 138, 139, 147, 148, 149 సత్యరాజాపూర్వదేశయాత్రలు - ఏడు, ఎనిమిది ప్రకరణములు- 1949.

34. సత్యరాజా పూర్వదేశయాత్రల యందలి మౌలికతను గూర్చి రాయసం వేంకట శివుడుగారు తమ ఆత్మచరిత్రమునం దిట్లు వ్రాసిరి. "నేను చెన్నపురిలో నుండు రోజులలోనే స్విఫ్టు విరచితమగు గల్లివరుని ప్రయాణముల ననుసరించి 'సత్యరాజా పూర్వదేశయాత్రలు' అను విచిత్రకధను పంతులుగారు రచింపదొడగిరి. ఏనాడు వ్రాసిన ప్రకరణముల నానాడు పంతులు నాకు జదివి వినిపించి నా యభిప్రాయము గైకొనుచుండెను ఓడప్రయాణమందలి నాబాధల సంగతి నేజెప్పగా విని, సమయోచితముగ వందుగొన్నిటిని సత్యరాజున కాయన యారోపించుట చోద్యముగ నుండెను హాస్యరసము కల్పనా విషయమున పంతులుగారు అడిసనుని కంటె స్విఫ్టునే యెక్కువగా బోలియుండెనని నేనంటిని అడిసనుని మృదుహాస్యప్రయోగము తెలుగున జొప్పింప పంతుల యాశయము"— పుట 132 - 1933

35 స్వీయచరిత్రము - రెం భా, రెం ప్ర. పుట 184-1915, సత్యరాజా పూర్వదేశయాత్రల రెండవ భాగమైన లంకాద్వీపయాత్ర చింతామణిలో భాగములుగా 1893 - 94 లలో వెలువడినది.

36 లంకాద్వీపయాత్రలోని జ్యోతిశ్శాస్త్ర చర్చలను కాశీభట్ట బ్రహ్మయ్య శాస్త్రిగారు తీవ్రముగ ఆక్షేపించినారు. ఆర్యమతబోధిని సం 10 సం. 1 జనవరి 1914.

38. ..

